# మహారాష్ట్రయాత్ర

## ప్రథమభాగము

రచయిత:

సాహిత్యభూషణ

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. యల్., బి.టి.పి.

(రెండవకూర్పు.)

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి

వావిళ్లప్రెస్సున ముద్రితము

గ్రంథకర్తచే ప్రకటితము.

1951



[Rs. 4-0-0.

కృతిసమర్పణము

శ్రీ

భాషోద్ధారక

వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు

గారికి

# పీఠిక

గ్రంథపఠనమువలననే జ్ఞానము లభించునని ప్రపంచమేధావు లెన్నడును విశ్వసింపలేదు. పరిశీలనమునకును, అనుభూతికిని అశేషావకాశ మొసగు దేశాటనము విశేషవిజ్ఞానమును చేకూర్చునని చాలకాలమునకుమున్నే వారుగుర్తించిరి. భారతవిద్యార్థులు ప్రాచీనకాలమున తమగృహములనుండి తరలి, నదీతీరములందలి గురుకులములకును, అరణ్యములలోని ఆశ్రమములకును చని, గురుగుణసంశోభితులైన ఆచార్యులను సేవించి, ఆత్మసంయమమున నారితేఱి, అనల్పమైన జ్ఞానము నందువారు. ఇలువీడి యాత్రనారంభించిన ముహూర్తమందే వారిపరిశోధనమును, అనుభవమును ఆరంభమయ్యెడివి. పరిశీలనానుభూతులు వైజ్ఞానికరాజపథములు సుడీ ! జ్ఞానపిపాసువులైన యాత్రికులు దూరసీమలకు చనుటకును, క్లిష్టపరిస్థితుల నెదుర్కొనుటకును సంశయింపరు. ఇట్లెదుర్కొనినపుడే హృదయమున నిదురించుశక్తులు ఫణమెత్తియాడు చిలువలవలె తలలెత్తి క్రియాక్షేత్రమున విజృంభించును.

ప్రబోధము సలుపుటకును పరిభ్రమణము అక్కఱనది. భారతాచార్యులు అన్యసీమలకు సయితము చని, తమజ్ఞానదీప్తిచే అనేకులహృదయముల నాలోకితము లొనరించువారు. శ్రీకృష్ణద్వైపాయనుడు పరిష్యాసీమ కరిగెనని తెలుపుపౌరాణికాధారము నేడును నైమిశారణ్యమున నుండుట నేగాంచితిని. ప్రపంచపథికులై, ముక్తిదూతలైన మహాత్ములు సమస్తయుగములందును మనదేశమునవెలసిరి. మనయాచార్యులు పలువురు పరివ్రాజకులే ! కాలటినుండి కాల్నడకను పయనమై, భారతపథికుడై, కాశ్యాదిక్షేత్రములందు విజ్ఞానగోష్ఠిసలిపి, బదరికాశ్రమమందును, ప్రభాసమందును, జగన్నాథమందును, శృంగేరియందును మఠములనబడు మహావిద్యాపీఠములను నెలకొలిపిన శ్రీశంకరుని మహోజ్జ్వల దృష్టాంతము శతాబ్దులనుండి భారతీయవైజ్ఞానికనభమున తేజరిల్లుచున్నదికదా ! నిన్నటివివేకానందుడు భారతసందేశమును పాశ్చాత్య జగతియందు జలదగంభీరస్వరమున వ్యక్తీకరింపలేదా !

భారతసంస్కృతీచరిత్రమును పరిశీలించినపుడు విజ్ఞానధనుల పర్యటనోదంత మందు నంతర్భూతమైయున్నదని గ్రహింపగలము. ఆచార్యులును, అంతేవాసులును యాత్రాశయములను దృష్టినిడికొని, తమతమ కర్తవ్యములను నిర్వహించిరి. ప్రబోధపఠనపరిశీలనములకు పరిభ్రమణము నిమిత్తమాయెను. ఇట్లని పౌరాణికయుగమందువలె చరిత్రయుగమందు సయితము పొడసూపిన బహుళదృష్టాంతములను పేర్కొని రూఢి చేయవచ్చును. గ్రీసుసీమ భారతమాతవలన విజ్ఞానభిక్షనందెనని ప్రతీచీమనీషులే ముక్తకంఠములతో పలుకుచున్నారు! హోమరుకాలమునందే గ్రీసుధరిత్రి అట్టిభాగ్యము నందెను. కావుననే వాల్మీకి హోమరులకృతులందు కొన్ని పోలికలు గోచరించుచున్నవి. భారతసంస్కృతికి ఈజిప్టుకూడ ఋణపడియున్నది. ఫొనీషియన్ జాతివారు క్రీట్ ద్వారా ఈజిప్టు గ్రీసులతో వాణిజ్యమొనరించుచు గ్రీస్ వాసులకు బోధకులైరి. జోరాస్టర్ ప్రతిభను ప్రశంసతో నుల్లేఖించిన ప్లేటో ప్రాచీవిజ్ఞానమును చవిచూచెనని తెలుపుట సత్యదూరము కాదు. సోక్రటీసు శిష్యుడైన ప్లేటోకు అలెగ్జాండరు గురువైన అరిస్టాటిల్ అంతేవాసి. వైజ్ఞానికసంప్రదాయము నారాధించిన అలెగ్జాండరు క్రీ. పూ. 327 లో భారతదేశమునకు దండెత్తివచ్చినను, అందుండి తరలుతటి భారతాచార్యులను తోడ్కొని పోయెను. రెండేండ్లలో నాతడు బెబిలన్‌లో మరణించినను, వాని యనంతరము గ్రీసుభారతదేశములకు సహమ విజ్ఞానయాత్రికులకు చక్కనిరాజపథ మేర్పడెను. మేసిడన్ మహాయోధుని పేరిట ఈజిప్టులో నెలకొనిన అలెగ్జాండ్రియానగరము ప్రాచీప్రతీచీపరివ్రాజకులకు కేంద్రమై, మేటివిద్యాపీఠమై యొప్పెను. గ్రీసుజిజ్ఞాసువులు మన తక్షశిలజేరి, ఆచటి విశ్వవిద్యాలయమున విద్యార్థులైరి. మౌర్యచంద్రగుప్తనకును, సెల్యూకస్‌కూతురైన హెలెన్‌కును పరిణయమైన మంగళముహూర్తమందే ప్రాక్పశ్చిమసంస్కృతులకు పాణిగ్రహణ మాయెను. గ్రీసు భారతదేశముల విజ్ఞానములు పరివ్రాజకుల ప్రబోధమహత్త్వము వలన నందందు నొండొంటిఛాయల నందినవి. సుప్రసిద్ధ గ్రీక్ యాత్రికుడు మెగస్తనీస్ పాటలీపుత్రమున నైదేండ్లు నివసించి, పదపడి ఆంధ్రదేశమున పర్యటన మొనరించి, మగధమహిమను వర్ణించినట్లే ఆంధ్రోన్నతిని ప్రశంసించెను. గ్రీసువాసుల పిదప ఇటాలియనులునుమనసీమతో చుట్టటి

కము గలుపుకొనిరి. పాండ్యరాజులకాలమున కొందఱు రోముయాత్రికులు దక్షిణసీమయందువసించిరి. పాండ్యసీమ కొంతకాలము పాండియాయను నారీమణిచే పాలింపబడెనని క్రీ. పూ. నాలవశతాబ్దమున మెగస్తనీస్ తెలిపినట్లు హూణశక మారంభమగుటకు రమారమి శతాబ్దమునకుమున్ను ప్లైనీయును దెలిపెను. రాజస్థులైన చక్రవర్తుల చేయూతనంది భారతవైజ్ఞానికయాత్రికులు బర్మా, సింహళము, టిబెట్, చైనా, సయామ్, బేబిలన్, పరిష్యా, ఎపిరస్, కెంబోడియా, సుమిత్రా, జావా, బోర్నియో మున్నగు తావులకరిగి అజ్ఞానాంధకారమును తఱిమివేసిరి. అశోకకనిష్కుల చరిత్రోదంతముల నెవిద్యార్థియెఱుగడు? ఏలికయై కవియై, పరివ్రాజకుడైన శ్రీహర్షుని యాత్రోదంతము లేభారతవిజ్ఞానికవగతములు కావు? పాశ్చాత్యజగతినుండివచ్చినట్లు దూరప్రాచ్యసీమలనుండియు మనదేశమునకు విజ్ఞానయాత్రికు లరుదెంచిరి. రెండవచంద్రగుప్తుడు పాలించుచుండగా హూణశకమున నాలుగువందలసంవత్సరములు కడచినపిదప పాహ్యాన్ విజ్ఞానయాత్రికుడై చైనానుండి సంవత్సరకాలము విశేషప్రయాసతో ప్రయాణము సలిపి, పెషావరు జేరెను. వాని యనుచరులలో మువ్వురు మధ్యమార్గమునుండియే మరలిరి. ఇరువురు మరణించిరి. పాహ్యాన్ పాటలీపుత్రమందు కొంతకాలముండెను. హుగ్లీముఖద్వారమున నొకమఠమున బౌద్ధమతవృత్తాంతమును వ్రాసికొనుచు రెండేండ్లుండి, సింహళమందలి అనురాధపురమునకరిగి బుద్ధునిదంతమునుజూచి, అందుండికదలి రెండుపర్యాయములు నౌకాప్రమాదమునబడి ఎట్లో బ్రదికి జావాజేరి, అందైదునెలలుండి పిదప నాతడు స్వీయసీమను చేరుకొనెను. హూణశకము 625 లో స్వదేశమునువీడి, సుప్రసిద్ధ చైనాయాత్రికుడు యువాన్‌చ్వాంగ్ శ్రీహర్షుడేలుకాలమున భారతదేశమున కరుదెంచి; నలందా విశ్వవిద్యాలయమున కొంతకాలము విద్యార్థియైయుండి, దక్షిణాపథమున కరుదెంచి, జగత్ప్రసిద్ధినందిన విద్యాకేంద్రమైన ధాన్యకటకమున త్రిపీటకములను పఠించి, అనంతరము వేంగివిద్యాపీఠమున కరిగి, అందుండి తన యాత్రను సాగించెను. పదునాలుగవ శతాబ్దమున మహమ్మద్ బిన్ తుగ్లుక్ ఢిల్లీశ్వరుడైయుండగా ఆఫ్రికాయాత్రికుడైన ఇబిన్‌బటూటా భారతదేశమున కరుదెంచెను. ఏలికవలన నాతడు న్యాయమూర్తిగా

నియోగింపబడెను. ఉద్యోగమును చాలించినపిదప నతడు చైనా చక్రవర్తికడకు రాయబారిగా పంపబడెను. సముద్రమున నోడ తున్కలగుటచే నెట్లో ప్రాణములతో నాతడు స్వస్థానమున కరిగెను. భారతదేశమును గుఱించి ఆతడు చక్కని వృత్తాంతమును లిఖించెను. ఇటలీనుండి మార్కోపోలో అను యాత్రికుడు మనదేశమునకు క్రీ. శ. 1290 లో నరుదెంచి, కాకతీయరాజ్యమహిమను వర్ణించెను. కమాలుద్దీన్ అబ్దుర్ రజాక్ పారశీకయేలికపనుపున మనసీమకు 1443లో నరుదెంచి, విజయనగర సామ్రాజ్యవైభవమును కడుకౌశలముతో వర్ణించెను. నికోలాకొంటి, డొమింగోస్, పెయిస్, పెర్నాస్, నూనిజ్ లను విదేశయాత్రికులుకూడ విజయనగరమహిమను వర్ణించిరి. షాజహాన్ కొడుకులు రాజ్యమునకై పెనగులాడుసమయమున బెర్నియర్ అను ఫ్రెంచివైద్యుడు భారతదేశమునకరుదెంచి, ఆర్యావర్తమున పర్యటన మొనరించి, తనయాత్రలో టెవెర్నియరను మఱియొక ఫ్రెంచియాత్రికుని కలసికొనెను. మొగల్ రాజ్యము శిథిలమగునపుడు చెలరేగిన చేటులను వారు వర్ణించిరి. బాల్యమందే ఇటలీనుండి యరుదెంచి దారాసైన్యమున సముదర్ యుద్ధమున పోరి, ఆతడు దుర్మరణమునకు గుఱియైన తర్వాత వైద్యవృత్తి నవలంబించి, షాఅలంభార్య వ్యాధినిగుదిర్చి, ఆతనికడ జాలకాలముపనించి, మనుచ్చి అను యాత్రికుడు కడకు చెన్నపురిచేరి, అందు 1717 లో మరణించెను మొగలుకాలమున భారతభూమి యెట్లుండెనో ఆతడు తెలిపెను. బెర్నియర్ ఔరంగజీబును ప్రశంసించెను. కాని మనుచ్చి ప్రతికూలాభిప్రాయమును వ్యక్తీకరించెను. ఔరంగజీబు ఆధీనమున నుద్యోగియైయుండుట కాతడంగీకరింపలేదు.

యాత్రానుభూతి ఉత్కృష్టసాహిత్యసృష్టికి నిమిత్తమగును. ఆంగ్లయాత్రికులు థేమ్సునదీతీరమున నొక ధర్మశాలయందుకూడి అందుండి మజిలీల సలుపుచు మతాశయసిద్ధికై అసువులు ధారబోసిన థామస్ బెకెట్ సమాధిని చూచుటకై కేంటర్ బరి పోవువారు. వినోదభరితమైన వీరియాత్రను ఛాసర్ మహాకవి తన "కేంటర్ బరీ టేల్స్"లో విశేషకౌశలముతో వర్ణించెను. ఛాసరురచితకథలు ఆంగ్లసాహితీమందిరమునందు రత్నదీపికలై తేజరిల్లుచున్నవి. సత్యసందీపితములేని

వృత్తాంతములందలి ధ్వనిననుసరించియు, ఛాయలనుబట్టియు ప్రపంచరచయితలు భావనాశక్తిని తోడొనరించుకొని యాత్రోదంతములను రచించిరి. జోనాథన్ స్విఫ్ట్ రచించిన "గలివర్స్ ట్రావెల్స్"ను, డేనియల్ డీఫో రచించిన "రాబిన్సన్ క్రూసో" యును ఈరీతి గ్రంథములు. వీనిని పరిశీలించుపఠితలు ఆంగ్లసంఘ మూరచయితల కాలమున వేర్వేఱు జీవితాంగణములం దెట్లునడచినదో గ్రహింపగలరు.

మంత్రశక్తిగల తన లేఖినితో కన్నులకుకట్టునట్లు యాత్రాంశములను ఛాసరుమహాకవి చిత్రించెను. పరిశీలనము పథమును చూపును. భావనము తనయద్భుతశక్తిని పురస్కరించుకొని, ఆపథమున కొంతదనుక నగ్రేసరమై యున్నతవీథులలోనికి చిత్తమును దోకొనిపోవును. ఘనసృష్టికి పరిశీలనము నిమిత్తము! కులాయమందలి తన నిసుంగులపై కన్నుంచి, శకుంతము వినువీథియందు నిష్టవిహారముసలుపు లీల, పరిశీలన ప్రోక్త ధ్వనిపై దృష్టినిలిపి, భావనము మహోన్నతమార్గముల జరించును. ఈ సూత్రము నెఱిగిన మహారచయితలు మేలికావ్యములను రచింపజాలుదురు. ఛాసరుకవి అట్టిరచయిత. కేంటర్ బరీయాత్ర వాని సహజశక్తి విజృంభణమునకు నిమిత్తమాయెను. తన శిల్పసౌభాగ్యముకతన, తన రసానుభూతికతన, తన భావోద్వేగముకతన, తన తన్మయత్వముకతన మహాకవి పాఠకలోకమును తన సహపాఠిగావించుకొని, తూగుటుయ్యాలలో రాధాకృష్ణులు నగుమోములతో నూగునట్లు ప్రమోదవీచికలం దానెచ్చెలితో గలసిమెలసి యుయ్యాలలూగును.

చారిత్రక హేతువులచే పురికొలుపబడి, పర్యటనప్రబోధములు గురుగంభీరమహోద్యమములను సృష్టింపజాలును. పదునేనవశతాబ్దమున యూరపులో తలసూపిన మహిమోపేతభావోద్యమ మిట్టిదే! హూణశకము 1453 లో కాన్స్టాంటినోపుల్ తురుష్కులచేతుల బడినపుడు, అందు వసించుచుండిన గ్రీకువిద్వాంసులు స్థానస్థానములందు సంచరించి, బహుళవైజ్ఞానికవిషయములను పలువురకుద్బోధింపసాగిరి. అపుడే ప్రజలమానసదిశావలయములు విశాలమైనవి! అంధానుకరణము అంతరించినది! సత్యాన్వేషణమున ప్రజలు బద్ధదీక్షితులైరి! హృదయపద్మము ప్రఫుల్లమైనపుడు భావమరందము పుష్పదళములందు కైదీయై యుండునా? జ్ఞానవీచిక సూర్యకిరణమువంటిదే! అది జిజ్ఞాసువు

హృదయమును చుంబించినపు డిది నగుమోమునన కెనయై మాధుర్య సంభరితమై, సౌందర్యసందీప్తమై విలసిల్లును. సౌందర్యదీప్తి సత్యాలోక మని, జ్ఞానమయూఖమని తెలుపుచుండును.

ఇటలీలో నాడునాటుకొనిన భావోద్యమమునుండి విజ్ఞానమరీచులు దశదిశల బ్రసరించినవి. ఈ మహోద్యమమే జర్మనీయందు మార్టిన్‌లూథర్ నెలకొలిపిన మతోద్యమమునకు ఆయువును, ఆలోకమును బ్రసాదించినవి. వివిధసారస్వతములను పరిశీలించినపుడు ఈరీతి దృష్టాంతములను విశేషముగా విలోకింపగలము.

బాల్యమందే యాత్రికుడనైతిని. దేశయాత్రయందే నాజీవయాత్ర ఆరంభముకావలెనని ఏలనో జగదీశు డుద్దేశించెను. అనేక పర్యాయములు మన పుణ్యభూమియందు సంచారము సలిపితిని. కలకత్తా విశ్వవిద్యాలయము బ్రసాదించిన పౌరాణికచారిత్రికాంశములను, తాత్త్వికమతవిషయములను చిత్తమున నింపుకొనియే భారతపథికుడనైతిని. హృదయస్థవిషయమునకు సంబంధించిన స్థలమును చూచినపుడే, విజ్ఞానవిశ్వాసముల పరిశీలనమునకు తోడుపడినపుడే స్థలప్రాముఖ్యముతో సమ్ముఖదృశ్యము హృదయఫలకముపై ముద్రితమై ఆత్మకు ననిర్వచనీయమైన ప్రమోదము నొదవించును. మనుష్యాంతరంగ మెంతచిత్రమైనదో చింతింపుడు. అనుకూలసన్నివేశములతో నం దపుడపుడు చిత్రితమైన భావరాజియును, దృశ్యవితానమును—భవపరంపరయందు పెక్కుశరీరములు చితిమంటలందు చిటచిటలాడినను,—ఆత్మ నంటియేయుండును. ఆత్మగ్రథనమున నివి యిమిడియుండు ననజెల్లును. ఆత్మకు అమరత్వము స్వతస్సిద్ధమైనది కావున అందు నంతర్భూతమైన అంశములును అమరత్వసిద్ధినందుట నిస్సంశయము. మనుష్యాంతరంగమున నమృతకలశ ముండును కావున నందలిబిందువులు మనుష్యవాక్కులందును, క్రియలందును తొణకుచుండును. మనుష్యత్వ ముముక్షుత్వముల నేత్రమెఱిగి మహిమోపేతజీవితాశయసిద్ధినందినవారే "సోహమ్" అని యాత్మవిశ్వాసముతో, మహోత్సాహముతో పలుకగలరు. దేవత్వము పొందజాలుశక్తిమనుష్యహృదయమున నంతర్భూతమైయున్నది. తమ తపసుకతన నమృతపుత్రు లనిపించుకొనినవారు పరివ్రాజకులలో నెందరు లేరు? భావపీయూషభరితమైన స్మృతి అద్భుతకావ్యసృష్టికి కన్న

తల్లి కాజాలును. నైసర్గిక ప్రతిభ ఈస్మృతియందు శోభిలునదే! మనుజుని గతానుభూతులకతన సౌష్టవసంపన్నమైన ప్రతిభ నవ్యసృష్టి గావించుచుండును.

యాత్రసలుపు నపు డెన్నెన్నియో తలంపులు చిత్తవీథియందు రివ్వుమనుచుండును. బదరికాశ్రమమున నరనారాయణు లెపుడు తప సొనరించిరో యెఱుగము, పార్థుడు ఏముహూర్తమున భూప్రదక్షిణమునకై పయనమాయెనో యెఱుగము. దిలీపుడు తనరాజ్యమును వీడి, సేవాదర్శనిర్వహణమునకై యాత్రసల్పి, గహనాశ్రమమున నెపుడు ప్రవేశించెనో యెఱుగము. ఎన్నెన్ని హేతువులనో మిషలొనరించి వాల్మీకివ్యాసులు సూర్యవంశపురాజులను, చంద్రవంశపుచక్రవర్తులను తమతలెనే విజ్ఞానయాత్రికులజేసి ఏవేళలందు వారిని వనములందును, పర్వతములందును త్రిప్పిరో యెఱుగము. పరివ్రాజకులై బహుకాలాంతరంగములందు మసలిమసలి, అరణ్యములందు నధివసించి మన ఋషికవులు ఆరణ్యకములను, ఉపనిషత్తులను, ఘనకావ్యములను, ఉత్కృష్టశాస్త్రములను ఏశుభముహూర్తములందు సృష్టించిరో యెఱుగము. కాని యీయుదంతములందలి భావములు చిత్తవియత్తలమున కోటికత్తులట్లు తళ్కొత్తునపుడు, భారతప్రకృతిపథములందు పదములు కదల్చునపుడు వివిధయుగపాత్రములతో వివిధయుగవీథులందు మానసికముగ మసలుచుందుము. కాశీ, హరిద్వార, ద్వారక, అమృతసర, అమరనాథ సారనాథాది మహాక్షేత్రములను గాంచినపుడు యాత్రికునిమానసమున భారతమతప్రభావమును, తక్షశిల, మొహెంజొదారో, నలందా, నవద్వీప, ధాన్యకటకవేంగిలందు చరించినపుడు భారతచారిత్రకవిభవమును తేజరిల్లవా? విద్యార్థినై విహరించి, విద్యార్థులకును, ఇతరజిజ్ఞాసువులకును ఈయాత్ర ఎట్లుపయోగించునో యోచించుట నాప్రధానాశయమాయెను. సాహిత్యమందలి ధ్వనియు, మనశ్శాస్త్రమందలి సంయోగసూత్రమును ఒప్పినంతవరకు భావపరంపరకును, దృశ్యపరంపరకును గల నేస్తమును గ్రంథభూమియందు తెలిపితిని.

వివిధపాశ్చాత్య విశ్వవిద్యాలయములందు విద్యార్థులైన వారు కొందరు ఇటలీరమ్యాద్రికిని, తక్కుంగల స్థలములకును తరలి, సౌందర్యోపాసకులగుచుండువారు. మిల్టన్, షెల్లీ ప్రభృతులిట్టివారుగృహాము

నుండి తరలి, సౌందర్యసంశోభితమైన సరోవరతీరమున వసించి, కీట్స్, షెల్లీ, బైరన్, కోలెరిడ్జ్, సౌదే మున్నగువారు చక్కని కావ్యసృష్టిగావించిరి. వర్డ్సు వర్తు కవి ప్రకృతిప్రదీప్తప్రదేశములందేమసలువాడు. గోల్డ్ స్మిత్ కవి ఐరోపాఖండములో స్థానస్థానములందు సంచరించియే "ట్రావెలర్" అను గ్రంథమందు రసబంధురపంక్తులను బహుళముగ జొనిపినాడు. కాళిదాసు వింధ్యహిమాచలములందు మసలియే యక్షపాత్రమును సృష్టించి, మహిమోపేతమైన తన "మేఘదూత"ను జగతి కర్పించెను.

ప్రపంచపథికుల దృష్టాంతములను, మేలికవుల రచనావిధానములను, విజ్ఞానధనుల జీవితాభ్యాసములను, పరివ్రాజకుల దైనిక కర్తవ్యములను మేలుబంతు లొనరించుకొనియే విజ్ఞానయాత్రికుడనై చరించుచుందును. ఈజీవితపరిభ్రమణమందలి అంతరార్థమును పాఠకమహాశయులు ఆదరానురాగములతో గ్రహింతురని ఆశపడుచున్నాను.

నాపర్యటనమున విషయపరిశీలన మొనరించుటకు నాకెట్టితరుణములు లభించినవో, విషయప్రబోధము సలుపుటకుగూడ నట్టియవకాశములు చేకుఱినవి. నాభ్రమణానుభూతిని తెలుచుగా ఉపన్యాసములందును,వ్యాసములందును, గ్రంథములందును వ్యక్తీకరించుచునేయుంటిని.

నామహారాష్ట్రయాత్ర నాభారతయాత్రలోని అంతర్భాగమే! ఈయాత్రోదంతమును "భారతి"యందు చూచి, పల్వురువిద్వాంసులు దానిని గ్రంథస్థముజేయ నన్ను ప్రోత్సహించిరి. వారిప్రోత్సాహమునండ గావించుకొని, సహృదయుల ఆదరానురాగముల నపేక్షించుచు నీయాత్రగ్రంథమును పృథ్వీయాత్రకై పంపుచుంటిని.

వాఙ్మయము జ్యోతిర్మయమని విశ్వసించి, వాగ్దేవీమందిరమున తమజన్మదాతవలె నిత్యోపాసకులై వెలయు భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు నాయుద్దేశ మెఱిగి, గ్రంథముద్రణభారమును తాముపహించి, అవ్యాజవాత్సల్యముతో నాకు మిగుల తోడ్పడిరి. కావున వారికి కృతజ్ఞతాపూర్వకధన్యవాదము లర్పించుచున్నాను.

మదరాసు. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

# నా మహారాష్ట్రయాత్ర

## మొదటి ప్రకరణము

భారతభూమి మహాఖండము—మహాఖండము మాత్రమే కాదు; భూగోళము నంతను దలపునకుతెచ్చు విశాలప్రదేశము. వసుంధర యందలి వివిధశీతోష్ణస్థితులును, భూమిస్థితులును ఇం దున్నవి. ఆకస మును ముద్దిడుకొను కొండలును, పైడిపైరు నీనంజాలు నేలలును, కడుంగడు చక్కనైన నదులును, విశాలకాసారములును, ఎడారులును, పలుతెఱగుల గనులును ఇందు గలవు. రమ్యమైన ప్రకృతి కిది పుట్టినిల్లు. వివిధజాతు లిందు పెంపొందుచున్నవి. వివిధప్రకృతులవారు, వివిధము లగు రంగులవారు, వివిధాచారముల కలవడినవారు, వివిధభాషలను ప్రయోగించువారు ఇందు వర్ధిలుచున్నారు. ఈభిన్నాంశములనుండియే అంతఃస్సలిలయైన సరస్వతిలీల భారతజాతీయత్వభావము ప్రవించు చున్నది. భారతావనియందు భ్రమణమొనరించు నాతడు ప్రపంచయా త్రను సాగించు వ్యక్తివలె వివిధానుభవముల నందగలడు.

జ్ఞానసంపాదనమునకు ప్రయాణము ప్రధానపథమని మన ప్రాచీ నులు గుర్తించిరి. బడిగోడలనడుమ జతికిలపడి, గ్రంథములందు విరియ బోయబడిన అక్కరాల గుంపుపై కన్నిడినంతనే జ్ఞానభువనము లన్నియు మానవునకు కరస్థలామలకములు కావని వా రెఱిగి యుండిరి.

ప్రత్యక్షానుభవమున మానవుడు విజ్ఞానమును జుఱ్ఱి మొద లిడును. ఒకడు చెప్పినది విని, ఒకడు చూపినది చూచి, ఒకడు పట్టిన తెన్నును పట్టి, ఒకని గీతమునకు అనుపల్లవిపాడి, ఒకనిమాటకు 'భళా భళి' యని మనుష్యుడు తనయందలి సహజశక్తిని లేపజాలడు. సహజ

శక్తిని విజృంభింపజేయునది అనుకరణముగాని, అనుసరణము గాని కాదు. మఱిస్వతంత్రభావము. ప్రత్యక్షానుభూతికతన నిది వృద్ధినందును. ప్రత్యక్షానుభవమును చేకూర్చునది ప్రయాణము!

తర్కశాస్త్రమందు జ్ఞానమునిచ్చు వివిధాంశములు చర్చింపబడినవి (Vide Chapter on "The Sources of Knowledge") చరిత్ర (E. G. Authority లేక ప్రమాణము) వలన చేకుఱు జ్ఞానమునకును, అదృశ్యయాంతరంగికశక్తి (Intuition) కతన లభించు విజ్ఞానమునకును నడుమ నిలుచునది అనుభవజ్ఞానమే! మనుష్యమానసగ్రథనమును పరికించినపుడు దీనిసత్యము స్పష్టముగ బోధపడును. శరీరమువలెనే మానవమానసము పెరుగును. పసిపిల్లవానిని పరికింపుడు. మందారమును చూచునట్లే అత డగ్నికణమును విలోకించును; ఎఱ్ఱపూవును చేబూనునట్లే చింతనిప్పును చేబట్ట నుంకించును. నిప్పుసెగ సోకినంతన నగ్నిగుణమును గుర్తించును. అనుభవముకతన శైశవమున మనుజుడు హృదయమున ప్రోగొనరించుకొను జ్ఞానమును జన్మాంతమందైన గోలుపోక, తరువాతిభవపరంపరలలోనికి గొంపోవును. అనుభవసముద్భవజ్ఞానమం దెట్టి మహత్త్వ మున్నదో గ్రహింపుడు. పదార్థపరిజ్ఞానమొదలు వ్రాసిన గ్రంథములవలన చేకుఱవచ్చును. కాని మనుష్యచరిత్రయందు అడగిమడగియున్న గంభీరాంశములును, ప్రకృతిహృది గల అమూల్యభావములును స్వతంత్రపరిశీలనము వలనను, ప్రత్యక్షానుభవమువలనను, సహజపర్యాలోచనమువలనను గాని మనసొమ్ములు కానేరవు. ప్రత్యక్షానుభవమందలి విలువను గుర్తించియే ప్రాచీనభారతీయులు విద్యార్థిని గృహమునుండి వెడలించి, దూరస్థములైన గురుకులములందును, కఠినపరిస్థితులందును నిలిపిరి. మన గురుకులములు వనశోభయందును, కొండసింగారమందును పెంపొందినవి. వనలక్ష్మి యింటనే కదా మన విజ్ఞానమును, మన నాగరకతయును ఉద్భవించినవి; ఈయంశమును రవీంద్రుడు పలుమాఱు తన రచనలం దుల్లేఖించినాడు.

("In India it was in the forests that our civilisation had its birth, and it took a distinct character from this origin and environment."......."The Indian mind never has any hesitation in acknowledging its kinship with

nature, its unbroken relation with all" Vide Rabindranath's "*Sadhana*" Pages 4 and 7.)

పాశ్చాత్యులుకూడ దేశభ్రమణమును, ప్రకృతిసంసర్గమును జ్ఞానసంపాదనమున కక్కఱయినవని గుర్తించిరి. ఆక్స్ఫర్డు కేంబ్రిడ్జిలందు విద్యార్థిజీవితమును ముగించి, ఆంగ్లజిజ్ఞాసువులు ఐరోపాఖండమందు దీర్ఘ ప్రయాణములు సాగించి, ఇటలీకి తరలి, అచటి సుందర ప్రకృతిదృశ్యము లందు మసలి, శృంగారప్రాదములందు, సౌందర్యమాధుర్యములందు గ్రుంకులిడిరి. షెల్లి, కీట్సు, గోల్డుస్మిత్ లిట్లొనరించి రని ఆంగ్లసాహితీ విద్యార్థు లెఱుగుదురు. కోలెరిడ్జిమహాశయుడు పర్వతమందలి తన విభృతస్థానము ("*The Valley of Seclusion*") నుండి తరలియేకదా తనప్రజలను చేరుకొనెను!* స్వాతంత్ర్యసమరమున పాల్గొనుటకై కదా ఇటలీ రమ్యారామములనుండి మిల్టన్‌మహాకవి శ్రేయసీమకుతరలి దేశ సేవయందు కనులను పోగొట్టుకొనినాడు.

ప్రయాణప్రాముఖ్యము నధునాతన యుగమందును గమనించి, ఆంగ్లేయులును పయనమును గుఱించి ఉద్గ్రంథములు వ్రాసిరి. వీరిలో ముఖ్యుడు సుప్రసిద్ధగ్రంథకర్త స్టీవెన్సన్. 1876 లో సర్ వాల్టర్ సింప్సన్‌తో గూడి చిన్ని నావయం దీతడు ఏంట్ వెర్ప్ నుండి బయ ల్వెడలినాడు. వానయందును, సన్నమై, భయంకరమైన సముద్ర మార్గము (Straits) లందును నెచ్చెలినిగూడి సలిపిన నౌకాయాత్ర వాతంతు "ఏన్ ఇన్‌లెండ్ వాయేజ్" ("*An Inland Voyage*") అను గ్రంథమున వర్ణించి, క్రీ॥ శ॥ 1878 లో దానిని ప్రకటించినాడు. రాత్రులందు తలదాచుకొనుటకై తాముపడిన పాట్లు నత డందు చక్కగ వివరించినాడు. మిగుల సామాన్యాంశములను సయితము విపులీకరించి తెలిపినాడు. తాను వ్రాసికొనిన డైరీనుండి కైకొనిన అంశములనే అతడు పెంచి వ్రాసినాడు. ఈగ్రంథమందు స్టీవెన్‌సన్‌ను, కథనాకౌశలము, శిల్ప నైపుణ్యమును గోచరించును. "సిగరేట్" ("Cigarette") లేక సర్

---

* "Ah! quiet dell, dear cot, and mount sublime! I was constrined to quit you. Was it right, while my unnumbered brethren toiled and bled, that I should dream away the entrusted hours on rose-leaf bed pampering the coward heart with feelings all too delicate for use?" (Vide Coleridge's "*Reflections on having left a place of Retirement.*")

వాల్టర్ సింప్సన్ చరిత్ర నీతఁడు చక్కఁగా చిత్రించినాడు. ప్రయాణాంత మున నీతండు పేరిస్‌లో ఓస్‌బోర్న్ సతి (Mrs. Osborne) ని కలిసి కొనినాడు. ఈతనితో సలిపిన యొడంబడిక చొప్పున నీయాడుది వెంటనే అమెరికాపోయి, తన తొంటిమగనికి విడాకులు సమర్పించి కొడుకును, కూతురును వెంటగొని స్టీవెన్సన్‌ను కట్టుకొనినది. ఈమె విద్యాబుద్ధు లెఱిఁగిన మహిళయట! ఈమె తనకు లభించినందుల కామహాగ్రంథ కర్త మురిసిపోయినాడు. ప్రయాణప్రమోదమున ప్రణయప్రమో దము చేకుఱెనని ఉబ్బితబ్బిబ్బయినాడు. ఒళ్లుమఱచి తన ప్రణయా వేగము నీతడు తనగ్రంథమందు వెడలగ్రక్కినాడు. స్వేచ్ఛమెయి మసలి, స్వేచ్ఛమెయి మనసు నాశాభరితమొనరించి, స్వేచ్ఛమెయి ప్రేమించు నవకాశము జేకూర్చినజగదీశు నీతడు ప్రస్తుతించినాడు ("And I blessed God that I was free to wander, free to hope and free to love") ఆత్మకథనము నీతడు కంఠమెత్తి తెలిపినాడో అను నట్లు వ్రాసికొనెనుగదా!

ప్రయాణగ్రంథములందు చిరస్థానము నాక్రమింపజాలునది ఈతనిచే రచింపబడిన "ట్రావెల్స్ విత్ ఎ డాంకి ఇన్ ది సెవెన్నిస్" ("*Travels with a Donkey in the Cevennes*") అను గ్రంథము. మోడెస్టైయిన్ (Modestine) అను నాడుగాడిదను దోకొని ఫ్రాన్సునం దీతడు కావించిన పయన మిందు వర్ణింపబడినది. ప్రయాణసన్నాహమున కును, ఖరక్రయమునకును సంబంధించిన అంశములు గ్రంథారంభమున విపులముగ వర్ణింపబడినవి. చక్కని వర్ణనములున్నను, గ్రంథము విషాద ప్లావితమైయున్నది. భారతీయులకువలె స్కాట్లండువాసులకు కొంత ఉపదేశధోరణి యుండును. ఈగ్రంథమం దిట్టిధోరణి గోచరింపక మానదు.

వివాహానంతరమున పడమర అమెరికాయందు తాను కొంత కాలము కడపిన జీవితము నీతడు "ది సిల్‌వెరేడో స్క్వాటర్స్" ("*The Silverado Squatters*") అను గ్రంథమున చిత్రించినాడు. సిల్‌వెరేడోను గుఱించిన హృద్యమైన గద్యవర్ణన లిందు గలవు.

"ఎక్రాస్ ది ప్లెయిన్స్", "ది ఎమెచ్యూర్ ఎమిగ్రెంట్" (*"Across the plains"*, *"The Amateur Emigrant"*) అను గ్రంథములందు గ్రంథకర్త జీవితచరిత్రను గుఱించిన కొన్ని యంశములు కలవు. ఇంగ్లాండునుండి అమెరికాకును, న్యూయార్కునుండి సేన్‌ఫ్రాన్సిస్కోకును స్టీవెన్సను కావించిన ప్రయాణ మిందు వర్ణింపబడినది. కాని ప్రయాణమునకు సంబంధించిన ఈతని గ్రంథరాజములో నివి కడపటిచోటునే ఆక్రమింపగలవు.

"ఇన్ ది సౌత్ సీస్" (*"In the South Seas"*) అనునది పయనమును గుఱించిన ఈతని తుదిగ్రంథము. తొలుత నిది యొక సుప్రసిద్ధ న్యూయార్కుపత్రికలో ప్రకటింపబడినది. తన చిన్నిడింగీలో (The Casco) దక్షిణసముద్రదీవులనడుమ గావించిన పయనమున తానందిన అనుభవముల నీతఁ డిందు విశదీకరించినాడు. ఈ దీవులందలి ప్రకృతిసౌందర్యమును, వీనియందుండువారి పరిస్థితులును, గుణదోషములును ఇందు వర్ణింపబడినవి.

ఇటీవల దివంగతుఁడైన కిప్లింగుమహాకవి "ఫ్రమ్ ది సీ టు ది సీ" (*"From the Sea to the Sea"*) అను శీర్షికతో క్రీ॥ శ॥ 1893 లో ప్రయాణమునకు సంబంధించిన రెండు భాగములను ప్రచురించినాడు. యువకుఁడై యున్నపుడు సోదరునితో కలిసి జార్జిసార్వభౌముడు ప్రపంచయాత్రను గావించెను. అప్పటి యాత్రాంశములు రెండుగ్రంథములుగ క్రీ॥ శ॥ 1896 లో బ్రకటింపబడినవి.

ప్రయాణమందలి పరితోషము నెంతయెంత యాంగ్లగ్రంథకర్తలో ఉగ్గడించిరి. "ప్రయాణము ప్రమోదభరితమైనదనియు, ఒంటరినై పయనింప నువ్విళ్లూరుదుననియు" ("One of the pleasantest things is going on a journey, but I like to go by myself") అని కజాహేజ్‌లిట్ మహాశయు డనినాడు! ఒరు లొనరించిన పయనములను గూర్చిన కథనములనుండి కొన్ని యంశములను గైకొని డేనియల్ డీఫో, షేక్స్పియరాదులు చక్కనివాక్యము లల్లిరి. అలెగ్జాండరు సెల్కర్కు నౌకాభంగముకతన సముద్రమున బడి, కొండొక తెప్పసాయమున నొక నిర్జనద్వీపమును చేరుకొని, ఐదేండ్లందు కడపిన ప్రవాసమును

దృష్టి నిడికొనియేకదా డీఫో తన సుప్రసిద్ధగ్రంథరాజము "రాబిన్‌సన్ క్రూసో" ("*Robinson Crusoe*") ను సృష్టించినాడు! ఒక సాహసకృత్యమును, ఉద్రేకభరితమైన ఒకసంఘటనమును (Adventure) ఆధారముగావించుకొనియే షేక్స్‌పియరు మహాకవి తన "ది టెంపెస్టు" ("*The Tempest*") ను రచించెనని ఆంగ్లసారస్వతవిద్యార్థు లెఱుగుదురు.

భారతదేశమందు నేడు చెల్లుబడియగుచున్న విద్యావిధానము లోపములతుట్టయని ఎల్లలు నెఱుగుదురు. ఈ విద్యావిధానమువలన హృదయము వికసింపదు. ప్రజ్ఞాప్రతిభలు హృదయమందేకదా పెంపొందును! కళోపాసనమును పురికొలుపు ఉద్వేగభావనాశక్తులు (Emotion and Imagination) హృదయమునందే కదా వృద్ధినందును! ఈశక్తులను మనుష్యహృదయమున రేకెత్తించునది ప్రయాణమని కంఠమెత్తి చెప్పగలను. చిన్నిచిన్ని వేడుకపయనముల (Excursions)కందందు అవకాశముకలదు; కాని, విజ్ఞానసంపాదనమున కక్కఱకైన దీర్ఘప్రయాణములకు నేటి విద్యావిధానమున ప్రోత్సాహములేదు. కావున ప్రయాణమునకు సంబంధించిన గ్రంథములు అధునాతన భారత సారస్వతాంగణమున గోచరించుట లేదు. ఒక్క వంగభాషయందు మాత్రము జలధరసేన్ అను సుప్రసిద్ధగ్రంథకర్త తనయాత్రను గుఱించి వ్రాసిన చిన్నిపుస్తకముమాత్ర మగపడుచున్నది.

మనభాషయం దిట్టి గ్రంథములు లేనేలేవు. దేశాటనమందలి ప్రాముఖ్య మిట్టిదని మనపెద్దలెవ్వరును చెప్పరైరి. కొలది వత్సరములకు మున్ను మదరాసులో శ్రీబత్తుల కామాక్షమ్మగారు దేశాటనమునుగ్గడించుట ముదావహము... "కాశీమజిలీ" లను గ్రంథమొకటి మన రాష్ట్రమందు విశేషప్రచారము నందినది. దీని సంపుటము లెన్నో వెలువడినవి. మధిర సుబ్బన్నదీక్షితులుగారు భూలోకమందలి తమ మజిలీని ముగించి, స్వర్గధామమును చేరుకొనిరి; కాని మణిసిద్ధుడును, గోపాలుడును తమ గమ్యస్థానమును జేరుకొనజాలరైరి. వివిధగ్రంథముల నుండి సంగ్రహింపబడిన విడ్డూరపు కథలును, చిత్రవిచిత్రములును ఇందు మూటగట్టబడినవి. ఇది మెఱపులు తళ్కొత్తించు అబద్ధముల మూట! చేప నవ్వినదనియు, రాతిబొమ్మ శిరోజములతో నలరారెననియు,

సప్తసముద్రముల కవ్వల నొక్కచెట్టుక్రింద పెక్కునిలువుల లోతున కొండొకపెట్టె సొరుగునందలి బరణిలో దాచబడిన తుమ్మెదలు నులిమివేయ బడినపుడు ఒక బ్రహ్మరాక్షసి చచ్చెననియు ("చేప నవ్వినకథ" "బుద్ధి సాగరకామపాలుర కథ" "సింహాదమనునికథ" లను చూడుడు.) దండుడు, సాంబుడు, ప్రవరుడు, వసంతుడు, రాము డను నేవురు మిత్రులందు సాంబుడు చెట్టుమొదట నిలిచియుండ దక్కినవారు వివిధశాఖల నుండి చని, సముద్రమధ్యమందో,పర్వతగుహాలోనో అదృశ్యులై, ఒకప్పు డిక్కట్టులబడి, వేఱొకప్పుడు కొండొక కొలనులో జలక్రీడలు సలుపు గంధర్వస్త్రీలను భార్యలుగబడసి, కైలాసమునకు స్వర్గమర్త్యములను సంధించి, ముల్లోకముల నేలి రనియు, తానువలచిన సుందరాంగు నొక యువతి, పెంపుడుతల్లిగ్గొన రక్కసి వచ్చువేళ నల్లిని జేసి మంచపుపట్టెడ యందు దాచెననియు, ఎవ్వడో ఆకసమునుండి గిరుగిఱ్ఱున జుట్టుకొని వచ్చి లోతుకొలకున గూలబడెననియు, కీలుగుఱ్ఱము నధిష్ఠించి యోధప్రవరు డొకడు మేఘవీథులనుండి చరచరబోవుచు, రాజసౌధాగ్రమున తలవిరియబోసికొని విహరించుసుందరి చూపులయందు తటాలున తవుల్కొని బరబర మేడలోనికి లాగబడెననియు నందు చదువుదుము. ఈరీతికథ లెంతదూరమైనను తెగసాగగలవు. సాహితి అచ్చెరుపాటును పుట్టించు కథనమును (ఆంగ్లేయులు వచించు "Romance"ను) కాంక్షించుట నిక్కమే! కాని సత్యమునుండి తొలగి విదూరముల వెంటబడు సారస్వతపథూటి ("రొమేన్స్"పై కన్నువైచి "రియాలిజమ్"ను తఱిమిగొట్టు సాహితీయువతి అనిన ననుడు) మృగతృష్ణననుసరించి చను నభాగునివలె వ్యర్థపరిశ్రమయందు కూలబడి నగుబాటునకు దాసియగును. మాయమాటలును, వింతకబురులును మోలీ బాజావలె పామరులదృష్టి నాకర్షించును. ఇట్టి సరకును వారికి సమర్పించు గ్రంథములు వేలకొలది విక్రయమగును. ఈతుక్కు ప్రోవులవలన కొందఱు గ్రంథకర్తలు ఐశ్వర్యవంతు లగుచున్నారు. వింతచెత్తకై జీవితములు ధారవోసి, తమ చిత్తములను క్షుద్రయాశలకు లగించి, చీని చీనాంబరములను గట్టుకొని విఱ్ఱవీగు గ్రంథకర్తలు ప్రజాళియందు సత్యప్రదీపకళికను వెలిగించుటకుమాఱు వారి హృదయములందు రాజ్యచక్ర

మును త్రిప్పు అవిద్యాపిశాచమునకు మఱింత నైవేద్యమును సమర్పించు వారగుదురు. "సత్యం, శివం, సుందరమ్" ("Truth, Goodness and Beauty") లను మహదాశయములనుండి పలితెంచు రచయితలు అంధకారమందును, అనృతమందును, అల్లకల్లోలమందును కూలబడుదురు.

భ్రమణచరిత్రలు కల్పితకథలు కావు. ఇవి ప్రత్యక్షానుభవ భాండాగారములు. వీనికతన చేకుఱు విజ్ఞానము మానవుని సర్వతోముఖాభివృద్ధికై తోడుపడునని నాదృఢవిశ్వాసము.

ఏకారణముచేతనో జగదీశుడు నిక్కమైన నావిద్యార్థిజీవితమును దేశభ్రమణమందే ఆరంభింపజేసినాడు. నేను పుట్టినది పవిత్రమైన ఆంధ్రదేశమందే! ఆంధ్రవసుంధరయందు నేను మిడిమిడిజ్ఞానమును సంపాదింపకమున్నె నాతలిదండ్రులు దివంగతులగుటవల్లను, వారి మహానిష్క్రమణానంతరము నా పిత్రార్జితము జ్ఞాతుల గభీరకంధరనాళమందు గుభాలున జొచ్చుటచేతను బాల్యమందే ఆంధ్రావని వీడి, దేశభ్రమణమొనరించి, తుదకు వంగమాతయండ జేరితిని. నన్ను గన్న ఆంధ్రజనయిత్రికి జోహారొనరించుచు, ఏదిక్కులేక అల్లాడు నన్ను తన యంకసీమను జేర్చుకొని, నాకు తన స్తన్య మిచ్చి, పదునేనేండ్లు నన్ను పెంచి, నాకు జ్ఞానభిక్ష నొసగి, నాకు పెంపుడుతల్లియును, ఉపాధ్యాయినియునైన "బంగారు బంగాళము" ('సోనార్ బంగ్లా') మ్రోల నేను సాగిలపడుచుందును. ఈయమ్మను తలచినపుడు నాహృదయ మావేశముతో నిండిపోవును. నాకనులనుండి కడవలకొలది నీరు కాఱును. ఒకప్పుడు తున్కతున్కలైన నాచిన్ని యెడందకు తన ప్రేమసుధాంజనమును పూసి, నాకు సాంత్వనమును, సాంత్వనమునే కాదు, ఆయువును ఒసగిన వంగజనయిత్రి ఋణమును నేను తీర్చుకొనలేను. నేడునుఏకారణముచేనైన నాహృదయము విషాదపూరితమగుచో నొకమాఱు వంగవసుంధర కరిగి మనసు కుదుటబడిన పిదప నిచటికి మరలివత్తును.........దేశభ్రమణమందు ప్రత్యంగుళమును పరిశీలించి, అందుండి విజ్ఞానమును గ్రహించుటకు పిన్ననాడే యలవాటుపడితినని తెలుపుట నాయాశయము.

కలకత్తాలో నుండుతఱి ఆర్యావర్తమును పలుమాఱు—ఒకొక్కప్పు డొంటరిగను, మఱొక్కపుడు సతీసహితముగను—ప్రదక్షిణము

చేసితిని. ఇటీవల మాత్రము పశ్చిమపర్వతములందు పర్యటనము సలుప గలిగితిని. ఏపుణ్యభూమి వీరవరుండైన శివాజీని గని ప్రపంచచరిత్రకారుల దృష్టి నాకర్షించినదో, ఏపవిత్రసీమ తిలక్, గోఖలే, రనడే మున్నగు మహాపురుషులకు కన్నతల్లియైనదో, ఏనేలయందలి గిరికందరములును, అరణ్యప్రదేశములునుకూడ పూతస్వాతంత్ర్యశబ్దముచే బహుశతాబ్దులు ప్రతిధ్వనించెనో, ఏయున్నతాపని గోదావరి, కృష్ణ, సావిత్రి, గాయత్రి, కొయనా, ఎన్నా మున్నగు నదీమతల్లులకు జన్మస్థలమైనదో, శివాజీ మనియున్నపుడును, లోకమాన్యుడు సజీవుడైయున్నపుడును, హిందూమతమవిచలితమై ఏభూమియందు పెంపారెనో ఆసీమలో ప్రవేశించి, దాని మహత్త్వమును గుర్తింప మిక్కిలి మక్కువపడితిని.

మహారాష్ట్రయాత్రకు బొంబాయిని కేంద్రస్థలము గావించుకొంటిని. అందుండియే పశ్చిమభారతమందలి వివిధస్థలములకు కదలిపోతిని.

ఉత్తర హిందూస్థానమందలి పర్యటనమును ముగించి బొంబాయిని క్రీ॥ శ॥ 1935 డిశంబరు 16-వ తేదీనాడు చేరితిని. అందుండి 23-వ తేదీని నాసికకు పోవ నిశ్చయించితిని.

నాసికదిశకు పోవురైళ్లెన్నియున్నవో, ఏయే సమయములందవి బయల్వెడలునో తెలిసికొనుటక్కై బోరిబందర్ (Victoria Terminus) స్టేషనునకు పోయి, ఇంక్వయరి ఆఫీసులో వాకపుచేసితిని. రాత్రి పదిన్నర మొదలు అరగంట కొకటి చొప్పున మూడు రైళ్లు నాసికకు పోవునని అచటి యుద్యోగి (ఆఫీసరు) చెప్పినాడు. "తెల్లవారునప్పటికి ఆ చోటును చేరు రైలేది?" అని యాతని నడిగితిని. "11 గంటల రైలు పోవును" అని యావ్యక్తి ఉత్తరమొసగెను.

నాటిరాత్రి (డిశంబరు 23-వ తేదీని) బొంబాయిలో బయలుదేరితిని. అచటి మిత్రుడొకడు స్టేషనువఱకువచ్చినాడు; టిక్కట్టు తీసికొనివత్తునని నాడు. "ఉదయమగు లోపున దిగవలసివచ్చుచో అప్రాప్తచోటులో చిక్కుపడవలసివచ్చును. కావున 11 గంటల రైలునకై టిక్కట్టు తీసికొనిరమ్ము" అని చెప్పి, అతనికి పైకమిచ్చినాను. కొంత సేపటికతడు

పంజాబు మెయిల్ టిక్కెట్టు తెచ్చి, నాచేత బెట్టినాడు. టిక్కెట్టును చూడగనే నా కించుక ఖేదము కలిగినది... వేగముగపోవు మన రైళ్లలో మొదటిది పంజాబు మెయిలు! ఒకప్పు డిది గాంధీగారి సర్టిఫికెటునుకూడ బడసినది. బొంబాయిలో రాత్రి పదునొకండు గంటలకు బయల్దేరి, నాసిక చేరుట కిది ఉదయమువఱకు నడచునని నమ్ముటెట్లు? శరవేగమున పోవుచు నిది చిన్నస్టేషనులను వదలివేయును. ఇన్క్వాయిరీ ఆఫీసులోని యుద్యోగులు చెప్పువృత్తాంతమునున్న దున్నట్లు నమ్మరాదని గ్రహించితిని. ఢిల్లీలో కొనిన "ఆల్ఇండియారైల్వేగైడ్" (*All india Railway Guide*) నొక పెద్ద మనిషి బొంబాయిలో దీసికొని మఱల నీయకపోవుటచే నిట్టి యుద్యోగి నాశ్రయింపక తప్పినది కాదు. టిక్కెట్టునకై పోయిన మిత్రశేఖరుడైనను 11 గంటలకైలు మెయిలని విని, దానికై పైకము చెల్లించినపుడు అది రాత్రిసమయమందే నాసికకడ నన్ను జారవిడుచునని యోచింపనైన లేదు. "మిత్రుడు నైసర్గికమైన తెలివిని (Native intelligence) ఇంచుక యుపయోగించిన బాగుండెడిది" అని తలచితిని. రాత్రి 11-35 లకు బయలుదేరు ప్యాసెంజరు నాసికను ఉదయము 7 గంటలకు చేరునని స్టేషనులో కానుపించిన పెద్దమనిషి యొకడు దపుడు చెప్పినాడు. టిక్కెట్టు కొనినపిదప నిక నాలసింప నిచ్చగింపక 12-వ నెంబరు ప్లాటుఫారములో నిలిచిన పంజాబుమెయి లెక్కితిని. మిత్రుడింటికి మరలిపోయినాడు.

మఱొకవిషయము: డిశంబరులోకూడ బొంబాయిలోచలిలేదు. అంతకుమున్ను సంయుక్తరాష్ట్రములందును, పంజాబులోను తిరిగి దురంతమైన చలికి గుఱియై బొంబాయి చేరుకొనినంతనే "అమ్మయ్యా!" అని యనుకొంటిని. సత్వరస్థలపరివర్తనమువలన బొంబాయిలోని చిఱుచలి చలివలెనే నాకు తోచలేదు. నాసికకుపోయి వెంటనే తిరిగి రాదలచితిని. కావున స్నానమున కవసరమైన కొలదిమాత్రపు బట్టలను ఒక మరచెంబునుకూడ గొనిపోతిని. పఱుపును, రగ్గును తదితర శీతవస్త్రములను బొంబాయిలో విడిచిపెట్టితిని.

రైలు క్రమక్రమముగ నెత్తుచో టెక్కి పర్విడజొచ్చినది. పడమటి కొండలకు రాకరాక వచ్చితినని కాబోలు కొండకొనలనుండి

చివాలున నెగసివచ్చి, తీవ్రశీతవాతూలము నా కాహ్వాన మొసగినది. పెట్టెలోనివా రందఱు పెద్ద పెద్ద రగ్గులు కప్పుకొని, ముసుగుదన్నిరి. ఏకాంబరధారివలె నున్నవాడను నేనొక్కడనే! వడకకుండ నుండవలెనని యెంత యత్నించినను బహువేగమున నడుచు రైలు నెదుర్కొని కిటికీగుండా రివ్వున లోపల ప్రవేశించు చలిగాలిలో శరీరము గజగజ వడకిపోయినది. నన్నుచూచి ఖేదపడుదానివలె నామరచెంబు చిఱు చప్పుడు చేయుచు కంపించినది! "నాసిక ఇందే ఎదురైనది! అచటికిపోయి గోదావరిలో మునుగుటెట్లు? ముందున్నది కాబోలు ముసుళ్లపండుగ! నాసికచలిని గుఱించి ముందే యోచింపకుండుట పొరపాటైనది" అని తలపోసితిని.

జరిగిన పొరపాటుపై దృష్టి నిలిపినయెడల అది బ్రహ్మరాక్షసియై పీడించునుగదా! ఇట్టి నెరసునుతలచి వగచుట నాప్రకృతికి ప్రతికూలము. తప్పును తప్పుకాదని మిడిసిపడను. ఇట్టి మిడిసిపాటు మానవుని అపరాధములందు సిద్ధహస్తుని జేసితీఱును. పొరపాటునుండి వాటిలు కష్టము కతన కొంతపరిజ్ఞానము చేకుఱుననియు, కష్టముకతనగాని మానవుడాత్మపరిశీలనమున కలవాటు పడడనియు, స్వీయహృదయపరీక్షను నేర్పునాచార్యు లరిష్టములే యనియు, సుఖమెన్నడు నాచార్యపీఠము నధిష్ఠింపజాలదనియు యోజించి, ఇక్కట్టు బోధించుపాఠమును పలుమాఱు మననము చేసికొని, దానికి చిత్తమున చిరస్థాన మొసగి, దాని వెలుగున క్లిష్టపరిస్థితులందు ముందంజవేయ ప్రయత్నింతును. ప్రపంచ పరిస్థితు లన్ని వేళలందు మన కనుకూలముగనుండవు. భిన్నభిన్న మానవ ప్రకృతులతో తఱచుగ మనకు సంఘర్షణము కలుగుచుండును. అనవరత మేకైకభావమందే మునిగి తేలవలెననిన, మనకు నిరాశ తప్పదు. మనసు నులిపిరికాగితమును చేసి పదిలితిమేని, వ్యతిరేకమైన ఏచిన్ని తలపుచేనైనను, అది చిరిగిపోకమానదు. ప్రతికూలప్రపంచపరిస్థితులకు వ్యక్తిగత వ్యతిరేకపరిస్థితులు సైదోడులగునపుడు తన మనసును కొంత గట్టిపఱచినగాని (ధైర్యమును చిక్కబట్టినగాని యనిన నసుడు) మానవుడు క్షణక్షణము తన యంతరంగమున దురంతయాతనచే పొగులును. ఇదియే "తెవులులేని కేదన!" భావసంఘర్షణమున మన

కొంక యపూర్వానుభవము చేకుఱును; మన మెఱుగని క్రొత్తప్రకృతి (అదెట్టిదైనను) మనకు దృగ్గోచరమగును. ఈదృష్టి నలవఱుచుకొనుటకు మానవునకు సమయముపట్టును. సంఘర్షణసమయమున మనుజుడు చఱ్ఱు మనుట సహజము. చఱ్ఱుమనువాడు తనయాత్మపై స్ఫులింగమును విసరు కొనును. ఒరులవలన చెఱుపునందుటకుమున్ను అంతరంగికముగ నీతడు తానే ఎంతేని చెఱుపు నందును. సంఘర్షణము నీతడు విశాలదృష్టితో పరికించు ముహూర్తమందే విజ్ఞానదృష్టి నలవఱుచుకొనగలడు. ఈ దృష్టి నలవఱుచుకొని బాహ్యావనియందు ప్రవేశించితిమేని, ప్రతికూ లానుభవములు మనచే "అమ్మో!" యనిపించవు. మనసును పిడికిటబట్టు కొట్లని మన మాతురపడ నక్కఱలేదు; మీదుమిక్కిలి మనకు కొంత జ్ఞాన మబ్బె నని ఆనందింతుము. అయ్యలారా! జ్ఞానము గిన్నెడుతేనె వలె మనకు చేబడదు. దాని నందుటకై ఒక్కొకపుడు మనము చింత నిప్పులందుకూడ కిక్కురుమనకుండ నడువవలెనుజుడీ! ఈభ్రమణ వాహినియందు చదువరులు నన్ననుగమించివచ్చిరేని, మనుష్యచరిత్ర యందలి చిత్రవిచిత్రముల నెన్నేని పొడగాంచగలరు.

రాత్రికదా! మనసునందు నాందోళన మేమియు లేనందున చలి యెక్కువగానున్నను, నిద్దుర రాదొడగినది. కాని నిద్రపోవు టెట్లు? రైలు రాత్రి రెండున్నర గంటలకు నాసిక చేరు నని బండిలోని ఒక పెద్దమనిషి చెప్పినాడు. నాకు కుసుకుపట్టుచో (తూరీగవలె నది ముందటికరుగుచున్నందున) నాగమ్యస్థానము పిట్టవలె వెన్క కెగసిపోవును గదా! అందుచే నాసిక నెదురుచూచుచు, ఇంచుకైన నొరుగక బల్లపై తిష్ఠవేసితిని. మాపెట్టెలో నెందఱో లేరు. పండుకొనుట కెంతేని చోటున్నది. ఇది యపూర్వమైన విషయమే! స్థలమున్నను నిద్రించు టకు పెట్టిపుట్టితిని గానని వగచితిని. "ఈఘటము ఒంటరిగా నున్నాడు. పాపము కాలక్షేపమునకై వీనితో నేదైన గొప్పగోష్ఠిలోదూకుటమే" లను నింగితజ్ఞానము పెట్టెలోని మహాశయుని కొక్కనికైనను లేకపోయి నది. పరోపకారము ప్రపంచమునుండి అంతర్ధానమైపోయినదని కినిసి తిని. నిలువున ముసుగులుదన్ని ఒకరిద్దఱు భీమకాయులు మహాఘోర ముగా గుఱు పెట్టసాగిరి. రైలుహోరుతో పందెము గట్టుటకై

ముక్కులతో వారు గంభీరముగా గర్జించుచున్నట్లు తోచినది. "ఈఅతి కాయ మహాకాయు లెవ"రని ఆశ్చర్యముతో పరికించితిని. ఒకడు మార్వాడీమహాశయుడు, బస్తావంటి బొజ్జగలవాడు, నేను రైలెక్క బోవునపుడు "చోటు లేద"ని కసరి, నేను పెట్టెలో ప్రవేశింపగనే అప్రతిభుడైన పెద్దమనిషి! కాని ఐదునిమిషములలో అతనికిని, నాకును స్నేహము కుదిరినది. అతడు హైదరాబాదులో వర్తకము చేయు చున్నాడు. కొలదిమాత్రపు తెలుగుముక్కలను ముక్కున బట్టినాడు. విభక్తులను, పురుషలను పాటింపమేని, ఆతని ప్రయోగములందు తప్పు లున్నవని చెప్పజాలము. "నేను ఉన్నాడు ఈబల్లమీద. చోటుగన్నై ఉన్నాడు. మీరు పడుకున్నాను ఆబల్లమీద" అని కొంతసేపటికి మున్ను నాతో ఆతడు చెప్పినాడు. తన ప్రసంగములో పాగపువతుగా మార్వాడీమాటల నాతడు కలుపువాడు. రాజస్థానమందు మసిలితిని కావున "గన్నై" (అధికముగా) మున్నగు మార్వాడీమాటల నెఱుగు దును. కావున నాతనిమాటల నవలీలగ నర్థముచేసికొని, ఆతని వింత ప్రసంగమును వినవలెనని మిక్కిలి మక్కువపడి, ఏమేమో యాతని నడుగువాడను. నవ్వుచు నేనడిగిన కొన్ని ప్రశ్నల కతడు నవ్వుచునే ఉత్తరములు చెప్పినాడు; తక్కిన నాప్రశ్నలు నానోటనుండగనే నిద్రా ప్రపంచమందు ప్రవేశించినాడు. ఇగట్‌పురి స్టేషనులో (ఇది పెద్ద స్టేషన్) రైలు ఆగినపుడు ఒక ట్రావెలింగు ఇన్‌స్పెక్టరు మాపెట్టెలో ప్రవేశించి "టిక్కట్టు! టిక్కట్టు!!" అని ఆతనిప్రక్క నిలిచి, పలుమారు అఱచినాడు. కాని మార్వాడి తన గుఱ్ఱుశ్రుతి నించుకైనను తగ్గింపలేదు; మీదుమిక్కిలి హెచ్చుస్థాయిలోనికిదిగినాడు! గుఱ్ఱుపట్టు రెండవవ్యక్తి ఈతని యన్నదైయుండును. ముఖవైఖరినిబట్టి ఆతడు పంజాబీయని బోధపడినది. నేను బొంబాయిలో రైలెక్కునప్పటికే అతడు నిద్ర పోవుచుండెను. "నిక్కముగానిది కుంభకర్ణదృశ్య" మనుకొంటిని. గుఱ్ఱులోనున్న మహాశయుని మూటకట్టినట్టులు కట్టి ఆతనివారలు రైలు లోనికి నెక్కించియుందురు! ఈవ్యక్తులనపుమ వెఱ్ఱిమొగముతో కొంతసేపు నిలిచి, ఏమనుకొనినాడో పాపము, ట్రావిలింగు ఇన్‌స్పెక్టరు వారిని కదపక (కదపినను లాభములేదని గుర్తించియుండును) మెల్లగ

పెట్టెనుండి అవ్వలికి జారినాడు. వీరి గుఱ్ఱుపోటీయందు నాకు కొంత కాలక్షేపమైనది.

పర్వతగుహాలందు భయంకరముగ గర్జించుచు, పర్విడు సింహము వలె రైలు కొండసొరంగములందు (Tunnels) భయదకల్పము చేయుచు పర్విడుచుండెను! నిర్జనపర్వత ప్రదేశమునుండి వెడలిన ఘోర ప్రతిధ్వని రక్కసియఱపట్లు కర్ణపుటములందు బడినది ! దేనినో "కటక్! కటక్!!" అని తెగనఱకుచు దూసుకొనిపోవునట్లు అంధకారమున ధూమశకటము తోచినది! "భీషణముగ అంకెలువేయు అపూర్వమైన ఆబోతేమో యిది" అని యనిపించినది. "కొండలను, లోయలను, వనములను, చీకటులను, విపత్తులను లెక్కసేయక సింహనాదము చేయుచు చరచర సాగిపోవు అద్భుతయోధు డిట్టుండును కాబోలు" ననుకొంటిని. "భూమి నుండి ఒక్కుమ్మడి అంబరవీథి కెగసి, మేఘములను పరపర నమలజూచు అపూర్వమృగ మేమోయిది!" అని తలపోసితిని. "భేష్! రైలంటే ఇట్లుండవలెను. తింటే గారెలు తినవలెను; వింటే భారతము వినవలెను, ఎక్కితే పంజాబుమెయిలే యెక్కవలె"నని యనుకొంటిని.

గవాక్షముదిక్కుగా దిరిగి, చీకటిని ఛేదించు ఇంజనువెలుగున నట్టె తలెత్తి, వెన్కకుతరలు దృశ్యములను పొడగాంచుచుంటిని. అంధకారము! ఆకస్మికాలోకము! అపూర్వదృశ్యము!—సంయుక్తముగ నివి యొసగు భావభిక్షకై మానసాంజలి నొగ్గి అట్లే కూర్చునియుంటిని.



# నా మహారాష్ట్ర యాత్ర

## రెండవ ప్రకరణము

సంకల్పశక్తి ఈశ్వరశక్తికి మారుపేరేమో! సైనికజీవితమున నెత్తుకొండ లెదురైనపుడు ద్విగుణీకృతోత్సాహముతో, అద్భుతసాహసముతో వానిని ప్రతిఘటించి ఇది ముందులకుఱుకును. ఘనాంధకారము బోలు దౌష్ట్యము దీని చఱపులను విని, ప్రాణములు వీడు రక్కసివలె నఱచి ఎందో యదృశ్యమగును. నిలిచి పోర నుంకించిన ప్రతికూలశక్తులీశక్తి యగ్రసర యగుటను తెరువొసగి, తాము సంపూర్ణ్ణయాంతరంగిక పరివర్తనమంది, అపూర్వాలోకమున తేజరిల్లి, దీనికి వంగి సలా మొనరించి, వెన్కకు తరలును. పశ్చిమపర్వతముల నెదుర్కొని, కొండసొరంగములందు భీషణప్రతిధ్వనులు లేపుచు, మహావేగమున ముందటి కుఱుకుచు, ధూమశకటము తన వెలుగున దళ్కొత్తించిన అద్భుతదృశ్యములు నాటిరాత్రి నామానసాంజలి నిడిన భావభిక్ష యివియే!

సరిగ రాత్రి రెండున్నరగంటలకు రైలు నాసికస్టేషను జేరుకొనినది. కుంజరకుంభస్థలిపై లంఘించుటకు మున్ను క్షణము తడయు కేసరి లీల, అవిరళభావప్రవాహమును తన లేఖినీముఖమునుండి వెడలించుటకు ముందు నిముసము యోచించు మహారచయితవలె పొగబండ్లకు రాజైన పంజాబుమెయిలు తరువాతిపయనమును సాగించుటకుమున్ను ఒక్కక్షణముసేపు ఆగినది. విశ్వమందు చిరమై వెలయునది శాంతిగాని భీషణ విజృంభణముకాదని ఘోరధ్వనియనంతరమపుడు రాజిలిన నిస్తబ్ధత విశద మొనరించినది.

నాసికస్టేషనుకడ రెండు ప్లాటుఫారములు ఉన్నవి. బొంబాయి నుండి వచ్చు రయిళ్లొక ప్లాటుఫారము కడను, బొంబాయిదిశ జను బండ్లింకొక ప్లాటుఫారము పొంతను ఆగును. రెండును ఇనుపదారికి చెరియొకవైపున నున్నవి. స్టేషన్ అంతపెద్దదికాదు. రెండుప్లాటుఫారములుకల నిడదవోలుస్టేషనునకు సైదోడువలె నున్నది. నాసికపట్టణము దీని కైదుమైళ్లదూరమందున్నది. నాసికకు త్రియంబకము పదునెనిమిది మైళ్ల మేరలో విలసిల్లుచున్నది. రెండుక్షేత్రములను చూడవలెననియే బొంబాయినుండి కదలివచ్చితిని. త్రియంబకమందే గోదావరి పుట్టినది.

ఏనదియందు మునిగినను దానిజన్మస్థలమును చూడవలెనని పిన్ననాటనుండి మక్కువపడుచుందును. నదీపూరము ప్రేమపూరమువంటిది కదా! ఈశ్వరకరుణనందుచు నీశ్వరు నందవలెనని ఆతురపడుచుందుము కదా! వెల్లువలో మునిగి మునిగి, పనిచెల్లిపోయినదని నేను తలపను. దానిని కనినప్రకృతి యెట్టిదో కనుగొన వాంఛింతును. ప్రకృతిదృశ్యములను చూచి, వానియందు విడియవలెనని ఎత్తువేయుచుందును. ఇట్లు విడియునపుడే మన కవి చక్కని గురుకులములు కాజాలునని యెఱుగుదును.

గోదావరియెడల నాకు ప్రత్యేకానురాగము కలదు. గోదావరీ నదీతీరమున బుట్టి, గోదావరీనీరములం దీదులాడి, గోదావరీసలిలమును గ్రోలి, గోదావరీవాలుకాస్థూపములం దాటలాడి, పిన్నతనము నీ నదీమతల్లిదాపున గడపుటచే కన్నతల్లివలె నాకది పూజనీయమైనది. నేడును ఈనది నాస్వంతనదియని చెప్పుకొనుచుందును. ఎన్నెన్నిచోటులందో తిరిగి జన్మస్థలమం దీఝరీమతల్లిని చూచినపుడు నాహృదయ ముప్పొంగును.

గోదావరికి గంగ చెల్లెలందురు. అక్క తనబిడ్డను చెల్లెలిచేత బెట్టినట్లు నాబాల్యముకడవకమున్నె గోదావరి నన్ను గంగకడకు పుత్తెంచినది. గోదావరివలె నామనసునకెంతో ప్రీతిగొలుపు సరిల్లలామ గంగ! గంగపొడవు పదునేనువందలమైళ్లుకదా! ఈ మేరయందు పయనించి, గంగాహృదయమును పరిశీలించుభాగ్యము నాకు గలిగెను. గోదాపులినతలమునకు చదువరులను గొంపోవుటకు ముందు గంగను నే

బరీక్షించిన తెలుగును (ఇది మన ప్రస్తుత పతనమునకు మేలుబంతియైనది కావున)* సంక్షేపముగ నిందు తెలుపుదును.

మంచుకొండపై పెక్కునాళ్లు పయనము సాగించిన పిదప లక్ష్మణ ఝూలాకడ జాల యాశ్రమములను చూడజాలుదుము. ఈ తావును చేరువఱకు గంగ సన్ననైయుండును. ఇందుండి పోయిపోయి, మైదానమున ప్రవేశించుతఱి క్రమక్రమముగ నిది వెడల్పగును. లక్ష్మణఝూలాకు మూడుమైళ్లదిగువలో హృషీకేశ క్షేత్రమున్నది. ఈ రెండు క్షేత్రములకు నడుమ గంగయొడ్డున చిన్నచిన్న కుటీరము లున్నవి. ఒకరి నడుగ నక్కఱలేకుండ మన మీ కుటీరములం దుండి ప్రకృతిశోభను విలోకించుచు, హిమగిరిదృశ్యమును మనసున జొనుపుచు, దివిజకల్లోలినీ పూరమున గ్రుంకు లిడుచు, చిరశాంతియందు ధ్యానమగ్నులమై హాయిగ కాలము గడపవచ్చును. ఇందు వసించు యోగులలో ముఖ్యులు రామకృష్ణమంగళస్వాములు ఇచ్చటియాశ్రమములలో, వ్యాసాశ్రమము, శంకరాశ్రమము, రామాశ్రమము, స్వర్గాశ్రమము ప్రధానములు. శంకరాశ్రమస్వర్గాశ్రమములు చక్కని పాలరాళ్లతో నిర్మింపబడినవి. శంకరాశ్రమము గంగకివ్వలను, స్వర్గాశ్రమ మవ్వలను ఉన్నవి. అనుదినము వీనియందు పురాణకాలక్షేపము జరుగుచుండును. అతిథులను సత్కరించు వ్యవస్థ లిందుగలవు.

ఈవ్యవస్థల నేర్పఱచిన మహనీయులలో ముఖ్యుడు 'కాలీకమలీవాలా'యను సన్యాసి. ఇతడెప్పుడును నల్లకంబళి కప్పుకొని తిరుగువాడు. కావున ప్రజ లీతని నట్లు పిలువదొడగిరి. ఈతడు స్థాపించిన ధర్మశాలలు హృషీకేశమున నారంభమైనవి. బదరికాశ్రమమునకు పోవువారు హృషీకేశమున హిందీలో వ్రాయబడిన ఒకచిన్న వైద్యగ్రంథమును, ఒక మందుల సంచికట్టును, ప్రయాణఘట్టములను సూచించు పఠమును, గంగోదకముతో నింపబడి, లక్కతో బంధింపబడిన ఒకచిన్ని చెంబును, ఒక తులసిమాలను కాలీకమలీవాలా ధర్మశాలయందు పడయగలరు. కలవారికిని, పేదలకునుగూడ నీశాలలే వాసస్థానములు. ధనికులిచ్చు పైకము దానమునకై వినియోగపడుచుండును. దేవప్రయాగ, కేదారనాథ,

* దీనిని గుఱించిన విపులోదంతమును చదువరులం పిదప తెలియగ గలరు.

యమునోత్తరి, గంగోత్తరి మున్నగుచోట్లులందు కాలీకమలీవాలా స్థాపించిన చిన్నిచిన్ని శాలలు కలవు. ఇతడు దేశభ్రమణమున నెంతో పైకమును బిచ్చమెత్తితెచ్చి, వీనినిర్మాణమునకై వెచ్చించినాడు. ఈతని నిండు బొమ్మ యొక్కటి నేడును హరిద్వారహృషీకేశములకు* నడుమ నున్న సత్యనారాయణమందిరమం దున్నది.

లక్ష్మణఝూలా హృషీకేశముల నడుమ రెండు చోట్లులందు యాత్రికుల నీవలి యొడ్డునుండి ఆవలియొడ్డునకును, అవ్వలినుండి యివ్వలికిని దాటించు నావలున్నవి. దాటించుటకు పైకమిచ్చినను నావవాండ్రు పుచ్చుకొనరు. ఇటీవల లక్ష్మణఝూలాకడ వ్రేలాడు వంతెన యొకటి నిర్మింపబడినది. ఈప్రదేశమున లక్ష్మణాలయముకలదు. హృషీకేశమున భరతాలయమును రామాలయమును నున్నవి. లక్ష్మణభరతుల కిచ్చోట్లులందు దక్క భారతసీమయందు మరెందును ఆలయములు లేవు. హృషీకేశమున మూలమిట్టునుండి నిమ్నతలమునకు దుముకుతఱినది మిగుల వేగవంతమైయుండును. హరిద్వారమున గంగ చాల గభీరమైయుండును. అన్నికాలములందును నది యిచట చరచర పోవును. హరిద్వారమందలి ముఖ్యఘట్టము "హరికీపారా." హరిద్వారమనిన స్వర్గద్వారమనియు, స్వర్గమునకు పోవువా రిందుండి పోవలెననియు, ఒకప్పుడు యుధిష్ఠిరుడు అనుజుల గూడి ఇందుండి పయనము చేసెననియు, క్రమక్రమముగ తమ్ములును, భార్యయును నేలగూలినను, శునకరూపమున గోచరించిన యమునకు తనధర్మప్రవర్తనముజూపి, అతడు స్వర్గమునకందుండియే పోయెననియు హిందువులు విశ్వసించుచుందురు. హరిద్వారమునకు కొంతయెగువలో 'భీమగోడ' యను చోటున నొకచక్కని చెరువుపొంత పాండవుల విగ్రహములును, పార్వతీపరమేశుల మూర్తులును కలవు. కొండమీది సూర్యగుండమువలె సీతటాకము మిగుల పవిత్రవంతమైనదని ప్రజలునమ్ముచుందురు. హరికీపారాకడ నమరవాహిని వెడల్పుగ నుండును. జాహ్నవినడుమ చిన్నమందిరముకలదు. విష్ణుపాదములనుండి సురాపగ యిచ్చోటనే వెడలెనని యాత్రికులు విశ్వసింతురు. తొలుత నేనీమహాక్షేత్రమునకు 1927 లో ఏప్రియల్

---

* హరిద్వారము హృషీకేశమునకు పదునేను మైళ్ల దిగువనున్నది.

13వ తేదినాడు జరిగిన కుంభమేళ మహోత్సవసమయమున పోతిని. చిన్న చిన్నసందులనుండి లక్షలకొలదియాత్రికులు బ్రహ్మగుండమందు పగలు ఒంటిగంటవేళ స్నానముచేయుటకై ముందులకురికిరి. జనసమూహమం దపుడెందరో నేలబడి విగతజీవులైరి. హరిద్వారమునుండి మూడుమైళ్లు ఎగువకుపోతిమేని, ఖంఖాక్షేత్రమును చూతుము. ఇచ్చట దక్షమందిర మును, 'సతీకుండు'ను గలవు. ఇది దక్షుడు యజ్ఞముచేసిన తావం దురు. ఈయధ్వర మిచ్చట జరిగెనో, తూర్పుగోదావరిమండలమందలి దాక్షారామమందు జరిగెనో తెలుపలేము. నైమిశారణ్యమునందువలె నిందొక పెద్దమారుతీవిగ్రహ మున్నది. హరిద్వారమునుండి చాల దూరము సాగిపోతిమేని, బ్రహ్మావర్త (దీనికి 'బిత్థూర్' అను నామాంతరము కలదు) మనుక్షేత్రమును చూతుము. ఒకప్పు డిచట బ్రహ్మ యజ్ఞము చేసెనందురు. అత్తటి భూమితలమున స్థాపింపబడిన మేకు ఎంతలోతువఱకు లోనికిపోయినదో యెఱుగ యత్నించి ఎందఱో విఫలమనోరథులైరట! ఇచ్చట గంగ మొసళ్లతో నిండియుండును. ఇట్లని అందునే నీదులాడునపుడువిని, ఈశ్వరకరుణకతన మకరముల కెరగాకతీర మును చేరుకొంటిని. ఇచటికి సుమారు మూడుమైళ్లదూరమున పరిహార మను పల్లెకలదు. ఈపల్లెకు కొంతదూరమం దున్న వనమున సీతను రామాజ్ఞనొదలదాల్చి లక్ష్మణుడు విడిచెనట! "జానకి ఇందే పరిహరింపబడి నది కావున దీనికి పరిహారమను పేరు వచ్చె" నని అచటి యోగియొకడు నాతోపలికెను. పరిహారమున కనతిదూరమున గంగదాపున మూడు పురాతనదేవాలయము లున్నవి. వీనియందు రాగిబాణముల తునకలున్నవి. ఇవి కుశలవులును, శ్రీరాముడును ఆప్రాంతమందు తమ యుద్ధమున వాడిన బాణములని అచటివా రందురు! బాణములు పురాతనము లైనవనుట నిస్సంశయము! కాంతారగర్భమున లోకపావని జానకి విడువబడినచోటున నేడును ఒకపెద్ద మఱ్ఱిచెట్టున్నది! ఈచెట్టు మొదలుచచ్చి చాలకాలమైనది. చాలదూరమువఱకు పెరిగిన ఊడలపై నిది నిలిచినది! అచట నొక లోతైన గుండమున్నది. సీతమ్మ అందుండియే భూగర్భమున ప్రవేశించెనని శతవృద్ధుడైన సన్యాసి యొక డచ్చోటున నా కెఱింగించెను. ఈవృద్ధు డా గుండమును నూయిగమార్చి, అచట నొక చిన్నగుడి కట్టినాడు. సీతమ్మ

భారతస్త్రీ! ఆమె పరిత్యజింపబడినది భారతారణ్యమందుగాని అమెరికాలోగాని, మెసపొటేమియాలోగాని కాదు. ఆర్యావర్తమందే కదా ఆమె యట్లు విడిచిపెట్టబడినది! జానకి యందే పరిత్యజింపబడినదని మనము నమ్మిన నమ్మవచ్చును.

తరతరములనుండి పెరిగి పెంపొందుచున్న విశ్వాసమును నఱికి వేయుట దుర్మతికే సాధ్యము. మూఢవిశ్వాసమును మనసునుండి దూరముగ నెట్టివేయుదును. కాని, దేవదేవునివలె ప్రభాకలితమై మనశ్చక్షుస్సమక్షమున దోచు విశ్వాసమునకు పాగిలపడుదును. మూఢవిశ్వాసము జ్ఞానసంపాదనమునకు చెఱుపుదెచ్చునట్లే సంశయపరంపరలు దాని కెగ్గు దెచ్చును. జిజ్ఞాసకు మార్గదర్శక మగు సందియమునకే నేను నామనసున తావొసగుదును. సంశయములను మూటగట్టి మనసునం దిమిడ్చి, దేశాటనము చేయువాడు వ్యర్థప్రయాసకు పాత్రుడగును. ఇట్టిఘటము ఏమూలనో నక్కి, ముక్కిపోయినబాగు!

లోకపావని జానకి బాష్పవారిచే కడుంగడు పునీతమైన చోటును చూచినపు డేభారతీయుని కన్నులనుండి నీళ్లు జొటజొట రాలవు? మునికూడి అచ్చో కొంతకాలముండి, మరల బ్రహ్మావర్తమునకు తరలి పోతిని.మంధర్, ఉత్తరీపూర్, వేణిగంజ్, మాధవగంజ్, మియాగంజ్ లను చోటులుదాటి, గంగాగంజ్*కడ గంగాతీరమున వైకుంఠాశ్రమమున నారదస్వామి ఆదరమందుచు కొంతకాల ముంటిని. ఈ తావున భూగర్భమున శంఖచక్రములుగల చక్కని విష్ణువిగ్రహము దొరకినదట! స్వామీజీ ఇందే తనయాశ్రమమును నెలకొల్పి, విష్ణువిగ్రహము నొక చిన్నగుడియందు ప్రతిష్ఠించెను. ఇందుండి పూర్వశరాయి పోతిని. ఇచట గంగాతీరమున చండీమందిరము కలదు. కర్ణుడు తనశరీరమునుండి కొంతరక్తమును దీసి చండీదేవి కిందు అభిషేకముజేయువాడట! 'చండీమయ్యా'ను గుఱించి పాటలుపాడుచు పలువురు హిందూస్థానీయులిచ్చోటి కరుగుదురు. ఇందుండిపోతిమేసి, జమల్పూర్ మాంఘీర్ సుల్తాగంజ్ లను చేరుకొందుము.

---

* ఈతావు సంయుక్తరాష్ట్రములందు ఫరుకాబాద్ జిల్లాలో కలదు. ఇచ్చటి కొకకూట దయనమందే కనూజ్ కలదు.

సుల్తాన్‌గంజ్ కడ మందాకిని చాల వెడల్పుగనున్నది. నదినడుమ చిన్నకొండగలదు. ఈకొండపై పూర్వము జహ్నుఋషి తప మాచరించువాడనియు, ఆతనికిక్క పాలబడి, తోస్త్రోడనే వానికుట్టుబడి, ఆతని కరుణాపెంపున ముని యూరువునుండి యీవలికివచ్చి, అందుండి గంగ జాహ్నవి యను నామమునందెననియు నచటివారందురు. దివంగతుడైన తన జనకుని పవిత్రస్మృతికి చిహ్నముగ నొకసంగీతుడందు ఒక ఈశ్వరాలయమును నిర్మించినాడు. దీని ప్రాకు కొండకొనపై చక్కని ఆశ్రమముకలదు. భారతీతీర్థుడను స్వామీజీ ఒకడందుండును. ఇతడతిథులను సత్కరించుచుండును. ఎవరేని ఈతనిపాదములంటొంత పైకమిడిన యెడల, శిష్యులు కైకొందురు. ఎవ్వరును నేమియు నీయకుండిరను, అచట నాహారము లభించితీరును. స్వామీజీ నియోగించిన నావికుడే ఆశ్రమవాసులను గంగనుండి ఆవలకును, ఈవలకును దాటించును. స్వామీజీ ఒకప్పుడు రామేశ్వరమునకును దక్షిణయాత్ర సేసి, అరవమున 'నరుపు' అనుపదమును, తెలుగున 'చారు' అనుమాటను నేర్చుకొనెను. 'గోదావరి' పేరు నాకు ఉత్తరహిందూస్థానమున అమోఘమైన సప్తసికైయుండెడిది. ఆనదీతీరమందే నాజన్మస్థలమున్నదని తెలిపినంతనె ప్రతియాశ్రమమందు నాకు నీడలభించెడిది; ఆదరానురాగములు చేయుచుండెడివి.

జహ్నుయాశ్రమమునందలి దృశ్యము మిగుల విచిత్రమైనది. పట్టిసముకడ గోదావరి నడుమ గుడియున్నను, ఇచ్చటివలె నందు నెత్తయిన కొండలేదు. కావున జహ్నుమున్యాశ్రమమునందలి చక్కదనము మచ్చోట గానరాదు. ఇచటికి రమారమి నూఱుమైళ్లదూరమందు వైద్యనాథమను మహాక్షేత్రము కలదు. భారతవర్షమునందలి ద్వాదశస్వయంభులింగములలో నొకటి అచ్చోగలదు. కాశి, రామేశ్వరము, కేదారనాథము, సోమనాథము, శ్రీశైలము, కాళహస్తి మున్నగు క్షేత్రములం బోలునది వైద్యనాథము. శివరాత్రి కచటికి వేనవేలు యాత్రికులు పోవుచుందురు. సుల్తాన్‌గంజ్ కడ చెంబులందు గంగోదకమునుబట్టి, శివరాత్రి నాడు ఈశ్వరున కభిషేకముచేయుటకై యాత్రికులు వైద్యనాథక్షేత్రమున కరుగుచుందురు.

వీరితో వైద్యనాథక్షేత్రమునకు పోవలెనని మక్కువపడితిని. ఈ ధోరణి ఆధునికవిద్యార్థికులలో పల్వురకు విస్తారము గొలుప వచ్చును.

గంగోదకమును గొని శివలింగము నభిషేకించినంతన కైలాసము దివినుండి నక్షత్రమట్లు చేతిలో రాలునని విశ్వసింపను. కాశీక్షేత్రము నాలుగుసారులు దర్శింపగలిగితినని, ఈశ్వరుడు తనకు గల ఒక్క కైలాసము గాక మఱి మూడు కైలాసములను నాకై నిర్మించుచున్నాడని నేను తలంపను. తీర్థయాత్రల ఫలితమును గురించి పల్వురు చెప్పు ఉదంతమును ఉన్నదున్నట్లు గ్రహింపను. తీర్థసేవనమును, దేవతాదర్శనమును, దేశభ్రమణమును, కొండొక మహత్తరోద్దేశమునకు సాధనములు మాత్రమే! ఆమహత్తరోద్దేశము ఆత్మశక్తి! ఆత్మశక్తి యలవడిననాడు పాపవాసనల నంటిన మాయ రాలుననియు, పరంజ్యోతిని గుర్తింప జాలుదుమనియు నావిశ్వాసము. పూర్ణవిజ్ఞానము సంపజాలిననాడు మన మీ యఖండమును వీక్షింపగలము.

విశ్వవిద్యాలయమున పెద్దడిగ్రీలను సంపాదించితినని, పెక్కు బహుమతులు గంటితినని, యశస్వికుల ప్రశంసనందితినని, విద్వాంసుడ నైతినని తలపను. నిక్కంపు విద్య విశ్వవిద్యాలయమును వీడినయనంతరమే ఆరంభమగును. అర్కరము లిచ్చు జ్ఞానము, ఎవరోయిచ్చిన జ్ఞానము, గ్రంథములందు నెవరో ప్రోగొనరించిన జ్ఞానము, రెండవతరగతిజ్ఞానమనియే (సెకండు హేండ్ జ్ఞానమనియే) నా యభిప్రాయము. లోగల సహజశక్తిని లేపి, స్వతంత్ర యోచనయం దారితేఱి, స్వాంతభావ భాండాగారమును నిలుపుకొనిననాడే మన విజ్ఞానదాహము తీఱును. "ఈపిపాస యెట్లు తీఱును దైవమా?" అని కన్నీళ్లు వదలుదుము కదా! వేయివెరవులు రోయుదుము కదా! ఈవెరవులను బట్టి నడచు చుండ నాకస్మికముగ మేఘముల మఱుగునుండి విద్యుల్లత మెఱయు లీల మానసగహ్వలయమున నొక్కొక్కప్పుడు ఏదేని మహితభావము తళ్కొత్తును! అపుడు మనసు కొంత కుదుటబడును. తపసు చాలింపక నడచితిమేని, భావసౌదామినీపరంపరలు గోపికానివహమట్లు హృదయ బృందావనము నాశ్రయించితీఱును!

తీర్థసేవయును, దేశయాత్రయును ఈ వెరవులలో ముఖ్యములు. ఏయే తావులందు శతాబ్దులు సాగిలపడినవో, ఏయే చోటులు సహస్రాబ్దులను కనులజూచినవో, ఏయే ప్రదేశము లొకప్పుడు మహావిజ్ఞానులకు పుట్టిండ్లయి గంభీరవేదవాక్కులతో ప్రతిధ్వనించినవో, ప్రకృతిశోభతో నవనవోన్మేషమై యున్నవో ఆయాస్థానములం దెన్నెన్ని భావతరంగములు పొంగి పొరలవు?* నేను గ్రుంకులిడిన దీతరంగములందు; నేను సాగిలపడిన దీభావములకు † శరీరముతోబాటు మానసమును, ఆత్మను గూడ నీతావులందు వెలారు భావలహరియందు మాటిమాటికి ముంచివేయ నాతురంపడుచుందును. నాదృఢవిశ్వాసము నా యాశయమునకు సింహద్వారమని నమ్మి, "నీయింగ్లీషు నీధోరణిని చంపలే" వని పల్వురు గేలిచేసినను, నాపథమందు ముందంజవేయుచు నేయున్నాను. నా యాంగ్లము నన్ను చెఱుపలేదనియే ఆనందింతును. ఆంగ్లభారతిని నే ననవరతము పూజించుచు నేయుందును. కాని నాస్వతంత్రభావమును "మట్టుపెట్టు"మని ఈమె హుకుమ్ చలాయించుచో, హద్దుమీఱి రావలదని ఈమెను ధిక్కరించుటకు సంశయింపను.

జహ్నుఋష్యాశ్రమమునుండి నూఱుమైళ్ల దూరముననున్న వైద్యనాథక్షేత్రమునకు కాల్నడక బోవ నిశ్చయించితిని. పరుగిడుచు, రివ్వురివ్వున నెగయుచు మన మెంత జ్ఞానమును సంపాదింతుము? నడచి నడచి ఉస్సురుస్సురని చెమ్మట బొట్టులు రాల్చుచు, నీబొట్టులందు ముత్యాలబోలు క్రొత్త తలపులను చూతుము, దక్షిణామూర్తి యోగ నుండియు, దోమనుండియు విజ్ఞానమును సంపాదించువాడట! ఆ మహా

---

* బ్రహ్మసమాజికులందు పెద్దయైన రవీంద్రదేవునిమాట గమనింపుడు :

"India chose her places of pilgrimage wherever there was in nature some special grandeur or beauty so that her mind could come out of its world of narrow necessities and realise its place in the infinite."

† ఇట్టి భావములు కేవలము పౌరాణిక ప్రాముఖ్యముగల తావులందును, ప్రకృతి శృంగారమున రంగారు చోటులందును, మాత్రమే కాక చారిత్రకప్రాముఖ్యము గల స్థానములందును గూడ వెల్లివిరియుచుండును. కావున పుణ్యస్థలములను, పణ్యస్థలములను, ఎడారులను, కొండలను, అడవులను, పేలసారంగములును కూడ నాభారత యాత్రయందు చేరినవి.

సీయుడు పుట్టిన చోటునందే మనము జన్మించితిమి. యత్నించినచో, బాహ్యదృశ్యములనుండి మన మశేషజ్ఞానమును తోడుకొనలేమా?

ఆశ్రమమందు కొన్నాళ్ళు విడిసియుంటిని. అచట జరుగు పురాణ కాలక్షేపమందును, శాస్త్రీయచర్చలందును పాల్గొనువాడను కావున స్వామీజీకిని, ఆశ్రమవాసులకును నాయెడల నెంతో ప్రేమ కుదిరెను. స్వామీజీ కమండలువువలె చక్కని రాగిచెంబును (నేడును ఇది నా కడ నున్నది) తెప్పించి యిచ్చినారు. ఆశ్రమసమీపమందే కలశమున గంగోదకమును నింపి లోకపావనిని చేబూని, యోగీంద్రుని ఆశీస్సుల నంది, వైద్యనాథమునకు పోతిని * శివరాత్రిసమయమున నీకథనమును తెలుపుతఱి స్మృతిపథమున నాటి శివరాత్రి సంఘటనములను సమగ్రముగ పరికించుచుంటిని. ఈయాత్ర కష్టభూయిష్ఠమైనది. పథమందు పల్వురతో శ్రమించి, పల్వురతో నానందించితిని. చక్కనైన చోటులందు కొన్నివాసములు సలిపిన నాటి యనుభవము నా కెంతో మేలొనరించినది. వైద్యనాథమందలి ఆలయము గుహవలెనుండును. వంగి లోని కరుగవలయును. పథశ్రమానంతరము కఠినోపవాసముతో పల్వురను త్రోసికొని, నేనందు ప్రవేశించుతఱి ప్రాణములుపోవునవస్థ సమ్ముఖమైనది. హర్లాజోడీ, దేవఘర్, కుయిల్ మున్నగు చోటులనుండి కదలిపోయి మరల గంగా ప్రవంతిని బట్టితిని. కాన్పూర్, ప్రయాగ, కాశీ మున్నగు పట్టణము లందే గాక పల్లెలందును, వనములందును కూడ వసించి, జాహ్నవిని సేవించితిని. కలకత్తాకు సుమా రెనుబది మైళ్ల దూరమందే గంగ సాగరమున గలియును. కావున ప్రతివత్సరము సంక్రాంతిసమయమున నచట మహోత్సవము జరుగుటచేసి, కలకత్తాలో నుండుతఱి అచటి కెన్నోమారులు పోవువాడను.

---

* ఇట్టియాత్ర లొకప్పు డాంగ్లవసుంధరయందును జరుగుచుండెడివి. లండనులో థేమ్సునదీతీరమందలి సత్రమందు విడిసి, పల్వురుయాత్రికులు కేంటర్‌బరీకి (ధర్మరక్షణార్థ మసువులంగోల్పడిన థామస్ బెకెట్ సమాధిస్థానమును చూచుటకై) పోవువారనియు, పథికు లొక్కొక్కరొక్కొక కథచెప్పువారనియు, ఉత్తమకథకుని పేరిట మార్గమందు విందులును, వేడుకలను జరుగుచుండెడివనియు ఛాసరుమహాకవి తన "కేంటర్‌బరీటేల్స్" (*"Canterbury Tales"*)లో తెలిపియుండెను కదా!

చదలేటిని శ్రద్ధాభక్తులతో పరిశీలించినట్లే గోదావరిని కూడా పరీక్షింపవలెనని ఆతురపడుచుందును. కొన్నేండ్లకుమున్ను రాజమహేంద్రవరమునుండి పర్ణశాలవరకు పోజాలితిని. అది పడవపయనము.—పదినాళ్ల పయనము. ఇసుకతిప్పలందును, పాపికొండలందును, జనపదములందును, భజనలందును, ఆటలందును, పాటలందును గడపిన సమయము ఆనందప్లావితమైనది. రామనవమినాడయోధ్యలోకంటె భద్రాచలముందే (నాడయోధ్యయందు జన్మోత్సవముమాత్రము జరుగుచుండును) విశేషోత్సవములు నెఱపబడుచుండును.

పర్ణశాలభద్రాచలములను పంచవటీక్షేత్రము లనుచుందుము. నాసికకడ నున్నది పంచవటి యని మహారాష్ట్రుల తలంపు. ఇందును అందును కూడా సీతాహరణస్థానములు పేర్కొనబడియున్నవి. మనప్రాంతమును గురించిన ఉదంతమే సత్యమైనదని నిరూపింపబడినదని ఇటీవల కవిసార్వభౌములు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు చెప్పిరి.

త్రియంబకమును తొలుత జూచి, పిదప నాసిక రావలెనని నిశ్చయించితిని. తెల్లవారుజామున నాలుగు గంటలకు స్టేషనునుండి నాసికకు బస్సుపోవుననియు, అందుండి వేఱొకబస్సు త్రియంబకము పోవుననియు వింటిని.

నేను దిగిన ప్లాటుఫారమునక్క నుండియే బస్సు నాసికకు పోవును. బస్సుపోవుటకు సమారము రెండు గంటల వ్యవధి యున్నది.

ప్లాటుఫారమునుండి మెల్లగ స్టేషనులోనికి పోతిని. గేటుకడ నేమో యల్లరి జరుగుచున్నది. ఒక భీమకాయునితో టిక్కెట్టు కలక్టరు జగడమాడుచున్నాడు. టిక్కెట్టుచూపు మనినపుడు కొండంతమనిషి చల్లగ నొక యరటిక్కెట్టును తీసి వానిచేతులలో పెట్టినాడు. పదుగురను కరగించి ఒకేవిగ్రహముగా పోతబోసినట్లు ప్రత్యక్షమైన పెద్దమనిషి న్యాయమును గమనించి పది పెద్ద టిక్కెట్లను కొనవలసినది. లేదా ఒక పెద్దటిక్కెట్టుకొని, దాని నేత్రాలికో లెక్కకట్టి, మిగిలినశరీరమును లగేజీచేయించి, బ్రేక్‌లో పడవేయించియుండవలసినది. ఈ రెండు విధములలో నేదేని ఒకవిధమును అవలంబించలేదు సరికదా, ఒక్క

పెద్దటిక్కెట్టునకు కూడ మొత్తిపెట్టి, ఆమహారథు డొక చైల్డు టిక్కెట్టును కొనినాడు. అదికూడ యెందులకో నాకు బోధపడినది కాదు. ద్వారము దాపున ప్రదర్శింపబడు దృశ్యము ఇతరులకు ఎంతో ఆనందము గొలిపినది; కాని టిక్కెట్టుకలెక్టరుకు పట్టరాని ఆగ్రహమును కలిగించినది. లోనికిటికీగుండా స్టేషన్‌మేష్టరు ఈదృశ్యమును పరికించి, నిలిచి పోరు చున్నా కొంపంతవ్యక్తియగు కొజోగి యున్నగానట్లు తనపనిలో నిమగ్ను డైనాడు. "వేళకు పైకం లేకపోయింది. ఏదోకొన్నాను. తీసుకో ఎగు రక" అని భీమకాయుడనినాడు. ఆతని కంఠస్వరము రైలుకూతవలె ఘోరముగా నున్నది! వానిరూపమును, మాటలధోరణియు టిక్కెట్టు కలెక్టర్ గుండెలను దడదడలాడించినవి. తానడ్డు నిలిచినను తనను, తనకొలువును, తనస్టేషనును కూడ ఒకయుంజలోదాటి అతడవ్వలి కరుగునని గ్రహించి, బుద్ధిమంతుడు కావున టికెట్టుకలెక్టరు చల్లగ ప్రక్కకు తప్పుకొనినాడు.

"ఈవింతమానిసి ఎవ్వడో! గజాసురుడు కాడు కదా? వీనిని స్టడీచేసి తీరవలె" నని తలపోసి, నే నాతని వెంటబడితిని.



# నా మహారాష్ట్రయాత్ర

## మూడవ ప్రకరణము

బొంబాయిలో రైలెక్కినప్పుడు మొదలు ఇప్పటివఱకు కంటికి కునుకు లేదు సరికదా కొయ్యవలె కూర్చుండవలసి వచ్చినది. బస్సు బయలుదేరుటకు రెండుగంటల వ్యవధియున్నది. కనుక కొంచెముసేపు స్టేషనులో నాఁగవలెనని మక్కువపడితిని. ఆచోటును సంపూర్ణముగా పరికించినాను. లోనిహాలులో కొన్నిబల్లలున్నవి. వానిపై నేమీ ఖాళీ లేదు. ఒక పొడవుపాటి బల్లమీద నెవరివో సామానులున్నవి. దానికి రెండుప్రక్కలందుగూడ నేమేమో మూటలు అమర్చబడియున్నవి. నే నీఘోరకలి చూచుచుండగా చరచరపోయి గజాసురుడు నేలమీది సామాను నిటునటు తన్ని, బల్లమీది సరకును క్రిందికి దొర్లించి తాను దానిపై బడినాడు. బల్ల పెద్దది కాబట్టి దానిపై నిద్రకు చోటు కలదు. కాని 'సగము గజాసురునకు' మాత్రము అది సరిపోయినది. మిగిలిన శరీరమును అతడు దిగువదెస నున్న టీషాపులో ప్రవేశపెట్టినాడు. "తుము కోన్ హో? జావ్ బహార్," ("ఎవరవు నీవు? పో అవలికి") అని అంగడివాడు అఱచినాడు. "ఘాస్"! (మూసుకో!) అని ఒక పర్యాయము కెవ్వుమని గజాసురుడు కన్నులు మూసినాడు. అతనితో ప్రసంగింపవలెనని ఆతురపడితిని; కాని నా కప్పుడు తరుణము చిక్కలేదు. వానిధోరణిని మాత్రము గమనించుచున్నాను. పలుకరించినంతన, నిముసములో నన్నాతడు 'గుటుక్కున మ్రింగు'నేమో అని యడలితిని. 'నాసికస్టేషనుకు వచ్చినవాడు తప్పక నాసికపట్టణమున కరుగును. అందైన నీతని గలిసికొందును గాక!' అని మనసు కుదుట బఱచుకొంటిని. కాని మేనువాల్చుటకు నా కెందును చోటు కానుపించలేదు. తుదకు కూర్చుండుటకైన తావు లేదు. నేలపైగూడ నెందఱో పరుండిరి. టీషాపులో కొంతసేపు కాలక్షేపము చేయదలచినాను. చలి తీవ్రముగా

నున్నది. తేనీరు కొంతచలిని అపునని యెఱుగుదును.* నాసికచలిని టీవలన కొంతవఱకు నెట్టింపదలచితిని. అందుచే టీషాపులో గట్టిగ తిష్ట వేసితిని. షాపువాడు హిందూస్థానీయుడు. మంచి చలాకీ మనిషి. అతని ప్రోత్సాహమువలన రెండుకప్పులను అవలీలగా గొంతుకలో ప్రవేశ పెట్టితిని. "రోడ్డున కవ్వల ముసాఫర్ఖానాకై ఒకబంగ్లాయున్నది. పరుండుటకు మీకు కంబళి చోటు దొరకును" అని 'చాయివాలా' చెప్పినాడు. ఆకల కటకటా! ఎట్లో నేనూ, నాచెంబూ పోయి 'బంగ్లా'లో ప్రవేశించితిమి. శవములవలె పలువురు అచట పడియున్నారు. గుడ్డలాంత రొకటి

---

* దారుణమైన చలిలో పన్నెండేళ్లనుండి హిమాలయములందు పెక్కుసార్లు ప్రయాణము చేయవలసివచ్చినది. పెషావరులో కొన్నిదినములుండి జీటూరాలేండి కోటల్ మున్నగుతావులు చూచుకొని, కైబరు తెరువున కవ్వలనున్న లేండిఖానాకు పోతిని. అంతకుమున్ను అరిదజను యేండ్ల క్రితము మాత్రము కైబరుకొండలందు సొరంగములు (టన్నెల్సు) దొలుచబడినవి. వీనిగుండా రైలు కడుసేర్పున నడచును. ఇండియాకును, ఆఫ్గనిస్థానమునకును నడుమ సరిహద్దులో ఒక చిన్న పోస్టాఫీసు ఉన్నది. ఒక కరాక్ పెద్దమనిషి నాకందు కనుపించి, ప్రసంగధోరణినిబట్టి నేను కాశ్మీరమునకు బోవుచుంటినని గ్రహించి "అయ్యా! ఇపు డచటికి పోయిన తప్పక మువ్వావాటిల్లును. అచటి చలిని సహించలేరు. ఈదినములలో నచ్చటివారు జమ్మూకు పోదురు. పలువురు గుండెలకు కుంపట్లు కట్టుకొని తిరుగుచుందురు. ఈచలిలో మీకు నిమోనియా వచ్చితీరును. ఇప్పుడు ప్రయాణము సాగించుట మంచిదికాదు. సాగింతురేని, తప్పనిసరిగ బ్రాందీని ఉపయోగించవలెను" అని పలికినాడు. "కాశ్మీరముపోవుట తప్పదు. కాని బ్రాందినాశ్రయించుటెట్టు దైవమా!" అని తలపోసితిని. బ్రాందికి బదులు మూడేసిగంటల కొక కప్పుమోతాదు చొప్పున హిమగిరి ప్రయాణములో టీ పిల్చువాడను. చిన్నచిన్న కొండ పల్లెలందుగూడ టీ లభించెడిది. శ్రీనగరమునకు పోవుతఱి చాలమైళ్లు జీలమ్‌నది దాపుననుండి కొండలోయలో పయనము సాగించవలెను. రాత్రులందు హిమగిరిపై నేకుటీరమందో విడిసి, మంచుగుండా త్రోవచేసికొని దురంతమై, దుస్సహమైన చలిలో నుదయమే జీలమ్ నదిలో మునిగి స్నానానంతరము వేడివేడి తేనీరుత్రాగువాడను. టీవలన కొంతచలి చచ్చెడిది. వంగమిత్రులకును, తేనీటికి నెంతో స్నేహము. పెక్కండ్లు వంగీయులతో వసించుటచే కాబోలు కట్టినేస్తము నాకుగూడ నొకప్పుడు లభించినది. టీ యొక్క మహత్త్వపటుత్వముల నొక్క మహాకావ్యమున వర్ణింప గాంక్షించుచుంటిని.

వెలుగుచున్నది. ప్రదేశము ధూళితో నిండియున్నది. చోటుకూడ స్వల్పము. ఎంతసేపు నిలిచియుండగలను? నాకడ స్నానాంబరములేకదా యున్నవి! "నాసికదుమ్ము పవిత్రమైనది" అనుకొని ధూళిలోనే తువాలు నొకమూల బఱచి శరీరమును దానిపై బడవేసితిని.* వెంటనే నిద్రపట్టి

---

* ఇట్టియనుభవము నీవఱలో నొకపర్యాయము మెఱుగుదును. కొన్నేండ్లకుమున్న అలహాబాదునుండి పయనమై నేను చిత్రకూటమునకు పోతిని. నాతో క. స. మూర్తి యను నొక ఆంధ్రసోదరుడు పయనమైనాడు. ఈ సోదరుని స్వస్థలము తూర్పుగోదావరి జిల్లాలోని ఒకపల్లె. చాలకాలమునుండి కుటుంబసహితముగ నితడు కలకత్తాలో నాటసకు దాపుననుండువాడు. బ్రాహ్మణుడు; అచ్ఛవైదికి; మంచివాడు. అర్ధరాత్రి వేళ చిత్రకూటము స్టేషనులో దిగితిమి. స్టేషనుకు అరమైలు దూరములో విశ్రాంతిగృహమున్నదని వింటిమి. అర్ధరాత్రి! గాఢాంధకారము! నామిత్రుని కాళ్లకు జోడులేదు. ఒంటికి చొక్కాలేదు. స్టేషనునుండి విశ్రాంతిగృహమునకు పోవుటకు సరియైన తెన్నులేదు. చుట్టుప్రక్కల తుమ్మచెట్లు విరివిగా పెరిగియున్నవి. త్రోవనిండా ముళ్లు! మెల్లగా నడచినడచి నామిత్రుడు సరిగా వాడిముండ్లపై అడుగువేసి "అమ్మో! చచ్చేను!" అని కెవ్వుమని ఘనస్వరమున మూలుగువాడు. చుట్టత్రాగుట నాకును అభ్యాసములేదు; అతనికిని అభ్యాసములేదు. కావున మాదగ్గఱ అగ్గిపెట్టి సంగ్రహములేదు. ఎట్లో కొంతసేపటికి ఆవిశ్రాంతిగృహము చేరితిమి. నామిత్రుడు తనమాటతో (చొక్కాలేకపోయినా, బిళ్లగోచీదారుడైనా యీతడు పాగాధరించినాడు) పైకెగబ్రాకి రెండడుగులువేసి, అక్కడనిలిచిన ఒకమృగముపై గుభాలున కూలబడి, "అమ్మో! చచ్చేన!!" అని మరల బొబ్బపెట్టినాడు. "ఏమది?" అని ఒక అడుగు వెనుకకువేసి, "భయంలేదు" అని అతనికి హుషారునిచ్చితిని. ఇంతలో ముగ్గురు హిందూస్థానీయులు ఒక టార్చిలైటుతో అచటికి వచ్చిరి. వారు ముగ్గురును ప్రయాణికులే! పాఠకులు మున్ముందు వీరినిగురించిన విపులోదంతమును వేఱుగ్రంథమున నెఱుగగలరు. టార్చిలైటు వెలుగులో చూచితిమిగదా ఒక ఒంటె అందు నిలిచియున్నది! నామిత్రుడు లేవసైన లేవక, కొంతసేపు దానిమ్రోల సాగిలపడి మూలుగుచు, పిదప లేచి, వెలుగులో మృగమును చూచి "అయ్యో! దీని మొహంమండా!" అని వెనుకకు మామీదికి దుమికినాడు. "భయంలేదు. ఇది పెద్దపులికా" దన్నాను. "కాదంటారా?" అని అతడు "హర! హర! మహాదేవ శంభో!" అనుచు లేచి హావభావములతో ఇంచుక సేపు భరతనాట్యప్రదర్శనమును సాగించినాడు. ఆచోటు మృగముల విశ్రాంతిగృహమని తేలినది. ప్రపంచములోని పెంటసరకంతయు నందేయున్నది. మేమైదుగురమూ పంచపాండవులవలె దానిలోనే నాటిరాత్రి శరీరము పాఱవేసితిమి.

నది. తోడనే అచట నేదో యల్లరి పుట్టుటచే నులికిపడి నిద్రనుండి యాకస్మికముగ లేచితిని. చీకటిలో నచటివారు కుమ్ములాడుకొనుచుండిరి! ఘెల్లుఘెల్లుమను చఱపులు వినబడినవి! కాలికి బుద్ధిచెప్ప నుంకించితిని. పెద్దగోలలో "దొంగ! దొంగ!!" అని ఒకరిద్దరు కేకలువేసిరి. నేను పాఱిపోయినయెడల నేనే దొంగనని 'నాభరతం పట్టెద'రని తలచి నేనందే నిలువంబడి "ఆగండి! ఆగండి!!" అనిమాత్రము అఱచితిని. స్టేషనునుండి ఒకరిద్దరు లాంతరులతో పరుగెత్తుకొని వచ్చిరి. ఎంతోకష్టముతో అప్పటి కురుక్షేత్రయుద్ధమును ఆపివేసిరి. జరగినకథ యిది: నిద్రలో నెవడో ప్రక్కవానిని తన్నినాడు. వాడులేచి అసలీపాయిదాలతో బదులుతీర్చినాడు. ఇరువురకు ద్వంద్వయుద్ధము సాగినది. చాపచుట్టుకొనగ వారు వద్దనున్న లాంతరుపైబడిరి. భగ్గుమని అది యారిపోయినది. యోధులిరువురు ఒరులపైబడుటచే పెద్ద యుద్ధము రేకెత్తినది.

సమరము సమసిపోయినపిదప నెవరిచోటునందు వారొఱగిరి. కొంచెముసేపైన పిమ్మట నందుండి కదలిపోతిని. ఇంకను చీకటి యధికముగానే యున్నది. స్టేషను ప్రక్కగాపోతిని. కొంతదూరమున అంధకారములో నేదో తెల్లనివస్తువు కానుపించినది. ఒకపర్యాయము కదలుచున్నట్లును, వేరొకమాఱు నిలిచినట్లును అది తోచినది! "ఏమది?" అని యూహించుచు నిలువంబడితిని. ఆవస్తువు అట్లే యున్నది. "ఇంతకుమున్ను దొంగ అబద్ధము! ఇపుడు నిజము అయియుండును. దొంగ కానియెడల అదేదో భూతమైయుండును. షేక్స్పియరు మహాకవియే పిశాచములను నమ్మియుండ, నట్టివి లేవని తలచు టెట్లు?" అని తలపోసి "ఎవరువారు?" అని కేకవేసితిని. జవాబులేదు. ఆవస్తువట్లే తిరుగుచున్నది. వేఱువైపునుండి స్టేషనుదిక్కుగ నడచితిని. ఆపదార్థము నాదెసకు రాదొడగినది. "శ్రీఆంజనేయం, ప్రసన్నాంజనేయం!" అనుకొని చరచరనడచి, రోడ్డును చేరుకొంటిని. స్టేషనునుండి వెడలు క్షీణాలోకము దానిపై తోచినది. సమీపించిన ఆవింతవస్తువేమో నాకపుడు తెల్లమైనది. తెల్లబట్ట కప్పుకొని ఒకమనుజుడు వచ్చి నామ్రోల నిలిచినాడు. "నీవెవ్వడవు?" అని బిగ్గఱగా నంటిని. "మాది నాసిక. నేను పండాబ్రాహ్మణు

డను. మీరెవరు? యాత్రికులా?" అని అత డనినాడు. "అవును యాత్రికుడనే! భూతమువలె అట్లు మసలుచున్నావేమి? పలుకరించి నపుడు మాట్లాడలేదేమి?" అని వచించితిని. నాప్రశ్నకుత్తరమీయక "నాతో నాసికరండు. చక్కగా యాత్ర జరపిస్తాను" అని అత డనినాడు. "నీవు జరపించనక్కఱలేదు. పో" అని వడివడిగ నేను స్టేషనులోనికి పోతిని. అప్పుడైన నన్నాతడు విడువలేదు. నావెంట స్టేషనులోనికి పరుగెత్తుకొని వచ్చినాడు. ఒకచిన్నికార్డు నాచేతబెట్టి "తాము నాతో దయచేయండి. మీకన్ని సదుపాయములు కలుగును" అని అతడనినాడు. ఆతని కార్డుపై దృష్టిపఱపితిని. అందిట్లున్నది:

"కా. ధా గంగాధర లక్ష్మణఖాందవే.

ఠి. సోమవార్ పేఠ్; ఘర్ నం. 3162 నాసికాక్షేత్ర"

నేను మఱిమాట్లాడక స్టేషన్ మాస్టరున్న గదిలోనికి పోతిని. బ్రాహ్మణుడు వెనుకకు మరలినాడు. నాటి పిశాచము వదలిపోయినదని సంతసించితిని.

ఈ పండా బ్రాహ్మణుని చూచినంతన నామనసున క్రోధభావ ముదయించినందులకు కారణము లేకపోలేదు. ఈతని తెగను గుఱించిన దురభిప్రాయము లెన్నో పలుగుపులుగులవలె నామనస్సుపై వ్రాలినవి. మానసికముగ నాతో కలిసి యాత్ర సలుపుచు, నాతో సంతసించుచు, నాతో సంతపించుచున్న చదువరులు అపుడు నామనసున నట్టిభావము లేల పొడసూపినవో యెఱుగ గాంక్షింతురు. పండా తెగను గుఱించిన ఉదంతమును వా రెఱిగినచో, మున్ముందు వారితో నేను మసలినరీతికి హేతువు లెవ్వియో గ్రహింపగలుగుదురు. కావున నతిసంక్షేపముగ నీవృత్తాంతము నించుక దెలుపుచుంటిని.

భారతయాత్రస్థలములం దెచ్చటి కరిగినను పండాబ్రాహ్మణులు ప్రత్యక్షమగుదురు. వీరి యేజంట్లు దూరస్థలముల కరిగి, యాత్రికులను పట్టుకొందురు. మనయాత్రికులలో పల్వురు పూర్వాచారపరాయణులు; పల్లెలందుండువారు. క్రొత్తచోటులనిన వారికి కొంత భయముండును. ఎందు విడియవలెనో, ఎందరుగవలెనో, ఏమేమి చూడవలెనో వా రెఱు

గరు. పోయినచోటులో వాడుకన్నైయున్న భాష వారికి తెలియనిదై యుండుట కూడ కలదు. బిక్కు బిక్కున పయనముసాగించు యాత్రికులను తమవశమొనరించుకొని పండా బ్రాహ్మణులు చిత్తమువచ్చిన తెఱంగున ప్రవర్తించుచుందురు. వీరిచర్య మనసున కెంతేని యాతన కలిగించును. యాత్రికులను పిండి, వీరు పైకము దీయుదురు. వీరివర్తనము వర్ణనాతీతము. ఆలయములోని పూజారులును వీరి సైదోడులు.

ప్రయాగలో ప్రసిద్ధికెక్కినపండా శ్రీహరిశాస్త్రి. ఇతని సొంత యిల్లు దారాగంజిలో వేణీమాధవమందిరమునకు రెండుఫర్లాంగుల దూరములో గంగానది యొడ్డున నున్నది. ఈతనిబోలువాడింకొకడు లేనందున పోటీచేసి మేమియు నీతని కెదురు నిలువలేదు. ఇతడు చాల ధనము నార్జించి వృద్ధుడైనాడు. ఇతని కొక్క కొడుకు. లంబోదర శర్మ! ప్రయాగకు శారదతో పోయినప్పుడు మాత్రము నే నీతని యింట మకాముపెట్టవలసి వచ్చినది. 1930 జనవరినెల ప్రయాగలో మిగుల పవిత్రవంతమైయుండెను. ఆనెల 29 వ తేదీని కుంభమేళమహోత్సవము జరిగెను. దీనిని మనము త్రివేణీ పుష్కరమనినను, అనవచ్చును. ఆరేండ్లు కడచినపిదప అంత్యపుష్కరమువలె ప్రయాగయందు మహోత్సవము జరుగును. పూర్వోక్తకుంభమేళమునకు మూడేండ్లకుమున్నే హరిద్వారమున గంగాపుష్కరము జరిగినది. సంక్రాంతినుండియే త్రివేణీ స్నానము మహత్తరమైనదని యూహింపబడుచుండెడిది. నానాప్రదేశములనుండి బహుసంఖ్యాకులు అపుడు ప్రయాగ కరుగుచుండిరి. అంతకు మున్ను సంవత్సరమునుండి కుటుంబసహితముగ దేశాటనము సలుపుచుంటిని. త్రివేణీపుష్కరమునకు శారదతో కలిసి రాజస్థానమునుండి ఢిల్లీమీదుగా అలహాబాదున కరిగితిని. మకరస్నానమునకే అచటజేరవలెనని ఆమె పలికినది. సరిగ పెద్దపండుగనాటికి గమ్యస్థానమునుచేరి శ్రీహరిశాస్త్రిగృహమున బసచేసి, విధ్యుక్తక్రియలు నెఱపదలచితిని. తనజడకొనయందలిబెత్తెడు భాగమునుదీసి, "త్రివేణీ" జనయిత్రికివేణీదానము చేయుదునని శారద చెప్పినది. దివంగతులైన నాతలిదండ్రుల నుద్దేశించి తీర్థవిధి పెట్టెదనని శాస్త్రితో నే బలికితిని. కాశీలో ఒకపెద్ద పండాకడ ఏజంటుగా పనిజేయుచున్న దిబ్బయ్యదీక్షితు అను పెద్దమనిషి యొకడు

అపుడు శాస్త్రికడ నున్నాడు. శాస్త్రికి మఱింత లాభము కలిగించవలె ననియు, తానుకూడ ఇష్టమువచ్చినట్లు కొల్లగొట్టవలెననియు సీత దూహించినాడు. ఈయేజంట్లచర్య మిగుల విపరీతముగా నుండును. ఛాయవలె వీరు వెంటవెంట తిరిగి, అక్కఱైన పైకము పీకికొని, అంత టితో విడువక, "గంటలోయిస్తాము;కొంచెము పైకము బదులియ్యండ"ని తీసికొని యాత్రికులు ప్రయాణముసాగించు దినమున నంత ధనమగుచుం దురు. చేయవలసిన క్రియలకై శాస్త్రితో సంప్రదించి, దీక్షితులు పెద్ద మొత్తమును వివరించినాడు. ఇంచుమించుగ నాతడు తెలిపిన పైకమునిచ్చి వేసితిని. "వేణీదానమహోత్సవమునకు పసుపుబట్టలు కట్టుకొని, దంప తులు త్రివేణికి పోవలె"ననినాడు అబ్బయ్య. "భేష్" అంటిమి. పైకము చేబడువఱకు బ్రాహ్మణు లిద్దఱు మాయడుగులకు మడుగులొత్తిరి. పదం పడి మాదారి మేము చూచుకొనవలసివచ్చినది. యమునాగంగలు కలియుచోటు మాబసకు సమారమి రెండుమైళ్ళదూరమందు కలదు. "అచట మీకై ఒక బ్రాహ్మణుడు కనిపెట్టుకొని ఉంటాడు. వెళ్లండి" అనినాడు శ్రీహరిశాస్త్రి. "భళాభళి" అని దీక్షితులు సెలవిచ్చినాడు. చచ్చిచెడి మేమచ్చటికి పోతిమి. బొబ్బిలి పాపారాయుడువంటి ఒక మహా వీరుడు మా కండ్లకు ప్రత్యక్షమైనాడు. అతడు హిందూస్థానీయుడు. వాని శరీరము దానవునివలె నున్నది. మొగము [illegible] పెద్దదై యున్నది. పెద్దపెద్ద బూరెలు కొన్నిపంచలు గుండ్రముగా పేర్చబడి యున్నట్లున్నది ఆ వదనారవిందము! మీసములు మిగుల దీర్ఘములు! బొత్తాములవైపును వీపుమీదికి త్రిప్పి చొక్కాదొడుగుకొనినాడు. ఇతని జూచినంతనె కొంచెము వెనుకకు తగ్గితిమి. ప్రయాగలో కొందఱు కొందఱు హిందూస్థానీ బ్రాహ్మణులు కొంత తెలుగు నేర్చు కొని అపరక్రియలందు శ్రీహరిశాస్త్రికి సాయపడుచు, నాలుగు డబ్బులు సంపాదించుకొనుచుందురు. పాపారాయుడు కొన్ని తెలుగుముక్కలను ముక్కున బట్టినాడు. మమ్ములను జూచి గంభీరవదనుడై "రా అండి కూసుకోండి" అనినాడు. "వీడేదో కూయుచుంటున్నాడు. ఏమికూత కుయ్యను దైవమా! చేతనైతే 'కొక్కొరోకో!'అనుము" అని శారదతో చెప్పితిని. "బావ్ జీ! కూసుకోండి" అని పాపారాయుడు మరల పలికినాడు.

"హిందీమే బోలో భయ్యా" ("అన్నయ్యా! హిందీలో చెప్పు") అని కొంచెముసేపు కూర్చుని, నదినడుమకు దోకొని పోవుటకై ఆతడు నావ నీడ్చుకొనివచ్చులోపల మేమిరువురము "ముముక్షుజన హృదయంగమం బగు త్రివేణీసంగమంబున దానంబులు" గావించితిమి. హిందూస్థానీ యుల సంస్కృతోచ్చారణము విస్తారముగా నుండును. వంగపురోహి తులు సంస్కృతమును చావగొట్టి చంపివేతురు. వీరు గౌడబ్రాహ్మణులు. మన క్రియలకు వీరంతగా పనికిరారు. పాపారాయు డేమో యుచ్చరించి నాడు. వేణీదానసమయమున హిందూస్థానీవిప్రుడు తప్పడేమో! ఎట్లో అచ్చటికొండ జరపుకొని శాస్త్రిగృహమునకుపోయి, మఱునాడు తీర్థ విధి నిర్వర్తించి, అంతకుమున్నే లాహోరునుండి మరలివచ్చిన మోతీ లాలుజవహారులను 'స్వారాజ్య' భవనమున దర్శించి గయకుపోతిమి.

గయలోని పెద్దతెలుగుపండా కేసరియాచార్యులు. ఈయన మకాము "పంచవటి"లో. ప్రదక్షిణామూర్తి మఱొకపండా! గయలో వివిధప్రదేశములందు పితృకార్యములు జరగవలెను. ముఖ్యస్థానములు మూడు: 1. ఫల్గుణీనది, 2. విష్ణుపాదము, 3. అక్షయవటము. ఆచార్యుల వారి అనుచరులలో నొకడు ఫల్గునికడ నుండును. నదికి కొంతదూర మున (యీనదిలోని నీరు సీలమండలను దాటదు) పదుగురచే పదిమట్టి చిప్పలలో అన్నము వండించి, టోకుమీద నందఱకు నిచటిబ్రాహ్మణు డొకేమంత్రము నుచ్చరించును. వటవృక్షముకడ నపుడపుడు ఆచార్యుల వారు పనిచూచుకొందురు. మంత్రము లుచ్చరించుచు నీయన ఇతర ప్రసంగములలోనికి దిగుచుందురు. గయావళి యిచట ప్రత్యక్షమగును! ఇతడొకహిందూస్థానీయుడు. పితృదేవతల కీతడు భూలోకమున ప్రతినిధి యట! పిండప్రదానము ముగిసినవెనుక యాత్రికులు పోయి పురోహితుని మాటబట్టి, ఈతనికాళ్లు గట్టిగాపట్టుకొని "తృప్తికలిగినదా?" అని ప్రశ్నిం తురు. చిత్తమువచ్చినంతపైకమునువీరికడనుండి పిండిగాని "తృప్తికలిగిన" దని ఈతడనడు. అట్లననిచో పితృకార్యమునకు భంగమువచ్చునట! ఆచా ర్యులుగారికిని, గయావళికిని దగ్గఱసంబంధము కలదు! తగినంత పైకము ముట్టినపిదప, గయావళీ కాళ్లమీది భక్తవరేణ్యుని వీపుపై తట్టి, ఆతని మెడలో నొకగన్నేరుదండవేసి "తృప్తికలిగినది" అని సెలవిచ్చును.

పెద్దపెద్ద మార్వాడీలు గయావళులకు పెద్దపెద్ద మొత్తములొసగుచుందురు! పితృదేవత లెట్లుందురో కాని, వారికి ప్రతినిధులనబడు మహాశయులు "పైలాపచ్చీస్!" పద్ధతిలోనివారు. వారికథ వ్రాయుట కిది సమయము కాదు. సింగపూరు మున్నగుచోట్లులందు కూడ నాటకోటి సెట్టులను గలిసికొని వీరు చాలవిత్తము దెచ్చి, చిత్తమువచ్చినట్లు వెచ్చింతురు. గయలోని పెద్దపండాలు కొందఱు ఇన్‌కమ్‌టేక్సు చెల్లింపవలెను. టేక్సు ఆఫీసరు వచ్చునప్పటికి డేగలవలె వీ రెచ్చటికో రివ్వు రివ్వున నెగసిపోదురు.

"తైర్థిక సమాహిత సమ్యగ్గయ" గయనుండి అనంతరము మేము వారణాసి కరిగితిమి.

కాశీలో ఆంధ్రులు చాలమంది కలరు. పండావృత్తిలోనున్న అచ్చటి పెద్దలలో ముఖ్యులు సి. హెచ్. రావుగారును, అవధానులుగారును. అవధానులుగారు కొలదిసంవత్సరములకుమున్ను పరలోకమున కరిగిరి. వారికుమారుడు లోకేశశాస్త్రి పితృకార్యములు జరుపుచుండును. పదపడి ఒక భమిడిశాస్త్రి దశాశ్వమేధఘట్టమున ప్రేక్టీసు మొదలు పెట్టినాడు. సి. హెచ్. రావుగారికిని నాకును చిరపరిచయముకలదు. కలకత్తాలో వీరు నన్ను కలిసికొనుచుండువారు. వీరి స్వస్థలము అమలాపురముదగ్గఱనున్న చక్కనిఅగ్రహారము. ఇది నా అత్తవారియూరు. నా మామగారిని, ఆయన అన్నగారు "రావుసాహేబు" గిడుగు వేంకటరామమూర్తిగారిని (వీరు పదంపడి పర్లాకిమిడికిపోయిరి.) అమలాపురములోని నాబంధుమిత్రులను రావుగారు బాగుగనెఱుగుదురు. మాయూరు (పేరవరము) ప్రక్కనుండియే అమలాపురము, వానపల్లి, గన్నవరములకు (దిగువచీలికలై) పోవు కాలువ ప్రవహించుచున్నది. కావున రావుగారు మాస్వస్థలము నెఱుగుదురు. మాయూరిలోగూడ వారియింటిపేరువారున్నారు. వారు మా 'పురోహితులు.' కావున రావుగారు నాకు సన్నిహితులు; నాయెడల వీరికి ప్రత్యేకాభిమానము కలదు. తొలుత నేను కాశీకి 1917 లో పోయినపుడు వీరిని గలిసికొంటిని.

నే నపుడు బాలుడను. ననుగన్న తల్లి నా నైదవయేటనే నన్ను విడిచి దివంగతనైనది. ఎనిమిదవయేట నాకుపనయనమైనది. మఱికొలది

యేండ్లు మనియుండి, నాకు వివాహాము చేసి, నాజనకుడు తన యర్ధాంగ లక్ష్మిని గలిసికొనెను. నాతలిదండ్రులకు ముందు నా తాతగారున్నపుడే స్వర్గస్థురాలైనది నా సవతితల్లి. బాలకుడనై పవిత్రమైన మూడు తద్దిన ములకర్తవ్యమును తలదాల్చి, దేశాటనమునకై బయలుదేరితిని. అమ్మకు, అయ్యకు సేవ సలుపగలుగు నదృష్టము నాకు లభింపలేదు. కొడుకుకై తపించి, నన్నుగని, నన్నొంటిగ విడిచి, వారు స్వర్గమును చేరుకొనిరి. వారితో వారియాస్తికూడ నంతర్ధానమైనది. వారి యస్థులే నాకు నవరత్నములైనవి. వీనిని కనుల కద్దుకొని, కన్నీటియందు పలుమారు వీనిని ప్రక్షాళనమొనరించి, మహాక్షేత్రములందు జననీజనకుల యాత్మలను దనిపి, ప్రత్యక్షముగ జేయజాలని సేవ నీతీరున నెఱపి, ధన్యుడ నగుటకై భారతపథికుడనై వెడలితిని. దురంతకష్టము లిచ్చు గోరుముద్దలను మ్రింగుచు, శైశవమందే నావిజ్ఞానయాత్ర నారంభించి, నేడును నాయుద్దేశసిద్ధికై శ్రమించుచున్నాను.

సి. హెచ్. రావుగారిని కలిసికొని, "నాచే పితృకార్యములు చేయింపు" డని కోరితిని. "వంకాయవలె నున్నను పెద్దయూహాలు కలవాడవు. మీ ఆస్తి మంచిది. తీర్థవిధి బాగుగ జరగవలెను" అని ఆయన యనినారు. నాయాస్తిని అప్పటికే కుక్కముట్టుకొనినదని ఆయన యెఱుగరు. ఆయనయును, సీతమ్మగారును నన్నపుడెంతో ఆదరించిరి. పదంపడి కాశీ పలుమాఱుపోతిని. హిందుస్థానీమిత్రులయిండ్లలోనే బసచేసితిని. 1930 లో శారదతో పోయినపుడు కేదారఘట్టమున రావుగారి మేడలో విడిసితిని. "కలకత్తాలో పెద్దచదువు ముగించారు. అచ్చట పలుకుబడిగలవారు. మాతమ్ముడు మూర్తివలె అచిరములో మీరు జిల్లామునసబు కాగలరు. దంపతులు వచ్చారు. ఇచ్చటిక్రియలు చాలా బాగా జరగవలెను" అనినారు రావుగారు. ఈపర్యాయము ఈయన ఆశ పెద్దదైనది. గుమ్మడిపండువంటి బ్రాహ్మణుని వీరు మా కప్పగించిరి. రావుగారి నట్టింట వధూవరులను మమ్ముల నిరువురను చెరియొక పీటమీద గూర్చుండబెట్టి, గంగాఘట్టమున జరగవలయు సంకల్పము నీత డింటికడనే యేకరువుపెట్టినాడు. స్నానసంకల్పమును నేనే యెఱుగుదును. అందుకై ఒక ఎడ్వొకేటును నియోగించుట నాకిష్టములేదు. రావు

గారు చెప్పిరి కావున నే నందుల కంగీకరించితిని. బ్రాహ్మణుని సంకల్ప ధోరణి చిత్రముగా నుండెను. "శుక్లాం" అని, నిమిషము నడచి, "బర ధరం" అని పలికి, "శశి" అని ఆగి, మరల మంత్రమును ముక్కలుచేసి, చెక్కలు కావించి, ఈతడు తంతు జరపింపసాగినాడు. "రామునితోక" "పిపరుం డిట్లనియె" అనువాక్కుల తోలుత నీమహావిద్వాంసుడే ఉచ్చరించియుండునని యూహించితిని. సంకల్పము ముగించి "మూడురూపాయల బేడయివ్వండి" అనినాడు బ్రాహ్మణుడు. "మీామంత్రోచ్చారణమునకు విశేషబహుమాకృతి మీాకు ముట్టవలెను. ఈపాటి మొత్తమునకై మీావంటి మహావిద్వాంసులు చేయిజాచ రాదు" అని నిర్లక్ష్యునై నవాని కుచితదక్షిణ నిచ్చితిని.

అనంతరము "కల్లోలవతిమతల్లి గంగ"ను దర్శించి, మణికర్ణిక యందు గ్రుంకులిడి, "అన్నపూర్ణ విశాలాక్షీసనాథుం గాశీవిశ్వనాథుని" సేవించి, భైరవుని గొలిచి, యింటికి మరలి, తీర్థవిధి నెఱపితిని. సిబ్బయ్య దీక్షితులు మరల నిచట ప్రత్యక్షమైనాడు. పెద్దపుస్తకమును దెచ్చి "ఇందులో రావుగారికి ఏమివార్షిక మిత్తురో వ్రాయండి" అనినాడు. "రావుగారు కాశీలో పెద్దపెద్దమేడలు కట్టిరి. మెడలో బంగారపు రుద్రాక్షలు ధరించారు. వార్షికమును వారే సంపసమర్థులు" అనిచెప్పి అందుండి శారదతో కదలిపోతిని.

అయోధ్యయందు ముఖ్యమైన ఒక రామాలయమున స్వామి కెదుట తెరగట్టి పూజారి "డబ్బు యిచ్చినగాని దర్శనము కా"దనినాడు. ఒకమూల నొక ప్రొయ్యిని, కొంతబూడిదను జూపి "సీత యిచ్చట వంటచేసెడిది" అని సెలవిచ్చినాడు. గోకులములోను, మధురలోను, బృందావనమందును పండాల దౌర్జన్య మధికము. "యమునాఘాట్" యని స్నానమునకు ముందు కొంతపైకమును చెల్లించవలెనట! నదిని గుత్తించిన హక్కులన్నియు పండావానిచేతియం దున్నవట! బృందావనమున నంద మందిర మొకటి యున్నది. ద్వారముపుండి లోనికి యాత్రికులు దేకు కొనియు, ప్రాకుకొనియు పోవలెనట! కృష్ణు డొకప్పు డందు దేకువాడని, ప్రాకువాడని, నే డందఱు అచ్చట నట్లుచేయవలెనట! మగవారు పసుపు దారములను, ఆడువారు పవిత్రమైన గాజులను అచ్చట కొనితీఱవలె

నట! సంతానములేనివా రచట నొక రావిచెట్టునకు ప్రదక్షిణ మొన
రించి పసుపుదార మొకటి కట్టి ఇంటికరిగినయెడల, నచిరములో మనో
రథసిద్ధి నందెదరట! బిడ్డను చంక నిడికొనివచ్చి కట్టినదారమును విప్పి,
కృష్ణునకు భోగముచేయవలెనట! సూత్రమును గట్టునపుడు పండా
లకు విరివిగా దానముచేయవలెనట! బృందావనములో ఒక అపవ
యాచారి యున్నాడు. అచ్చటి హిందూస్థానీపండాలు చెప్పుదానికి
నీతడు "తందానతాన" యనుచుండును. గోకులములోని పండా
యమునకడకు యాత్రికులను గొంపోయి, "పాప్ కాటో! పాప్
కాటో!! అని చప్పట్లుకొట్టండి" అని వారిని ప్రోత్సహించును. అంత
టితో వారి పాపములు అంతర్హితములగునట! ఇచ్చటగూడ నొక
ఆలయమున దేవుని కెదుట పూజారి తెరగట్టినాడు. "మూడు రూపా
యలబేడ యిచ్చినగాని తెర లేప" దనినాడు. "వితంతువులకును,
నిరుపేదలకును సంతర్పణలు జరుపెదము. పైక మీయండి" అని
నాడు. ఇట్టి సత్క్రియలు వీరు జరుపెదరనుట కెట్టి నిదర్శనములు లేవు.
వివిధప్రదేశములందు "మూడు రూపాయల బేడ" అను పదము విన
బడుచుండును. పండాల కీశబ్ద మెట్లు పవిత్రమైనదో చెప్పలేను. "నాకు
తోచిన దక్షిణ నిస్తాను. మూడుంబేడ లెక్కయేమో నాకు తెలియ"
దంటిని. "మీకు పస్నం కాదు" అని పూజారి గట్టిగా పలికినాడు.
"దేవునకు పరదాలేమి? ఘోషాయేల?" అని నేనపుడు తెరదీసి మూల
పాఱవేసితిని. పూజారి హుంకరించినాడు! పదుగురుచేరి నన్ను మా
ర్గాన గమకించిరి. తత్త్వశాస్త్రమతశాస్త్రప్రబోధములవలన నాసమయ
మున వారు వెనుకకు తరలువారుకారని గ్రహించితిని. "మేకపోతు
గాంభీర్యము"ను, కొంత పరాక్రమవిజృంభణమును అపుడు అక్కరైన
వని యూహించి, "ఒక్కడొక్కడుగ రండి!" అని వడివడిగా హిందీతో
కొన్ని యింగ్లీషుమాటలు మేళవించి యట్టహాసము జేసితిని "ఈయింగ్లీషు
మేక్ యాత్రకై రాలే"దని గొణుగుకొనుచు, వారు అందుండి మరలిరి.
గోవర్ధనమును జూచి మఱల బృందావనమున కరిగితిమి. "రూపాయబేడ
యిచ్చినయెడల ప్రసాదమిస్తాను" అని యచటి ముఖ్యాలయములోని
పూజారి పలికినాడు. మనదేవస్థానములలో భోగము చేయించినపుడు

ఇచ్చులాగున చక్కని ప్రసాదము నాకడిచ్చునేమో యనియు, కొంత ప్రసాదము నింటికి గొనిపోయి నలుగురకు దానిని పంచిపెట్టవచ్చుననియు నాశపడి, పూజారికి ఆతడడిగిన పైకమిచ్చి, ప్రసాద మిమ్మని శారద యనినది. ఇసుకవంటి పదార్థమును మూడుపొడుములట్ల పరిమాణముగల దానిని ఆతడు చేతిలో దులిపినాడు. "కిక్కురుమనకుండ ఈ మూడు పట్ల ప్రసాదమును నీముప్పాపు అన్నలకు వి. పి. గా పంపు" మని మాత్రము ఆమెను ప్రోత్సహించితిని.

ఆర్యావర్తమున మాంఘీర్ నకు కేసుమైళ్లదూరమున 'సీతాకుండ్' అను ప్రదేశము కలదు. ఇచట దాశరథుల నామములతో నాలుగు గుంటలున్నవి. ఇందలి నీరు త్రాగుటకు గాని, అంటుటకు గాని బాగుండదు. అవి నిల్వనీరు. పైన పచ్చని కోటింగు ఉండును! వీనికి దాపున 'సీతాకుండ్' కలదు. అది వేడినీళ్లగుంట. నీరు సలసల కాగుచుండును! అనవరతము అందుండి పొగ వచ్చుచుండును! ఈ చిన్ని చెరువుకు నలువంకలందు నిసుకపడి నిర్మింపబడినది. చెంబులద్వారా నీటి వెలికి తీసికొనుటకు వీలుండును. నీటి నొక పెద్దపాత్రలోనికి పోసికొని, ప్రక్కనున్న నూతిలోని నీటితో కాసిని కలిపి స్నానము చేయవలెను. ఏటేట నందు పెద్దయుత్సవము జరుగును. ఇచటికి పోనెంచి, రాత్రి పదిగంటలకు మాంఘీర్ లో దిగి, స్టేషనుకు అరమైలుదూరమందున్న ధర్మశాలలో నారాత్రి విశ్రమించితిమి. తెల్లవారుజాము మూడుగంటలకు గదితలుపు పై "దబదబ" చప్పుడు వినబడినది! చప్పుడు క్రమక్రమముగా నధికమైనది! 'ఏమని?' నే నీవలికి వచ్చి చూచితిని. దునేనుగురు అతికాయులందు ప్రత్యక్షమైరి. "దొంగలేమో!" అనిన శారద. భయములేదని ఆమెను ధైర్యము చెప్పి "మీరెవరు? ఇచ్చట అల్లరిచేయుదురేమి?" అని వారి నడిగితిని. "మేము పండాబ్రాహ్మణులము. మీతో సీతాకుండ్ నకు వత్తుము" అని వారనిరి. "మాతో రావలదు; పొండు" అని గట్టిగా చెప్పితిని. రెండుగంటలసేపు వారందే 'తిష్ఠవేసి' పిదప నిష్క్రమించిరి." అనంతరము మేమొక టాంగా కట్టించుకొని 'సీతాకుండ్'కు పయనమైతిమి. "ఇచ్చటి పండాలు బందిపోటులను పోలువారు. వీరితో మీరు జాగ్రత్తగా మసలవలెను సుమండీ!" అని బండివాడు మమ్ములను ముందే హెచ్చరించి

నాడు. బండి నడచుచుండగ నెవ్వరో ఒక బలిష్ఠకాయుడు చరచర వెన్క నుండి పరుగెత్తుకొని వచ్చి, బండివాని ప్రక్కను గూర్చున్నాడు. ఆత డేమియు ననక యూరకుండెను. బండివాని కతడు పరిచితుడేమో యని యూహించితిమి. మేము దిగినతావునందే ఆబలశాలి దిగినాడు. అచట నేయూరును లేదు; నిర్జనప్రదేశము! మేము బండి దిగుసరికి పదుగురు పండాలు మాదగ్గఱకు పరుగులెత్తుకొనివచ్చిరి. బండినుండి దిగిన బలిష్ఠ కాయుడు "రండి స్నానమునకై" అని నాతో పలికినాడు. "నీవెవర" వంటిని. "తెల్లవారుజామున ధర్మశాలలో గలిసికొన్న వారిలో నేనొక్కం డను. యాత్ర చేయించుటకై మీతో కష్టపడి యింతదూరము వచ్చితిని" అని యాతడనినాడు. బండివాడు చెప్పినట్లు నిజముగ వీరందఱు బందె పోటులని అపుడు గ్రహించితిని. అచట పోలీసు లెవ్వరును లేరు. ఆ నిర్జనప్రదేశమున సతీసహితుడనై నిలిచి వారితో కలహించిన, ముప్పు వాటిల్లునని యూహించి, నేనేమియును మాట్లాడక, బండివాని సాయమున నూతిలోనుండి కొంతనీరు తోడుకొని 'సీతాకుండ్'కడ పత్నీసమేతముగ స్నానము చేసితిని. "మురికికంపు గొట్టుచున్నను, మిగిలిన గుంటలలో గూడ మునుగవలె" ననినారు పండాలు. "మీరు పోయి వానిలో దిగబడు" డంటిని. మేము స్నానముచేయుచుండ గుంపుగా వారచటికి వచ్చి, "ఈతావునందే ఒకప్పుడు *సీత అగ్నిప్రవేశము గావించినది" అని చెప్పుచు, సగము చచ్చిన ఆవుదూడను మాముంగల నిలిపి, "దీనికై పది రూకలిచ్చి సీతపేరున దీనిని మాకు దాన మీయుడు" అని వారనిరి. నేను వారిమాటను త్రోసివేసితిని. "మీ౦త్రోవను మీరు పొండు" అంటిని. వారు పోక "పదిరూకలు కాకమానె, సగమియ్యండి" అనినారు. ఇట్లు కొంచెము కొంచెముగా వెల తగ్గించి తుద కొకడు దూడను నా మ్రోలనిలిపి, దాని తోకపట్టుకొని "బాబూజీకా నామ్ మే షాడేదస్ అణా గోదాన్" ("అయ్యగారి పేరిట పదణాలనర గోదానము") అని "ఈమాత్రపుపైకమైనను ఈయక తప్ప"దనినాడు. నేను 'ససేమిరా' యంటిని. ఈయొక్క దూడను వచ్చినయాత్రికుల కడకు దెచ్చి, ప్రతి

* సీత అగ్నిప్రవేశ మచట గావించె ననుటకు రామాయణములో నెట్టి నిదర్శనమును లేదు.

వానిచే గోదానమని దానితోకపై కొన్ని అణాలనైన వారుపెట్టించితీఱుదురు. ఇది దురంతమైన బలాత్కారము. ఇక నందు తడయక, టాంగాను రాక పోకలకై కట్టించుకొంటిమి కావున, దూరమందున్న బండివానిని పిలిచి మేము దానిపై నెక్కి, బండిని చరచర ద్రోలుమని ఆతనికి హుషారు యిచ్చితిమి. పండాలు బండి వెన్కబడిరి. "గోదానము తాలూకు సొమ్ము!" అని పలుమాఱు వారఱచిరి. "ఇపుడు పోలీసుపటాలము వచ్చి మీకిచ్చును. మీరు బ్రాహ్మణులు కారు. పుణ్యక్షేత్రములం దుండదగు వారుకారు. మీరుండవలయుచోటు చీకటిఖైదు. మీ'జులుమ్'సహించు వారము కాము. తగు శాస్తి బొందెదరు. ఉష్కు మీఱి ప్రవర్తింపకుడు" అని పట్టరాని కోపముతో నే జెప్పితిని. బండి చరచర పోవుచునే యున్నది. ఒకరిద్దరు పండాలు హుమ్మని బండిపై నుఱుకబోయిరి! నా బండివాడు ముసల్మాను. అప్పటివఱకు చిత్రముచూచుచు నతడు తనకేల కలహమని యూరకుండెను. ముసల్మానుబిడ్డ! వానికిపుడు వీరావేశము కలిగినది; చబుకు చేబూని కనుఱెట్టజేసి ఆతడు నిలిచినాడు!

ఉత్తరహిందూస్థానములో హిందూ ముసల్మానులకు విరోధము. హిందువులు సాధారణముగ ముసల్మానుబండివానిని కుదర్చనే కుదర్చరు. నే నీనియమమును పాటింపక తనబండినే ఏర్పఱచినందున బండివానికి నాపై భక్తి కుదిరినది. ప్రసంగధోరణినిబట్టి నేను దక్షిణదేశస్థుడ నని ఆతడు గ్రహించినాడు. దాక్షిణాత్యులపై నచటి మహమ్మదీయుల కెట్టి కోపము లేదు. "ఒక జాతి చెడ్డది వేఱొకజాతి మంచిది" అని చెప్ప లేము. ఆనిర్జనప్రదేశములో నాకు సన్నిహితుడై, నన్ను గాపాడ సంసిద్ధుడైనవాడు ఒకమహమ్మదీయుడు, "ముష్కరుడైన తురుష్కు"డనియు, "కరకు తురక" యనియు, "తుచ్ఛుడైన మ్లేచ్ఛు" డనియు కొందఱీతనికి పేళ్లు పెట్టుచుందురు. "తోడిభారతీయుడు; నాసైదోడు. ఈతని హృదయమందు అమరనదీ విమలవారిబోలు అనుకంప తొలుకాడుచున్న" దని నే నాముహూర్తమున గ్రహించితిని. ఆముహూర్తమున దురంత దౌష్ట్యమున కొడిగట్టినవారు తోడిహిందువులు; తోడిబ్రాహ్మణులు. ఈ దురాత్ముల దుశ్చరిత్రను పొడగాంచి హిందూసంఘమును గుఱించి ఎట్టి దుర్విమర్శనమును చేయను, కాని ఒకప్పుడు మహత్తరమైయుండిన

హిందూసంఘము నేడు నేలగూలినదనియు, దీనికి నేడెంతో సంస్కార మవసర మనియు, దాని నందినపుడే నేడు దీని నెదుర్కొనిన తీవ్రసమస్యలు పరిష్కారమునందగలవనియు, హిందూసంఘము పునరుద్ధరణము నందగలదనియు నొక్కివక్కాణింతును.

బండివాడు లేచినంతనే నాకును బల మధికమైనది. నాచేత గఱ్ఱ లేదు; కాని, వాడియంచులుగల పెద్ద మరచెంబు ఉన్నది. మరచెంబును నేను చేబూని మాతను శారద కిచ్చితిని. మువ్వురము యుద్ధసన్నద్ధుల మైతిమి. మేమాడినది నాటకమని శత్రువు లెఱుగజాలరైరి. ఇక తమ పప్పు ఉడుకదని గ్రహించి పండాలు తమ కాళ్లకు బుద్ధిజెప్పిరి.

వింధ్యవాసిని దర్శింప నరిగినపుడు త్రోవలోనే తోడేళ్లవలె పండాలు మమ్ము మూర్కొనిరి. దుష్టవారిసమక్షమున యాత్రికుడు పూజారి చిత్తమువచ్చిన మొత్తమును పెట్టి తీఱవలెను. జగద్ధాత్రిమ్రోల నాతడుచ్చరించు మాటలు కర్ణకఠోరములై యుండును. కల్లుపాకల పొంతగూడ నట్టి దురూక్తులను వినము.

మూకమూకలై యెదురగు పండాలు "మీదేయూ" రనియు, "ఏమొహల్లాలో దిగెద"రనియు, "మీ రెంతమంది" యనియు క్రాసు పరీక్ష చేయుదురు. ప్రతిప్రశ్నకు ప్రతివానికి జవాబుచెప్పుట అసాధ్యము. ఏప్రశ్నకు జవాబుచెప్పక, అపుడుకూడ వారు పీడించుచు "ఎచటదిగెద"రనినపుడు "బొబ్బర్లంక" యనియు, "ఎందుండి వచ్చి" రనినపుడు "సుబ్బారాయు" డనియు వారికి తెలియని తెలుగుమాటలను, తెలుగుపద్యములలోని పదములను ప్రత్యుత్తరములుగా నుచ్చరించువాడను. పండాలయొక్కయు, పూజారులయొక్కయు వృత్తాంతము దెలుపవలెనన్న నీసందర్భమున గ్రంథము పెరిగిపోవును. వీరికి సంపూర్ణమైన ఆంతరంగికపరివర్తన మవసరము. వీరిని నిర్ణీతమైన అవధులందు నిలుపు చట్టపుకట్టుదిట్ట మవసరము. ధూర్తులను పుణ్యస్థలములనుండి తఱిమికొట్టవలెను; లేకున్న యాత్రికులకు పుణ్యక్షేత్రముల యెడలగల విశ్వాసము తున్కతున్కలగును. పరిస్థితులు బాగుపడనంతవఱకు యాత్రికులు వీరిపై నాధారపడక ప్రత్యేకమైన యేర్పాటులు గావించు

కొనుట బాగు. తమ పురోహితుని వెంటనిడికొని, హిందీని కొంతవఱ
కైన నేర్చుకొని, పరిభ్రమణమునకై పయనమైనచో, దుర్వ్యయము
నుండియు, దుష్టులబారినుండియు వీరు విడివడజాలుదరు.

కొంతసేపటికి స్టేషనుమాస్టరు గదినుండి యీవలకి వచ్చితిని. చర
చరవచ్చి గంగాధర లక్ష్మణఖాందపే నాప్రాల నిలిచినాడు. నేనేమో
యోచించుకొనుచుండ "ఇది మహాక్షేత్రము! రామక్షేత్రముమాత్రమే
కాదు. ఒకప్పుడిచట నీశ్వరుడు తపసుచేసినాడు. బ్రహ్మయజ్ఞము చేసి
నాడు. దేవతలెంద్లొ గట్టుకొని నసించినారు. నదికడ నావ యెట్లవసర
మో తీర్థస్థానముకడ పండా యట్లే అవసరము." అని యెంతదేమేమో
చెప్పినాడు. నే సుమిన్నకొనియుండుటచే ఆధోరణి 'స్వగతము'లో చేరి
పోయినది. ఇంతలో నాసికపోవు బస్సువచ్చినది. "బ్రహ్మవలె యజ్ఞము
చేయుము. ఈశ్వరునివలె తపసుచేసికొనుము. యాత్రికులను పీడింప
కుము" అని బుజముపై తట్టి ఖాందపేను హెచ్చరించి, నేను బస్సులో
ప్రవేశించితిని.



# నా మహారాష్ట్ర యాత్ర

## నాలుగవ ప్రకరణము



బస్సువాలకము బహుచిత్రముగా నున్నది. అది యీనాటిది కాదని వెంటనే గుర్తించితిని. ధర్మరాజాదులవారి రాజసూయయాగ మును చూచుటకై బయలుదేరిన కొందఱు పెద్దమనుష్యులు ఒకబస్సు మీద ప్రయాణముసాగించి, తిరిగివచ్చునపుడు తెరువునడుమ నది భంగ పెట్టుటచే నాసికలో దానిని వదలినట్లును, అదియే నేటి మాపయనము నకై ఉపయోగింపబడుచున్నట్లును ఊహింపగలిగితిని. తూకముగల వ్యక్తులు నలుగురు కూరుచున్నయెడల అది విఱిగి ముక్కలగుట నిక్క మనియు, మధ్యమార్గమున మన్ముద యేగోతిలోనో కూల్చివేయుననియు నడలుచు బిక్కుబిక్కుమనుచు నేనందు ప్రవేశించితిని. ఈరీతి బస్సులు ఉత్తరహిందూస్థానములో, ముఖ్యముగా లాహోరు అమృతసరములకు నడుమ విరివిగా గోచరించును. నేను ప్రవేశించునప్పటికే బస్సులో మహాశయు లెందఱో పెద్దపెద్దదుప్పట్లు కప్పుకొని కూర్చునియుండిరి. వారిరూపములు కడుంగడు వింతలైతోచినవి. వేర్వేఱులోకముల నుండి వా రవతరించిరేమోయని యూహించితిని. వారు కప్పుకొనిన దుప్పట్లుకూడ ద్వాపరయుగములోనివానివలె నగపడినవి. నన్ను చూచి పాపము వారు కొంతచోటిచ్చిరి. నాసికకు తాళమువేసినగాని కూర్చుం డుట సాధ్యముకాదని గ్రహించి, ఊపిరిబిగబట్టి ఒకప్రక్క జతికిలపడి తిని. పెద్దపాగాధరించిన చిన్నమనిషియొకడు చాలసేపు నన్ను తేఱిచూచి "భాయీసాబ్! వ్హేర్ డిడ్ యు కమ్ ఫ్రమ్?" ("Where did you come from?" "మీరెందుండి వచ్చినారు?") అని ప్రశ్నించినాడు. బస్సులోని బడుద్ధాయులలో నెవ్వరికైన ఇంగ్లీషు వచ్చియుండునని నేను తలచియుండలేదు. హిందీతో ఆంగ్లమును మిళాయించిన మహా శయు డొకడు నన్నట్లు ప్రశ్నింపగనే "గోదావరి సాగరమున కలియు

చోటున కనతిదూరమునుండి" అని యాంగ్లమున వాగ్బాహుళ్యమును (Periphrasis) ప్రయోగించి వడిగా నుత్తరమిచ్చితిని. దానితో, అతడు ఉక్కిరిబిక్కిరియైనాడు. ఇంగ్లీషుతో నోరువిప్పుట తప్పని గ్రహించి, అతడు హిందీలో ధోరణి మొదలుపెట్టినాడు. నాస్వస్థలము రాజమహేంద్రవరమని ప్రసంగమున గ్రహించినాడు. మహారాష్ట్రులకు ముఖ్యముగా, వారిలో గోదావరితీరవాసులకు రాజమహేంద్రవరము పరిచితమైనప్రదేశము. నన్ను పలుకరించిన పెద్దమనిషి నాగపురములో నేదోయుద్యోగము చేయుచున్నాడు. వానిసొంతయూరు నాసికయే! సెలవుదీసికొని, యిపు డింటికి మరలుచున్నాడు. డిశంబరు (1935) లో నాగపురమున మారిస్ కాలేజీ స్వర్ణోత్సవసందర్భమున రాధాకృష్ణుడొసగిన మహోపన్యాసమును వింటినని ఆతడు పలికినాడు. ఇంతలో నెవడో బస్సుకడకు నడచివచ్చి, లోనివారిని తేఱిచూడ దొడగినాడు. నాసమీపమున నధివసించిన నాగపూరుమిత్రుడు మెల్లగా "మీదేయూరని అతడడిగినయెడల నాసికయనియే చెప్పుడు! లేకున్న మీసామానును పరికించి కొంతఃస్సు లాగును" అని నాతో చెప్పినాడు. కాశ్మీరము, రాజస్థానము, మార్మగోవా మున్నగుచోటులకు పోయినపు డిట్టిపరీక్షలు జరగుచుంట నెఱుగుదును. 'నాదినాసిక' యని వానితో నెట్లు తెలుపుదును? అబద్ధమాడుట నాకిష్టములేదు. చదివినది ప్లీడరీవృత్తికైనను, జగదీశుడు అందు విశేషకాలము నిలుపక, అందుండి నన్నుతొలగించి, మరల నందు బ్రవేశింపనీయకున్నాడు. ఆహా! న్యాయవాదవృత్తికి మంగళసూత్రమును కట్టియున్నయెడల, అనృతమువచించుట కట్లు లొట్రుపడియుందునా? అయినను, ఆసమయమున నాకడనున్న సామానుమాత్రమెంత? స్నానమునకు పనికివచ్చు వలువలేకదా నాయొద్దనున్నవి! వానికి పన్ను తగులుబడియగుచో, మాట్లాడక రెండుతువాళ్లి నాపెద్దమనిషికి సమర్పించవలెనని నిశ్చయించితిని. తొందరపడి "నాది నాసికయే" అని చెప్ప దలచుకొనలేదు. కాని నేనుకూడ మహారాష్ట్రుడనని అపోహపడి, నన్నేమియు బ్రశ్నింపక ఆయుద్యోగి అందుండి తరలిపోయినాడు. బస్సు కదలినది. ఏముహూర్తమున ఊడి క్రిందబడుదుమో అని యడలి, దానిశబ్దము వికృతమై వినబడినపుడు "హరహరా!" అనుకొనుచు,

మరల విపత్తురాకుండుటకై వేయిదేవుళ్లకు మ్రొక్కుచు, నిముషములు లెక్కింపసాగితిని. చలిగాలి రివ్వురివ్వున వీవదొడగినది. నాసికపట్టణము ఐదుమైళ్లదూరమందే యుండుటచే; ముదుసలిదైనను దినములలోకాక కొన్నిగంటలలోనే మాబస్సు మమ్ములను గమ్యస్థానమున జేర్చినది. పైకము సంతకుమున్నే చెల్లించితిని; కావున ఆందఱితో నందుండి దిగితిని.

చలి దుర్భరంతమై, దుస్సహమై యుండెను. ఇంకను రాత్రి సాగుచునేయున్నది. నాటినిశీథము నాయెడల పగబూనినదేమో అని యూహించితిని. నాసికనుండి త్ర్యంబకమునకు పోవుబస్సు పగలు ఎనిమిదిగంటలు దాటినపిదపగాని బయలుదేఱదని వినియుంటిని. అప్పటివఱకు కాలము నెట్లు చేయుటెంటు? బొంబాయిలో నేమహాయాత్ర మున ప్రయాణించితినో, త్రోవపొడుగునను చిక్కులే దాపురించుచున్నవి. నిమిషమైనను ఎందుకు నిలుగలేనైతిని. తునుకలప్రోవుబోలు మాబస్సు మార్గమధ్యమందే ప్రభాతమును చూచునని ఆశపడితిని. నిద్దురకు నీరు వదలి, తెరువున నిలిచి యెంతసేపు చలితో పోరుసలుపవలెనో యెఱుగనైతిని.

సమయసమయములందు నిద్రాహారములకు స్వస్తిచెప్పి, యిక్కట్టులతో పోరు సలుపవలయుతరుణములు నాకెన్నో లభించినవి. తొలుత దేశాటనమునకై పయనమై కలకత్తాలో ప్రవేశించినపుడు అనుదినము నాకీతరుణములు ప్రత్యక్షమగుచుండెడివి. బాలకుడనై కలకత్తాలో బౌబజారు హైస్కూలులో చదువుతఱి, తప్పనిసరిగ ఆత్మసంయమమును అభ్యసించుటకై పాటుపడవలసివచ్చెను. కొంత పైకమార్జించి చదువుకొనవలసివచ్చెను. విశ్రాంతిగాని, నిద్రగాని, యిష్టమైన ఆహారముగాని నాకంతగా లభించెడిదికాదు. అప్పుడు కలకత్తాలో తెలుగువారి సంఖ్య అంతగాలేదు. తెలుగుతిండి పాలెక్కి! భోజనమునకై 25 ఈడెన్ హాస్పిటల్ రోడ్డులో గల పంజాబీబ్రాహ్మణహోటలులో ప్రవేశించితిని. అచ్చట లభించెడిది రొట్టె. అంతకుమున్ను రొట్టెతిను అభ్యాసములేనందున అచ్చటి ఉప్పుకారములులేని క్రొత్తతిండి నాకు సొక్కెడిదికాదు. ఆసమయములో నాజీవితముపై కన్నుంచిన ఆంధ్రులిద్దఱుండిరి. వీరు బ్రాహ్మణేతరులు: రేకపల్లి వీరాస్వామి, చోడిసెట్టి వీరరాఘవులు అను

వారు. వీరు కలకత్తాలో వర్తకము చేయుచుండువారు. నాకును వీరికిని సఖ్యము కుదిరినది. వీరాస్వామి అప్పటికే మిగుల వృద్ధుడు. అప్పటికి ముప్పదియైదేండ్లకుమున్నే అతడు కలకత్తా జేరుకొనినాడు. కాకినాడ నుండి గోదావరి లంకపొగాకును తెప్పించి, కలకత్తాలో చుట్టలు చుట్టించి, గ్లాసుగో మున్నగు చోటులకు ఎగుమతిచేయువాడు. ఈతని కింగ్లీషురాదు. బంగాళమును, హిందీని, అక్కరైనపుడు తెలుగును కలిపి 'చకచక' మాట్లాడువాడు! అట్టి గ్రామ్యమునకు వ్యాకరణ మక్కఱ లేదనుకొనినాడు. మనిషి మంచివాడు. మంచిభక్తుడు. సన్యాసులపై నెంతో ప్రీతిగలవాడు. ఎందఱెందఱో కపటసన్యాసు లీయమాయకుని జేరి, ఏమేమో మంత్రము లుచ్చరించి, డబ్బు దోచుకొనిపోవువారు. ఒక జడదారి "నిన్ను బ్రాహ్మణుని చేతు"నని చెప్పి యేమేమో మంత్రము లుచ్చరించి, ఆతని మెడలో నొకజందెము వేసినాడు. అబద్ధపు జందె మైననేమి, దానిని మెడదాల్చి, తనజన్మ పవిత్రమైనదని వీరాస్వామి యెంచువాడు. పుణ్యదినములందు తప్పక ఉపవాసములు సలుపుచు, మత్స్యమాంసములను వర్జించి, నిష్ఠాగరిష్ఠుడై యుండువాడు. అపుడపుడు హోమములు సలుపుచుండువాడు. అనుదినము 50 ప్రిన్సెప్ వీధినుండి అచటికి రమారమి రెండుమైళ్లదూరమున హుగ్లీనదీతీరమున చాంద్ పాల్ ఘట్టమునకు స్నానమునకై పోవుచు, నన్నుగూడ గొంపోవు వాడు. కలకత్తాలో మాకు పరిచయముకలిగినతోడనే తన యింట బస చేయుమని నన్నుకోరినాడు. వీని కింగ్లీషురానందున, ఈతని వర్తకము నకు సంబంధించిన ఉత్తరములను నేనే వ్రాసిపెట్టుచుండువాడను. మాస మాసము నాకు కొంత ప్రతిఫలమిచ్చువాడు. తనతో గంగాస్నానమునకు గొంపోవువాడు. ఉపవాసములందును, జాగరణములందును తనతో పాల్గొనుడని ప్రోత్సహించువాడు. నాచే భారతభాగవతములు చదివించి వినుచుండువాడు. వీరరాఘవుని మకాము మలంగాగల్లీలోగలదు. ఈతని యంగడి ఆరవనెంబరు చాందినీచౌక్ లో నుండెడిది. ఇతని తండ్రి నాగయ్య; కాకినాడ కాపురస్థుడు వీరాస్వామికంటె ముందుగనే కల కత్తాపోయి వర్తకము మొదలిడినాడు. తొలుత కొంతకాలము వీరా స్వామి ఈతనికడపనిచేసి, పదంపడి సొంతవర్తకము స్థాపించుకొనినాడు.

వీరరాఘవులు కలకత్తాలో పుట్టి, అందే పెరిగినాడు. బంగాళమునే చదువుట, వ్రాయుట నేర్చినాడు. తెలుగు వ్రాయ తెలుగడు. వర్తకమును తానే చూచుకొనుచుండువాడు. తెలుగు ఉత్తరములను నాచే వ్రాయించుకొనుచుండువాడు. వీరాస్వామివలె స్వదేశపుచుట్టలను ఎగుమతిచేసి, ఆతనికంటె విరివిగా విదేశములనుండి వివిధములైన సిగరెట్లను తెప్పించి పెద్దవర్తకము జేయుచుండువాడు. జావాచుట్టలను వాడు వాడు. అప్పటికే షార్ట్ హేండ్ టైప్‌రైటింగుల నెఱుగుదును; కావున నీతనికి ఉత్తరములు టైప్‌చేసి యిచ్చువాడను. ఇతడుకూడ ప్రతిమాసము నాకు కొంత పైక మిచ్చుచుండువాడు. వీరాస్వామి, వీరరాఘవులతో గల సంబంధముకతన కలకత్తాలో నావిద్యార్థి జీవితమునం దించుక భాగమును కడపి, తరువాతిచదువునకు వలసిన ఉద్యోగపునవ్యవస్థలను అన్యులసంపర్కమువలన స్థాపించుకొనగలిగితిని. పిన్నతనమునుండి వివిధరాష్ట్రములందలి ప్రజలయంతరంగములను పరీక్షించుతరుణములు నాకెన్నో లభించినవి. ఆంధ్రులందు ఎందఱెందఱు బ్రాహ్మణబ్రాహ్మణేతరుల చరిత్రలనో పరిశీలించితిని. వారియెడల నాకు సమానగౌరవముకలదు. నా బ్రాహ్మణేతర మిత్రులు ఆధునికవిధానము ననుసరించి అంతగా చదువుకొనినవారు కారు. కావున వీరు తమ హృదయములనుండి అనుకంపను దూరముగా తఱిమి కొట్టలేదు. తోడి బ్రాహ్మణులు, కొందఱు తోడిబంధువులు నిర్దయులై నన్ను భ్రష్టునిజేసి దేశాటనమునకై ప్రవర్తించినపుడు, నన్ను దగ్గఱకు దీసికొని, నాకాదరమును రాగము లొసగి, నాచేయుపసి నానందముతో గైకొని, నా కెంతేని సాయముచేసి, నన్ను కాపాడినవారు బ్రాహ్మణేతర సోదరులే! జాతినిబట్టిగాక గుణమును బట్టియే మనుష్యుమహత్త్వమును గుర్తింపవలెనని నాడే గ్రహించితిని. వీరాస్వామి వీరరాఘవుల గురుగుణములు నాకపుడు మేలుబంతులైనవి. ఉపవాసములును, జాగరణములును విశేషించి వీరాస్వామి సహవాసమువలన బాల్యమందే నాకు పట్టుబడినవి. వీరాస్వామి వీరరాఘవులు నేడిహలోకమందు లేరు. వీరి పవిత్రాత్మలకు సచ్చిదానందముల నొసగుటకై సదా సర్వేశ్వరుని ప్రార్థించుచుందును.

నా పరిశ్రమను పరికించుచు ఆదినములలో వీరాస్వామి నన్నుద్దేశించి, "అర్జునునివలె నిద్రను, లక్ష్మణునివలె ఆహారమును మీరు జయించినారు" అనుచుండువాడు. ఈ ప్రశంసకు నేను తగనుగాని, కలకత్తాజేరినపిదప నిద్రాహారములను హద్దులో నుంపగలిగితిననియు, బాల్యశిక్షణము కతన నిక్కట్టు లొక్కుమ్మడి నన్ను మార్కొనినపుడు దృఢచిత్తుడనై నిలువగలననియు నమ్ముచుందును. (నాడే కాదు నేడు కూడ) దురంతదురితోత్కట బాధలు పైబడి నాగుండెలను గుండజేయ గమకించు ముహూర్తములందు, నన్ను కాపాడుచున్న దీ యాత్మ విశ్వాసమే!

నాసికలో నాడు తలదాచుకొనుటకు చోటులేక పడినయిబ్బందిని నే నంతగా పాటింపలేదు; కాని నా యాత్మవిశ్వాసమును కఠోరపరీక్షకు గుఱిగావించిన పరిస్థితులు ఈ మహారాష్ట్రయాత్రలో గూడ నన్నెదుర్కొనినవని తెలుపుదును. క్రూరమృగములతో నిండిన సాంద్రవనములందు నేను కొన్ని రాత్రులు గడపవలసివచ్చెను. చదువరు లీయుదంతమును కాలక్రమమున నెఱుగగలరు. అంతరంగమందలి జిజ్ఞాసను వృద్ధిజేసి, భయసంశయములను పోనాడి, దుర్విమర్శనలను, విపాత్తములైన పరిహాసములను పాటింపక మనుష్యహృదయమున నపూర్వశక్తిని జనింపజేసి, ధైర్యసాహసములతో ముందంజ వేయించునది ఆత్మవిశ్వాసమని తెలుపుట నాయాశయము.

బస్సునుండి దిగినంతనే నాగపూరువ్యక్తి మఱి నాతో మాట్లాడక మెల్లగా, చల్లగా నిష్క్రమింప దొడగెను. నాసిక అతని స్వస్థలము. అందు స్వంతగృహముగల అదృష్టవంతుడు. బస్సులో నిష్ఠాగోష్ఠి నాతో కాలక్షేపముచేసిన పెద్దమనిషి. రాత్రిసమయముగనుక తనయింట విందారగింపబోవు వాడనుగాననియు, ఉదయమే లేచి త్రియంబకము పోవువాడననియు నెఱిగిన బుద్ధిమంతుడు. అప్పటికప్పుడే రాత్రి చాల కడచిపోయినందున మిగిలిన భాగమున చలినుండి నన్ను కాపాడుటకును, నేబరుండుటకును, నాకు కొంతచోటిచ్చిన తన కపు డెంతో పున్నెము లభించు నని యూహింపజాలు బుద్ధిశాలి. దుర్దాంతమైన చలిచే నేను వడకుచుండ నప్పటి నాదుస్థితిని గ్రహింపగల విద్యార్థి

కుడు. కాని ఆత డేమియు పలుకక, అల్లన తనదారి దాను బట్టుచున్నాడు. "మీతోడవచ్చి, తెల్లవారునఱకు మీయింటనుందు" నని ఆ మొద్దురాచ్చిప్పనో నెట్లు పలుకుదును ? "ఏయరుగు మీదనైన నించుక చోటు లభించినయెడల, కొంచెము సేపందు విశ్రమించి ధన్యుడనైతి ననుకొందును" అని మాత్రము రెండడుగులు ముందులకువైచి అతనికి వినబడున ట్లంటిని. "ఇచ్చట అరుగు లేమీయుండవు" అని సెలవిచ్చి, అతడు దాటినాడు. నాబల్లు మండుకొని పోయినది. చోటునకై నేనంత పరితపించ లేదు. కాని యిట్టికఠినచిత్తుని గాంచితినని ఖేదపడితిని. విద్యాధికుని యందు అట్టి యుదాసీనభావమును, నిష్ఠురప్రవర్తనమును గాంచినంతనే నా ఖేదమున కాగ్రహము తోడైనది. కొంత దూరము వఱకు సాగిపోయిన ఆవ్యక్తిని కేకవేసి, పిలిచి, నిలిచినంతనే వానిని సమీపించి, "ఏపుణ్యభూమి పరార్థ జీవియైన శివాజీని, దేశహితార్థము మహాత్యాగ మొనరించిన లోకమాన్యతిలక్‌ను, మహనీయగుణగరిష్ఠుడైన గోఖలేను, సేవాధర్మనిర్వహణమున యశస్వికుడైన రానడేను, భారతిని, భారతాంబను భజించుటందు సిద్ధహస్తుడైన కేల్కారును కని జగత్ప్రసిద్ధి నందినదో, అట్టిమహారాష్ట్రము నేడును మహాత్ముల కాలవాలమైయున్నదని ఊహించుచుందును. మీదర్శనము నాకు నిక్కముగ నాశాభంగము కలిగించినది. ఇక నిం దెట్టివింతమానవులు నా కనులబడుదురో! ఇక తమత్రోవను తాము పొండు. నే నీపథమందే నిలిచియుండి, మీపై శాపవృష్టి గురియింపను. కాని నేటి యనుభవమును హృదయంగమ మొనరించు కొందును. మీకు సంపూర్ణమైన హృదయపరివర్తనము కలుగుగాకని ఈశ్వరుని వేడుకొందును." అని పలికి మరలితిని. ఆత డేమియు మాట్లాడక తనదారిని తాను పోయినాడు.

ఈ మహారాష్ట్రుని బోలుమహాశయు డొకడు హిమగిరి యాత్రయందు పండ్రెండేండ్లకుమున్ను నాకు ప్రత్యక్షమైనాడు. నాటి యుదంతము నీసందర్భమున సంక్షేపముగ తెలుపుట అప్రస్తుతముకాదని నాతలంపు.

నేగావించిన కొండొక హిమగిరియాత్రలో నాకు గమ్యస్థానమైనది శ్రీనగరము. అచటికి పోవుటకు రెండుమార్గములున్నవి. అవి జమ్మూ,

రావల్పిండిపథములు. ఫ్రాంటియర్ మేయిల్‌లో పోయి, వజీరాబాద్ లో దిగి, అందుండి కాశ్మీరరాజు శీతకాలవాసమైన జమ్మూను పోయి, ఆతావునుండి బస్సుద్వారా శ్రీనగరమునకు పోవచ్చును. కాని,యీత్రోవ బహుళమైన అపాయములతో నిండియుండును మహోన్నతస్థలముల నుండి పాతాళమునంటు లోయలలోనికి దిగి, అందుండి మరల పైకెగ బ్రాకి, మరల నొకగభీరోపత్యకయొక్క యంచునుండి హిమగిరి యాత్రయందు బస్సుపోవును. లోయలోనికి దిగుబండి వెన్క నెత్తైన చోటునుండివచ్చు బండిలోనివారికి నొక్కొకపుడు కానుపించదు. బస్సు కంటె ప్లెజర్ కార్ వేగముగ పోవును. కావున పెక్కువిపత్తులకు గురియగుచుండును. కాబట్టి పలువురు ధనికులుకూడ బస్సునే ఆశ్రయించుచుందురు. అచ్చటి డ్రైవరులు మిగులనేర్పరులు. ఇంచుక యజాగ్రత పొడ సూపినయెడల, బస్సు గుభాలున లోతులోయలోపడి పిండిపిండి యగును! అందలివారు నిముసములో గుండ యగుదురు! గుండయగుట కంగీకరింపనివారు బలిచక్రవర్తి బట్టతలపై వాలుమొగ్గవేసి దానిని వ్రయ్యలొనరింతురు. కాశ్మీరరాజు విశేషధనమును వెచ్చించి జమ్మూనుండియు, రావల్పిండినుండియు శ్రీనగరమునకు బాటలు వేయించినాడు. కాని పర్వతప్రదేశమందలి తెన్నులు సరిగ్గైనవి కాక ఉపద్రవ సంకులములై యుండును. సీమరేగిపండ్ల వర్తకమునకు (Apple trade) రావల్పిండి మార్గము అనుకూలమైనది. అందును అపాయములు ఘటిల్లు చుండును ; కాని జమ్మూపథమందలి ఆపదలకంటె నివి తక్కువమైనవి. రావల్పిండినుండి శ్రీనగరము సుమారు రెండువందలమైళ్ల దూరమందున్నది. ఈ మార్గముగుండా నేను కాశ్మీరమునకు పోవ నిశ్చయించితిని.

1929 లో లాహోరులో జరగిన కాంగ్రెస్సుకు రాజస్థానము నుండి పోయి, అందుండి హిమగిరియాత్ర సలుప నుద్దేశించితిని. లాహోరు కాంగ్రెసుకు కొందఱాంధ్రులు వచ్చిరి. తొలుత నేను "రాజస్థానయువ సమాజము" యొక్క డేరాలో బసచేసితిని. ఒక బందరు ఆంధ్రసోదరుడు నాకు నగపడి, తెలుగుల డేరాలోనికి రమ్మని నన్నాహ్వానించినాడు. కలకత్తాను వీడి, శారదతోగూడ పెక్కునెలలు రాజస్థానమున పర్య

టన మొనరించుచుండుటచే, నాటివఱకు నాకు తెలుగు మొగము కనుపించలేదు; తెలుగుమాట చెవిబడలేదు. అందుచే రాజస్థాన మిత్రులతో నేదో సద్ది చెప్పి, నే నాంధ్రులడేరాలో ప్రవేశించితిని. నాతో నాపొట్టిపిచికి యున్నాడు. నెల్లూరినుండి రేబాలవారు, కాకినాడనుండి మొసలగంటివారు, రాజమండ్రినుండి నాళంవారు కాంగ్రెసుకు వచ్చిరి. ఇంగ్లీషురానికొందఱు తెలుగులుకూడ లాహోరు కాంగ్రెసు చూచుటకై వచ్చిరి. పలువురు కలిసి ఒక్కటిక్కటే కొని, వంతులువంతులుగా కాంగ్రెసుడేరాలో ప్రవేశించి, విస్తారము చూచువారు. చాలసేపు సొంతడేరాలో ఏమేమో "హస్కుకొట్టు వారు" బెనారెస్ నుండి వచ్చిన ఆంధ్రవిద్యార్థు లీవేడుకలో, కులాసా ధోరణిలో పాల్గొనువారు. నేను పెషావరునకు పోదుననినపుడు నలుగురాంధ్రులు నావెంటబడిరి. వీరిలో మొదటివాడు రాజమండ్రి కాపురస్థుడు నాళం భీమరాజు. ఇతడు నిష్కలహృదయుడైన దేశభక్తుడు. వైశ్యకులమునకు వన్నె దెచ్చిన యువకుడు. చదువునకై కలకత్తా వచ్చి నాకడ కొన్నాళ్లుండుటచే నితడు నాకు పూర్వపరిచితుడు. రెండవ వాడు విశాఖపట్టణమునకు సమీపమందలి కొత్తామునుండి వచ్చిన పప్పు పెద్దిభొట్లు. తక్కిన యిరువురు చిట్టివలసనుండి వచ్చినవారు. ఒకడు పిచ్చయ్యయను వైశ్యరత్నము; రెండవవాడు పట్టుసాలికులస్థుడు తిమ్మయ్యయనబరగువాడు. ఇత డింగ్లీషునెఱుగడు. కాంగ్రెస్సనేమో చూడవలెనని పరుగెత్తుకొనివచ్చినాడు. ఫ్రాంటియరుమెయిల్ లాహో రులో రాత్రి ఏడుగంటలకు బయల్దేఱును. మేమాఱుగురము (ఆఱవ వాడు పొట్టిపిచికి) ఆఱైనపిదప మాడేరాను విడిచి అవ్వలి కరిగితిమి. "లజపతి నగర" ద్వారమున స్టేషనువఱకు రెండుటాంగాలు కట్టించు కొనదలచితిమి. "పంతులుగారూ! వీరితో మీ రిందు నిలువుడు" అని చెప్పి భీమరాజు ముందులకరిగి "టాంగావాలా! టాంగావాలా!!" అని యఱచినాడు. టాంగావచ్చులోపల (ఏమనివచింతును!) ఆతనిజేబు చులకనైనది! అందున్న మనీపర్సునెవ్వరో లాగివైచిరి! అందు చాల నోట్లున్నవట! కాంగ్రెసుసమయము కావున జనులు ఇసుకవేసిన రాల నట్లున్నారు! పోయినపర్సు ఇక లభించుననుట కల్ల! టాంగాలువచ్చునని

మేము నిలబడియుంటిమి. భీమరాజుమాత్రమువచ్చి పర్సుపోయినసంగతిని చెప్పినాడు. ఆతనినష్టమునకు మిక్కిలి వగచితిమి. పోలీసులతో చెప్పితిమి; కాని పోయినడబ్బు మరల లభించలేదు. ఇట్టిదుశ్శకునముతో ప్రయాణము సాగించుట కిష్టపడక నాటికి డేరాలోనికి మరలిపోతిమి. మఱునాడు బుడంకాయితో పయనమైతిని. భీమరాజు పయనంపుటూహను మనసునుండి వెడలించినాడు తక్కినముగ్గురు నావెంటబడిరి. వీరితో గలిసి నేనుసలిపిన ప్రయాణమును గుఱించిన విపులోదంతమును పాఠకులు నా "కాశ్మీరమజిలీ" లందును, "నాడుత్తరపర్యటన" మందును విలోకింపజాలుదురు. ప్రస్తుతము మనదృష్టియందలి విషయమును దృష్టాంతీకరించుటకుమాత్రము అప్పటి ప్రయాణాంశముల గొన్నింటి నిం దుల్లేఖింతును:

పైన తెలిపిన ముగ్గురు మిత్రులు నాతో* పెషావరునుండి కైబరుకనుమయవ్వలివఱకు వచ్చిరి. కాశ్మీరమునకు గూడ పోదునని నా ప్రయాణప్రణాళికను వారికి దెలిపితిని. "మేముకూడ వచ్చుటకి సత్తుము. హిందీకాని, పంజాబీకాని, కాశ్మీరికాని మాకు రాదు. ఒంటరిగా గాక మీతో పయనముసాగించిన, మాకెంతేని మేలుకలుగును. మా అంతకు మే మచటికి పోలేము." అని పలికి, వారు ముగ్గురు నావెంటబడిరి. నాతో తక్షశిలయందు విడిసి, అందుండి రావల్పిండి వచ్చిరి. రావల్పిండిలో "దాల్మండీ" యను చోటున గోవిందసింగ్ అను సిక్కుమిత్రునింట గొంతకాలముండి, పదంపడి శ్రీనగరమునకు పయనమైతిని.

రావల్పిండికి నలుబదిగైదు మైళ్లదూరములో మర్రీ అనుచోటు కలదు. పంజాబు గవర్నమెంటువారిందే వేసవిసమయమున వసింతురు. హిమగిరిపై నిదిమిగుల నెత్తయిన ప్రదేశమం దుండుటచేతను, మే మచటికి జనవరిలో పోవుటచేతను, ఆచోటంతయు మంచుతో నిండియుండెను. కాశ్మీరప్రభుత్వమువారిచే నియోగింపబడిన పరిచారకులు బస్సుపోవుత్రోవనుండి మంచును త్రవ్వి, పథపార్శ్వమున ప్రోగొన

"నాతో" అనినపుడు నాతోడ నాపొట్టిపిచికకూడ నున్నాడని చదువరులు గ్రహింతురు గాక! నా యనుచరుడైన బుడంకాయనుగుఱించిన వృత్తాంతము నా "కాశ్మీరమజిలీ" లందు వారు చూచియుందురు.

రింతురు. అచటి యిండ్లన్నియు నొత్తుగ పిండిముద్దలతో కప్పబడినట్లు మంచుముద్దలతో గప్పబడియుండెను. బస్సుపోవుతటి చేయిజాపగనే నిమిషములో నది తెల్లబడిపోయెడిది. ఇచటికి రమారమి ఇరువది మైళ్ళలో "కోహాలో" అనుచిన్నకొండపల్లె కలదు. ఈపల్లె జీలమ్‌నది యొడ్డుననున్నది. మే మీపల్లెను చేరుసరికి రాత్రి రమారమి యెనిమిది గంటలవేళయైనది. హిమగిరియాత్రలో రాత్రులందు, కొండలందు పలు మాఱు విడియుచుండువారము. అప్పటియనుభవములు అత్యద్భుత మైనవి. నాటికి "కోహాలో" యందు విశ్రమించి, మఱునాడుదయమున బయనమగుదమని చెప్పి, మాబస్సు డ్రైవ రెందో అంతర్ధాన మైనాడు. బస్సు ఆగగనే ఒక కాశ్మీరీయువకుడు చరచర మాకడకు వచ్చినాడు. ఆతని మేనిచాయ దబ్బపండురంగును ధిక్కరించుచున్నది! అతడు దట్ట మైన లాంగ్‌కోటును ధరించినాడు. వానితలపై చక్కనిటోపీ అలరారు చున్నది. బస్సులో నున్ననన్ను చూచి "బాబూ సాబ్! ఆయియే. మై ఆప్‌కా తాబేదార్ హూం". ("అయ్యగారూ! దయచేయుడు. నేను తమ పరిచారకుడను") అనినాడు. ఈ యాహ్వానము నాకెంతో ఆనందము గలిగించినది. రామనవమి యుత్సవములు చూచి, భద్రాచలమునుండి రాజమహేంద్రవరమునకు యాత్రికులు తిరిగివచ్చునపుడు, పోలవరము కడ నిసుకతిప్పలలో కొన్నిపందిరులువేసి, పుణ్యాత్ములు కొందఱు వారిని ప్రేమపూర్వకముగ నాహ్వానించి, భక్ష్యభోజ్యలేహ్యచోష్యములతో తనుపుచుందురు. ఇట్టి యేర్పాటు నేడున్నదో లేదో యెఱుగను; కాని 1922 లో నుండెడిది. వినయపూర్వకముగ హిమగిరిపల్లెయందు మమ్మా హ్వానించిన కాశ్మీరీయువకుని జూచి, మంచుకొండపై మాకాతిథ్య మీయ నవతరించిన గంధర్వబాలుడని యూహించితిని. అపూర్వమైన విందు చేకుఱునని ఆశపడితిని. "చెలియే!" ("నడువుడు") అని చెప్పి మిత్రులతో నేనాతని వెంటబడితిని. చలి చెప్పనలవిగానిరీతినున్నది. అక్కడైన శీతవస్త్రములు శరీరముపై నున్నను, అంతరంగమునుండి దారు ణమైనచలివెడలి, యొడలిని గజగజ ఊపుచుండెను! అచిరములో మే మాయువకునియింటి కరిగితిమి. మమ్మాతడు వేర్వేఱుకుర్చీలపై నాసీనుల గావించి, ముందటగల బల్లలపై వేడినిప్పులతోనిండిన కుంపట్లు నుంచి

నాడు. శీతనగమున పయనము సలుపుతతి రాత్రులందు అనివార్య ముగ నగ్ని సమీపమున సమయము గడపవలెను. రేలందు కొండ పల్లెలలో విడియుతతి గదికిని, మంచమునకును, అగ్గికిని ప్రత్యేకముగా బాడుగ నీయవలెను. అగ్ని దర్శనమువల్ల మేము "అమ్మయ్యా!" అనుకొంటిమి. "తమకు పూరికావలెనా, కచోడీ కావలెనా, ఫుల్కా కావలెనా, పరోటా లేక చపాటీ కావలెనా? సెలవీయుడు" అని కాశ్మీరీ యువకుడు నన్నుద్దేశించి పలికినాడు. "ఇవన్నీ రొట్టెరకములు. మీకేమి కావలెనో చెప్పండి" అని తెలుగుసోదరుల నడిగితిని. ఇంతలో పొట్టి పిచికి "గర్మాగరం చపాటీ లియావ్" ("వేడివేడి చపాటీలు తెమ్ము") అని హుకుమ్ జారీచేసినాడు. నిమిషములో వేడివేడి చపాటీలువచ్చి మాముందు వ్రాలినవి. "మలాయిభీ లీజియేగా?" (మీగడకూడ తీసి కొందురా?) అని యువకు డడిగినాడు. వాని ప్రశ్న ముగియకమున్నే "అల్ బత్" ("తప్పక") అని బుడంకాయ అఱచినాడు. మీగడతోను, కోపీ లేక గోబీ (కేబేజ్), ఆలూ (బంగళాదుంప), మటర్ (పచ్చిబొటానీ గింజలు)కలిసిన చక్కనికూరతోను చపాటీలను కడుపునిండ మెక్కితిమి. "దూద్ భీ లీజియేగా?" ("పాలుకూడదీసికొందురా") అని యువకుడు మరల ప్రశ్నించినాడు. "జరూర్!" అని పొట్టిపిచికి పలికినాడు.' అర్ధనేరు ప్రాప్తికి' అందఱము పంచదార కలిసిన వేడివేడి పాలు పీల్చి, "బహుత్ అచ్ఛా! బహుత్ అచ్ఛా!" ("మిగుల మేల్! మిగులమేల్")అనుకొంటిమి. "ఏంపుణ్యాత్ముడండి! జగదీశు డిట్టివానికే సకలైశ్వర్యము లిచ్చును. మే మిట్లు పలికితిమని ఆపెద్దమనిషితో చక్కనిహిందీలో తర్జుమాచేసి చెప్పండి" అని పప్పుపెద్దిభొట్లు హిమగిరిగుహలు మారుమ్రోగునట్లు 'జేవ్' మనుచు పలికెను. నే నట్లే తెలిపితిని. "ఆప్ కా మెహర్ బానీ" ("తమదయ") అని యతడు బిల్లు తెచ్చి మెల్లగా మాముందుంచి, "పాన్ భీ లియావుంగా?" ("తాంబూలముగూడ తెత్తునా?") అని చెప్పి వెంటనేపోయి, తాంబూలము తెచ్చి మాకిచ్చినాడు. బిల్లులో నైదు రూకల మొత్తమున్నది. "ఏమిది?" అని యించుక యోచించి, తోడనే "మాకింత సత్కారము చేసి మా యుదరములను నింపిన పెద్దమనిషి ఒక హోటలుకీపరుకాని మమ్ములను తనుపుటకై గంధర్వలోకమునుండి

దిగివచ్చిన శ్రీమతి వరూథిని తమ్ముడు కా"డని గుర్తించి దానిని, వెంటనున్న మహాశయులచేతి కిచ్చితిని. బిల్లును చూచినంతనే వారు తెల్లబోయిరి. "హతోస్మి!" అని యొక్కరొక్కరుడు గుభాలున నేలగూలునని అడలితిని. అప్పటికి వారంత పనిచేయలేదు; కాని నిముసములో వారి వైఖరులు మారినవి. కత్తితో ప్రేటువేసినను వారి మొగములనుండి రక్తపు చుక్క పడునని తోచలేదు. నిమిషమునకుమున్ను ఆతని నెంతో పొగడిన పెద్దిభొట్లు "హరి వీడి మొహమ్ముండా! అయిదు రూపాయలే! కొంపతీశాడు ఉండి ఉండి!" అని గుండె చఱచుకొని, అఱచినాడు. "మనిషి ఒక్కంటికి రూపాయిమైనది; పొట్టిపిచికి వెచ్చమును నేనే భరింతును. కావున నేను రెండురూక లిత్తును. రూపాయిచొప్పున మీరు మీపైకము వానికీయుడు" అని నేను పలికితిని. "ఇప్పుడేమనుకొంటే యేమిలాభం? యిచ్చివేయండి" అన్నాడు తిమ్మయ్య. "ఇటువంటి డిమేండు తలపైబడునని కలలోనైన తలచియెఱుగను. హిమగిరి తలపై పడినట్లుయింది! నేను పుట్టి పెరిగి సుమారు యేభైయేళ్లాయెను. ఒకపూట తిండికి (అందులో అన్నమూ లేదు, వీడి పిండాకూడూ లేదు) రూపాయి నేనెన్నడూ యిచ్చియుండలేదు. ఈడబ్బు వీడికి దక్కియేదుస్తుందేమి?" అని విసుకుకొనుచు, పప్పుభొట్లు రొంటినుండి తన రూపాయను దీసి క్రింద గిరవాటువేసినాడు. "ఈలా అని పంతులుగారు ముందే చెప్పియుండవలసింది. మాటరాకపోవడంచేత ఇంతపని జరిగిపోయింది. వీడు ఏమి పెట్టినాడని రూపాయి యిచ్చేది! చివరికి ఒక్క పెసరట్టయినా కళ్లబడింది కాదు. నోరంతా చచ్చికూర్చుంది. చూసి చూసి వీనికి రూపాయి నేనియ్యను. నా కింకా చపాటీలు తెప్పించండి" అనినాడు పిచ్చయ్య. మా ధోరణి యేమో కాశ్మీరీయువకునకు తెలిసినది కాదు. "క్యా చాయియే ఫర్మాయియే" ("ఏమికావలెనో సెలవియ్యండి") అని ఆత డని నాడు. "ఉన్కో ఫిర్ చపాటీ దీజియే" ("ఆయనకు మరల చపాటీవడ్డింపుడు") అని నే నంటిని. వడివడిగపోయి నాలుగు చపాటీలను తెచ్చి అతడు పిచ్చయ్యముం దుంచినాడు. "చేతులు కడుగుకొన్న నేమి? మేమేల అడుగరాదు?" అని తక్కిన మహాశయులు తమలో తాము యోచించు కొనిరి. ఇంతలో మఱొకబిల్లు

తెచ్చి "అవుర్ ఆర్ అణాపీజియే" అన్నాడు యువకుడు. "మఱి ఎనిమిదణాలీయమంటున్నాడు" అని పిచ్చయ్యతో చెప్పితిని. "సనేమిరా!" అనినాడాతడు. "అల్ల రెందుకు? పాఱవేయండి.' అని నే నంటిని. "పీల్చివేశాడు వీని దుంపతెగ" అని పెద్దిభొట్లు పలికినాడు. "ఇంత ఘోరమా! ఇంతదారుణమా! ఈ డబ్బుతో ఎంతమందికో సంతర్పణ చేయవచ్చునే!" అని సణుగుచు, తిట్టుచు, పూర్వోక్తవైశ్యభోక్త పైకము చెల్లించినాడు. "పరుండుటకు మాకు చోటెందు లభించును?" అని నేను యువకుని ప్రశ్నించితిని. "కొంతదూరంలో ఒక డాక్ బంగ్లాయున్నది. అచట కావలసినంత చోటుండును ఇక్కడ చోటు లేదు. ఇష్టమైతే ఈ బల్లమీద ఒకరిద్దఱు పరుండవచ్చును. కాని యిచ్చట చలి అధికము" అని ఆతడనినాడు. చిట్టివలస మిత్రు లందే యుండదలచిరి; కాని 'నిద్రచేసి' నందులకు మరల పైక మీయవలసి వచ్చునని అడలిరి; మఱెచ్చటికిని రాలేమని ప్రక్కనున్న దుకాణములో చతికిలబడిరి. నేను వెలుపలి కరిగితిని. పొట్టిపిచికియును, పెద్దిభొట్లును నావెంటబడిరి. "పాన్ కా పైసా దేజియే" ("తాంబూలము తాలూకు పైకమియ్యండి") అని హోటలువాడు భొట్లుచేయి పట్టుకొనినాడు. "ఏమండో, వీడేమో అంటున్నాడు. కొడతాడు కాబోలు వీడి మొహమ్మండా! అమాంతంగా జెబ్బపట్టుకొన్నాడు!" అని పప్పుభొట్లు మొఱపెట్టెను వెనుకకు తిరిగి, సంగతినెఱిగి, కళ్లలకైన డబ్బులు యువకునికిచ్చి ముందులకరిగితిని. "బంగ్లా బాగా యెత్తుచోటుననున్న" దని అచటివారనిరి. కారుచీకట్లు నలువైపులందు అలముకొనియున్నవి. త్రోవయును, తెన్నుయును కానుపించలేదు. ఎత్తుపల్లములును, ముండ్లును, మంచు గడ్డలును మమ్మెదుర్కొనినవి. ఎట్లో బుడంకాయయును, నేనును మీదికెగ ప్రాకితిమి. ఇక పప్పుపెద్దిభొట్లు?

లాహోరులోనే ఈతడు బావాజీవలె తయారైనాడు. ఈతడు యొజ్జపంచలే వాడుచుండును. ఒడలుకు చొక్కా లేదు; కాలుకుజోడు లేదు. మెడలువంచి "పిండీలో" ఈయనచే ఒకరగ్గు కొనిపించినాను. చొక్కాకుట్టించుకొను" మనినపుడు "ఊహూ!" అనిమూతిపాడించినాడు. "కాలిక జోడు తప్పదు. జోడు లేకున్న, నీప్రాంతాలలో

నలుగురూ నవ్వెదరు. అదట్లుండ జోడు లేనిదే మంచులో తిరుగ రాదు. ఐదునిమిషాలలో ప్రాణము లెగిరిపోవును" అని చెప్పితిని. గోవింద సింగును, ఆతని సోదరులును అట్లే చెప్పిరి. ఎట్టకేలకు ఒక చవుకరకపు జోడు కొనుటకు భోట్లు అంగీకరించినాడు. పొడవుపాటి యెఱ్ఱని వింత జోడును కొనినాడు. పాదరక్షల నంతకుమున్ను వాడని పెద్దమనిషి యగుటచేతను, కొనినజోడుతోలు రాతికంటె గట్టిదగుటచేతను, కొంత గఱుకై యుండుటచేతను, పప్పుభోట్లు దానిలో పాదములు దూర్చి చాల బాధపడువాడు. "రామా! ఇది కుక్కపీకినట్లు పీకుతోందండీ!" అని యఱచువాడు.

నేనూ, పొట్టిపిచికీ ముందటికరుగుచు "అడుగు వేయవలెను" అని భోట్లును హెచ్చరించితిమి. పాపము ఆతని యాతన వర్ణనాతీతము. బిక్కుబిక్కుమనుచు, జోడుతో మీది కడుగు వేసి, "రామా! హరీ!" అని కెవ్వున కేకవేసి, దానిని తీసివేసి మంచులోనూ, ముండ్లలోనూ అడుగువేసి, "అమ్మో! చచ్చేను!" అని బహుకష్టముతో మరల జోడు తొడిగి, కాలుసాగించి, "హరహరా" అని ప్రక్కగోతిలో ఆమహాశయుడు కూలబడినాడు. మేమిరువురము వెన్కకు వచ్చితిమి. "చంపేశావయ్యా బ్రాహ్మడా! ఇక్కణ్ణుంచి రావడంయెల్లా? జోడు తొడిగితే ఒకతంటా, తొడగకపోతే మఱొకతంటా! ఈ కాశ్మీరము నన్ను చంపేందుకు పుట్టిందికాబోలు! ఈ కొండలూ, యీమంచూ, యీ ముళ్లూ నాహతమార్చి తీర్తాయి!" అని ఆతడు గద్గదస్వరముతో మొఱపెట్టినాడు. నాగుండెనీరైనది. పొట్టిపిచికి పకపకనవ్వుచు గంతులు వేసినాడు. "భోట్లు నిందుండి కదపుటెట్లు?" అని పరిపరివిధముల దలపోసితిని. ఇద్దఱమూ పట్టి పైకి గొనిపోవుదమనినను, అతడు స్థూలకాయుడుగాని బెండువంటివాడుకాడు. ఎక్కవలసినది ఎత్తుకొండ యగుడు, దాపుననున్నది లోతులోయ యగుటు, అట్లొనరించుట అసాధ్యమని గ్రహించితిని. ఆతనిచే మరల కష్టముతో జోడు తొడిగించి, మెల్లగ చెరియొకవైపునుండి చెరియొక చేయిపట్టుకొని మీది కడుగువేయించితిమి. బుడంకాయిగాడి నవ్వు హెచ్చినకొలది భోట్లు ఆగ్రహం హెచ్చినది "అరే! తుంటరీ! తెల్లవారనియ్యి. నిన్ను తవ్విపాఱ

వేస్తాను" అని ఆతడు అఱచువాడు. ఎట్లో ఆఛాందసునితో మేము డాక్ బంగ్లాను చేరుకొంటిమి.

మే మచటికి పోవునప్పటికి బంగ్లానుండి యెవ్వడో ఒక హిందూ స్థానీయుడు చివాలున నీవలికి వచ్చినాడు. సగముదుస్తుల నాంగ్లపద్ధతితో ధరించినాడు. మమ్ముజూచి "మీ రెవరు? ఇచ్చటి కేలవచ్చి తిరి?" అని అతడు ప్రశ్నించినాడు. వాని కంఠస్వరము కర్కశముగా నున్నది. "అయ్యా! మే మీ రాత్రి యిచ్చట పరుందుము. ఉదయమే లేచిపోదుము" అని నేను తెలిపితిని. ఇచట చోటులేదు పొండు" అని ఆత డనినాడు. "లోపల చోటులేకున్నను, మేమీ వసారాలో నొఱ గుదుము. ఇందు కావలసినంత చోటున్నదికదా!" అని నేనంటిని. "తావు ఇందూలేదు, అందూలేదు. వెంటనే పొండు" అని తీవ్ర స్వరముతో ఆత డనినాడు. నేనుహిందీలో ప్రసంగించుచుండ నతడు ఇంగ్లీషులో మాట్లాడసాగినాడు. నేనుకూడ ఇంగ్లీషులో ప్రసంగము మొదలిడి, నా ధోరణిలో కొంత స్టీమ్ ఎక్కించితిని. "ఏమోయీ! నీవు మానవునివలెనే అగపడుచున్నావు. అందును భారతీయుడవు. నీ కిట్టి నిష్ఠురవర్తనము కూడదు. నిన్ను మేము కోరిన దేమియును లేదు. దక్షిణ సీమనుండి వచ్చి, కాశ్మీరమునకు పోవుచు, ఈ రాత్రి యిందు చిక్కుబడిపోతిమి. ఈస్థితిలో వన్యమృగములైనను మాకు చోటిచ్చుటకు వెనుదీయవు; మనుష్యరూపమున నున్న నీ నోటినుండి ఇట్టి నుడువులు వెటలుట శోచనీయము" అని పలికితిని. "ఎంతచెప్పినను, మిమ్మిందు పరుండనీయను" అని ఆత డెప్పటిపాటను పాడినాడు. "నీవు నూఱు చెప్పుము. వేయిచెప్పుము. మే మిందే 'తిష్ఠవేతుము.' నీ యిచ్చవచ్చిన చర్య జరపుకొనుము." అని "పప్పుభొట్లూ! సంశయింపక నీవు ప్రక్క వేయుము" అని పలికితిని. తాను తెనుగున మాట్లాడిన నచటిహిందూ స్థానీయునకు బోధపడదని భొట్లు గొణుగును. "ఈపిశాచము మనలను మ్రింగివేయునేమో! వీనితో మనకు పోరాట మెందులకు?" అని "పరుండు" మని నేను గద్దించినంతనే నేలపై నాతడు మేను వాల్చి నాడు. "మనము మనుష్యులము. ఈతడు ప్రస్తుతము పశువైనాడు. పశుబలముకంటె మనుష్యబల మధికము. ఏచింతలేక నిద్రింపుము.

మంచుమలను విలోకించుచు, నే నీరాత్రి మేలుకొని యుందును. నీకేమియు భయములేదు." అని భోట్టుకు ధైర్యముచెప్పితిని. హిందూస్థానీయు డవాక్కయి నిలిచినాడు. "నీవు మహత్తరమైన భారతభూమి యందు పుట్టుటకు తగవు. 'అతిథిదేవో భవ' అను పవిత్రవాక్కు ఈ దేశమందు, ముఖ్యముగ నొకప్పుడు మునిపుంగవులకును, నిలింపులకును, నిలయమైన ఈహిమాలయమున ప్రతిధ్వనించినది! నీవు నీహృద యము నెందు వీడితివో యెఱుగను. ఈవిశ్రాంతిగృహమునకు సంబం ధించిన నిబంధనపత్రమును గొనిరమ్ము. మర్యాద నేకాక, నియమమును కూడ నెఱుగని మూర్ఖునివలె నగపడుచున్నావు. నీపైచర్య దీసికొనిన నీయుద్యోగము ఊడి నేలరాలును. నీ కపకారము చేయనుకాని నీకు హితవు చెప్పెదను. మేము దొంగలముకాము. ఇందుండి నీవు మమ్ము లను క్రిందికి నిరాకరింప దొరకొనినను, మేము కదలువారముకాము. ఈగహనమున మాకు మఱొకతావు లభింపదని నీవు తొలుతనే గ్రహించి యుండవలసినది" అని హిందూస్థానీయు నుద్దేశించి పలికితిని. ఏమనుకొనినాడో కాని ఆత డిక మాట్లాడలేదు; నా యాదేశాను సారము పొట్టిపిచికి పోయి భోట్టు ప్రక్క పరున్నాడు. కొండమీది యల్లరి విని ఎవరో ఒక పెద్దమనిషి బంగ్లాలోనికి చరచరవచ్చెను. మనిషి చామనచాయవాడు. దట్టమైన బట్టలు ధరించినాడు "కథయే" మని నన్నడిగినాడు. జరగిన ఉదంతమును వానికి పూసగ్రుచ్చినట్లు చెప్పితిని. ఆతడు మిగుల నక్కజపడి, శిలాప్రతిమవలె నిలిచిన హిందూస్థానీయు నుద్దేశించి "నీ వెంతేని దుర్నయమున కొడిగట్టితివి లజ్జతో, దుఃఖావ మానములతో మనము శిరములువంచుకొనవలెను. వీరు దాక్షిణాత్యులు విద్యాబుద్ధులందు దాక్షిణాత్యులు మన తలదాటినారు. వీరు మనకు పూజనీయులు. ఉత్తరహిందూస్థానమునుండి పోయినవారిని వీరెంతో గౌరవింతురు. వీరుచూపు ఆదరణమునకు బదులుగ నీ వత్యాచారము జూపితివి." అని పలికి ముఖము వాచునట్లు వానికి చీవాట్లు పెట్టినాడు. పశ్చాత్తాపము నంది ఆ హిందూస్థానీయుడు క్షమింపుడని నన్ను వేడు కొనినాడు. నా కన్నులనుండి నీరు జొటజొట రాలినది. గంగాస్రవంతి; వలె నాహృదయమున సత్తేకి పూతభావపూర ముప్పొంగినది.

ఆహా! మనుష్యాత్మకు మహదానంద మొసగునది మహత్తర మైన ప్రణయభావమేకదా! మనుష్యహృదయము నేలున దీభావమే కదా! అపుడపుడు దుశ్చింతలు రాబందులట్లు మనసుపై వ్రాలుట నిక్కమే! క్రోధభావము ఝంఝామారుతమట్లు హృదయము నట్టిట్టు లాడించుటయు నిక్కమే! ఆగ్రహముచే ఘూర్ణితచిత్తుడైన మనుజుడు దురాక్తులాడుట నిక్కమే! దుష్క్రియలకు దొడరుటయు నిక్కమే! కాని క్రోధముగాని, మఱే ప్రతికూలభావముగాని మనుష్యాత్మకు సహజముకాదు. సహజముకాని దెంతకాలము నిలుచును? దేవదేవుని పీఠస్థలియైన మనుష్యహృదయమున పిశాచము కాపురముండ నేర్చునా? జగచ్చక్షువుమ్రోల కారుచీకటి వయ్యారిభామవలె నృత్యముచేయ జాలునా? మనుష్యహృదయమున దివ్యశంఖారవమట్లు పవిత్రప్రేమ వాక్కు ప్రతిధ్వనించినంతనే దొంగవగిది క్రోధమందుండి కాలికొలది పాఱిపోదా? కొంతసేపు హిందూస్థానీయుడును, నేనును పోరాడు కొంటిమి ఆత్మరక్షణముకొఱకును, చెంతనున్న మిత్రుల రక్షణము కొఱకును నేను కొంతనాటక మాడితిని. సంయమిని కానుగాని క్రోధ భావమును హృదంతరాళమున గాపుర ముండనీయక దానిని తఱిమి కొట్ట నాతురపడుదును. మెత్తనివానిని చూచిన మొత్తువా రెదు రగునపుడు, అస్త్రసన్యాసము అనర్థహేతువగుతఱి, కాలపరిస్థితులు కురు సేనలట్లు మాఱ్కొనినపుడు, ముప్పునుండి దాటుటకై ఉచితమైన ఉపా యము నవలంబింతును. ఎదుటిపగతుని మిత్రుని గావించుకొనుటకై వేయివెరవులు రోయుచుందును. నాకు మిగులగూర్పు మిత్రులలో పలువురొకప్పుడు నన్నెదుర్కొనినవారే! నాటి హిందూస్థానీయుడు పదంపడి నాకు ప్రాణమిత్రుడైనాడు. హిమగిరియాత్రయందు నా కత డెంతోసాయము సలిపినాడు. ఈతని పరిచర్యనుగుఱించిన విపులోదంత మును చదువరులు వేఱుగ్రంథమున గాంచగలరు. పుట్టిపిచికి తొలుత నాశత్రువేకదా!

ప్రణయభావసేచనముచే నాటిరాత్రి మమ్ముల నానందపూర మందు ముంచిన ఆనూతన యాగంతువునకు మేము హృదయపూర్వ కముగా ధన్యవాదము లొసగితిమి. అతడు కురుక్షేత్రమందు అధ్యా

పకవృత్తిలో నుండెను. "కొంతసొంతపనిమీద కోహాలోకు కొన్నాళ్లకుముందే యరుదెంచితి"నని యాతడు పలికినాడు. వానిపేరు చిరంజీవి. నేనార్యావర్తమును వీడివచ్చినయనంతరము ఆతడును, నాటిహిందూస్థానీయుడును తఱచుగ జాబులు వ్రాయుచు, నా యోగక్షేమము లరయుచున్నారు. దాక్షిణాత్యమునకు రండని వీరికి పలుమారులు వ్రాయుచుందును. ప్రేమఋణమును దీర్చుకొను నవకాశములకై పొగులుచుందును.

"పరుండుటకు మీకిచట సౌకర్యము లభించదు. ఈ చలికి మీరు గుఱికారాదు. మీకు వలసిన సదుపాయములను నేనొనగూర్తును. నాతోడ రండు" అని ప్రొఫెసర్ చిరంజీవి నాటినిశీథమున నాతో గౌరవపురస్సరముగా పలికినాడు "మంచి" దని నెచ్చెలులతో కలిసి మెల్లగ నాతనివెంట నరిగితిని. తరువాతియుదంతమును పాఠకులు పదపడి తెలిసికొనగలరు.

హిమశైలమున, నాడు తారసిల్లిన హిందూస్థానీయునకు నాసిక జేరుతఱి నాకగపడిన నాగపురవాసి తమ్ముడేమోయని యూహించితిని. చదువరు లీతని గాలక్రమమున మరల గాంచగలుగుదురు; నెచ్చెలి యయ్యెనని ఆనందింపజాలుదురు.

నా డాత డదృశ్యుడైనంతన తెరువున, చలిలో నేనట్లే నిలువంబడి పోతిని.



# నా మహారాష్ట్రయాత్ర

## ఐదవ ప్రకరణము

తెరువునకొంతసే పల్లే నిలువంబడిపోతిని. చీకటి ఇంకను పలుచబడ లేదు. చలిగాలి అల్లనల్లన వీచుచున్నది. నలుదిక్కులు ఇంకను సుషుప్తిమగ్నమైయున్నవి. అప్పటి నిస్తబ్ధత భావమయమై చూపట్టినది. రెప్పవాల్చక, దశదిశలను పరికించుచుంటిని. చాలదూరమునుండి అపుడేదో మధురరవము వినవచ్చినది. సుదూరస్మృతిపథమున మధుమయ స్వప్నములను లేపుచు, ఆత్మచే "హాయి! హాయి!!" అనిపించు ప్రణయ భావమువలె నానిస్వనము శ్రుతిగోచరమైనది. ఒక్కొకగీతికావాక్కు ఒక్కొకపిల్లగాలియలపై నధిష్ఠించి, చెవిసోకుచు నాయంతరంగమున జొచ్చి అం దనంత యానందవీచికల నుప్పొంగించెను.

మనుష్యస్పర్శనెఱుగక మంచుకొండపై నడయాడు గంగోత్తరీ ప్రశాంతహృదయమున నల్లన జారిపడు చల్లనిచినుకువలె శాంతిమయమైన ముహూర్తమున, శీతలమైన శర్వరీవాతావరణమున, చింతాస్పర్శనెఱుంగనియంతరంగమున గీతికాహృదినుండి రాలు తియ్యనితలపు అనంతభావమహోదధికి కన్నతల్లి యగునుగదా! మునులును, కవులును రమ్యప్రకృతియందే తమ జీవితములను కడప నిచ్ఛగించుట మానససరోవరమట్లందు వెలయు శాంతియందు గ్రుంకులిడి, గభీరధ్యానమున మునుగితేలిది, కొంగ్రొత్తమానికములనుచేబట్టుటకే కదా! సచ్చిదానందములందు త్రివేణియగుట పరికించి వారచొప్పి విజ్ఞానయాత్రికు లగుటకై కదా !

మనసంతయు నామధురరవముపై నిలిపితిని. పొలములందు నడిరేయి వినబడు తేటపాటవలె నది వినబడుచున్నది. అందు సంస్కృత పదములు లేవు. కాపులుచ్చరించు తేలికహిందీమాటలే పాటయైనవి.

ఇట్టిమాటలేకదా నీట నవలీలగ గలియు చక్కెరవలె మనసున గలసి పోవును! సాంద్రసంతమసమున గగనతలమందు చక్కనిచుక్కలు తోచినంతన కొండలందు జోలపాడుచు, శకుంతసంతానమును నిద్ర పుచ్చు చల్లని కడుపుగల వెల్లువవలె, కొండొక పల్లెవాసిశుభ్రచిత్తము నుండి అల్లన వెడలు నాగీతిక అత్తటి నాసికావాసులను జోకొట్టు చుండెను. గీతికయందు మాటిమాటికి వినబడు సంబోధనశబ్దము "కన్నైయ్యా!"

గోకులవాసులు శ్రీకృష్ణుని "కన్నైయ్యా" అనుచుందురు. ప్రేమ రసమును వెలారించునది తల్లిముద్దుగాని సింహాసనాసీనయైన రాజ మహిషి యుచ్చరించు ముదలకాదు. మనసునకు ముద్దుగొలుపునది తల్లిమాటగాని క్లిష్టమైనపరభాషాశబ్దముకాదు. సుధను చిందించునవి శీతకరకరములుగాని మోటుత్రాళ్లా? చెమ్మటలందు పెంపొందిన పాండితి చెమ్మటలనే పుట్టించునుగదా! సూనగర్భమునుండి యవిరళ ధారయై వెలువడు సౌరభమట్లు, గంధబంధురహృదయమునుండి చాలువాఱు సహజభావధారయే నిలింపుల కమృతము నొడ్డించిన దేవ దేవునివలె జిజ్ఞాసువులయాత్మల కానందము నొడ్డించును. గట్టికాయల నుండిగాక లలితసుమపేశములనుండియే, మంచుమంచి ముత్తైపుజేరు దాలిచిన పూరేకుమూకలనుండియే మధురవాసనలు వెడలులిల క్లిష్ట శబ్దమునుండికాక చక్కనై, చల్లనై, కోమలమైన పదములనుండియే తేనెతుంపురులు పోలు తలపులు వెల్వడును. చక్కనికవిత మెదడునకు బొప్పిగట్టించు జటిలవాక్కునందుగాక, కమ్మతావిని కలువడించుచు "హాయి! హాయి!!" యనిపించు పండుపైరుపోలు తల్లిమాటయందే తన దివ్యార్థమును వ్యక్తపఱుపజాలును. ఈయంశమును పండితులందు మసలినపుడుగాక పల్లెలందు, పామరులందు మసలినపుడు గ్రహింపగలి గితిని. సంయుక్తరాష్ట్రములందలి పల్లెలందు చాలనెలలుండి, కవిజనమన సులు పోలునచ్చటిపొలములందు పెక్కురాత్రులుకడపి, మురిపెముతో పైడిపైరులు పుట్టించు రైతునెచ్చెలులపాటలకు వీనుదోసి యొగ్గి, ఆర్యా వర్తయారామసీమలందు నందనచందనోత్కరమును, బృందారకసుంద రులకు సయితము కన్నులపండువొనరించు మందారపారిజాత బృంద

మును, కల్పకమునకు సహపాఠియైన కుజవితానమును సృష్టించినమహిత గుణాఢ్యులు భారతవనమాలులు. ఆలపించిన మధురమంజుల గేయములందలి హాయిని మనసార జుఱ్ఱి, పరమపరితోషమున మున్కలువేసిన భాగ్యము నాకు చేకూఱినది. "కన్నైయ్యా!" యని ముద్దుకృష్ణుని కడు చనవున సంబోధించి, ఆవేశపూరితులై వారు పాటలు పాడుచుందురు. ఆహా! వానియందలి కైత ఎంతమహత్తరమైనది! హృదయమును కదలించునదేకదా కవిత! ఆత్మచే తాండవనృత్యము చేయించునదే కదా కవిత! మనసున తన్మయానందమును నిండించునదే కదా కవిత! ఇట్టి యద్భుతానుభవములను గేయములు కలిగించులీల మఱేరచనములును గలిగింపవని నాయూహ. బిడ్డను ముద్దుపేరున నోరారపిలచియేకదా కన్నతల్లి గుండెయందలి నిండుప్రేమను కుమ్మరించును! ముద్దుకృష్ణుని తలమూర్కొనుచు మురిసిపోయిన యశోదవలె మురిపెముతో "కన్నైయ్యా!" యనుచు, నిర్మలాత్ములైన పాలికాపులు ఇంతింతనరాని యానందమున గంతులు వేయుచుందురు.

నాటిపాటయందలి "కన్నైయ్యా!" శబ్దము మాటిమాటికి చెవి బడినందున వెనుకటి యనుభవములెన్నో నాస్మృతిపథమున పొడసూపినవి. * గోకులవాసియైన గొల్లయెవ్వరో యాత్రికుడై నాసిక కరుదెంచి మధుమయరజనీసమయమున తన గొల్లదేవుని ప్రస్తుతించుచుండెనని గ్రహించితిని. పాట వినవచ్చుదెసకు అల్లన జని గొల్లనెచ్చెలిని చేర వలెనని మక్కువపడితిని. చాలదూరమునుండికదా అది వినబడుచుండెను! పొలమునుండియో? గుడిసెనుండియో? గుడినుండియో? ఎట్లు గ్రహింతును? అయినను కొన్నియడుగు లాదిక్కుగాబోతిని. అపుడెవరో ఒకవ్యక్తి నాకెదురై "అయ్యా! మీదేయూరు?" అని నన్నడిగెను. "నేను యాత్రికుడను, త్రియంబకముపోదును. ఆపాట యెందుండి వినవచ్చుచున్నది?" అని నేనడిగితిని. "కొందఱుకొందఱు యాత్రికులు ఇందుండి త్రియంబకము నడచిపోవుచుందురు. పోవుచుపోవుచునో,

* సంయుక్తరాష్ట్రములందును, అన్యప్రదేశములందును పాలికాపులతో నే గడపినవేళను గుఱించిన విపులోదంతమును చదువరులు "నాఆర్యావర్తయాత్ర" యను గ్రంథమున విలోకింపగలరు.

విడిసినచోటుల వినోదించుచునో వా రట్లుపాడుచుందురు" అని యాతడనినాడు. అట్టిపామరులతో అట్టియమాయకులతో యాత్రయందును జగదీశునందును సంపూర్ణవిశ్వాసముంచినడచువారితో చేలందును, రేలందును, వైరులందును, నిస్తబ్ధతయందును సలిపిన యాత్రయే యాత్ర! ఇట్టి యాత్రయందే ప్రతియంగుళమును, ప్రత్యంగుళమందలి ప్రత్యణువును బహుళభావసంభరితమై మనకు చూపట్టును. ఆర్యావర్తమున పెక్కుతూరు లట్టియాత్ర సలిపి ధన్యుడ నైతిని. గగనచుంబి మహావిశ్వవిద్యాలయమున, పెద్దపరీక్షలందునెగ్గి, పెక్కుపసదనము లంది ఎంతోజ్ఞానమును పడసితినని నే నెన్నడును విశ్వసింపలేదు. నా విశ్వవిద్యాలయమునుండి కదలిపోయి, విశాలభారతభూమియందు పచ్చికపానుపులందు, పండుచేలందు, పర్వతసానువులందు, లోతులోయలందు, మంచుతెరువులందు, పల్లెవాసులందు, రైతుబిడ్డలందు మసలినపుడే నేనించుక విజ్ఞానమును చవిజూచితినని విశ్వసించుచుందును. నా యీ యాత్రను గుఱించిన కథనము నాంధ్రావని కప్పనమొనరించుట తెలుగున యాత్రకు సంబంధించినగ్రంథములెవ్వియు లేవనియే కాక నిక్కంపు విజ్ఞానము లభించుతెన్నుల నెన్నో తోడిజిజ్ఞాసువులకు చూపజాలుదునని నమ్మి యని వినీతభావమున పాఠకమహాశయుల కెఱిగించుచున్నాను. ఆర్యావర్తమునందువలెనే మహారాష్ట్రమందు గూడ అంగుళమంగుళమును పరిశీలించుచు పయనము సాగింప నుద్దేశించి, ఈశ్వరకటాక్షముకతన నుద్దేశసిద్ధి నందితిని. మహారాష్ట్రమందు కొండలును,అడవులును బహుళములై యుండుటచే,వానియందు విశేషకాలము కడప నిశ్చయించి, పెక్కుతూరులు కాల్నడకను పయనముగావించి; సమతలప్రదేశములందు (నిర్దిష్టసమయమందు యాత్రను ముగించుటకై) అక్కఱగువేళలందు బండియందో, మఱేయానమందో యాత్రను సాగించితిని. నాసికాత్రియంబకములనుండి బొంబాయి తరలిపోయినపిదప అందుండి సలుపవలయు దీర్ఘమైన మహారాష్ట్రయాత్రకు వలసిన సన్నాహములను ముందే ఆయత్తమొనరించుకొంటిని. నాసికనుండి త్రియంబకమునకు నడచిపోవలెనని తొలుత నేను నిశ్చయించుకొననైతిని. నడచిపోవుయాత్రికు లందెందఱో యుందురని నేనెఱుగ

నైతిని. నాటినిశీథినీసమయమున నట్టియాత్రికులెవ్వరును నాకు సన్నిహితులు కాలేదు. గానపథమునననుసరించి పోయిపోయి, ఆపాటగానిజేరుకొందమనినను, అల్లనల్లన నామధురనిస్వనము హిల్లోలతరంగములందు లీనమైపోయినది! ఇక నడచి అత్తటి యెం దరుగుదును? కావున త్రియంబకమువఱకు బస్సుమీదనే పోకతప్పదని గ్రహించితిని. "త్రియంబకముపోవుబస్సు కొంచెముప్రొద్దెక్కిన పిదప బయల్దేఱును. అది కదలుచోటు ఇచ్చటికి ఫర్లాంగుదూరమందున్నది. విశ్రమించుటకు మీకందు చోటు లభించును. దానిని చూపెదనురండు." అని తెరువరి పలికెను. వానితో కొంతదూరము సాగిపోతిని. ఆదూరమున నొక చావడిజూపి, "అది ప్రయాణికులకై నిర్ణయింపబడిన విశ్రాంతిగృహము. మీ రందు పరుండవచ్చును" అని చెప్పి ఆవ్యక్తి తనదారిని తాను పోయెను. మెల్లగ నే నావిశ్రాంతిస్థానము కడకరిగితిని. అది పశువుల సాలవలెనున్నది. కొలదిమాత్రపుస్తంభములపై కప్పు నిలిచియున్నది! గోడలులేవు! పలువురు పలుదిశలందు పలురీతుల పరుండిరి. వివిధములైన గుఱ్ఱులు వినబడుచున్నవి. వారియం దాసమయమున ప్రవేశించు టెట్లు? మధ్యభాగమున నేదో పెద్దబస్తా కానుపించినది. దానిసమీపమున జేర వచ్చు ననుకొంటిని. పోయిబస్తాపొంత "జగదీశా!" యని చతికిలబడితిని. మేనువాల్చుటకు చోటులేదు. వాల్చవలెనను నిచ్చగూడ నాకులేదు. ఒకగడియనేపెట్లో కాలక్షేపముచేయ నిశ్చయించితిని. కూర్చుండియు, నిలిచియు, ఒక్కొకయడుగు మీదికివైచియు నిద్రించుమహాశయులతో * నీవలిలో ప్రయాణములు సాగించుతరుణములు నాకు లభించినవి;

* ఇట్టివారిలో ముకుందదాస్ రాఠి యనుమిత్రుడొకడు కలడు. ఇతనిది రాజస్థాన మండలి, బికనీరురాష్ట్రములోని 'దేశినోక్' అనుపల్లె. ఇతడు మంచిభక్తుడు. సరయూనది తీరమున నయోధ్యాలో "స్వర్గద్వార" ఘట్టమునకు సమీపమున యాత్రికులకై ఒక విశ్రాంతిగృహమును కట్టించినాడు. ఏబదేండ్లు (పిల్లనిచ్చు పుణ్యాత్ముడు ప్రత్యక్షము కాలేదుకనుక) కఠినబ్రహ్మచర్యదీక్ష నవలంబించినాడు! తొందములేని విఘ్నేశ్వరునివలె సిద్ధమైనాడు! నాతో నీతడు ఉత్తరహిందూస్థానమున నొకసారి యాత్ర సలిపినాడు. 1927 ఏప్రిల్ 18 వ తేదీని హరిద్వారమున జరిగిన అద్భుతమైన గంగాకుంభమేళసమయమున నాతో నీతడుండెను. నాటియపరాహ్ణమున యమునవలువురుసన్యాసులు అలంకృతగజము

కాని యీయద్భుతచర్యలం దొక్కటియు నాకు పట్టుబడలేదు. కనులు మూసి నాటి యాత్రోదంతమును తలపోయసాగితిని. దీర్ఘయోచన కును, నిద్దురకును దగ్గఱిచుట్టఱిక ముండునుకదా! యోచనా మగ్నుడును, నిద్రామగ్నుడును బాహ్యప్రపంచమునుండి దూరముగ తొలగిపోదురు. నాడు కొంతసేపు చింతనయందు మునింగియుంటిని. వాయువీచికలందు నెందో యంతర్ధానమైన మధుర కృష్ణగీతిక నన్వేషించుచు నిశీథినీని స్తబ్ధతయందు నాయాత్మ యెందేని చనుదెంచినది.

ఖైదీనిపట్టియుండుజోడు జోడులట్లు శరీరమానసము లాత్మను పట్టియుండునుగదా! వీనిపై హుకుమ్ చలాయించి, వీనిచే నిట్టి కర్జ మొనరింపజేయునది కర్మయే! వీనిపట్టునుండి వదలి, ఈశ్వరధామమును చేరుకొనుట కాత్మ తపించుచుండును. కళ ఇట్టిపట్టులనుండి వీనిని విడిపింపజాలునని నావిశ్వాసము. కళ ఈశ్వరదూత! కళామహత్త్వము కతన శారీరకమానసికనిర్బంధములు నిరర్థకములగును. బుసగొట్టుచు నెగయు విషోరగముకూడ నాగస్వరము విని, తనక్రౌర్యమును నేల రాల్చి, తన్మయచిత్తుడైనమహాభక్తునిభంగి ఆత్మహ్లాదినానందమును నింపుకొని, అందీదులాడదా? కళలందుమిన్నయైనది సంగీతమే! అందును మధురభావసంభరితమైన ఈశ్వరనామముగాడిన గీతాలాపనము ద్విగుణీకృతమాధుర్యమున దొలుకాడదా? ఎండుదొన్నియలోని తేనియకంటె పుష్పాంతరంగమున నుప్పొంగు మరందము మహత్తరమైనదికాదా?

లెక్క మహాసంరంభమున జాహ్నవీతీరమున నుత్సవము జరిపిరి. ఎందఱెందఱో భక్తులు స్నానాదులు పొన్నతెరువున నిలిచి, అచటివృక్షము పవిత్రవంతమైనదనియెంచి, దానిని తలపై బోసికొనువారు. వీరిలో ముకుందరావొకడు. నాటివృక్షమును చూచుటకై గట్టుమీద బహుసంఖ్యాకులతో పాటు నేను కూర్చునియుంటిని. రావు 'ఖూడిదబుస్సపన్న' యైవచ్చి, నాప్రక్క జతికిలబడి, నాటియుల్లకల్లోలమం దగనిమునసమునో గాఢనిద్ర పట్టించుకొనివాడు. నాతో కలిసి ఈతడు దీర్ఘయాత్ర సలిపినాడు. కడుపడిగ చనవలయుం వేళలందు తప్పక కునికిపాట్లుపడువాడు. ఈతనివిచిత్రోదంతమును చదువరులు వేఱుగ్రంథమున గాంచగలరు. తులసీరామాయణముపై వీనికి ప్రీతిమెండు. కాని ప్రీతికితగిన పాండితి లేదు. కడుకష్టమున శబ్దోచ్చారణ మొనరించువాడు. తన్మయత్వమో లేక మైకమో అపుడీతని మనసును స్వాధీన మొనరించుకొనెడిది.

దిక్కులేని యిల్లాలివలె నమవసనిశి నల్లాడు సుగంధముకంటె శారదచంద్రికలను తోడుజేసికొని కుసుమోద్యానము లందు విహరించు సౌరభము ఘనతరమైనదికాదా? దివ్యపుష్పకమెక్కి మేఘమార్గమున శ్రీరామునిగూడి పరమపరితోషమున నయోధ్యకు మరలిన వైదేహీవదువున; భక్తిభరమైన గీతావాక్కును ప్రాపానరించుకొని మనుష్యాత్మ దివ్యబృందావనమును చేరుకొనుసు. నాటి కృష్ణసంస్తవము విహంగపతివీపెక్కి అదృశ్యుడైన విష్ణువువలె సమీరస్కంధము నధిష్ఠించి యెందో యరిగెను! అరిగిననేమి? శ్రీ కృష్ణుని వెంట బఱతెంచు రాధలీల మనుష్యహృదయము మహిమోపేతవస్తువులను, శక్తులను అనుసరించుచుండును. కావున నొకప్పుడు మనుష్యదృష్టి యందు తవులొ్కనిన దృశ్యములును, మనుష్య కర్ణపుటముల జిక్కిన స్వాదుశబ్దములును, (చెప్పనేల?) మనుష్యానుభవమున జొరబడిన వివిధాంశములును, ఉచ్చులందు బడిన పిట్టబిడ్డలవలె మనుష్యస్మృతినుండి చులకనగ విడివడజాలవు. ఇట్టి యనుభవముల కతన మానవస్మృతి అమృతసూతియట్లు మధురభావపూరితమై యుండును కావుననే కాబోలు మానులును, కవులును స్మృతిమహత్త్వమున కంజలి ఘటింతురు? కావుననే కావలయును వర్డ్సువర్తు మున్నగు ప్రతీచీకవులును స్మృతినుండి కైకొనిన తీపితలపులను వెలుపలికి తోడి తోడి, వానిని హృద్యమైన పద్యపంక్తులందు నింపిరి.

మనుష్యస్మృతి హిందూమతమందు విశేషప్రాముఖ్యము నందినది. భవపరంపరలోని భిన్నానుభవములు మానవహృదయమున సంచితమైయుండునని గదా హైందవ తత్త్వశాస్త్రము తెలుపుచున్నది! నేటి శాంతిదేవిజీవిత-విశేష మిందులకు ప్రత్యక్షదృష్టాంతము. స్మృతిగర్భమందలియనుభవములు మణిపేటికలోని రంగారు బంగారు నాణెములు పోలునవి. బైబిలులో పేర్కొనబడిన నాణెములు ("Talents")—మిల్టన్ కవిచంద్రు డుల్లేఖించిన నాణెములు ఆత్మవృద్ధి కనిగదా నిర్దేశింపబడినవి! స్మృతిపేటికయందలి నాణెములును ఇట్టివే! కావుననే మనఋషికవులును, కవిఋషులును కనులు మూసికొని

స్మృతిమంజూషములను తెఱచి, అంపలినాణెములకతన నెంతేనిపర మార్థమును చేబట్టిరి.

రేపల్లె గొల్లపాడిన తియ్యనిపాట మేఘమాలికలం దూగాడు దివ్యడోలికవలె నా స్మృతియం దింకను దోగాడుచుండెను. శారీరక మైన నాటిపరిశ్రమనుండి, మానసికమైన నాటి పరితాపమునుండి విడి వడి, నా యాత్మ గోపాలుని పాటవెంట జనినది.

ప్రశాంతసలిలముపై హఠాత్తుగ దొరలిన కఠినశిలవలె ఆనంద మగ్నమైయున్న నా హృదయమున నపుడు మహాప్రళయధ్వని గుభాలు మనినది! పదుగురును కెవ్వుమనిరి! నే నులికిపడి లేచితిని! అంతవఱకు నా ప్రక్కను పడియున్న పెద్దబస్తా లేచి (చెప్ప నేల?) గణాచారివలె చిందులు త్రొక్కసాగినది! అదేటిచిత్రమో నాకు బోధపడలేదు. నేనత్తఱి విడిసినది "పిశాచములకొంపకాదుకదా?" అని తలపోసితిని. బస్తాలోనుండియే ప్రళయధ్వని వినబడుచున్నది! తక్కుంగలవారు గగ్గోలుపడిరి! కొందఱు స్మృతినెఱుగక పిచ్చివారివలె నఱవసాగిరి! కొంతసేపటికి మహాకాయ యోర్తుక కప్పుకొనినగోనెను క్రిందపాఱ వైచి, "చోర్ ! చోర్ ! !" అనియఱచి నాపై దుముక గమకించినది. అపుడపుడే తెల్లవారుచున్నది. పలుచని వెలుంగున నందఱును నన్ను తేఱి చూచిరి "ఇది ఘోరమైన అత్యాచార"మని నేనూహించితిని. వివిధ పర్యటనములందు ఇట్టి మూర్ఖుల నెందఱినో కాంచితిని. మెత్తగ నూర కొనుట అవివేకమని గ్రహించి, లేచి నిలిచి, "మీ వలెనే నేనును ఇచ్చట విశ్రమించుటకై వచ్చినాను. ఈముసలిరాకాసి ఇట్లేల యల్లరి చేయుచున్నదో యెఱుగను. చోటు తక్కువయగుడు, బస్తాయనితలచి సమీపమున గూర్చుంటిని. ఏదేని పీడకలగని ముసలిది అల్లరిచేసిన, క్షమింతును. 'చోర్! చోర్!!' అని ముందటి కుఱికినయెడల దీని ముక్కుచెవులు కోయింతును." అని తీవ్రస్వరమున బలికితిని. అచ్చట చేరిన మూక (ఇందు చదువుసంధ్య లెఱిగినవా డొక్కడును లేడు) సంగతి గ్రహించి ఆయవ్వను కసరికొట్టిరి. అప్పటి కాల్యకృత్యములు నెఱపుటకై నాకు తోడుపడిరి.

ఉస్సురుస్సురనుచు బస్సుకై తడసితిని. త్రియంబకము పోయి, అచటి గోదావరియందు స్నానముచేయ నిశ్చయించితిని. కావున నాసికలో నాటియుదయము టీగాని, టిఫిన్‌గాని పుచ్చుకొననైతిని. బస్సులు నిలుచుతావు (బస్సుస్టేండు) కడనున్న బల్లపై నేగూర్చుని యున్నపుడు ఒకని వెంబడియొకడు, పండామహాశయులు నాయొద్దకు వచ్చిరి. "నాసికలోనియాత్ర ముగించుకొని, పిదప త్రియంబకము పోవలెను. ఇట్లని శాస్త్రముచెప్పుచున్నది" అని వారు తమతమకార్డులను నాకు సమర్పించిరి. "సరే వింటిని; ఇక దయచేయుడు" అని వారిని సాగనంపితిని. ఎనిమిది గంటలైన పిదప మేయిల్‌బస్సు వచ్చినది. పోయి దానిలో కూర్చుంటిని. పావుగంట సేపటిలో పెద్దంజలువేయుచు, గజాసురుడు వచ్చిపడినాడు. నాసికస్టేషనునుండి అత డెట్లురుదెంచి నాడో యెఱుగను. తెల్లవారువఱకు స్టేషనులోనే సుఖనిద్ర జెంది, ఉదయమున లేచి యథేచ్ఛగ నడచివచ్చినాడని గ్రహించితిని. ఈతనిపంథ నవలంబించి యుండినచో నాటిచిక్కులు నన్నుమార్కొని యుండునవికావు; కాని, ఆచిక్కులు లేకున్న నాయీకథనము ఎందుబెండునడువున నుండెడిదని పాఠకమహాశయులతో నుడువుదును. గజాసురుడు వచ్చి చివాలున బస్సులో ప్రవేశించినాడు.

పగటివేళ గజాసురుడు మఱింత స్ఫుటముగా కనుపించినాడు. అతడు పశ్చిమోత్తరరాష్ట్రమందుండు వాడని గ్రహించితిని. తక్షశిలకు పోవునపుడు ఒకప్పుడారాష్ట్రమున వివిధప్రదేశములందు పరిభ్రమణ మొనరించితిని. నౌషేరాకు కదలిపోవుటకుమున్ను కేంబెల్‌పూర్‌లో ఒకవకీలు యింట బసచేసితిని. ఈతనికి మదరాసీలయెడల నెంతేని ప్రీతికలదు. "మదరాసురాజధానిలోని బ్రాహ్మణుల మేధాశక్తి లోకోత్తరమైనది." ("The brains of Madrassi Brahmins are the best brains in the world") అని యీతడు పలుమాఱు పలుకుచుండువాడు. "బ్రాహ్మణేతర సోదరుల ప్రజ్ఞయున్నట్టిదే" యనినే దెలుపువాడను. దాక్షిణాత్యులు మేధావులని హిందూస్థానీయులును, వంగీయులును పరస్పర ప్రసంగములం దను కొనుచుందురు. షణ్ముఖం చెట్టి ప్రభృతు లీవిషయము నెఱుంగుదురు. పశ్చిమోత్తర రాష్ట్రమందు

పిల్లకొండలబోలువారును, మర్రిచెట్టులట్టులుండువారును ఎందఱో కలరు. శరీరమునకు సరిపడు మెదడు వీరికి లేదు; కాని వీరు చక్కని హృదయములు గలవారు. ధైర్యసాహసములందును, ఆదరానురాగములందును వీరు జగతియందజేయులు. కేంబెల్‌పూరులో నా కాతిథ్య మొసగిన లాయరు ఏనుగవలె నుండువాడు! గజాసురు డాతనియన్న యని భ్రమసితిని.

గజాసురుడు పెద్దకోటు తొడుగుకొనినాడు. ఉన్నతమైన ఉష్ణీషమును ధరించినాడు. గంభీరవదనుడై బస్సులో సగముచోటు నాక్రమించినాడు. వానిహావభావములును, చేష్టలును ఎల్లఱి నాశ్చర్యాన్వితుల గావించెను. అందఱికన్నులు వాని మీదబడినవి! వానిని పలుకరింపదలచితిని. ఇంతలో అతడే "బాబూసాహెబ్! ఆప్ కహా రహినేవాలే?" ("అయ్యా! తామెందుండువారు") అని నన్ను ప్రశ్నించినాడు. "మద్రాస్" అని చెప్పితిని. నేగూడ అతనినట్లే ప్రశ్నించితిని. "మాది నౌషేరా; నేనుబనియాను; (వైశ్యుడను) గడియారముల వర్తకము; చేయుచుందును. పనిమీద బొంబాయి వచ్చినాను. నాసికా త్రియంబకములను చూచి పోవలెనని వచ్చితిని. మీరుకూడ ఇప్పుడు త్రియంబకమునకే పోదురనుకొందును." అని యాతడనినాడు. "అవును, నావలె మీరును యాత్రికులని యెఱిగి ఆనందించితిని" అని యుత్తర మొసగితిని. "నాకును చాల సంతోషముగానున్నది. మద్రాసును గుఱించి విశేషముగా వినియుంటిని. మనదేశమందది దొడ్డతావని వింటిని. మీరు త్రియంబకములో నెన్నాళ్లుందురు?" అని గజాసురు డడిగినాడు. "ఆప్రదేశమును పూర్తిగ పరిశీలించి, నాసికవచ్చి, యిందుండి బొంబాయిపోదును. పదపడి అందుండి మిగిలిన మహారాష్ట్రయాత్ర సాగింతును." అని బదులుచెప్పితిని.

ఉత్తరయాత్రయందు జగదీశుడు నాకొక పొట్టిపిచికిని ప్రసాదించినాడు. మహారాష్ట్రయాత్రయందాతడు గజాసురుని నా కప్పన మొనరించెనని ఆనందించితిని. ఇరువురము మామా ప్రత్యేకరాష్ట్రములను గుఱించి ముచ్చటించుకొనసాగితిమి. ఇంతలో బస్సుబయలుదేఱినది

మెయిల్ బస్సుకావున చాలసేపుతడయక కొందఱిని మాత్రమే యెక్కించుకొని కదలినది.

మా కెదురుగ నెవరో యొకమహాశయుడు కూర్చుని రెండుకన్నులను మాపై నిలిపినాడు. కడుశ్రద్ధగ మా ప్రసంగమును వినుచున్నాడు. మనిషిరూపము వింతగచూపట్టినందున నే నాతనిలక్షణములను పరికింప దొడగితిని. ఆతని యంగప్రత్యంగములు పలకలుదేఱియుండెను. బ్రహ్మదేవుడు త్రిభుజములను (Triangles) ను మనుష్యాకారముగ నమర్చి పుడమిమీదికి పుత్తెంచెనని యూహించితిని. కందగడ్డవలెనెఱ్ఱయెఱ్ఱగానున్నాడు. ముఖవైఖరినిబట్టి "నిశ్శంశయముగ నీతడు రక్తమాంసములతోనొప్పు దైమానురా" జని గ్రహింపగలిగితిని. "బాబూసాబ్! ఆబ్ కహాసే ఆయేథే?" ("అయ్యగారూ! తామెందుండి వచ్చినారు?") అని నన్నడిగినాడు. "వీడు పండాగ్రహ" మని ఆనిముసమందే యూహించుకొని నేను ప్రతివచన మీయలేదు. గజాసురునికూడ అతడట్లే ప్రశ్నించినాడు. "నోషేరా" నుండి అని ఆతడు బదులుచెప్పినాడు. "త్రియంబకములో మీకు సమస్త సదుపాయములు సమకూర్చి చక్కగ మీచే యాత్ర జరిపిస్తాను" అని అతడు తన కార్డును గజాసురునకిచ్చినాడు. దాని నతడు నాచేతబెట్టినాడు. "డి. వి. ఆర్. దీక్షిత్, త్రియంబక్, నాసికజిల్లా" అను హిందీయక్షరములు దానిపై తోచినవి.

నాసికయందుగాని, త్రియంబకమందుగాని ఏపండావాని గృహమందును విడియుటకు నాకిష్టములేదు. పండాల "జులుమ్" యెట్టిదో నా బొంబాయిమిత్రులకు దెలిపియుంటిని. వారివలన తమకు కలిగిన యనుభవములను పూసగ్రుచ్చిన ట్లెఱిగించి, కాకులనట్లు వారిని దూరముగా తఱిమివేయుమని వారు గట్టిసలహా నాకొసగిరి. బొంబాయిలో, దాదర్ లోగల భదానీశంకర్ రోడ్డులోని "శ్రీకృష్ణనివాస్" లో వసించు మాధవమొరాబా అను మహారాష్ట్రమిత్రుడు త్రియంబకమందు రతక్ గల్లీలోవసించు శ్రీహరివాడెల్ కార్ అనుతననెచ్చెలియింట విడియుమని నన్నుగోరి, నారాకనుగుఱించి ముందే వానికి జాబు వ్రాసెను. అట్లే బొంబాయిలో, థానాయందు, బొంబేరోడ్డులోవసించు కె. పి. బ్రహ్మాయను మఱియొకమహారాష్ట్రమిత్రుడు నాసికలో, పంచ

వటికడ, గంగామందిర ప్రాంతమున వసించుతనమిత్రుడు ఒ. కె. టి. సత్పతీ ఎం. ఏ. బి. టి. గారింటనుండుమని నాతో చెప్పి తానుకూడ వానికి ముందే నాయాగమనమును గురించి ఉత్తరము వ్రాసినాడు. పండాల మొగములు చూడక ఈమిత్రులతో డ్పాటున నీరెండుయాత్రలను విధ్యుక్తముగ నిర్వర్తించుకొనవలెనని నిశ్చయించితిని; కాని, యీనిశ్చితాభిప్రాయమునకు ఘక్కాతగులునేమోయని యిప్పుడు తోట్రుపడసాగితిని. నాతోనిపుడు గజాసురుడున్నాడు! ఒకమాదిరి మానవుడయిన నంతగా యోచింపవలసినపని లేదు. ఈతని కతిథిసత్కారము చేయవలెననిన, దేవాసురులు మానవులను తోడుపడి, నడుముగట్టి వంటకును, వడ్డనకును పూనుకొనవలెను. రథమువంటి మనుజునిచూచి క్రొత్తనెచ్చెలులు మూర్ఛిల్లుదురనుట తథ్యము. పుణ్యమునకు బోయినవారికి పాపమెదురగునేమో! గజాసురుని పరిత్యజించి నాదారిని నేనుపోవుట నాకిష్టము లేదు. ఆతని చంకనిడికొనవలసివచ్చుచో పూర్వోక్త మిత్రులనుగాక తదితరులనే ఆశ్రయించి, రెండుయాత్రలను ముగించుకొనవలెను. అయినను పండాలదెస నాబుద్ధిపాఱినదికాదు.

"మన మీపండాను చేతబట్టుట మంచిదేమో యోచించండి. క్రొత్తచోటుకనుక కొంతసేపు ఇటువంటి బ్రాహ్మణుని పరిచర్య మనకవసరముకదా!" అని గజాసురుడు నాతో పలికినాడు. ఆతనియుద్దేశమును ప్రతిఘటించుట అస్తుతి కూడదనియు, పండాబాపడు ఉక్కుమీఱి ప్రవర్తించునెడల నిముషములో గజాసురుడు వానిని గుటుక్కున మ్రింగుట నిక్కమనియు నూహించి "వీనిని పిడికిటబట్టు" డని నా మిత్రునితో చెప్పితిని.

రమారమి పదునొకండుగంటలగునప్పటికి మాబస్సు త్ర్యంబకమును చేరుకొనినది.

ఏసరిల్లలామ దాక్షిణాత్యమందేగాక ఉత్తరహిందూస్థానమున గూడ కడుంగడు పవిత్రవంతమైనదని యెన్నబడుచుండెనో, ఏమహాపగపూతనామము వినినంతన భక్తులహృదయము లావేశపూరితములగుచుండునో, ఏసరిత్తీరమున శ్రీరాముడు సతీసోదరసహితుడై వసించి పదునాలుగేండ్లు ప్రకృతిశోభకు కనులప్పగించినాడో, ఏఝరీమ

తల్లి నాశ్రయించి గౌతమప్రభృతులు ప్రహృష్టాంతరంగులై తపోధనులై వఱలిరో, ఏకల్లోలినికతన బహుళకేదారములు రంగారు బంగారు పైరులిని అసంఖ్యాకుల ఉదరములను, హృదయములను, నయనములను తనుపుచున్నవో, ఏయేటిపొంత పోతన రామదర్శనమంది మహాగ్రంథ రచనకు గడంగెనో, ఏ వెల్లువనీరు త్రావి త్రావి పల్వురు తెలుగుతనయులు అనన్యసామాన్యకవితాశక్తినంది ఆంధ్రశారద కమూల్యభూషలు సమర్పించిరో, ఏశైవలినిచుట్టు పెక్కుపురాణములును, చరిత్రములును పుట్టుకలంది శతాబ్దులందును, సహస్రాబ్దులందును దాని యద్భుతమహిమను కీర్తించుచున్నవో, ఏనిర్ఝరిణిలో నిలింపులాడ జలక్రీడలాడ నింగినుండి యవతరించిరో, ఏధునీకూలమున జనించి ఏనదీవీచికలం దీదులాడి ఏవాహినీకూలస్థవాలుకాస్తూపములం దాటలాడితినో, ఏతరంగిణీ తరంగములందు బహుళపూతభావములు తళ్కొత్తి నాహృదయపుండరీకముపై వ్రాలి దానిని ప్రఫుల్ల మొనరించినవో ఆస్వర్గదాయిని (గో=స్వర్గము, దా=ఇచ్చునది) గనిన త్ర్యంబకమహాక్షేత్రమున గాలిడినంతన నాహృదయము భాస్వదాశయసందీపితమైనది; నాయాత్మ కమలకాసారమందలి కలహంసలీల పరితోషవీచికానిచయమున నుయ్యాలలూగినది. ఉపాస్యదేవత ప్రత్యక్షమైనంతన తన్మయత్వమున నాట్యామాడు పరమహంస చాడ్పున నింతింతనరాని యానందమున నృత్యమొనరించినది.

బస్సు ఆగినంతనే మాపై పండాడేగలు వ్రాలినవి. తమ ప్రశ్న పరంపరతో పీడింపసాగినవి. ప్రతివచనమేమియు నీయజాలదని గజాసురుని హెచ్చరించి, చరచరనడువదొడగితిని. లావువాడు, నలుపుదాళు గలవాడు, మిగులవాటముగ పాగాచుట్టినవాడు, కళావరురాజనదగు మానవుడొకడు మమ్ములను తఱుముకొనివచ్చినాడు. వానిని వదలించుకొనవలెనని మేమెంత యత్నించినను నెగ్గలేకపోతిమి. దురదృష్టవశమున నీతనిధాటి నామీదనే పడినది. "అయ్యా! మీది రాజమహేంద్రవరమా? మీమకాము ఇన్నీసుపేటలోనా?" అని తొలుత నన్నతడు ప్రశ్నించినాడు. మహారాష్ట్రులకు రాజనగరనామము పరిచితమైనదని యెఱుగుదును. కాని ఆవ్యక్తికి ఇన్నీసుపేట యెట్లు పరిచితమైనదో

గ్రహింపజాలక అబ్బురపడితిని. ఏయుత్తరమొసగక ముందంజ వేయుచునేయుంటిని. "రాజమంత్రి వారంతా నాకడకు వత్తురు. నేనే మీచే చక్కగ యాత్రసాగింతును. నాతోరండు" అనుచు గజముపొడవుగల ఒకపుస్తకమును తెఱచి ఆతడు పల్వురపేళ్లను ఏకరువుపెట్టసాగినాడు. ద్రుతగతిని మేము నడచుచునే యుంటిమి; మమ్ము తఱుముకొనియే వచ్చుచు తన చిట్టానుండి ఆతడు యాత్రికులనామములను గ్రుక్క త్రిప్పుకొనకుండ చదువుచునేయున్నాడు. ఎట్లైనమమ్ములను—ముఖ్యముగ నన్ను—ముక్కునబట్టి రివ్వుమనపలెనని ఆతడు నిశ్చయించుకొనినాడు! కళావరురాజు చదివినపేర్లలో రెండు నాకు పరిచితమైనవి. తొలుతటిది శ్రీపాదకామేశ్వరరావుగారిది. వీరు రాజమహేంద్రవరవాసులనియు, ఆంధ్రులకు పరిచితులైన గ్రంథకర్తలనియు, నావలె నొకప్పుడు ద్విజకవినాటకముల నాంధ్రీకరించిరనియు నెఱుగుదును. నేనెఱిగిన రెండవపేరు మేడేపల్లి శ్రీరాములది. ఇతడు నాబాల్యమిత్రుడు. నాల్గవతరగతిమొదలు కొన్నేండ్లవఱకు రాజమహేంద్రవరమున వీరేశలింగముగారి ఉన్నతపాఠశాలలో నాసహాధ్యాయుడై యుండెను. కాలేజీ చదువు పొంతబోక పారిశ్రామిక విద్యనంది బొంబాయిపోయి సోదరుడు అనంతముతోగలిసి కొండొకవాణిజ్య-సంస్థలో నుద్యోగిగా ప్రవేశించి, విశేషధనమార్జించుచు తనయింట రాజన్యుడై యున్నాడు. కామేశ్వరరావుగారి పట్లను, శ్రీరాములుపట్లను ఈ బ్రాహ్మణుడు ఎట్లు ప్రవర్తించెనో నే నెఱుగను. పండావాడు వారిపేరు లుచ్చరించువఱకు వారు త్రియంబకము పోయిరనియైన నెఱుగను. కాని, కళావరురాజు వర్తనము నాకు దుస్సహమైపోయినది. వాని జబర్దస్తీవైఖరి నామనసును మిక్కుటముగ బాధింప దొడగినది. పండాలవలని యనుభవము లెట్టివో సూచనగా చదువరుల కీవఱలో తెలిపియుంటిని. ఈ దుష్టగ్రహముమీదికి గజాసురు నుసికొలిపి, వానిపీచమడంచి తక్కుంగల పండాలకు కొంత బుద్ధిగఱప దలచితిని. కాని దౌర్జన్యభావమునకు మనసున జోటీయరాదనియు, ముఖ్యముగ నది యాత్రికుని హృదయమున పొడసూపరాదనియు వెంటనే గ్రహించి "ఏమోయీ ఛాందసుడా! నీవు ఎట్లు విజృంభించినను, నేను నీవెంట వచ్చువాడను కాను.

నీవూ, నీజాబితాకట్టా ఇక వెనుకకుమరలిన సంతసింతును.” అనిపలికితిని. “రానిండు, అలువనిండు, రండు” అని గజాసురుడు డైమార్ రాజు వెంట జరచర నడచుచునే యుండెను.

కొంతసేపటిలో డైమార్ రాజుసౌధమును చేరుకొంటిమి. తలుముకొనివచ్చిన పండావాడు తనపట్టు నెగ్గనందున మండిపడి, పండ్లు పటపట లాడించుచు వాడిమాటలు విసరుచు, మొదటిపండాను మార్కొనినాడు! డైమార్ రాజు వీరుడుకాని భీరుడుకాడు. తత్క్షణమే అగ్గిరాముడై విజృంభించినాడు! “నా యాత్రికులను—నాసికలోనే నేను సంపాదించుకొనిన యాత్రికులను కఱచుకొనిపోవుటకు నీకెన్ని వేల గుండెలున్నవిరా? దుర్మతీ! ఇకపో; లేకున్న నీకు తగినట్లు బుద్ధి చెప్పెద”నని అతడు రంకెలు వేసినాడు. అసలే కందగడ్డవంటి మనిషి! ఇప్పుడు మఱింత కందిపోయినాడు! కన్నులనుండి నిప్పులు చెరిగిపోయ సాగినాడు! పందుకోతికిని, కొండ మ్రుచ్చుకును పోరు పొసగినది! “భేష్! మంచి తమాషా!” అని మురిసిపోతిని “ఈ దండగులను నిర్జించుట అస్త్రదాదుల పనికాదు కావున, వారొకరినొకరు పచ్చడి చేసికొనవలె ననియే విధాత ఉద్దేశించియుండు”నని గ్రహించి, బ్రహ్మదేవునకు బహుశముల్లైన ధన్యవాదములొసగితిని. కోరచూపులూ, కారుకూతలూ, పండ్ల పటపటలూ, దడబడలూ చెలరేగినవి! కురుక్షేత్రయుద్ధమందలి మహారాజుల ద్వంద్వయుద్ధములు డైమార్ రాజు కళావరురాజుల పోరుముందు చచ్చు పెద్దమ్మలని చెప్పకతప్పదు. సహజముగ విక్రమశాలులేమో ఈరాజులు ఒకరికొకరు తీసిపోలేదు. పండ్లును, గోళ్లును అనిర్వచనీయపరాక్రమముతో ప్రయోగింపబడినవి! ఇరువుర మహాకాయములును గీరుకొనిపోయినవి! ఈ మహావీరులపై దివినుండి దేవతలింకను పుష్పవర్షమేలకురియింపకుండిరో నాకు బోధపడలేదు. నింగినుండి కరతాళధ్వనులైనను వినవచ్చినవికావు. దుర్నయము! కలియుగములో నిలింపులుకూడ కఠినాత్ములైరని మిగుల వగచితిని. ఇరువురు రాజులు వగర్చుచు కుమ్ములాడుచుండిరి. నల్లరాజును మించి ఎఱ్ఱరాజును, ఎఱ్ఱరాజనుమించి నల్లరాజును బలప్రదర్శనమొనరించుచు, ‘హు’మ్మనుచు ‘హూత్’ అనుచు పటువేగముతో ‘డీడిక్కీ’ కొట్టుకొనసాగిరి. అపుడు

లోపలినుండి డైమార్ మదామ్ తాటకివలె అఱచుచు, చీపురుపుచ్చుకొని విశేషసాహసముతో రంగస్థలమున ఆవిర్భవించినది! గిరజాలులేని డైమార్ జాకీ (మదాంరాజుల పుత్రరత్నము!) వంకరమూతిని మఱింత విఱిచి, ఎదుటివీరునిపై బెడ్డలు రువ్వసాగినాడు. గజాసురు డిక చోద్యము చూచుచు నిలువంబడలేదు. ఇర్వురు యోధులనడుమ బ్రవేశించి, బలముకొలది కళావరురాజును త్రోసినాడు. ఆత్రోపుతో వాడు గిర గిర దిరిగి తిరిగి, గుభాలున బొంబాయిస్టేషనుపై పడినాడు! పదంపడి డైమార్ రాజు గ్రుస్సుత్రిప్పుచు, ఉచ్చైస్స్వనముతో స్వీయపరాక్రమ మును మెచ్చుకొనుచు, రాజఠీవితో పెద్దంజలు వేయుచు, అంతఃపురమున ప్రవేశించినాడు.

బెడ్డలు రువ్విరువ్వి, కుఱ్ఱవాడు గుమ్మముముందు చతికిలపడినాడు. అచ్చముగ వాడు డైమార్ రాజుయొక్క చిన్నసంపుటము (Small edition) వలె నున్నాడు. పాపము కురుపులు వేసినవికాబోలు, వానితల కాయ అనాసకాయకు అన్నగారివలెనున్నది! తలవెనుక చింతకాయను బురుడించు ముడికలదు! చేరంతగల వానినొసట రూకంత గందపు చుక్క విలసిల్లుచున్నది! దానిపై అగ్నికణముబోలు బొట్టు అలరారు చున్నది. మిగుల తెల్లనైన వానియజ్ఞోపవీతము పోయి చిలమండను ముద్దిడుకొనుచున్నది! వానివయసు రమారమి పన్నెండేండ్లుండును. కందిన శరీరముతో వాడు మిరపపండువలె నున్నాడు. పద్మాసనము వేసి కొని మూతి మెలివేయుచు, గంభీరమైన ముఖవైఖరితో అత దేవో పనసముక్క లుచ్చరించుచున్నాడు. మేమాతని తేఱచూచుచున్నను, మమ్ము పరికింపక, అతడు తనధోరణిలోనే పడియున్నాడు. డైమార్ రా జపుడు పిడిగువలె నీవలబడి "ఈ బాబుజీల నింకా పైకి తీసికొనిపోలే దేమిరా కుంకా!" అని శాంపిలుగా(మాదిరిగా)ఒక చిన్ని మొట్టికాయను వాని తలకాయపై సమర్పించి, వంటింట బ్రవేశించినాడు. "కయ్!" అని వాడొక్క అఱపు యఱచి, మీదికి ఒక్క దూకు దూకి, మామ్రోల నిలిచి, "అయ్యలూ! రండి! పైకి రండి! దబ్బున! లేకపోతే పితాజీ హైరానం చేస్తారు" అనినాడు. మేము వానివెంటబడితిమి.

డైమార్కురాజు మేడ మిగుల విచిత్రమైనది. ప్రపంచమందలి రాజభవనములన్నియు నొకయెత్తు; అదొకయెత్తు! రాళ్ల దరిగాని, యిటుకలదరిగాని పోక, సౌధనిర్మాణమున డైమార్కు రాణీరాజులు అద్భుతమైన స్వతంత్రభావమును వ్యక్తపఱచిరి! తమ మహలును వెదుళ్లతో నిర్మించి, దానిపై దట్టమైన పేడను దిట్టముగా పూసిరి! దొడ్డదైన ఈపదార్థముయొక్క కోటింగును (పూతను) డైమార్కు మదామ్ స్వయముగా, అతి శ్రద్ధగా, తఱచుగా చేయుచుండునని మేడవాలకమే చెప్పక చెప్పుచున్నది. గంధవహుని ధర్మమాయని హర్మ్యమాహాత్మ్యము నిముసములో మాకు స్పష్టమైనది. పవిత్రమైన గోమయమున నుత్పన్నమైన వాసన పవిత్రతరమైనది; కావున దానినుండి కాలికొలది పరుగెత్తుట పున్నెమునకై చెవిగోసికొను సహజ సహానాకుశలులకు తగదని గ్రహించి, "ఇక లోపల ప్రవేశింతము రండు" అని మహోన్నత శరీరుడైన నామిత్రవరేణ్యునితో తెలిపితిని. కాని "మేడచూస్తే పిట్టవలె నున్నది! గజాసురుడో, పడమటికనుమలకు పెద్దన్నయ్యకదా! దానిలో నీతడు ప్రవేశించినయెడల దాని గతి యేమగునో దైవమా!" అని యడలితిని. మిరపపండు నామాంతరము గలజాకీ "ఆయియే! బాబూ సాబ్?" ("రండు! బాబయ్యా!") అని తొందరపెట్టుచునే యున్నాడు. ప్రాణములను గుప్పిటబెట్టుకొని అడుగువేయుచు ముందు గజాసురుని దారితీయ నిచ్చితిని. అడుగువేసినకొలది పైనదెలిపిన సమీరుని పవరు హెచ్చినది. సంయములకు ప్రాణాయామము అత్యంతావశ్యకమైనది! ఆముహూర్తమున మేము జోడుబోగులవలె తయారైతిమికదా! ఊపిరి బిగబట్టుట మాకపుడు తప్పనిసరియైనది! జగదీశుడు దయామయుడు కావున అప్పట్టున మమ్ముల నట్టు ప్రాణాయామమునందు ప్రవేశపెట్టినాడు! కంపులోపుట్టి పెరిగిన బిడ్డగావున మిరపపండు నిముసములో మేడమీదికి తుఱ్ఱుమన్నాడు. గజాసురుడు మెల్లమెల్లగా మెట్లపై అడుగులువేయుచుండెను! రామస్మరణమొనరించుచు, నే నాతనివెంట నడుగులు వేయుచుంటిని. పిడుగువడువున పైకప్పు ఏ ముహూర్తమున తలపై జారిపడునో యనియు, నే నీమహాభవనము నుండి తిన్నగా వైకుంఠమునకు టపాకట్టినయెడల నింటియొద్ద శారద

పని యేమగునోయనియు, ఎన్నోయాత్రలుచేసి, భయంకరప్రదేశముల నుండి పలుమారు భద్రముగా బయటబడి తుదకీ బ్రాహ్మణుని ప్రసాదమున నాజీవితచరిత్ర కీతీరున గద్యచెప్పవలసియుండుట దైవేచ్ఛయేమోయనియు, "చావున కెన్నిమారులో ఉండవు. ఈ మహాక్షేత్రమున నది లభించుట మహాభాగ్యమే!" యనియు, నడుముగట్టిన యోధుడనై అత్తఱి అట్లు అసువులను గోల్పోయినను చిరకీర్తిని పొందజాలుదుననియు, ఎట్లూహించినను, గోదావరితల్లి చల్లనితల్లి కావున తన యనుంగుబిడ్డపై కనికరించి, ఆపదనుండి ఈదీనుని కాపాడవచ్చుననియు పరిపరివిధముల తలబోయ దొడగితిని. అనుకొనినయట్లు ఆకృపావల్లి మాపాలిటనున్నది. కొంతసేపటికి మేము సురక్షితముగా పైన జేరుకొంటిమి. చేరినంతన నేమని వాకొందును! చీకటి మూడుమూటలై అచ్చట జేరినట్లు తోడనే మా కందు మూవుర వింతస్వరూపములు ప్రత్యక్షమైనవి! అంత గజాసురు డంతటివాడే ఉలికిపడినాడు! "ఈ మువ్వురును దివినుండిదిగి ఈసౌధాగ్రమున విడిసిన యక్షులో, కిన్నరులో, కింపురుషులో, గంధర్వులో, త్రిదశపన్నగ సిద్ధగరుడ చారణ విద్యాధరాదులలో నెవ్వరో యైయుండు" రని నే నూహించితిని.



# నా మహారాష్ట్ర యాత్ర

## ఆఱవప్రకరణము

"అయ్యలూ! ఏఊరు మీది?" అని మూవురనడుమ నలరారు వృద్ధుడు ప్రశ్నించినాడు. శబ్దము వాని నాభికమలమునుండి పట్టుద్రెంచుకొని ఈవలబడినట్లుండెను. ఆమహాశయుని శిరమున మెఱయు మేలిపాగా మిగులనెఱ్ఱనై ఆతని శరీరకాంతితో నెకసక్కెములాడుచుండెను. వానికి నెడమవైపున నొక సన్నని మనిషి చతికిలపడియుండెను. ఆతని వయసు నలుబదేండ్లుండును. కుడివైపున నొక యాడుది కలదు. పాపమామె మొగమున స్ఫోటకపుమచ్చలు దట్టమైయున్నవి. ఆమెయొడిలో తాటిపండువంటి బిడ్డ కలదు. గజాసురుడు ప్రత్యక్షముకాగనే శిశువు "బేరు"మని యేడువదొడగెను. పోరుపెట్టిన నిసుంగును తల్లి దూరముగ గొనిపోయినది. ఆతావున నాంధ్రమున ప్రశ్న వినవచ్చినంతన నేనెంతో యానందించితిని. "చెన్నపురి" యని ఉత్తరమొసగి వారియుదంత మడిగి తెలిసికొంటిని. వరంగలునుండి వారు యాత్రికులై అచటికి వచ్చిరట! ముసలివాడు నిజముగా వైశ్యకులమండనుడు. తక్కినవా రిరువురు దంపతులు—దేవాంగులట!

ఇంతలో మిరపపండు పైకి పరుగెత్తుకొని వచ్చి "పితాజీ వస్తున్నారు" అని నోటీసు ఇచ్చినాడు. డైమాక్ రాజు నిమిషములో హాజరై "స్వాములూ! తమహుకుం ఏమో సెలవియ్యండి. తీర్థవిధి జరపెదరా?" అని మమ్ముల నడిగినాడు. "తీర్థవిధి రేపు జరపెదను. నే డిచట దర్శింపవలయు ముఖ్యస్థానములను చూపుము" అని నే నంటిని. "ఒకప్పుడు బ్రహ్మకపాలమునకుపోతిని. అప్పటినుండి నేను శ్రాద్ధములు మానివేసినాను. ఇపుడు పిండప్రదానముతో నా కేట్టి ప్రసక్తియు లేదు." అని గజాసురు డనినాడు. "బ్రహ్మకపాలము వెళ్లిన నేమి? ఇది నూతనక్షేత్రము కాదా? తీర్థవిధిజరపిన జరపవచ్చును. నేనాక్రియగావింతును. కాని,దీనివిషయమై

రేపుకదా యోచించుట!" అని మిత్రునితో పలికితిని. "నే నేకపాలము నకు బోలేదు. వీనితో నట్లంటిని అంతే!" అని యాతడు నా చెవిలో చెప్పినాడు. "గోదావరిపుట్టినచో టేది? యాత్రికులకును, చరిత్రకారులకును ప్రధానమైన ప్రదేశము లెచటెచట నేవేవి యున్నవి?" అని హైమానురాజు నడిగితిని. "అదె అచట అగపడుచున్నది బ్రహ్మగిరి. అది మిగుల నెత్తయినదికదా! దాని నెక్కుట చాలకష్టము. గోదావరి ఆగిరి శిఖరమున పుట్టినది. కొండకు దిగువను కుశావర్తక్షేత్ర మున్నది. యాత్రికు లందే తీర్థవిధులు నిర్వహించుచుందురు. దాని సమీపమందే ఈశ్వరాలయ మున్నది. మావానిని మీకు తోడిత్తును. ఇపుడు కుశావర్తమున స్నానము చేసిరండు" అని తెలిపి అతడు మిరపపండును మా కప్పగించినాడు. "అయ్యలూ! మేంకూడా వచ్చేదా?" అని వరంగలువృద్ధు డడిగినాడు. "రం"డని మే మా దివ్యహర్మ్యమునుండి మెల్లగ క్రిందికి దిగితిమి. పాపము తాటిపండు ఇంకను పోరుపెట్టుచునేయుండెను. మాకు మిరపపండే మార్గదర్శకు డైనాడు. అచిరములో మేము కుశావర్తమును చేరుకొంటిమి.

అదియొక చిన్న చెరువు. ఇట్టి చెరువు లెన్నో నేడును నైమిశారణ్యమున గలవు.* తటాకమునకు నలువలంకులందును 'చక్కని మెట్లున్నవి.

* నైమిశారణ్యము నేడు 'నీమ్‌సార్' అను నామాంతరమున బరగుచున్నది. ఇది మిశ్రిక్ హత్యాహరణములకు నడుమ గలదు. వీని ప్రత్యేకప్రాముఖ్యమును విపులముగ నిందు వివరింపజాలను. సంయుక్తరాష్ట్రములందు బాలామావునుండి సీతాపూర్ పోవు రైలు మార్గమున నివి యున్నవి. హత్యాహరణమునకు మాత్రము వేణీగంజ్ స్టేషనునుండి కాల్నడకను పదిమైళ్లు పొలములగుండా పోవలెను. మిశ్రిక్ కడనే దధీచి తన వెన్నెముకను రాక్షసవధకై దేవతల కిచ్చినాడట! వెన్నెముక నిచ్చుటకు ముందాతడు భారతభూమిం గల మహాతీర్థములను సేవింపదలచినాడట! ఆతడందులకు గడంగినయెడల విశేషకాల మగుననియు, అంతదనుక దానవబాధను సహించుట సాధ్యము కాదనియు నదలి దేవేంద్రాదులు భారతావనియందలి పుణ్యక్షేత్రములను దధీచికై నైమిశారణ్యమందే తోడతెచ్చి నెలకొలిపిరట! వారియందు తానమాచరించి, అర్థించిన అమరులకు వెన్నెముక నిచ్చుటకై దధీచి ఆత్మార్పణము గావించుకొనెను. నేడును నైమిశవనమున నీక్షేత్రములు కలవు. చిన్నిచిన్ని సరోవరములు కాశీ, గయ, ప్రయాగ, అయోధ్య, మధుర, గోకుల, బృందా

మెట్లకు నెగువ నెత్తయిన అరుగులు గలవు. వీనిపై నలుతట్టులందు వసారాలున్నవి. యాత్రికు లరుగులపై చేరుచుందురు. చెరువునకు పడమర వైపున నొక నూయి కలదు. ఇందు నీరులేదు. ఇది కూపగయవలె నున్నది.* యాత్రికులు పిండములను దీనియందే విడతురు. కుశావర్త మునకు పైభాగమందే ఈశ్వరాలయ మున్నది. ఇందందు చిన్ని చిన్ని గుళ్లున్నవి. బ్రహ్మగిరిపై జనించిన గోదావరి కొండనుండి చాలువాటి ఒకచోట కన్నులబడి, వేరొకచో నదృశ్యమై కుశావర్తహ్రదమున బడుచుండును. సరస్సులోని సలిల మవ్వలికి ప్రవించుటకు దిగువ నొక ద్వారము కలదు. తటాకమున నీరు నిలువదు; కావున నది కడుంగడు శుభ్రమైయుండును. కుశావర్తమున కవ్వాల పూలుపండ్లు మున్నగు పూజాద్రవ్యములు లభించును. విపణివీధి అచటి కనతిదూరమందే యున్నది.

తీరమున కొంతసేపు నిలిచి సరోవరమును పరికించితిని. నిర్మల హృదయమునుండి యవిరళకవితాధార వెలారి బహుళమానసములను

---

వరము, ద్వారక మున్నగు పవిత్రధామములతో పరగుచున్నవి. కొన్ని గోమతీనదికి సమీపమునందే యున్నవి. మఱికొన్ని సుమారెరువది మైళ్లమేరలో నందందు గలవు. సుదర్శన చక్రవృత్తాంతమునకు సంబంధించిన చక్రతీర్థమందు గలదు. అదియు నొక కాసారమే! దానిలోతు నెవ్వరును కనుగొనజాలరైరట! అష్టాదశపురాణము లాపుణ్యభూమియందే పుట్టినవి. వ్యాసఋషి పరిష్వాసీమ కరిగెనను ఉదంత మందు లిఖితమైయున్నది. సూతాదిమహాఋషులందు నివసించిరి. పాండవులు కొంతకాల మూతావున వసించిరి. అందు మహోన్నతమైన మారుతివిగ్రహము కలదు. అచటికి కొంతదూరమున గోమతీగర్భమున రుద్రావర్తమున నీశ్వరలింగము కలదు. నీటిపై వేయబడిన బిల్వపత్రములను లోపలి గుండమందలి శివలింగ మాకర్షించుకొనును! బహుకారణములచే నైమిశభూమి కడుంగడు పవిత్రమైనది. ఏడాది కొకమా ఱందు గొప్పమేళా (ఉత్సవము) జరగును. "చౌరాశీ జాత్ర"కై బహుసంఖ్యాకు లచటి కరిగి విస్తీర్ణవనభూమిని చుట్టివత్తురు. అందలి వృక్షములుకూడ పూజింపబడుచుండును. వానియందు శ్రీవిష్ణువు వెలసెనని యాత్రికులు విశ్వసించుచుందురు. ఈయరణ్యమున మసలిన భాగ్యము నాకు చేకూడినది. ఈయాత్రను గుఱించిన విచిత్రోదంతములను చదువరులు వేఱొకగ్రంథముల విలోకింపగలరు.

*గయలో నిది విష్ణుమందిరమునకును, అక్షయ వటమునకును నడుమ నున్నది. ఇది టెంకాయలతో నిండియుండును. శాస్త్రదృష్టియందు దీని కెంతో మహత్త్వమున్నది. కాని దీనిలోపలిభాగము మిగుల నపరిశుభ్రమై యుండును. శోచనీయముకాదా?

తనుపులీల, చెర్వొకడుపునుండి గోదావరీధార స్రవించి అనేకకేదారములను తనుపుచుండును. కుశావర్తము వట్టి నీటిగుండమని నే దలపలేదు. కుశావర్త మనుడు, మానససరోవర మనుడు, హరిద్వారమందలి హరికీపౌరాలోని బ్రహ్మగుండ మనుడు, భీమగౌడ కడగల తటాక మనుడు, మఱి హిమగిరిపై వెలయు సూర్యకుండ మనుడు, ఖంఖల్*కడ విలసిల్లు సతీకుండ మనుడు, హాత్యాహరణ వైద్యనాథ మహాక్షేత్రములందునొప్పు సరోవరసమూహమనుడు, మణికర్ణికలోని కొలకనుడు, మఱేతీర్థమనుడు కేవలము జలరాశి యని నే నెన్నడు నమ్మియుండలేదు. నీటికై బహుయోజనము లరుగనేల? వ్యక్తికిగాని, వస్తువునకుగాని, భావమునకుగాని స్థలకాలముల దూరము విశేషమూల్యము నొసగును. శతాబ్దులందును, సహస్రాబ్దులందును మసలిమసలి అధునాతనవసుంధరకు గురుగంభీరపాఠమును గఱపు సంప్రదాయము, సంజీవిపోలు భావము నాత్మహృది నిడికొనునది కావుననే చిరంజీవియై విజ్ఞానుల జిజ్ఞాసకు నిత్యజీవన మొసగును. అత్మ అమరత్వముగల దందుము. ఎన్నెన్నో తీపితలపులు చేరి ఒక్క యమృతసూతియగులీల నెన్నెన్నియో భావములు కూడి ఆత్మయగును. మనుజులు పుట్టుదురు; గిట్టుదురు భావమో? ఇది మిత్తిగొంగ! కెందామరలనుండి యువ్వెత్తుగ లేచుభ్రమరగీతికవలె, విలయకాలశిఖిశిఖలనుండి మహత్తరభావము వెడలి తరువాతిసృష్టికి కన్నతల్లి యగును. సంప్రదాయ మనినంతన కనులెఱ్ఱజేయువా రెందఱెందఱో కలరు. చలనరహితమై, జీవరహితమైన సంప్రదాయముపై గోరినిలుపు టుచితము. మహిత భావమాయువుగా నద్భుతదీప్తుల వెదలించుచు వెలయు సంప్రదాయము, ఎన్నడో పుట్టినదైననేమి, యుగముల కేల్మోడ్పుల నందజాలును. తీర్థయాత్రలందలి సంప్రదాయము మహత్తరమైనదని నాదృఢవిశ్వాసము. దీనిని పరికించు విశాలవిజ్ఞానదృష్టియందు బహుశాభ్యుదయపరంపరలు నిహితమైయున్న వని నా తలంపు. తీర్థయాత్రలందలి ఫలితమును గుఱించి మహాభారతమందును,

* ఇది హరిద్వారమునకు దిగువ రెండుమైళ్లదూరమం దున్నదనియు, దక్షు డిందే యజ్ఞము నొనరించెనని, పలువురు విశ్వసింతురనియు చదువరు లెఱుగుదురు.

తక్కుంగల మహాపురాణములందును విచిత్రవృత్తాంతముల గాంతుము. ఉన్నవాని నున్నట్లుగ వీనిని జేకొనకున్నను, అంతఃసలిలములీల వీని యందు వెలయు అద్భుతసత్యమును ముగ్ధకృష్ణునట్లు నిజాంతరంగముల గైకొను టొప్పు. వెనుకటిదని సత్యము ప్రాతగిలునా? సత్యమునకు క్రొత్తప్రాతలున్ననా? సత్యము సర్వేశుడని గ్రహించి, దానికి సత్య నారాయణుడను నామాంతర మిడి, భారతమహనీయు లెన్నెన్ని యద్భుతములు నెఱపిరి కారు? సత్యగర్భితమైన సంప్రదాయము ఈశ్వర పీఠమందలి యఖండజ్యోతి కెనగానది. దీనికి జేజేలుపాడుటకు మాఱు ప్రాచీనమైనదని మొగములు చిట్లించుకొంటి మేని అంధకారమం దల్లాడి, గభీరాజ్ఞానకూపమున కూలబడుదుము. వినాశనమునకు నొదల నొగ్గు వస్తువులకు దాపురించు క్రొత్తప్రాతలను అవినశ్వరభావముల శిరములకు గట్టితిమేని ఆత్మనాశనమును "దూ! దూ!" యని పిలచిన వార మగుదుము; పుడమి చిఱుతప్రాయమం దున్నపుడే కెంపుకాంతు లట్లు తూరుపుదెసనుండి తళ్కొత్తిన విజ్ఞానమరీచులు మనకు కొఱగాని సరకు లగును. సనాతన మనినంతన చుట్టుమనుట పాడియా? భావభరిత సంప్రదాయము విశ్వహృదయమందే పునాదిగలదై, ఉత్తుంగకాలకుధర శిఖరమును చుంబించును. మహత్తరసనాతనభావము దేవదేవుని నాభి నుండి మృణాలమై వెడలి, ఎట్టి యద్భుతసృష్టిని పుష్పింపజేసినదో యెఱుగమా? వేదవిజ్ఞాన మీసృష్టిసముద్భవ దివ్యసౌరభమే కాదా? కాంతికిని, సౌరభమునకును ప్రాతక్రొత్త లుండుననువా డవివేకి కాడా? వీనికి ప్రాతక్రొత్తలులేనిచో వీనిని గనిన భావమున కుండునా? భావోపాసనము, కళోపాసనము, సౌందర్యోపాసనము, సత్యోపాస నము, ఆనందోపాసనము, ఈశ్వరోపాసనము నొక్క యుపాసనమే యని కంఠమెత్తి పలికెదను. భావము నారాధించువారే నిత్యసత్యవ్రతులు. "సత్యం, శివం, సుందరమ్"లను పరమాశయము లవినాభావసంబంధము గలవని రస్కిన్, కీట్సు మున్నగు పాశ్చాత్యరచయితలు తెలుపుటకు బహుయుగములకు మున్నే భారతమనీషు లెఱిగించిరి. ఒక్కజగదీశుని త్రిమూర్తులని పేర్కొందుము. ఒక్క మహత్తరభావమునే "సత్యం శివం సుందరమ్" లని పేర్కొందుము. "శాంతం, అద్వైతం, ఆనం

దమ్" లీభావశబలతలోనివే! భావారాధనమున నారితేటిన తపసి పదునాలుగు భువనములను పదునాలుగు పూవుచెండులన ట్లరచేత దాల్పగలదు. భావపూజయొసగు శక్తి ఎంతయద్భుతమైనది! ఈశక్తి కతననేకదా ప్రాచీనఋషులు సాహితీబ్రహ్మాండములను సృష్టించిరి! భావశక్తి, తపశ్శక్తి, ఆత్మశక్తి, అనిర్వచనీయశక్తి సుడీ! ఈశక్తికతన ప్రాచీనవీరులు విశ్వచ్ఛుబోలువారు ఫాలాక్షునిగూడ నోడింపజాలు ప్రజ్ఞనందిరి! ప్రాచీనమహిళలు కొందఱు అనసూయకెనయైనవారు ముగురమ్మలను గూడ మేలుబంతులైరి! సావిత్రిబోలు మహిమాన్విత యశస్తిలకలు మృత్యువునెదుర్కొని జయపతాకమును చేబూనిరి. నేటి విద్యావిధానము బాహ్యాభివృద్ధికి సంబంధించిన పరిజ్ఞానమునే మన కొసగుచున్నది. భౌతికశాస్త్రమునకే పట్టముగట్టినది! ఋజువున కందని ఆత్మసంచలనము, ఆంతరంగికమహత్త్వము, భావదార్ఢ్యము, ఆశయ శక్తి మున్నగునంశములు నవనాగరకులకు హృదయంగమములు కావు. ప్రతీచీసంస్కృతిలోని ఉచితాంశముల నెఱుగక, మేధామహిమపై గాక, జుగుప్సాగర్భితమైన కొండొకభావోచ్ఛిష్టముపై ('Intellectual refuse of the West')చూపునిలుపు వ్యక్తులకు దేవదేవునివలె భారత విజ్ఞానమొసగు అమృతకలశము పనికిమాలిన కుడితికుండవలె గోచరిం పదా? ఉచితానుచితములను పాటింపక, సద్విమర్శన మెఱుగక, జీవశక్తి గల కొన్నిసంప్రదాయములను వీరు బలాదూరనిరి. అవిశ్వాసమును, అనుచితపరిహాసమును వీరి సొమ్ములైనవి. మౌఢ్యమెంత భయదమైనదో, అవిశ్వాసమును అంత హానికరమైనదే! ఇట్టి యవిశ్వాసమును మది జేరనీకుండుటకును, మనసునకు భావశబలత జేకూర్చుటకును, జీవితాం గణమున క్రియాసఫలతగాంచుటకును, అనల్పమైన ఆత్మశక్తినలవఱుచు కొనుటకును, కనులువిప్పి ప్రకృతిగ్రంథమును పఠించి, మహిమోపేత ప్రాచీవిజ్ఞానలహరియందు జిజ్ఞాసువులు రాజహంసలై యీదులాడ వలెను. ప్రకృతిగ్రంథమును పఠించియే మన మహాకవులును, షేక్స్ పియరాదులును విజ్ఞానధనులై తమవిభూతిని సమస్త విశ్వమునకును సమర్పించిరి. విద్యార్థిజీవితమున దేశాటనప్రాముఖ్య మెఱిగియే మన ప్రాచీనులు అరణ్యస్థగురుకులములందే తమ విశ్వకళాపరిషత్తులను నెల

కొల్చిరి! ఆంగ్లకవులు తప్పనిసరిగ కొంతకాల మిటలీరమ్య ప్రకృతియందు వసించి, నవనవోన్మేషశాలు లగుచుండువారు. మననదులందును, సరస్సులందును, గిరిశిఖరములందును, వనములందును, పౌరాణిక ప్రాభవమును, చారిత్రిక ప్రశస్తిని పడసిన ప్రదేశములందును, వివిధ వైజ్ఞానికతీర్థములందును బహుకాలమునుండి పెల్లుబ్బు భావసలిలమును మనసార గ్రోలి ఆనందించుటకై నే ననేకమారులు దేశభ్రమణ మొనరించితిని. "భావాంబరవీధి విశ్రుత విహారి"ని కాజాలుదు నేమోయని ఆశపడియే దీర్ఘయాత్రలు సలిపితిని. కుశావర్తము నాకట్టెదుట భావబంధుర కాసారమై చూపట్టినది. పలుమారులు దివిజకల్లోలినియందు గ్రుంకులిడినపుడు నామనసు విహంగపతివలె దివిదెస నెగసిపోయినది. భావధునియం దీదులాడినపుడు నాయాత్మ జవోపేతముగ కాలపథమునుండి వెన్కకు జని, ప్రాచీమహత్త్వమున దీర్ఘమాడినది. అత్తఱి నేనందిన ఆనందమునకు మేర లేకుండెను. జ్ఞానద్రవమును ("ద్రుపద") దృష్టాంతీకరించు సలిలమందు గ్రుంకులిడినపుడే కాదు, ప్రకృతిశోభకును, ప్రాచీనదృశ్యములకును (అందును మహత్తరమనుష్యజీవితమునకును, మతమునకును సంబంధించిన వానికి) కను లప్పగించినపుడును నే నట్టి ప్రమోదము నందితిని. నా మానసాంజలియందు పరితోషమును ధారవోసిన తరుణము లెవ్వియో చదువరులకు తెలుపుచునే యుందును. ఆత్మను తనుపు లమృతము కావున, క్షణికమైన సుఖమునకు దిగదుడుపని, తొల్లింటిమునులును— మును లేకారు, రాజన్యులును వలసినంత ఆనందమునందుటకై వనని స్తబ్ధతయందు, వనరమగేహమున వాసము లేర్పఱచుకొనిరి. కుశావర్తమున స్నాతులమైనంతన, సుధాపూరితకలశము లట్లు తోడియాత్రికుల హృదయములు పరమానందముతో పొంగిపొరలినవని నే నూహించితిని. వారి యనుభవ మెట్టిదో యెఱుగనుగాని అదృశ్య జగదీశ్వరపద శబ్దమువలె ననిర్వాచ్యపరితోషభావము నిజాంతరంగమున మసలు చెఱుగుదును.

అనంతరము మే మాదాపుననున్న దేవమందిరమున కరిగితిమి. మహోన్నతమైనది కాదుకాని ఆలయము ప్రాచీనమైనది. కావున సాగర తరంగములట్లు ఉత్తాలపూతభావము లందు పరిఢవిల్లుచుండెను. గర్భా

లయము లోతుగ నున్నది. భూగర్భమునుండి గంగ పొంగి అందలి శివ లింగము నభిషేకించునని త్రియంబకవాసు లనిరి. అచ్చోటును జేరి ఆచిత్రమును దర్శింప మక్కువపడితిమి. బ్రాహ్మణులకే అచటి కరుగుట కనుమతి లభించునని గజాసురుని, వరంగలు మిత్రులను పూజారులు లోపల బ్రవేశింపనిచ్చిరికారు. ఈ యభ్యంతరమునకు మిగుల వగచితిని. "అస్పృశ్యుల" ప్రవేశమును గుఱించి కొంతకాలమునుండి ఆందోలనము జరగుచునేయున్నది. "అస్పృశ్యులకు" గాక తక్కుంగల హిందువుల కుత్తరహిందూస్థానమున నేయాలయమందు నెట్టి నిషేధమును లేదు. రామేశ్వరస్వామిని తాకుటకే యాత్రికునకు (అత డగ్రజాత్యుద్భవు డైనను) సాధ్యము కాదు. కాశీవిశ్వేశ్వరునకు స్వయముగ మనసార యాత్రికు డభిషేకము చేయవచ్చును. నిషేధపుటుత్తరువు మహా రాష్ట్రసీమయందలి ఈ ముఖ్యస్థానమున మఱింత కఠోరమై గోచ రించుటచే మిగుల ఖేదపడి పూజారులలో "ఈశ్వరపూజ సేయు టకు ప్రతిమానవునకును హక్కు కలదు కదా! నామిత్రులను ప్రతిఘటిం చుట అన్యాయముకాదా?" అని పలికితిని, "వీ రీశ్వరుని గొలుచుటకు పురోభాగమందలి చావడిలో వలసిన వ్యవస్థయున్నది." అని వా రనిరి. మిత్రులను వదలి గర్భాలయమున ప్రవేశించుటకు నామనసొప్పకుండెను. అందుండియే మహేశునకు ప్రణమిల్లి, నిష్క్రమించు టుచితమేమో యని యూహించితిని. పంచములకు ప్రవేశములేదని గాంధిజీ విశ్వేశ్వర సందర్శనముజేయుట కిష్టపడలేదని యెఱుంగుదును.ఒరులను వీడి వైకుంఠ మున జొచ్చుటకునొల్లకుండుట యటుండ 'నన్యులకై నరకమున లంఘిం తు'నని శ్రీరామానుజస్వామివలెనే శ్రీవివేకానందస్వామివచించెనుగదా! జిజ్ఞాసువునై, విజ్ఞానయాత్రికుడనై, చాల శ్రమకు లోనై నే నచటి కరిగి తిని. విహంగమువలె నెగసివచ్చిన మనసున కచ్చో నాశాభంగము కలు గునని, ఈశ్వరసమక్షమందే అట్టి విషాదపరిస్థితులు తలసూపునని తలప నైతిని. నాకన్నులనుండి నీరు జొటజొట రాలినది. నామనసునకు తగి లిన యాఘాతము నామిత్రులకు దగులలేదు. ఇచ్చగించినచో గజాసు రుడు తప్పక లోపల ప్రవేశింపజాలెడువాడు. మహేశుడుతక్క త్రియం

బకమం దాతనితో నిలిచి పోరజాలు మనుష్యుడు మఱెవ్వండును లేడు. "గర్భాలయమున ప్రవేశించి, తనంత దాను గంగాభవాని ఈశ్వరాభిషేకము జేయు చిత్రమేమో చూచిరం"డని గజాసురుడును, వరంగలు నెచ్చెలులును నన్ను బలవంతపెట్టిరి. నామనస్తాపము నీశ్వరునిమ్రోల వ్యక్తీకరించుటకై లోపలిగుడియందు బ్రవేశించితిని. బొమ్మరిల్లువలె నున్న చోటునందు నీర మల్లన నుబుకుచుండెను. మూడు మూలలనుండి సలిలము వెడలుచుండెను. మధ్యప్రదేశమున పల్లెరమట్లున్న తావున శివలింగముపై పవిత్రవారి వెలారుచుండెను. స్థూలకాయుడైన మహారాష్ట్ర విప్రు డొకడు (ఇతడు గర్భాలయమున నెట్లు ప్రవేశించెనో తెలుపగలవారెవరు?) మహేశునకు దట్టముగ చందన మలంచుచు, నాచేతికి కొంతగంధ మిచ్చినాడు. అందులకు సంతసించి స్వామికి దానిని బూసి, భగవంతునిమ్రోల సాగిలపడి "తండ్రీ! ఇట్లొనరించుటకు నీతనయులందఱికిని అధికారము కలదు. ఈభాగ్య మెల్లరకు చేకూర్చుము. పూజారుల హృదయమందలి మౌఢ్యమును ఛేదింపగలవాడవు నీవుగాని శాసనసభలు కావు" అని యంతరంగమున నని, కొంతసే పందుండి, అనంతర మవ్వలి కరిగితిని. మిరపపండుతో గలిసి అచిరములో మేము బస జేరుకొంటిమి.

అప్పటికి అపరాహ్ణము రెండు గంటలు కడచెను. అంతదనుక నే నెట్టి యాహారమును దీసికొనలేదు. నాసికలో బస్సుకడ గజాసురుడు ఫలహారము గైకొనినాడు. ఎట్టి యాత్రాస్థలముల కరిగినను, కొందఱు కొందఱు ఉత్తరహిందూస్థానీయు లుదరములు పూరించియే స్నానమొనరించుట నే నెఱుగుదును. హరిద్వారమున కొన్నేండ్లకుమున్ను జరగిన కుంభమేళమహోత్సవసమయమున నాతో ముకుందదాస్, కృపారామ్, దమ్మోర్, డగ్గిర్లను మార్వాడీవ్యక్తులుండిరి. నాడు (ఏప్రిల్ 13, 1927) అపరాహ్ణమొంటిగంట దాటినమీదటగాని కుంభమేళ పుణ్యముహూర్త మాసన్నము కాదు. స్నానసమయ మదియే! నాతో నుండిన మిత్రులు పదిగంటలు కాకమున్నే పొట్టలను చపాటీలతో నింపి,

నాముందు "పక్కీరసోయికి" *సంబంధించిన పూరీల దొంతరను పెట్టిరి. అత్తఱితి వానిని నే నొల్లనందులకు వారు కినిసిరి. "అనవరతము మెక్కుచునే యుందుము నగరములందున్నట్టి ఆత్మసంయమము నభ్యసించుటకు చక్కని తరుణములు లభింపవు. ఇంచుక మతావేశ మున్నగాని సంయమగుణము—సంయమ గుణమే కాదు మహాగురుగుణమైన నలవడదు. ఇట్టిగుణముల నలవఱుచుకొనుటకు వలసిన శిక్షణమును మానవుల కొసగుటకును, పెక్కు ఇక్కట్టులను మొక్కవోని విక్రమమున నెదుర్కొని, ఉత్తుంగశిఖరమున వెలయు భాస్వదాశయమును జేరుట కాతని కెంతో సామర్థ్యము జేకూర్చుటకును తీర్థయాత్ర లుద్దేశింపబడినవి.† పండ్రెండేండ్లకు నొక్కమాఱు వచ్చు పవిత్రముహూర్తము నాశించి,

---

* "పక్కీరసోయి", "కచ్చీరసోయి" అను రెండువంటకములు ఉత్తర హిందూస్థానీయులందు ప్రసిద్ధములు. పుల్కాపప్పుయన్నములు "కచ్చీ"కి సంబంధించినవి. పరోటా, పూరి, సాగ్ లు "పక్కీ"కి సంబంధించినవి. వీనిని వైశ్యులు చేసినను, బ్రాహ్మణులు తిందురు. బ్రాహ్మణస్త్రీలు "కచ్చీ" పదార్థములనుగూడ భుజింతురు.

† యాత్రలందలి మహత్తరోద్దేశమును భారతీయులు గుర్తించినట్లు మఱెవ్వరును గుర్తింపలేరు. వ్యక్తిగతజీవితమునకును, సంఘజీవితమునకును తీర్థయాత్రలను లగించి, హిందూమతము భారతీయులకు సర్వతోముఖాభివృద్ధిని ప్రసాదించినది. ప్రాచీనభారత యాత్రికులలో నగ్రగణ్యు డాఖండలసూనుడు! కఠోరనియమపాలనార్థ మాతడు జడదారియై భూప్రదక్షిణ మొనరించినాడు. నరులం దాతడుత్తముడు! సంయమీంద్రులను మించిన మహాసంయమి! బదరికావనమున నారాయణునితో నుగ్రతప మాచరించిన మునికుంజరుడు. ఆత్మవిజయమందిన విజయుండు! పరమార్థమును చేబట్టిన ధనంజయుండు! దేవదత్తమును పూరించిన మహాత్ముడు! నిర్గుణోపాసకులందు శిరోమణియై జగదీశునకు నెచ్చెలియైన భాగ్యశాలి! విశ్వరూపసందర్శనమందిన అదృష్టవంతుడు! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున భగవద్గీతాప్రబోధమందిన పుణ్యమూర్తి! ఈశ్వరునకొక్క యడుగు మాత్రము వెనుకనుండి తీర్థసేవవలన, క్రమతపనుకతన ముక్తినందె, దివ్యబృందావనమున వంశీధరునితో నాటలాడిన క్రీడి! భారతమును, భగవద్గీతను విమర్శకదృష్టితో పరికించిన యెడల మన కీవిషయములు విశదమగును. "విజయవిలాసము"ను తెలిసినంతన పార్థుని ఆధ్యాత్మికవిజయోదంతము కనుల బడునని ఆశపడుదుము. పూలరాశిబోలు చామకూర వెంకటకవికవితలోని నుడితేనియలందు పూతభావధార చాలంగాఱునని యాశింతుము.

శ్రమించి, యింతదూరమరుదెంచి కడుపుకక్కుఱితికి దాసులమగుట తగునా?" యని నే నపుడు నామిత్రులను మందలించితిని. వారి హృదయములు మాఱినవి. మర్నాడు నావలె వారును, వారితో యాత్రార్థమరుదెంచిన పావనగుణశోభిత లక్ష్మీబాయిసోదరియును ఉపవాసములు చేసిరి. నేను త్రియంబకమున నావెంటనున్న మిత్రులు నాపద్ధతి ననలంబింపవలెనని నా యాశయము కాని, వారు చిత్తమువచ్చినచొప్పున నాచరించిరి.

---

కాని గ్రంథమున బ్రవేశించినంతన మన కెదురగునది దురంతమైన యాశాభంగము. "గోకర్ణభూప్రాంచద్ధూర్జటిఁగొల్చి, పశ్చిమసముద్రప్రాంతపుణ్యస్థలుల్ గంచున్ బోయి ప్రభాసతీర్థమున వేడ్కం గ్రీడించిన క్రీడి" యాతడు స్త్రీలోలుని చేసి వదలినాడు 'భుజమూలరుచుల్ ఝళుంఝళయంటలో గలుగుమిటారి జూచుటే కాని" ఆతనికి మఱిదేనిమీద 'నపేక్ష యొకించుకేనియును" లేదట! తన మనసులోని సరకును చామకూరకవి మహాసంయమికలకు గట్టినాడు. ఆత డర్జునుని గుర్తించిన అదృష్టవంతుఁడు కాడు.

ప్రబంధకవులును, వారికద్దలి నిలువేలుపు జేసికొనినవారును పచ్చిశృంగారమునకు క్రీతదాసులైరి. వాల్మీకికాళిదాసులు వెలారించిన శృంగారరసమందలి అద్భుతయాధ్యాత్మికభావములను వారు హృదయంగమ మొనరించుకొనిరి కారు. సానుమంతశిఖరము మీది జలధార,—ఏకొందఱు మహనీయులకో దృగ్గోచరమగు జలధార వెల్లువయై, పాయపాయలై సుదూరమందలి విస్తీర్ణకేదారములను తనుపులీల, ఉపనిషచ్ఛిఖరములపై నుదయించిన భావధార,—ఘనతరతాత్త్వికదార్ఢ్యముగల మహనీయులకే మానసగోచరమగు భావధార భారతమహాకావ్యమున జొచ్చి బహుళసంఖ్యాకుల యాత్మల దనుపుచొప్పున, గురుగంభీరతత్త్వశాస్త్రమాడమున జనించిన భావధార విశాలసాహితీవిశ్వమున స్రవించి, పామరహృదయముల దనియించునని యీకవులు గుర్తింపరైరి.

కవిత్వమునకును, తత్త్వశాస్త్రమునకును, మతమునకును, ఆత్మకును అవినాభావసంబంధ మున్నదనియు, ఆధ్యాత్మికశక్తి నది యాత్మహృది నిముడ్చుకొనినదనియు గుర్తించినవారు మనవేలలో నెందఱో లేరు. శ్లేష, ఆశుకవనము, అవధానము కవిత్వమహత్త్వమును ప్రకటించునవనునభిప్రాయము చాలకాలమునుండి ఆంధ్రావనియందు విజృంభించుచున్నది. ఇవి పాండితిని, మేధాశక్తిని మాత్రమే వ్యక్తపఱచునుగాని కవితాశక్తిని, సహజశక్తిని గాదని నొక్కి చెప్పుదును. శ్లేషతో నొకరేమేమో చదివినంతన "అహాహా! ఓహోహో!" అని పలువురు తలలూచుట పలుమాఱు చూచుచుందుము. "మానవజాతిగొఱ్ఱెలమంద" ("Mankind is a flock of Sheep") అనికదా

డైమార్ రాజుకొంపలో చతికిలపడిపోయిరి. ఇక నేచటికిని రాజాల మనిరి.

దేశభ్రమణమున నెదుటివారిని గుర్తింపక తోడ గొనిపోరాదు. ప్రకృతియందును, శారీరకస్థితియందును మనకు సరిపడు వ్యక్తులే తోడి యాత్రికులై యుండవలెను. జిజ్ఞాసయందు,-విజ్ఞానపిపాసయందు మనకు

---

కర్షియులు తెలవిసాదు. నూటికి తొంబదుగురు మూర్ఖులనిగాదు జాన్ స్టూవర్ట్ మిల్ (Vide J. S Mill's "*U iltiarianism*"). విమర్శకదృష్టి ఎందఱికి గలదు? భావశాశక్తికి బహుయోజనములదూరమందున్నను, పలువురు పద్యములల్లుచుందురు. ఇవి "పంచరత్నము"లనియు, "నవరత్నము" లనియు పిలువబడుచుండును. నత్తగుల్లలనుమూటగట్టి, మంచిముత్తెములని చక్కని చీటిని (Hand-bill) దానికి కట్టి మొఱకులను మోసగించువారెందఱో కలరు. బిరుదులు, శాల్వలు, కట్నములు, సంచులు వీరి సొమ్ములు నిప్పుచ్చురమున దిగబడినవీరికి కొంతయండ యేర్పడుచున్నదని సంతసింతురు; కాని, ఆత్మను తనుపు కొండొక మహత్తరభావమును తమ కవితయందు చూపనంతవఱకు, సభ్యజగతిచే తన్మయనృత్యము చేయింపజాలు ఒక్క సహజగంభీరభావమును వీరు వ్యక్తపఱుపనంతవఱకు వీరిని కవులని తలచుట తప్పని ఎలుగెత్తి చెప్పుదును. కవిత్వమొక రాష్ట్రమునకును, ఒక జాతికిని, ఒకసీమకును, ఒక కాలమునకును మాత్రమే చెందినదని తలపరాదు. అది విశ్వమానవకల్యాణమునకై తోడ్పడునది. ధరిత్రిని పవిత్రమొనరింపజాలునది. "భౌతికశాస్త్రవేత్తలెందఱో ఉన్నారు. వీరి పరిశోధన లన్నోకీతుల దుర్వినియోగము గావింపబడు చున్నవి. నేడు పలువురుకవు లక్కఱయైయున్నారు. వీరికతన జగతి బాగుపడును" అని 1936 సంవత్సరమున జూలై 25 వ తేదిగాడు జరగిన సామ్రాజ్య విద్యామహాసభయందు ఆంగ్లసీమలోని నాటిప్రధానమంత్రి బాల్డ్విన్ వచించుట మందెవహాము. ఇట్టి మహత్తరోద్దేశమునకై తోడపడు కవులెంధ్రవసుంధరయందెపు డుదయింతురోగదా! ఈ యంత్రమాశయమును చేరవలెననిన కవిత్వమును గురించి, సాహిత్యమును గురించి నేడు విశేషముగా మన నేలలో వెల్లుబడియగుచున్న భావములు తుత్తునియలు కావలెను. ఈ భావములకు పలువురు విద్యార్థులే దోహదమొసగుట శోచనీయము. ఈమహనీయులు వివిధ జీవితాంగణములందు మేలుచేతురు కావచ్చును. కాని ఆదర్శసాహిత్యమును గురించిన పరిజ్ఞానము వీరిలో బండినున్నయని వీరిగ్రుడ్డి పొగడ్త చెప్పక చెప్పుచున్నది. గురుగుణమునకు సాగిలపడువాడు మహాత్ముడు. ఇతడు క్షుద్రాంశమునకు నంజలి ఘటింపడు. ఘటించిచో నీతడు గుణతత్వమెఱుగని మూర్ఖుడనియో, క్షుద్రాంశములనే కాంక్షించు

దీసిపోనివారే అత్తటి మన నెచ్చెలులై యుండవలెను. కష్టనిష్ఠురముల నోర్చి, మహోత్సాహమున ముందటికి లంఘింపజాలువారే, పరిచర్య చేసి పరిచర్య చేయించుకొనగలవారే ఆయవసరమున సన్నిహితులై యుండవలెను. ఈనియమమునకు చెఱుపువచ్చెనేని, భ్రమణోద్దేశము భగ్నమై పోవుట తథ్యము. మనసునకు దురంతయాతన కలుగుట నిక్కము.*

ఇక నేచటికిని రాజాలమని చతికిలపడిన మిత్రులను ముంగడకు త్రోయుట కిచ్చగింపనైతిని. వారికతన నాపూనికను నేబుటుక్కున ద్రెంచు

---

దుర్మతియనియో గ్రహింతుము. విమర్శకుని ఆంతరంగిక గ్రథన మెట్టిదో యాతనినుడువులే తెలుపును. ప్రతిదానికి తలయూపు విమర్శకుడు గంగిరెద్దునకు జ్యేష్ఠభ్రాత యనిపించుకొనును. సద్విమర్శనము తలసూపినపుడే కుకవులు వెన్కబడి, సుకవులు ముంగడకు వత్తురు. పరస్పర ప్రశంసలును, ఆశ్రయించిపడసిన సన్మానములును తాత్కాలిక ప్రమోదమునే ప్రసాదించును. మనమేమో, మన ఘోషయేమో యని కాలము గడపితిమేని మనమెల్లపుడును వెన్కనే పడియుందుము. అన్యరాష్ట్రములవారును, అన్యదేశములవారును, అన్యయుగములవారును మనసాహితిని, మన వ్యక్తిత్వమును మెచ్చవలెననిన, సభ్యజగతియందు మన సారస్వతమునకు మహోన్నతస్థానము చేకూరవలెననిన దాని నుత్తమాశయములకు సంధించి, మహత్తరకళాసూత్రములను నిర్వచించి, జిజ్ఞాసువులకు మనము సద్విద్య గఱపవలెను; నిక్కంపు విజ్ఞానయాత్రికులను, సాహిత్యోపాసకులను, కళారాధకులను, నిర్మలచారిత్రులైన ఆనందవ్రతులను పృథ్వీరంగమున నిలుపవలెను.

* ప్రతికూల ప్రకృతులవారితో పయనము సాగించుదురదృష్టము నా కపుడపుడు లభించినది. లాహోరరుదెంచి, అచటికి ముప్పదిరెండుమైళ్ళదూరమందున్న అమృతసరముపోవు టెందులకనియు, జలియన్ వాలాబాగ్‌ను చూడవలసిన దేమియనియు, బంగారుగుడియందలి గొప్పతన మేమనియు వచించిన వ్యక్తియును, ఆగ్రాస్టేషన్ ప్రక్కనుండి రైలులో పోవుచునే తాజ్‌మహల్ కొన జూచి సంతృప్తినందిన జిజ్ఞాసువును, మున్నూఱేండ్లకు మున్ను లాహోరు అమృతసరములకు నడుమ షాజహాన్ సమ్రాట్టు పెంపొందించిన షాలీమార్ మహోద్యానమును (ఆ మార్గమునుండి పోవుచునే) చూచెడిదేమి యనిన మహాశయుండును, వారణాసి వచ్చి అచటి కేనుమైళ్లదూరమందలి సారనాథమును చూచు టెందులకనియు, అశోక స్తంభమునుగాని, బౌద్ధవిహారపరంపరను గాని, స్తూపమునుగాని మ్యూజియమునుగాని గాంచిన నొడిబడునదేమనియు బలికిన ఘనుడును, గయకు చనుదెంచి, బుద్ధగయకు పోవ నక్కఱ యేమనియు, పెషావరునుండి వచ్చుచు మార్గమందలి తక్షశిలను చూడవలసిన దొడ్డయవ

కొన బూనుకొనలేదు. ఒంటరినై బ్రహ్మగిరి శిఖరము నెక్క నిశ్చయించి, తోడనే యాదిక్కుగ సాగిపోతిని.

తెరువున బలిష్ఠకాయు లిరువురు డోలీని బుజముల నిడికొని నా కెదురైరి. డోలీలోనికి దయచేయుడని వినయపూర్వకముగ నన్నాహ్వానించిరి. అపరాహ్ణము! మూడుగంటలవేళ! కుక్షిలో నేమియును పడవేయక గోదావరి జన్మస్థానమును వీక్షింపవలెననియు, చీకటిపడకమున్ను గిరిశిఖరమునుండి దిగి రావలెననియు నుద్దేశించితిని. డోలీలో చతికిలపడినయెడల, శ్రమయుండకనే పోయెడిది. కష్టపడవలసినచోటున, చెమ్మటలోడ్చవలయుసమయమున సుఖమును చేగొన గాంక్షించితిమేని, అది

---

సరమేమనిన్నూ, ప్రాచీననాగరికతను గుఱించిన ఘోష కడుపును నింపునా యనియుం వచించిన ధీశాలియుం, హృషీకేశమువఱకు వచ్చి యచటికి మూడుమైళ్లదూరమందున్న లక్ష్మణఝూలాను జూడబోవు టెందులకనియుం, బొంబాయి చనుదెంచి, మలబారుగిరిని జూచు టెందుకనియుం, దాని తాతకొండలు తనయూర నున్నవనిన జిజ్ఞాసువును, కాశీ విశ్వేశ్వరుని మ్రోలసాగిలబడినపుడు పకపక నవ్వి, అది మూఢాచారమని గేలిచేసిన సహృదయుండును, అయోధ్యవచ్చి పెండ్లాముబిడ్డలకై తల్లడిల్లి పెద్దపెట్టున రోదన మొనరించి మంచముఁగట్టి రేయింబవళ్లు పీడించి, తనను వెన్కకు గైకొనిపొమ్మని ప్రాణములుతీసిన ధైర్యశాలియుంను, తంజావూరునకు కొంతదూరమందున్న మహిళకోట నుండియరుదెంచి గయలో తారసిల్లి, (ఈతడు తమిళుడు. వీనికి హిందీగాని, బంగాళీగాని, తెలుగుగాని, ఇంగ్లీషుగాని రాదు. ఆసమయమున తమిళమున నాపరిజ్ఞానము శుద్ధశూన్యము. ఈతనితో నేను వేగిన విధమును పరాత్పరుడెఱుగును) తోడవత్తునని తెలిపి, మధుపురవైద్యనాథములకు చనుదెంచి, జనసమూహ మధికమైయున్నదని యడలి, శివరాత్రినాడైన నీశ్వరసందర్శనము నభిలషింపక, అనువుగానిచోటున నన్నమును, సాంబారు, ఇడ్లీ, కూటు, రసములను సంస్కరించుచు వానికై వాగిలినన్ను బాధపెట్టినవాఁడును, ఫ్రాంటియరు ఎక్స్‌ప్రెస్‌లో మూడవతరగతిపెట్టెలు లేకున్నను, ఆశ్రేణిటిక్కట్టునే కొందునని పట్టుపట్టిన స్థితప్రజ్ఞుఁడును, అక్కఱకుమాలిన వెచ్చము చేయుంచు, తనయక్కఱలకై నాపైబడిన మహోదారుడును, టిక్కట్టుకొనుటకుగాని, కూలివానిని పిలుచుటకుగాని, చిన్నిమాటను చేయనుటకుగాని కొఱగానిమహాశయుండును, అనవరత మెవ్వరితోనైన తప్పక కలహించెడుయోధాగ్రేసరుడును, ద్రుతగతి జనవలయుతటి గాఢనిద్రయందు నిమగ్నుడైనకలియుగకుంభకర్ణుడును, ఇంకను రకరకములవారును పెక్కుపయనములందు నాకు దాపురించిరి.

తప్పక రోతపుట్టించును. ఎండబడకున్న నీడలోని హాయి నందగలమా? కష్టమున కనుంగుబిడ్డగాని సుఖము సుఖమే కాదు. అనవరతము కిరీటధారియై మాంధాతవలె సుఖ మెదురగుచో, తనంతదాను చుల్కనయగును.

ఇంద్రియములకు నెచ్చెలియగునది సుఖము. ఆత్మకనుంగు చెలిమికత్తె కష్ట మందును. ఆత్మదృష్టి అనవరతము ఉన్నతాశయములపై వ్రాలియుండును. మల్లికలనట్లు వీని నందుకొనుట కది ఎంతేని తపించును. రవిదెసజనుచ్ఛక్తి వెలుగున ప్రవేశించునట్లే, మహోన్నతోద్దేశము దెస నరుగు ప్రాణి వెలుంగు నందకమానదు. కాంతిని, శాంతిని అందినంతన నాత్మ యానందపూరిత మగును. తా నాహ్వానించిన కష్టమే తన కానందభిక్ష పెట్టునని అది యెఱుగును. తపసులోని మహత్త్వమును, కష్టమందలి పటుత్వమును గుర్తించునది ఆత్మగాని ఇంద్రియములుకావు. ఇవి చెప్పినట్లు నడచుకొను మానవుడు కొంతసుఖమందును. నిజమే! కాని, సుఖించు సమయమున (క్రమగతినుండి తప్పి జారితి నని వీని యాత్మ పొగులును కావున) నీతని యంతరంగము దురంత యాతనలపాలబడును. అంతరంగమున నగ్గిరవుల్కొనుచుండ నొడలిమీది మంచిగంధము సిగ్గును, దుఃఖమును కలిగింపదా? చిరాభ్యుదయమును, ఉత్తమోద్దేశసిద్ధిని, ఆత్మానందమును వలచినవ్యక్తులు అక్కఱైన మెట్టులని ఇక్కట్టులను చూచి మురియుదురు. జ్ఞానపిపాసువును, విజ్ఞానయాత్రికుడును, చిరపథికుడును ఇట్టి సోపానముల నెడనెడ గాంతురుంతురు. పథికునియాంతరంగికశక్తిని, జ్ఞానపిపాసను, వజ్రసంకల్పమును, ఇచ్ఛాశక్తిని, నిశ్చయబలమును, స్థితప్రజ్ఞను పరిశీలింపనెంచియే జగదీశుడు వీనికట్టెదుట పెద్దకొండను నిలుపును. జాన్ బనియ నను కంచరి బెడ్‌ఫర్డు కారాగారమున పండ్రెండేండ్లుండి, ఈ యంశమును దృష్టాంతీకరించుటకే "యాత్రికునిగమనము" ("*The Pilgrims Progress*") అను తనయుద్గ్రంథమును లిఖించెనని నా యుద్దేశము. కుధరశిఖరము నెక్కుటకు జంకి, అనాయాసముగ బ్రక్కతెరువులజనిన అభాగులిరువురును అంధకారమందును, ఆత్మనాశనమందును కూలబడ లేదా? మత్తవేదండమును మార్కొనుసింహడింభ

కమువలె మూఢవయాత్రికుడు (క్రైస్తవుడు) కొండ నెదుర్కొని నాడు. మార్గమధ్యమున అపల్లొనియన్‌తో పోరాడినాడు; పట్టు వదలక గమ్యస్థానము దెస సాగిపోయినాడు. తుదకాతడు సౌమనస్య సౌందర్య మాధుర్యములకు నిధానమైనసురపురమున జొరలేదా? బనియన్ మొన్న మొన్నటివాడు. ఈతడు జన్మించుటకు బహు సహస్రాబ్దులకు మున్నే భారతీయులు యాత్రయందలి ఆంతరంగికార్థమున కవగతులైరి. మహిమాఢ్యమైన యాత్రలక్ష్యము నొక్కొకపుణ్యతీర్థమున స్థాపించిరి. సాహిత్యక్షేత్రమందును, జీవితాంగణమందును అదియొక్క ముఖ్యఘట్టమాయెను. ప్రతీచీమేధావులు అందే "పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్" నవలోకించి ధన్యులైరి. భారతసాహితి కేవలము పఠనమునకేగాక నిత్యానుష్ఠానమునకై కూడ ఉద్దేశింపబడినది! భారతసాహితి కేవలము వినోదమునకొఱకే కాక ఆదర్శజీవిత విధానమునకై కూడసృష్టినందినది !! భారతసాహితి కాలక్షేపమునకు మాత్రమేకాక మనుష్యహృదయమును ముక్తిమందారము దాపున జేర్చుటకై కూడ తలయెత్తినది!!! భారతసాహితి రసానుభూతి నొదవించుటకేకాక పఠితలనమృతపుత్రుల జేయుటకై కూడ పృథ్వీపీఠస్థలినలంకరించినది!!!! ప్రాచీ సాహిత్యమందలి గంభీరాశయములను, గభీరభావములను గనజాలక "ఇది అసాధ్యములకు, మితిమీఱిన విస్తారములకు ఆలవాల" మని పాశ్చాత్యనాగరికతావాతూలమున బడి కొట్టుకొనువా రందురు. కనుల కగపడు బ్రదుకే మానవుని సంపూర్ణజీవితమని వీరి తలంపు. ఆర్థిక, రాజకీయ, సాంఘికజీవనమునకు నాయువు వోయునది యాధ్యాత్మికజీవనము. ఆత్మశక్తి అద్భుతమైననాడే మనసును, ఇంద్రియములును, శరీరస్థ యంగప్రత్యంగములును తమతమ పనులను కడుంగడు చక్కగ నెఱవేర్చును. ఆధ్యాత్మికశక్తి అనూనమైనపుడే ప్రత్యక్షజీవితము—అదివ్యక్తిగత జీవితమైనను, జాతిజీవితమైనను మహిమోపేతమై, నవనవోన్మేషమై తనరును. కావుననే మనకవులీశక్తివృద్ధి నుద్దేశముగా గొని తమ కృతులను రచించిరి; బాహ్యార్థమునే కాక, ఆంతరంగిక జన్యమునుకూడ వారు చూపిరి. కురుక్షేత్ర మెచ్చటి ప్రధనము? చారిత్రకదృష్టితో పరికించిన నది బాహ్యభండనమే! తాత్త్వికదృష్టితో విలోకించిన, నది

యాంతరంగికరణమని తెల్లమగును. ఈ యాలమందే, ఈ నిష్కామ కర్మయందే "భగవద్గీత" సృష్టిగాంచినది. ఈశ్వరకటాక్షమును కవచము కావించుకొని ఘోరారిష్టములను మార్కొను నరుడు విజయుడును, ధనంజయుడు నగును. ధర్మక్షేత్రమున నిలువంబడి విషాదయోగము నభినయింపక, నిజయత్నమను గాండీవమును నిజోద్దేశము దెస నెక్కు పెట్టు వ్యక్తికి కష్టపరంపరలు లొంగి, ఆతనిచేతికి జయపతాకమిచ్చి, వానికూడిగముచేయును. తత్త్వశాస్త్రమునకును, మతశాస్త్రమునకును, మనుష్యాత్మకును, ప్రత్యక్షానుష్ఠానమునకును సంబంధించిన "భగవద్గీత" భారతీయుల ప్రత్యేకదృష్టిని, సారస్వతసృష్టిని వసుమతికి వ్యక్తపఱచినది. ఈశ్వరశక్తి నాత్మ జీవితరచనమున విజృంభింప జేయగలవాడే, సృష్టికర్త కాజాలునాతడే గ్రంథకర్తయగుట కర్హుడు. ఏమేమో యఱచి పదుగురను పకపకలాడింప గలవాడు గారడివాడగునుగాని సాహిత్యోపాసకుడు కాజాలునా? సాహితియందు దివ్యమరీచుల నీను నాత్మశక్తినే మన ఋషికవులు ప్రతిభ యనిరని నాతలంపు. దీని నలవఱచుకొనుటకే విజ్ఞానయాత్రికుడు తపించును. తపసన జడలు పెంచుకొని, ఎందో ముక్కుమూసికొని చతికిలపడుట కాదు. అది నిరంతర కృషి. గ్రంథపఠనమువలన చేకుఱునది పాండితియే! ప్రకృతిపఠనము వలన, పరిశీలనమువలన, భావనమువలన, ప్రత్యక్షానుభవమువలన, ఆదర్శదృష్టాంతమువలన, సదుపదేశమువలన, ప్రతిభాప్రజ్ఞలవలన, మనన నిదిధ్యాసనములవలనగాని ఈతపసు పూర్ణము కాదు. యాత్రకతన నిందలి బహుళాంశములు మానవునకు పట్టుబడును. యాత్రికుని లక్ష్యము "పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్" లో సువ్యక్తమైనదికదా! పథికునిగతి ఉద్యోగములకొఱకును, సద్యోగములకొఱకును ఉద్దేశింపబడలేదు. అది ప్రతిభాసంపాదనకు, ముక్తిలాభముకొఱకు నుద్దేశింపబడినది. ప్రపంచ పథికుల చరిత్రములను, ముక్తిదూతలవృత్తాంతములను విమర్శక దృష్టితో పరికించితిమేని, మన కీయంశము స్పష్టమగును. విజయుడును, ప్రతిభావంతుడును, గమ్యస్థానము జేరిన యాత్రికుడును, ముక్తినందిన తపస్వియును సాహితీవసుంధరయందు వేర్వేఱు వ్యక్తులుకారు. మన కొండలును, మననదులును, మనవనములును, మనసారస్వతవిశ్వ

మందలి వివిధఘట్టములని, ఇవిజీవసహితములు కాక పరమాశయముల దెస మానవయత్నమును దోకొనిపోవు శక్తులని ప్రాచీనకాలమందలి మనసాహిత్యోపాసకులు గుర్తించిరి; తారాగ్రహశీతాంశువులనుగూడ తమసంఘమందు జేర్చుకొని వానితో చుట్టఱికము గలుపుకొనిరి; ప్రకృతి నాశ్రయించి అందాశ్రమములను నెలకొల్పిరి. షేక్స్పియర్ మహాకవి ప్రకృతిదృశ్యములందు వివిధప్రబోధవ్యవస్థల నవలోకింపలేదా?

"...Tongues in trees, books in the running brooks,
Sermons in stones and good in everything"

కాని ఆతడు పాశ్చాత్యుడగుటచే అనవరతము తనదృష్టి నాధ్యాత్మికోద్దేశమునకు లగింపలేదు. కాళిదాసో? భారతీయుడుకావున నీతడు శృంగారములని తోచు తన రచనములందు బహుళాధ్యాత్మికభావము లనునింపినాడు. వ్యాసవాల్మీకుల రచనములవలె నీతనిగ్రంథములు ప్రకృతియందును, యాత్రాస్థలములందును జన్మింపలేదా? వీనిని చదువు విజ్ఞాని ఆంతరంగికముగ మేఘదూతవలె వింధ్యభూధరములందును, హిమగిరులందును, నదులందును, కనులపండు వొనరించు కేదారములందును విహరింపడా? యాత్రికుడుచేయు కర్జముకూడ నిదియేకదా!

కళోపాసకుడనై, జ్ఞానపిపాసువునై నేను యాత్రసలిపితినిగాని, నీట మునిగినంతన, కొండ లెక్కినంతన స్వర్గము నరచేత బట్టగలనని యాశించికాదు. తెరువున నిక్కట్టులు లేకున్న నాయాత్రకు అందమే యుండెడిది కాదని యెఱుగుదును. డోలయాత్రోద్దేశమునకు చెఱుపు దెచ్చునని యెఱుగుదును. డోలీకాదుకదా, ఈశ్వరవిమానమైనను, విహంగపతియైనను కొండదిగువను నాకు ప్రత్యక్షమై తిన్నగ నుద్దేశసిద్ధికడ నన్ను జేర్తునంచు రాయిగ్రుద్ది తెలిపినను, వానిని దూరముగ తొలగించుటే నాకర్తవ్యమని యెంచి, అట్లొనరించియుందును.

ద్విగుణీకృతోత్సాహముతో ముందంజవేసితిని. డోలీవాండ్రు నన్ను వదలలేదు "మీదారిని మీరుపొండు; నేను నడచియే కొండతుద చేరెద" నని వారి నుద్దేశించి పల్కితిని. "అయ్యా! బ్రహ్మగిరి నెక్కుట చాలకష్టము. కొంతదూరము పోయినపిదప సంగతి మీకే

బాగుగబోధపడును. అందుచే మేమును మీతోవత్తుము. తరువాత మీరు డోలీ యెక్కితీఱుదురు. ఈయుత్సాహ మెంతో సే పుండదు. మీరు పట్టణములం దుండువారు. ఇట్టికొండల నెక్కుట కెంతో అభ్యాస ముండవలె" నని వారనిరి. వారి నుడువులు నామనసునకు చుఱుకుగ తట్టినవి. "కొండకొనచేరుట అసాధ్యమైనచో, కొండదిగువ నుండియే మరలివత్తును. కాని డోలీయెక్కి యాత్ర సాగింతునని నమ్మకుడు. మీరు ప్రబోధించితిరని నామనసున కిష్టములేని పని నెట్లు చేతును?" అని నే నంటిని. మఱికొంతసేపు నాతో నడచి, యేమేమో యనుకొని వారు మరలిపోయిరి. ఒంటరినై నడువదొడగితిని.

బ్రహ్మగిరికి నలువలకులందును సాంద్రవనమున్నది! చల్లనై, చక్కనైన ఆతావుగుండా పోవుతఱి నా హృదయ మింతింతనరాని యానందము నందినది. నగరవీథులందు అపాయములేనితఱి నలుగురతో నాడుచు పాడుచు నడచుట పాడి. చెట్లయందో? నిర్జనప్రదేశమందో? శాంతియుత,సౌందర్యసంక్లిష్టస్థానములందో? కిక్కురుమను తెరువరి అందు ప్రవేశించుట కర్హుడు కాడు. నడిరేయిని నిద్రామగ్నమైయున్న కమల కాసారమున రాయి రువ్వు టెట్టి దుర్నయమో, పువ్వారొమ్మున వాడి గోళ్లు చొప్పించు టెట్టి దౌష్ట్యమో, లలితభావముపై కఠినశబ్దమును దొరలించు టెట్టి చెట్టయో, మణికాంతులీను మంచుతుంపురుపై నడుగు వేయు టెట్టిపాపమో, లేతమోమున చఱపువేయు టెట్టి క్రౌర్యమో, తియ్యని 'కూహూకూహుల' పై పెడబొబ్బను వీడు టెట్టి దౌర్జన్యమో, క్రొన్ననలపై ముండ్లురాల్చు టెట్టి దౌరాత్మ్యమో, కసుగాయమీదికి కార్చిచ్చును పురికొలుపు టెట్టి యత్యాచారమో, హేమలతపై శాతాసిని విసరు టెట్టి కలుషమో, నగుమోముచిన్నారిని వెక్కిరించు టెట్టి యన్యాయమో, నిండుజవ్వనిగుండియపై శిలీముఖమును వేయు టెట్టి యఘమో, శాంతిమయప్రదేశమున నుడువువీడుటయు నట్టి కాఠిన్యమే! చేతనున్న మరచెంబుతక్క నికెవ్వరును అపుడు నాతోడ లేకుండుట మేలే యనుకొంటిని. చెంబును చప్పుడుకానట్లు పట్టుకొని నడచుచుంటిని. ఆకుగములనుండి అల్లనవెడలిన పక్షికూజితములు వనరమ గావించు గుసగుసలట్లు వినిపించినవి.

నిస్తబ్ధతయందే కదా ఆత్మ నిద్రనుండి మేల్కాంచును! పురిపిళ్లతో నందే కదా సచ్చిదానందములను క్రోలును! అందే కదా విశాల మానసదిశావలయము ప్రణయినీహృదయమట్లు విప్పారును! ప్రొద్దు గ్రుంకినంతన గూండ్లజేరుపిట్టమూకలవలె నెందో యడగియున్న భావ పరంపరలపుడే కదా రివ్వు రివ్వున చిత్తమున వ్రాలును! విశ్వేశ్వరాలయమందలి శివరాత్రినాటి గంభీరఘంటారవముపోలుపున నా సమయమందే కదా అంతరంగమున దివ్యవాణి ప్రతిధ్వనించును! ఆహా! శాంతికిని, సౌందర్యమునకును, ఆనందమునకును, దివ్యభావమునకును ఎట్టి యవినాభావ సంబంధమున్నదో! ఎట్టియాంతరంగిక బాంధవ్యము కలదో! దీని నెఱిగియే కాబోలు ప్రాచీనజిజ్ఞాసువులు మానులై శాంతి, నికేతనములందు కుటీరము లేర్పఱచుకొనిరి! అనంతవారాశియం దిచ్చవచ్చిన తెఱగున మున్కలువేయు మీనములట్లు మునిమానసములనంతశాంతియందు గ్రుంకులిడి ఎంతెంతహాయిని, ఎంతెంతభావ విభూతిని నందినవో! నామన సత్తఱి భావబంధుర ప్రాచీనకాలము దెస మహోత్కంఠతో నెగసినది.

ఇంతలో మైదానము కడచినది. కొండమీది కమితోత్సాహముతో కదలిపోతిని. ఉల్లమునకు చల్లందనమిచ్చిన ప్రశాంతవాతావరణమునుండి కదలిపోయి, బండరాళ్లపై బడితిని. దిగువభాగమున మాత్రము కొన్ని మెట్లున్నవి. వానిని దాటినంతన నడుగు చులకనగ పడలేదు. అరుగులుపోలు రాళ్లు త్రోవలో తోచినవి. మోకాళ్లపై చేయిమోపిగాని యెక్కుట సాధ్యముకాలేదు. నాసత్త్వమకు ఘోరమైన పరీక్ష యెదురైనది! ఘనభావములకు ఘనతరపరీక్ష ప్రత్యక్షమైనది!!

కడచిననాటి సాయంకాలమున బొంబాయిలో వెల్‌కమ్‌హోటలులో తొందరతొందరగా భోజనముచేసితిని. అదైనను ఆంధ్రభోజనము కాదు. రసరహితమైన పద్యమును బోలు అరవకూటు కన్నెదుట నిలిచి, నిముసములో నాచే "హతోస్మి" యనిపించి, అనంతరము నన్ను వదలినది! రాత్రినిద్ర నెఱుగకుండుట, నుడులకందని హైరానుకు గుఱియగుట, ఇంతదనుక పయనించి, మానసికముగగూడ నింతింతనరాని బడలికనంటుట ఇక్కట్టులచఱపులకు సత్త్వమొడ్డుట ఎట్టియనుభూతులో యోచింపుడు.

తఱచుగ నన్ను పీడించు తలనొప్పి అత్తఱి నన్ను తీవ్రముగ మార్కొనినది. ఈబాధ బాల్యమునుండి నన్నాశ్రయించియున్నది. గునపములు, గొడ్డళ్లు, ఈటెలు, బల్లెములు ఒకేమాఱుగా నెత్తిపై పడిన ట్లుండును! రాత్రులందు చాలసేపు మేల్కొనుటయు, మితి మీఱిన పనిని మెదడున కప్పగించుటయు నీదుర్దాంతయాతనకు కారణములాయెనని వైద్యు లనిరి. వారు తెలుపకుండగనే ఆహేతువుల నెఱుగుదును. కాని విశ్రాంతికి నేను నోచుకొనలేదు. నామనసు నన్ను విశ్రాంతి దీసికొననీయదు. అది నిరంకుశత్వమును చలాయించును. మిల్టనుకవీంద్రుడు తెలిపిన "క్రియాధిపతి" ("Task Master") యది! యోచింపవలసినదానిని యోచింపనినాడు, చదువవలసినదానిని చదువనినాడు, వ్రాయవలసినదానిని వ్రాయనినాడు, వచింపవలసినదానిని వచింపనినాడు నాహృదయమందు తప్పక దుస్సహసంక్షోభ ముదయించును. కలవానియింట జొరబడిన దొంగవలె హక్కులేని నిద్దురందు చిత్తము ప్రవేశించెనేని, నాడు నన్నుపీడకలలు పీడించుట తథ్యము. చితియందు నాశరీరము చిటచిటలాడు పవిత్రసమయమందైన నామనస్సు విశ్రాంతి నెఱుగదేమో! పరలోకమందే నాకు శాశ్వతవిశ్రాంతి చేకుఱునేమో! ఆట్లేయగుగాక! నేను చదివిన చదువులును, నేను వ్రాయువ్రాతలును, నాసుఖమును గుండజేసివదలినవి! శారదను చేపట్టితిననికాబోలు లక్ష్మి నాయెడల ప్రసన్నకాలేదు. కావుననేకాబోలు, నే నింకను రొంపిలో దిగబడలేదు. ఇదియే నాభాగ్యము కాబోలు! భావికాల మెట్లుండునో యెఱుగను దూరమున నిలిచిన లచ్చిని చేరబిలుచుటకు నామన సొప్పకుండుగాక! నాశారదయే నాయంత్యముహూర్తమున సయితము నాచెంగట నిలిచి, నాయాత్మకానందము గలిగించునుగాక! శైశవమునుండి నేనారాధించుచున్న సాహితీసీమంతినికిని, ననుగన్న భారతాంబకును, భగవతికిని, జగతికిని ఇంచుకంతైననేవచేయగలిగితి నను భావమును, ఎట్టిప్రలోభమునకును లొంగక దృష్టినుండి ఉత్తమాశయములను చెదరనీక, ధర్మమార్గమున పదస్ఖలనము గానీయక ఐహికమైన ఈమజిలీని గడపగలిగితినను భావ

మును ఆతుదినిముసమున నాయంతరంగదిగ్వలయమున జోడు చుక్కలట్లుపొడసూపెనేని నాజీవితము ధన్యమైనదని మురియుదును.

కొంతతలనొప్పి నాటియుదయమందే తలసూపినది. కొండ యెక్కుటచే అది తీవ్రతరమైనది! చేత నొకయూతకోలనైనను లేదు. అంతకు కొన్నినాళ్లకుముందు పంజాబులో పర్యటనము సలిపినపుడు, అమృతసరమున నాపుణ్యచిహ్నముగా గొనిన చక్కని చేగఱ్ఱను శాంటాక్రజ్ లో (ఇది బొంబాయికి సమీపమందున్నది) ఒకమిత్రునింట నెవ్వరో అపహరించిరి. మోకాలి నూతజేసికొని, ఎత్తయిన కొండరాళ్ల నెక్కుచు నెంతదూరము పోదును? శిరమెత్తి చూచితినిగదా ఆకసమును చుంబించుచు, పర్వతము ఘోరరాక్షసివలె కానుపించినది! నాయెడల నేలకో అక్కసుపూని పర్వతరాజు దివిదెసపెరుగుచున్నట్లు పొడగట్టెను? శిరోవేదన దుస్సహమైనది! ఒడలున ముచ్చెమటలు 'పోసినవి!' "అమ్మా!" "అమ్మయ్యో!" "అమ్మా!" అనుకొనుచు (రక్తమును మాత్రము క్రక్కక) మఱికొంత యెత్తున కెక్కితిని. తలరాలినేలబడు ననుకొంటిని. శిరోవేదన బోగొట్టుబిళ్లలు (Aspirin tablets) ఒకటి రెండు లభించునేమో యని జేబులో చేయిబెట్టి చూచితిని. అవి లభించలేదు. "అమృతాంజనమును" "యోగభస్మమును" (తలనొప్పి నించుక తగ్గించుటకై మెంథాల్ కర్పూరములను—Menthol, and Camphor—కలిపి నేదయారొనరించి వాడుచుండెడి ఔషధవిశేషము) జేబునుండి అంతకుమున్నె జారిపోయినవి. ఉస్సురుస్సు రనుకొనక తప్పి నదికాదు. అపరిమితమైన దాహము వేసినది! చేతిలో మరచెంబున్న నేమి? నీరేదీ? పోవుచున్నది గోదావరిమాత పుట్టినచోటునకు! ఆపత్కాలమున నాయమ్మ కొంత స్తన్యమిచ్చునని ఆశపడితిని. కాని నా కది లభించలేదు. గొంతుక యెండిపోయినది! కడుపు కాలుచున్నది! నాలుక ఆరిపోయినది! శరీరమంతట దురంతమైననొప్పులు బయల్దేరినవి! అయిదు ప్రాణములలో మూడెగసిపోయినవి! మిగిలిన రెండసువులు ఇకనచిర ములో గోదావరీజన్మస్థానమునకు గాకమానె, గోభూమి దెస నెగసిపోవు నని గ్రహించితిని. కదలించుట కెంతయత్నించినను కాళ్లేతులు కదల లేదు! "హా! శ్రీహరీ!" యనిపర్వతసానువుపై వెలికిల బడిపోతిని!

మార్గదర్శకుడు (Guide) లేనందున త్రోవదప్పితినని, తప్పితిని కావుననే ఈ ఘోరసంకటమున బడిపోతినని గ్రహించితిని. నావలెనే మఱొక యభాగుడు తెన్నుదప్పినగాని నాకచ్చోటున మనుష్యదర్శనము లభింపదని యెంచితిని. తప్పుతెరువున సగముదూరము కడచినవెనుక నా కిక నెవ్వ రగపడెదరు? బనియన్ చిత్రించినకావ్యము (Bunyan's "*Pilgrim's Progress*") మానసయవనికపై చలనచిత్రము చందమున తళ్కుకొన్నది! గంగానదిని చేరుటకై దక్షిణాసీమనుండి నడచినడచి, తీరము నంటుటకుమున్ను చచ్చి స్వర్గమును చేరుకొనిన బ్రాహ్మణునిగాథ(ఇది కాశీ పురాణములో నున్నది) నామనసున దట్టినది. అంతదనుక నేను కడపిన జీవనము, వివిధరాష్ట్రములందు నేను సలిపిన పయనము లందలి సంఘటనములతో చరచర చిత్తవీథియందు పర్విడినది! ఈ పర్యాయము మాత్రమే వెంటగొనిరానందున చెన్నపురియందే యున్న శారద మానస నేత్రమున కెదుట దోచినది.

నిముసము కన్నులు మూసితిని. 'నిద్దురపట్టునేమో' అని యాశ పడితిని. పట్టలేదు. ఇంతలో నీశ్వరకటాక్షముకతన కావలయును నాహృదయమున నూతనోత్సాహ ముదయించెను. అట్లు పడియుంట, మనసున దౌర్బల్యమునకు చోటిచ్చుటనియు, సిగ్గుచేటనియు గ్రహించితిని. అట్టి యిక్కట్టును నెట్టివేయుటందే గట్టిపూనిక సార్థకత గాంచునని గుర్తించితిని. నాటి ఘోరవిపత్తుతో పోరినపుడే ద్విగుణీకృతమైన ఆత్మశక్తి నందగలనని ఆశపడితిని. నాటికి మూడునాళ్లకుమున్ను బొంబాయి విశ్వవిద్యాలయపుస్తకభాండాగారమున చదివిన పంక్తులు భాసమాన మయూఖములమాడ్కి మానసదిగ్వలయమున తళ్కుకొత్తి, నాకు మఱింత ఆంతరంగికదార్ఢ్యమును గలిగించినవి. అపాయము వాటిల్లుతఱి, అంతరంగమున నూతనశక్తి యుద్భవించుట విడ్డూరము కాదని యవి విశద మొనరించినవి. రానున్న దుష్టకష్టము నూహించియే కాబోలు జగదీశుడు బొంబాయిలో నాపంక్తులను నాకను లెదుట విరబోసినాడు. *

---

* "Still we went on leaning our weight against them, and as we went a kind of exaltation seized me, as it does always in moments of great danger, so that my heart grew bold and feared no more. I would match myself against these elementnl strengths as I had matched myself against those of hostile people, and conquer them. Or may be it was the breath from the divine fire burning below that

"ధిక్ !" అనుకొని లేచి నిలిచితిని. చర చర కొంతసే పెక్కితిని. తన్నట్లు మార్కొనుచున్నందులకు కినిసికాబోలు గిరిరాజు మఱింత భయంకరమైన రూపుదాల్చెను! అరుగులుపోలు రాళ్లు కడచినవి. తరువాతిశిలలు మత్తమాతంగములట్లు తోచినవి! జంకక ఒక్కొకపుడు నడచియు, వేఱొకప్పుడు ప్రాకియు, ఇంకొకపుడు దేకియు, మఱొకపుడు వంగి వంగి యెక్కియు ప్రత్యంగుళమును పరిశీలించుచు కొంత దూర మరిగితిని. ఈ వింత గతిలో చేతినుండి మరచెంబు చివాలున రాలిపడినది! బలిచక్రవర్తిబట్టతలపై బడి నిముసములో దానిని తున్కతున్కలుచేయునని యడలితిని. దొరలి దొరలి చెంబు సుమారు నూఱు గజముల లోతులోనున్న లోయలో పడినది! దానిని వదలిపోయిన, ముందుముందు తీవ్రతరమైన దాహముతో పొగులవలసి వచ్చునని తలపోసితిని. అల్లన లోయలోనికి దిగజారితిని. తల్లిమాటవలె అదూరమున జలధార చాలువాఱునట్లు వినవచ్చినది. చోటును పరికించుచు నిందందు నడయాడితిని. కొన్ని గజములదూరములో పర్వతపార్శ్వము నుండి సన్నని సలిలధార స్రవించుచు నా కనులబడెను! నాసంతసమునకు మేరలేదు. నన్నీవనధారచాపున జేర్చుట కొఱకే ఈశ్వరుడు నాచేతగల చెంబును జారజేసెనని గ్రహించి, కన్నులనుండి జలబిందువులు జలజల రాల నాతని నుద్దేశించి అచ్చో సాగిలపడితిని. ఘోరవిపత్తులందుగాని ఈశ్వరప్రేమ ప్రత్యక్షముకాదని గ్రహించితిని. అంబుధార క్రింద తలయొగ్గితిని. అది ఈశ్వరాశీస్సు కదా! శిరోవేదన కొంత తగ్గినది. కడుపునిండ నీరు త్రాగితిని. ఉదరగోళము కొంత చల్లబడినది. మనసు కుదుటబడినది. ఇంచుకసే పందు నిలిచి, చుట్టుగల గురుగంభీర గహనసీమను పరిశీలించితిని. తన నిస్తబ్ధశైల సామ్రాజ్యమును, అల్లనల్లన దివియందు చలించి పిట్టయొకండు వీక్షించుచున్నది. ఆహా! పక్షి జీవిత మెంతమహత్తరమైనది! శకుంతము పోజాలని తావేది? అది కనజాలని రమ్యదృశ్యము లేవి? విశ్వమందలి వింతలుచూడవలెనన్న, అనంత

already had entered into me. I cannot say but this I remember, that before I had reached the point of that fearful rock I was filled with a wild joy and could laugh at Philo crawling after me with hesitating steps and breathing prayers now to Isis and now to the Grecian gods that he had worshipped as a child."

(Vide "*Wisdom's Daughter*" by H. Rider Haggard, Page 220)

శాంతియం దీదులాడవలెనని, కడలేని భావములను మనసున ప్రోగొన
రించుకొనవలెనని, ఆనందమును తనివార గ్రోలవలెనని, పచ్చందన
మును, చక్కందనమును, చల్లందనమును ముల్లోకములుచేసికొని ప్రకృతి
గూడి వానియందు మురియవలెనని, మాధుర్యము నవిరతముగ నా
నందస్రుతుల వీనుదోసిళ్లందు బోయవలె ననిన, ఏదేని యొకభవమున
నిక్కంపుగవినై వసుంధరపై భావధారల గురియింపవలెనని, మాన
వుడు విహంగమై జన్మింపవలెను. అచ్చెరుపాటున నాయద్భుతదృశ్య
మును చూచుచుండ నొకవైపున గుహయొకటి నా కగపడినది అందుండి
మర్కట మొక్కటి నాదిక్కునకు పరుగెత్తుకొని వచ్చినది. కోతికి
జడియనేల ? గుహాయం దేదో చప్పుడు వినబడినది ! అం దేదేని వన్య
మృగ మున్న దేమో యని తొలుత బీతు జెందితిని. హిమగిరి గుహ
లందు అందందు యోగులను చూచియుంటిని. శీతనగమున పయన
మొనరించినపుడు వారిని గలిసికొని, వారితో కొన్ని దినములు కడపి,
వారి యాశీస్సులనందు భాగ్యము నా కదివఱలో చేకూరినది. వన్య
పశువుకాక మహాత్ముం డెవండైన నెదుట గోచరించు గుహలో వసించు
చుండెనేమో యనియుఁ అతని గలిసికొనిన నపూర్వాంశముల నెన్నేని
యెఱుగవచ్చుననియు, నాటి కందే విడిసి పఱువాత కొండకోన చేరు
టకై పయనింపవచ్చుననియు తలపోసితిని. ఒకరుప్ప వెన్క నిలిచి ఆ చప్పు
డేమైయుండునో యని కనిపెట్టసాగితిని. డొంక ప్రక్క నొక శుభలేఖ
పడియుండెను! ఆ నిర్జనప్రదేశమున కాజా బెట్లువచ్చెనో యెఱుగను.
ఒరులజాబు చూచు టనుచితమే! ఆ కమ్మకం దొక హక్కుదారుడు
లేనందున, మీఁదుమిక్కిలి అది కల్యాణపత్రమగుట వలన ఆపసుపువన్నె
కమ్మను తీయుట తప్పుకాదని యోచించి చేబూనితిని. అందున్నవి
హిందీయక్షరములు. వానిని చదివినపుడు నా మనసున కెంతేని అచ్చెరు
పాటుకలిగెను. అది వాయ్‌లో వసించు ఒక మహారాష్ట్రవ్యక్తికి వ్రాయ
బడెను. వ్రాసినవాడు బృందావనవాసి. ఆ పెండ్లిజాబు అచ్చటి కేల
వచ్చెనో! ఒకపికరాయబారి లేఖబూని, గగన మార్గమున చనుచు దాని
నచ్చో దటాలున జారవిడిచెనా? బ్రహ్మగిరిజేరిన కొండొక యాత్రికుని
కడనుండి గాలిలో నెగసి వచ్చెనా ? ఏమో! ఏమైనగాని, శుభలేఖ

లభించు శుభోదయమే యనుకొంటిని. పత్రమును మెల్లగ జేబునం దుంచితిని. ఇట్లొనరించుటకు కారణము లేక పోలేదు. ఇంతలో గుహలో మరల శబ్దమయ్యెను. వెనుకటికంటె నిపుడది దీవ్రముగా నుండెను. మున్యాశ్రమము నిట్టి భయదధ్వని యేల యుదయించు ననుకొంటిని. గుహనుండి బారెడు పాము యొకటి అపుడు చరచర ఈవలికి ప్రాకివచ్చినది! మరల నదే ధ్వని! ఆచోటున నిక నిలిచిన, ముప్పువాటిల్లునని గ్రహించి యెట్లో చెంబున నీరు నింపుకొని పడిపడిగ నందుండి కదలితిని. జోడును దైమానురాజింట వదలివచ్చుటచే, తత్తఱ పాటున నట్టటే నడువవలసివచ్చుటచే రెండుకాళ్లయందు ముండ్లును, పల్లేరుకాయలును నిండుగ గ్రుచ్చుకొన్నవి. వానరము నా కూడ రాదొడగినది. జేబున సెనగలు లేకపోయెను. అయిన నది యాత్రికుల నాశ్రయించు కోతికాదని గ్రహించితిని. అది పండుకోతి కాదు. అడలు గొలుపు కొండముచ్చు! మీదపడి పీకివేయునేమో యనునట్లు దానివైఖరి తోచెను. చేత గఱ్ఱ లేదు. ఒకవైపున దుష్టప్లవంగము! ఇంకొకతట్టున క్రూరవ్యాళము! అవి రెండు నొక్కమాఱు మార్కొ-నిన, రెండుచేతులు మొగిచి మృత్యుకాంతనోట నుఱుకవలసినదే! నిముసమైనను తడయక, ఒక తెన్నునుగానక, కొండపైకెగ బ్రాకసాగితిని. వెన్కనుండి కాలసర్పము తఱుముకొని వచ్చుచున్నదేమో అని యడలితిని. పాపమా విషధర మెందో యదృశ్యమైనది! ఎగిరెగిరి కొంతదూరము వెంటబడిన మర్కట మొకచెట్టుకొమ్మపై దుమికి నన్ను నాత్రోవను పోనిచ్చినది. దానికిని, చిలువకును, గుహయందు ధ్వనిజేసిన యదృశ్యగహనమృగమునకును ధన్యవాదము లొసగితిని. ఉపద్రవమునుండి బయటబడితిని. మరల భూధరము నతిక్రమించుటకై గట్టియత్నము చేయవలెను. అప్పటికి రమారమి యైదుగంటల వేళయైనది. అత్తఱి మఱల మొండిసాహసమునకు కడంగుట అవివేకమేమో యనుకొంటిని కాని అపుడు చేయునదేమి? క్రిందికరిగి రేవకడ కొండకు తిరిగిరావలెనని యోచించినను, ఇంతదనుక పడిన పాట్లు వ్యర్థమగునేమో యనియు, పదపడి నాపూనికకు నెవ్వారేనియవాంతరము గలిగింపవచ్చుననియు పరక్షణమందే తలపోసితిని. క్రిందికరిగినను, మరల త్రోవతప్ప ననుటకు గేరంటీ లేదనియు,

గోదావరీ జన్మస్థానముకాదుకదా అంధకారమున నే భయంకర వన్యపశువైనను ప్రత్యక్షమై తక్షణమే నన్ను కుక్షిని జేర్చుకొనవచ్చుననియు యోచించితిని. అత్తటి మీదికరిగినను ముప్పురావచ్చును. యత్నమును విరమించి, మనసున విషాదమును నింపుకొని దిగి ముప్పుదెచ్చుకొనుటకంటె యత్నమును సాగించి, మనసున ధృతి సాహసములను నింపుకొని, పైకెక్కి ఆపదను కవుంగిలించుకొనుట ఘనతరవిషయమని యూహించి, మఱిక్రిందికి చూడక్క పాటింపక పర్వతము నెదుర్కొంటిని. "కొండపై నెన్నెని ప్రాణు లున్నవి. ఈశ్వరుడు మఱొక్కప్రాణికి నాటి యామిని నండచోటీయడా" యని తలపోసితిని. అంగవస్త్రమును నడుమునకు గట్టుకొని, తొంటితీఱున వంగుచు, డేకుచు, నెగబ్రాకుచు, నెట్లో ముంచటికి శరీరమును నెట్టించుచు, నే ముహూర్తమున కెట్లు సాధ్యమో అట్లు చలించుచు నెట్టకేలకు కొండకొన జేరుకొంటిని! "అమ్మయ్యా!" యనుకొని, కుధరమునకు జోహారని భగవంతునకు సహస్రధన్యవాదములు సమర్పించితిని. నదీమతల్లి పుట్టిన చెందని తహతహతో నలుతట్టుల జూచితిని. నాకది కానుపింపలేదు సరిగాదా, భీషణాకారము దాల్చి మఱొకకొండ కొంతదూరమున గానుపించినది! దానినికూడ నెక్కనగాని నాగమ్యస్థానమును చేరజాలనని అపుడు గ్రహించితిని. నిముసమునకుమున్ను ఉబ్బితబ్బిబ్బైతిని. ఇపుడు మరల నిట్టూర్పులు వెడలదొడగినవి! ఎప్పుడైన మిడిసిపాటుకూడదు కదా! ఆకొండ మింటినంటు గోడవలె నున్నది. దానిమీది కెగబ్రాకుట అసాధ్యమని అడలితిని. చొరవచేసినను, కర్మముచాలక కాలు జారినయెడల, తున్కతున్కలై పాతాళమున రాలుదునని యెఱుగుదును. ఇకేమిచేతును? "హా! దైవమా! ఇదేమి దారుణపరీక్ష?" అని కనులుమూసికొని, నాటి యనుభూతినంతర్దృష్టితో పరిశీలింపసాగితిని. అందుండి యెటుచనినను ముప్పే! అందు నిలిచినను ముప్పే!

చదువరులారా! నాయీబ్రదుకున నెన్నెనికడగండ్లకు గుఱియైతిని. ప్రతియిక్కట్టు ప్రాణముదీయ నడలించినను, దానియందే దేని జ్ఞానద్రవ ముండునేమో యని ఆశపడితిని. బ్రహ్మగిరియారోహణమున రాబందు లట్లు నాపై నెన్నోపాట్లు వ్రాలినవి. కొంతసేపవి నన్ను

బాధించినను, వలచి తెచ్చుకొనునవి కావున నవి నాయాయువును దీయక పరముహూర్తమున నాహృదయమునకు నూతనసంజీవి నొసగినవి. నా జీవితమున నాకు విశేషవిజ్ఞానభిక్షబెట్టిన యనుభవములలో నాటి యను భవ మొక్కండని వినీతభావమున విన్నవించుచున్నాను.

ఇంకను ఉస్సురుస్సురనిన, నిట్టూర్పులు వీడిన నత్తటి అవి యగ్ని కీలలై నన్ను మాడ్చివేయునని యెఱుగుదును. కన్ను లందు నీటిని జేర నిచ్చితిని గాను. అంతదనుక నన్ను గాచిన సర్వేశ్వరుడు పరముహూర్త మున నన్ను జోడుకొండలనడుమ నలిపివేయడని ఆశపడితిని. గుండెను గట్టిగ బట్టియుంచితిని.

ఆహా! మనుష్యహృదయసృష్టి యెట్టిదో! అది కుసుమాదపి మృదులమనియు, వజ్రాదపి కఠోరమనియు గదా మహాకవి భవభూతి పలికినాడు! దడదడలాడి మానవుని నేలద్రోయునదియు, ఇంచుకైన జలింపక మహాపదలందు మనుష్యుని కాపాడి, దివ్యసింహాసనముననాతని నాసీనుజేయునదియు నదియే! అంతరంగస్థభావమును బట్టియే హృదయ మిట్టి గుణమునందునేమో! లోపల గొండొక యద్భుతశక్తికలదని విశ్వ సించి, దానిపై నేకాగ్రదృష్టిని నిలిపినపు డది యెదుటి యడ్డంకులను గుండగావించి, ఎదురొడ్డినిన యరిష్టములను చెండాడి, మనుజునిచేతికి విజయపతాకము నందించును. ఆశక్తిని గుర్తింపక, అంతరంగమున నవి శ్వాసమునకు చోటిచ్చి, భయసంశయములను దానికి తోడిచ్చి, అంధుడై అంధకారమం దల్లాడు నాతని కది యేదుగడ కాజాలదు. కావున వాని మనుగడ మరుభూమికి ప్రతిరూపమై యుండును. క్రమక్రమముగ నాడు కొండకంటె నాగుండెను మొండిజేసిన దివ్యశక్తికి జోహారంటిని.

ఇక గంటలో తప్పక ప్రొద్దుగ్రుంకును. నాడు మార్గశిర బహుళ చతుర్దశి. మర్నాడే నాకన్న తల్లి దివంగతయైన దినము! సూర్యాస్తమ యము కాకమున్నే కొండకొన జేరకున్న, భయదమైన ఆ తెరువున్న భీషణాంధకారమున నాకు ఘోరదుర్మరణము తప్పదని యెఱుగుదును. నాడు సూర్యభగవానుడు వేయికన్నులతో నన్ను పరికించుచున్నట్లు గుర్తింపగలిగితిని. కారుచీకట్లు నాపై దాడి వెడలకుండుటకై ఔశావల యమునుండి తాను కదలక, తనఘోటకము లేడింటి నాతడు పగ్గము

లతో పట్టి యుండనోపు! గ్రుక్కెడు నీరు త్రాగి, క్రొత్తసత్తువ దెచ్చుకొని, నడుమున కంగవస్త్రమును బిగించికట్టి, చెంబును జారనీక, కడు వడిగ పై కెగబ్రాకసాగితిని. తోడనే సత్తువ సన్నగిలినను, రొజుచున్నను, భుగుల్భుగుల్లను పొగవలెశ్వాస వెడలుచున్నను, పేగులు తెగుచున్నను, గుండెలు దడదడలాడుచున్నను, ఒడలంతయు వడవడ వడకుచున్నను, గోదావరీధారలవలె శరీరమునుండి చెమ్మటలు కాలుచున్నను, మఱల శిరోవేదనము ప్రారబ్ధకర్మమువలె సమ్మెటపోటులు వేయుచున్నను, ఒకమాఱు కనులుమూసి, వేఱొకమాఱు తెఱచి, నన్ను నేనెఱుగక, కాళ్ళే తులు కదలుచున్నవో లేదో యనినైన గుర్తింపక, గిరికాయము నంటియుండి గోదావరీజనయిత్రి జన్మస్థానమును స్మరించుచుంటిని. ఇక నపుడేమి జరిగినదో నేను తెలుపజాలను. పాఠకులే యూహించుకొందురుగాక! మఱికొంతసేపు కడచిపోయినది. కడుకష్టమున కనురెప్పలెత్తి పశ్చిమదిశ జూచితిని. బంగారు చిఱునగవులు నగుచు, దినేశుడు కనుల పండు వొనరించినాడు! తన వేయిచేతులతో నాశిరమును స్పృశించి, బహుళాశీస్సుల నాపై తళ్కొత్తించి, దాపుననుండి (అది పశ్చిమకుధరమే కదా!) అల్లనల్లన జని, సప్తకాంతులనివాళులతో నదృశ్యుడైనాడు! నేజేరిన తావునుండి దశదిశలను పరిశీలించితిని. బ్రహ్మగిరిశిఖరమున నాసీనుడనైయుంట గుర్తించితిని. పరమహంసవలె నాయాత్మ హృదయబృందావనమున నృత్యమొనరించినది. అదూరమున మధురమంజుల నిస్వనము వినవచ్చినది! అది జలధారయాలాపించు అనంతదివ్యగీతిక యని యెఱిగితిని. నాకు మిగులగూర్చు నదీమతల్లి అందే జనించినదని గ్రహించితిని. ఎన్నటికో తల్లిని గనిన బాలకునివలె, పరమపరితోషమున నా దిక్కునకు పర్విడిపోతిని.



# నా మహారాష్ట్రయాత్ర

## ఏడవ ప్రకరణము

సలిలనిస్వనము మాతృదేవీమధురభాషణమట్లు వినవచ్చెను. గిరి శిఖరమునెక్కినపుడు నేబడిన యాతనలు కాంచియే, కనికరము పెంపున నదీమతల్లి నన్ను చెంతకు చేరబిలిచిన ట్లూహించితిని. ప్రేవులు తెగునట్లు, ఒడలును గుండ జేసికొనునట్లు, గుండె రక్తము పిండుకొను నట్లు, పంచప్రాణములను చెరగొట్టినట్లు, నాటి దారుణారోహణమున* ప్రవర్తించిన నాకు కొండకొన జేరినంతన నూతనశక్తిని, నవజీవనమును నాకొసగినది ఆయమ్మ యాదరోక్తియే! ఆహా! తల్లియనురాగ మెంత మహత్తరమైనది.† దుస్సహావేదనయందు కన్నబిడ్డను కాంచినపుడు తన

---

* భారతదేశభక్తులందు దేశము శమంతకమైన కాంతులు జవహర్‌లాలునకు కొండ లెక్కుటయందును, వనములందు మరలుటయందును ఎంతో యభిలాషకలదు. ఆతని పలుకులను పరికింపుడు :

"...And I dream of the day when I shall wander about the Himalayas and cross them to reach that lake (*Manasa Sorovar*) and mountain (*Kailas*) of my desire.........The journey is always worth the making even though the end may not be in sight.

'Yea, in my mind these mountains rise,
Their perils dyed with evening's rose, And still my ghost sits at my eyes
And thirsts for their untroubled snows. —Walter de la Mare
(Vide Pandit Jawaharlal Nehru's Autobiography. Page 38)

† మహాకవులీ యనురాగమును బహుభంగుల గీర్తించిరి. షేక్స్పియరు మహా కవియొక్క "ది ట్రేజిడీ ఆఫ్ కోరియోలేనస్" ("*The Tragedy of Coriolanus*") లోను, ఆతని యడుగుజాడలంటి సారస్వతక్షేత్రమున మసలిన ద్విజేంద్రుని "చంద్ర గుప్త" లోను మాతృప్రణయమహత్త్వము కడుంగడు చక్కగ చిత్రింపబడినది. అందలి మాతవలున్నియా (Volunnia); ఇందలికన్నతల్లి మురు (Vide: Act V, Scene 3; Act I, Scene 3, '*The Tragedy of Coriolanus*', నే నాంధ్రీకరించిన 'చంద్రగుప్త' లోని 2-వ యంకమునందలి మొదవరంగమును చూడుడు).

నిసుంగును కాచుటకై, దానికి సుఖశాంతులు చేకూర్చుటకై పరమపరితోషమున కన్నకడుపు ఎన్నెన్నిమారు లాత్మార్పణ మొనరించుకొనుటకు దలపడదు?

చల్లనితల్లి గోదావరి పొత్తిళ్లలోనే పెరుగుభాగ్యము నా కొదవెను.* గౌతమీవసిష్ఠ శాఖలనడుమ, చక్కనైన కాలువ (ఇందుండియే ఆలుమెళ్ళు కడచినవెనుక లొల్ల నుండి అమలాపురము, గన్నవరము, వానపల్లిదిశలకు మూడు కాల్వలు వెల్వడును) తీరమున మాయూరు (పేరవరము) ఉన్నది. ఈ ఝరీశాఖ లేడుపాయలై సాగరమున గలియును. వీనియందు కవిస్వప్నములు పోలు దీవు లున్నవి! భారతావనిలోని నదీగతుల నన్నింటిని పరికింపుడు. ఇట్లు విస్తరిల్లి, ఇంతసింగారమున రంగారిన ధునీగతి నింకెందును గానరు. కనువిందొనరించు కోనసీమ కీడైన సీమ మఱెందును లేదు. ఎనలేని హొయలున తళ్కొత్తునిచటి ప్రకృతివిభవము నాడును నేడునుకూడ రసస్రవంతుల గనుచుండెను. వీనిని గ్రోలి, గోదావరీవీచికలయం దీదులాడి నాడు నన్నయాదులు, నేడు వసురాయాదులు కవితల్లజులైరి! మన కొక రాష్ట్రముగాని, మహానగరముగాని లేకుండుటచే భారతయాత్రికులు మూలమూలలందుగూడ సౌందర్యమునీను మననేలను జూడరారు. కావున తెలుగునేలలోని ఈసొంపు నన్యరాష్ట్రీయు లంతగా నెఱుగరు.

గోదావరీగర్భమందలి లంకలు నూతనసృష్టియట్లు పొడగట్టును. పర్ణశాలనుండి సాగరమువఱకు గలదీవులందు పిన్ననాడే మసలితిని. రామపదాంకితములై, శాంతినిలయములై, ఆత్మకు పుట్టినిండ్లట్లివి శోభిలు

---

*తాను బాలకుడై యుండ దనపెద్దలు కొందఱు కూడని పన్నులందు దనను కొండొకపడి నిలిపినయుదంతమును తెలుపుచు, మాఃపురము జగదీశు డొక్కడే విక్రయింపు చేస్తకాదు కాగలడని తన "యాత్మకథ" యందు గాంధీజీ తెలుపుకొనినారు. మిత్రస్థానము నాక్రమించుటకు భగవానుడే యర్హుడగుచో, తల్లిదండ్రుల తావలమున చేరుటకుటి వేఱుమానవమాత్రుల కేలమా? రుక్మిణి పేర్కొనిన పురాణదంపతులే కదా మాతాపితరులు కాగలరు! అమ్మవెనుక నయ్య దివంగతుడైనంతన నాకు జననీజనకు లైనవారీ దంపతులే! నా చుట్టములు వీరే! విజ్ఞానదాహముతో నాగులువాడను గాన నగంగా గోదావరులు నాకట్టులైరి.

చుండును. పచ్చలు రాశిరాసులై అందు వెలయుచుండెనని తోపకమానదు. రాశిరాసులైన వెండిపొడిపోలు ఇసుకతిన్నె లెన్నో మాయూరి చేరువ నున్నవి! ఒకప్పుడివి నాయాటచోటులు. దురదృష్టములతోపాటు ఎన్నో యదృష్టములు నాకు ప్రాప్తించినవి. తోడిబుడుతలగూడి రమ్యదృశ్యము లందు, శైవలినీమతల్లి మ్రోల శైశవమునుగడపుట నాయదృష్టములలో మిన్నయనుకొందును. లంకమొక్కలందు, పుచ్చపాదులందు, ఎత్తు మంచెలందు, ఒత్తుచేలందు, పైడిపైరులందు, పచ్చికసానువులందు రేబవళ్లు కడపి, పిట్టపలుకులను మనసున బట్టించుకొని, నైశవాతూల మున మధుకణములను చాల్వొట్టు కర్షకగీతములకు సెవులొగ్గిన ప్రశాంతసమయమందే నావిద్యార్థిజీవిత మారంభమైనది. నాహృదయ ఫలకమున జిజ్ఞాసాంకురమును నాటినది శ్యామలసస్యపరివృతయై, సుందరియై, సహృదయయై, నిర్మలభావపూరితయైన గోదావరీజన యిత్రియే!

జ్ఞానము సలిలములీల ప్రవించునదని మన తత్త్వశాస్త్రము తెలుపుచున్నది. వెల్లువ నిత్యకృత్యములకు పనికివచ్చు నీరు కాని వేఱుకాదని ఇతరదేశీయు లనవచ్చును. కాని భారతీయులు దానిని జ్ఞానపూరమనిరి. నదులకుఱగటగదా భారతవిజ్ఞానము పొంగిపొరలినది! భారతసభ్యత రమ్యోద్యానమట్లు పెంపారినది! మనకవులు తమతలపులను నదీమతల్లులనుండి కైకొనుటేగాక, తమకావ్య వ్యక్తులనుగూడ వానిదాపునందే వసింపజేసిరి! రామాయణ భారతాది పురాణములను పరికింపుడు. గంగా గోదావరీ సరయూ తమసానదులు వానియందు అక్కసెల్లెండ్రట్లుతోచి, వనములందును,కొండలందునువఱలివాహినీపతిం జేరుకొనును.*యమునా

* వాల్మీకిరామాయణమున నిందందు దోచు ఈ శ్లోకములను పరికింపుడు;

"గంగాయాశ్చాపి సంతారం భరద్వాజస్య దర్శనం,
భరద్వాజాఽభ్యనుజ్ఞానాచ్చిత్రకూటస్య దర్శనమ్.
తతః పంచవటీం గత్వా రామః సౌమిత్రిమబ్రవీత్,
ఇయం గోదావరీ రమ్యా చక్రవాకోపశోభితా.
స ముహూర్తం గతే తస్మిన్దేవలోకం మునిస్తదా,
జగామ తమసాతీరం జాహ్నవ్యా స్త్వవిదూరతః.

తరంగిణియే భక్తిస్రోతమై భాగవతమున మానసగోచర మగును! ఈ మూడుపురాణములును ముగురమ్మలై, భారతమహావిజ్ఞానమును గనినవి! వీని జన్మస్థలము పొత్తములందు లేదు.

పొత్తములందు మనసు సంపాదించు విత్తమెంత? "గ్రథములు గ్రంథు" లనువాడు రామకృష్ణపరమహంస. వ్యాసవాల్మీకులు గ్రంథములనే నమలి మ్రింగి, మేడలందును, మిద్దెలందును, విద్దె నందియుండినచో, గొందులందే గోడలందే వారి ప్రజ్ఞాప్రతిభ లడగి యుండెడివి. ఆమహాకవుల మనసులు "చెన్నగునదీపులినసీమల దాగిలిమూతలాడి"

---

స తు తీరం సమాసాద్య తమసాయా మహామునిః,
శిష్యమాహ స్థితం పార్శ్వే దృష్ట్వా తీర్థమకర్దమమ్.
అకర్దమమిదం తీర్థం భరద్వాజ నిశామయ,
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా.
న్యస్యతాం కలశస్తాత! దీయతాం వల్కలం మమ,
ఇదమేవాఽవగాహిష్యే తమసాతీర్థముత్తమమ్.
స శిష్యహస్తాదాదాయ వల్కలం నియతేంద్రియః,
విచచార హ పశ్యంస్తత్సర్వతో విపులం వనమ్.
సోఽభిషేకం తతః కృత్వా తీర్థే తస్మిన్యథావిధి,
తమేవ చింతయన్నర్థముపావర్తత వై మునిః.
అగస్త్యదర్శనం చైవ జటాయోరభిసంగమమ్.
పంచవట్యాశ్చ గమనం శూర్పణఖ్యాశ్చ దర్శనమ్.
కబంధదర్శనం చైవ పంపాయాశ్చాపి దర్శనమ్,
శబర్యా దర్శనం చైవ హనుమద్దర్శనం తథా.
ఋశ్యమూకస్య గమనం సుగ్రీవేణ సమాగమమ్,
ప్రతిష్ఠవనమేవాథ మధూనాం హరణం తథా.
సంగమం చ సముద్రేణ నళసేతోశ్చ బంధనమ్.
ప్రతారం చ సముద్రస్య రాత్రౌ లంకావరోధనం,
శృంగిబేరపురే సూతం గంగా కూలే వ్యసర్జయత్.
కోసలో నామ ముదితస్స్ఫీతో, జనపదో మహాన్.
నివిష్ట స్సరయూతీరే ప్రభూతధనధాన్యవాన్.

ఆనందభరితములై కవితాధారలను కుప్పరించినవి. నదీధారలు కవితాధారలకు కన్నతల్లులని యెఱింగియే గోదావరీజలబిందువులను గ్రోలినవారు కైతలో నందెవేసినచేతు లయ్యెదరని కొంద ఱందురు.

నదీధారలలో భావధారను కాంచునది జిజ్ఞాసాగర్భితమైన దృష్టి. కళారాధనకు తప్పనిసరిగ అక్కఱైనది ఈచూపే! జిజ్ఞాసతోడు భక్తిప్రణయము లిందు గాఢముగ నుండును. హృదయము నాకర్షించు వస్తువున భావవ్రతుడు వీనినిగాంచును. రామనామమునకై, భక్తినిధికై మారుతి రతనపురాలను ముక్కముక్కలు చేయలేదా? వెనిస్ రాళ్లలో రస్కిన్ మహాశయుడు భావఖండముల నేఱుకొనలేదా?

---

సాహిత్యమునందు, సంగీతకళయందు, భక్తియందు ఆత్మసముద్భవమగుచుండును. ఆత్మకు కలిగిన భావాలు దివ్యభావము ప్రకృతియందు, ముఖ్యముగ తరంగిణులందు నుండును. నీటిబొట్టును "లోక పావనీ"! యని ఆవేశపూరితహృదయుడై సంబోధించి భారతీయుడు దాని ముందు సాగిలపడడా? భారతీయుని ప్రకృతిని గుణించియే నివేదితా సోదరి నయాగరాజలపాతములు భారతావనియందుండుచో నవి పుణ్యతీర్థములట్లు గణింపబడియుండుననియు, వానిదాపున నెన్నో గుళ్లును, గోపురములును లేచెడివనియు పలికినది. నదియందు గ్రుంకులిడిన ముహూర్తమందే భారతీయుడు నిజాత్మచే భూతభావ స్రోతమున మునకలు వేయుచును. రసతరంగిణియైన కవిరచనమునకును, తరంగిణికిని గల సంబంధ మెట్టిదో తెలిపితిని. భక్తప్రవరుల జీవనములను, రచనలను పరికించితిమేని ఎన్నెన్నో ఝరీమతల్లులను గాంతుము. కావ్యకర్త కావ్యపాత్రను సరిత్తీరమున నిలుపుటకు ముచ్చటపడులాగున, భక్తవరేణ్యుడు తనయిలువేలుపును శైవలినీకూలమున నిలుపుటకై ఎంతో యుబలాటము జూపుచుండును. రాము యాత్రికుడై, జగదీశుని యాత్రికుడని వీరు ప్రస్తుతింతురు. బహుళదృష్టాంతములను చేర్కొనుట కిందు తావులేదు. శ్రీ జయదేవకృతగీతగోవిందకావ్యములోని కొలదిపంక్తులను మాత్ర మిందుదాహరింతును.

"స్ఫురదతిముక్తలతాపరిరంభణముకులితపులకితగాత్రే,
బృందావనవిపినే పరిసర పరిగత యమునాజలపూతే."

"శ్లో. యమునాతీరవానీరనికుంజే మందమాస్థితమ్
ప్రాహ ప్రేమభరోద్భ్రాంతం మాధవం రాధికాసఖీ"
"ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ."

వానిని పాఠకలోకమునకు పంచి యీయలేదా ?* భారతదృష్టాంత ముపై కన్నిడి, గ్రంథరచనమునకు గడంగిన (కార్లైలు, ఎమర్సను లిట్లని తెలుపుకొనిరి.) తనగురువువలె నీత డిట్టి దృష్టి నందినాడు

భారతీయునిదృష్టి సూర్యకిరణము బోలునది. మయూఖమునకు గల జిజ్ఞాస ఎంత యద్భుతమైనది! జ్ఞానమునకై జగములు తన్నుద్దేశించి, గాయత్రి జపించుచుండ నిది సుఖస్వప్న మట్లు సూనసమీపమున జేరి గిలిగింతలచే, ముద్దులచే, దానినిలేపి, పక్కున నవ్వించి, ముల్లోకములను నిండింపజాలు ప్రణాయపరిమళమునుండి బుడుంగున ప్రసవహృదయమున మునింగి, మరందరత్నాకరమునుండి జ్ఞానరత్నములను ప్రోగొనరించుకొనదా ? తన యేడురంగులతో తళ్కొత్తుచు చిఱుతరగలపై నృత్యగీతలూగుచు, మర్త్యలోకము నుండి ఎంతెంతో భావసామగ్రిని మోచుకొని దివియందు చేరవేసికొనదా? భారతీయుని దృష్టి అలలందును, కుసుమకేసరములందును, తీవలందును, తెమ్మెరలందును, కొండచరియలందును చొచ్చి ఎంతేనివిజ్ఞానము నందినది! అంబరచుంబి మహాద్రులను, విమలసరిల్లలామలను, శుభ్రకాసారములను, గభీర సింధువులను పొత్తంపుబుటలు గావించుకొనినది! జ్ఞానసంభరితమైన రవిమరీచి విశాలవిశ్వమున నద్భుతకాంతిని కలువడించులీల, విజ్ఞానపూరముతో తొలుకాడు భారతదృష్టి విశ్వవలయమున నపూర్వ తేజమును గుమ్మరించినది.

జగదీశునకు సవ్యసాచి నిమిత్తమైనట్లు ఈశ్వరశక్తిసమన్వితమైన ప్రకృతికి మహదుద్దేశములను యుగముల కెటిగించుటకై దృష్టిసమన్వితుడైన మానవుడు నిమిత్తమైనాడు. ఇట్లు నిమిత్తమాత్రులైన వారిలో ముఖ్యులు ఋషులును, కవులును, ప్రవక్తలును. ప్రకృతిలో తొలితావునందిన నవియంశిభావోపాసకులు జగద్ధాత్రిని గాంచి చేతులు మొగిచిరి. ఈయమ్మను సేవించుటకు, ఆత్మహృదయములందు జ్ఞానవాహి

---

*మహారచయిత రస్కిన్ వ్రాసిన "దిస్టోన్స్ ఆఫ్ వెనిస్' "*The stones of Venice*" (1851-4) నుద్దేశించియే కదా ఆతనిసూచార్యుడు కార్లైలు" సత్యసందీపితమైన మహోపదేశ" ("Most true and excellent sermon in stones") మని ప్రశంసాపూర్వకముగ పలికినాడు!

నిని బ్రవహింపజేసికొనుటకు వారు యాత్రసలిపిరి ! నదిపుట్టినచోటును చేరి "ఉద్భటాచలకూటాటోపలకోటి" యందు గగనచుంబిభావములను గాంచిరి ; ప్రకృతియందలి పరంజ్యోతికి ప్రణమిల్లిరి ! యాత్రికుడన ముముక్షువని యెఱిగి, జ్ఞానసంపాదనము ఆత్మశక్తివృద్ధికని, ముక్తికని గ్రహించి, విజ్ఞానార్జనమునకై తపస్సుచేసి, జీవితమును సార్థకము జేసికొనవలెనని పిన్నతనమునుండి మక్కువపడుచునేయుంటిని; యాత్ర సాగించుచునేయుంటిని. ఐహికధనసంపాదనలో మనసును ప్రవేశింపనీయక జగదీశుడు నన్ను పథికుని గావించినాడు. చిఱుతనమందే నా యాస్తిని దూరముగ నెట్టివేసినాడు. ఎందుండియో నిప్పునెరసులు దెచ్చి నాచిన్ని గుండెయం దుంచినాడు. గుండెయం దీయగ్ని రగులుచుండుటచేతనే పదునాల్గవయేట నేయడలెఱుగక, దాని ధూమవేగము ననుసరించి దూరయాత్ర నారంభించితిని. ఐహికవిభూతి నాజిజ్ఞాసానలముపై బడు జలపాతమగుచో, నా కది వలదని వేయిదేవుళ్లకు మ్రొక్కుకొందును. నాయాత్రకు* భంగముదెచ్చుపరిస్థితులు (అవి పచ్చనివైనను) నన్ను మార్కొనకుండుగాక ! నా మహారాష్ట్రయాత్ర నాజీవితయాత్రలో నొకఘట్టము మాత్రమే ! గోదావరీజన్మస్థలమున మానసాంజలిని నింపుకొనుటకే నాటి సంధ్యాసమయమున దానిదెస బర్విడితిని. మూర్తీభవించిన వారిధారగనై నాయాశయము కొండకొనపై కట్టుగుట తోచినది.

---

*విజ్ఞానార్జనమునకు యాత్ర అక్కఱైనదని భారతీయులు గుర్తించిన వెనుక నన్యదేశీయులును గ్రహించిరి. మెగస్తనీస్, ఫాహియాన్, ఇబిన్ బటూటా, హ్యూయన్ త్సాంగు మున్నగుపథికు లన్యసీమలనుండి మనదేశమున కరుదెంచి, ఎన్నెన్నో కష్టములకు శిరమొగ్గి విశేషవిజ్ఞాన మొంది, దాని స్వగ్రంథములందు జేర్చిరి. ఈయంశమునవే జవహారుపండితుడు ఇటీవల ప్రకటింపబడిన తనయాంగ్లగ్రంథమున నిట్టుల్లేఖించెను:

"Thirteen hundred years ago there came a great traveller from China to India in search of wisdom and knowledge. His name was Hiuen Tsang and over the deserts and mountains of the north he came, braving many dangers, facing and overcoming many obstacles, so great was his thirst for knowledge. And he spent many years in India learning himself and teaching others especially at the great university of Nalanda, which existed then near the city that was called Pataliputra and is now known as Patna. Hiuen Tsang became very learned himself ahd he was given the little of "Master of the Law"—the Law of the Buddha—and he journeyed all over India and saw and studied the people that lived in this great country in those far-off days. Later he wrote a book of his travels" (Vide 'First letter to Indira', page 156: "*India and the world*" *by* Pandit Jawaharlal Nehru.)

కావుననే నూతనశక్తి నందితిని. నాడు నాతపసు పండిన దనుకొంటిని. తపసుపండి నపుడేకదా సంతప్తచిత్తము నందనమునకు ప్రతిచిత్రము కాగలదు! మానసగోచరమైన భావపూర ముత్సాహప్రవంతుల నుప్పొంగించును! ఉత్సాహానందములు నవజీవన సామగ్రులు! నవభావము నవజీవనప్రదాయిని కాదా?

గోదావరిపుట్టినచోటున నలుతట్టులందు జోదులట్లు నిలిచిన నాలుగు ఉదుంబరవృక్షములు కలవు. పర్వతశిఖరమునుండి ఈవలికి నీ రుబుకుచుండును. కొండనుండి సలిలధార సరాసరిగ క్రిందికి పాఱుట గానము. శైలపార్శ్వమున నందందు ధారలు వెడలుచుంట జూతుము. ఒక్కొకచో నది గుప్తమైయుండును. ధార వెడలు తావులలో నిందును అందును రాతితొట్టెలగపడును. పుట్టినచోటున కించుక దిగువను కుశావర్తతటాకమునకంటె మిగుల జిన్నదియైన చెరువు కలదు. గోదావరి నీ రందు జొచ్చి, అందుండి తరువాతి మజిలీకరుగుచుండును. బ్రహ్మగిరి మీదను, త్రియంబకమునకు దిగువను గుప్తమై యుండి ఆఱుమైళ్ల దూరమున నదీరూపమున తోచిన తావలమందును, నాసికమున్నగు ప్రదేశములందును గోదావరిని నిశితదృష్టితో పరిశీలించితిని. ఈ యీ చోటులం దీశ్వర విగ్రహమును, గోదావరీ జనయిత్రీవిగ్రహమును, మఱికొన్ని మూర్తులను నిలిపి పూజారులు యాత్రికుల కడనుండి పైకము పిండుచుందురు!

నాటి సాయంసమయమున కడువడిగ నుదుంబరవృక్షములనడుమ జేరి, ఆవేశపూరిత హృదయుడనై జనయిత్రీ జన్మస్థలమున సాగిలపడితిని. అవిరళమై, అనంతమైన యాశీస్సై ఉదకము నాశిరమున బడినది. దావానలముపై బడిన అమృతవృష్టివలె, తీవ్రవేదనతో వ్రయ్యలగుతలపై నంబుధార పడినంతన నాయుల్లము చల్లనైనది. అప్పటి నాయానంద మెట్టిదో మాటలతో తెలుపజాలను. జన్మస్థానమునుండి కదలిపోయిన పిదప మనుష్యస్పర్శనంది సలిలము కొంత మలినమగును; దాని నైసర్గిక గుణమునకు కొంత భంగపాటు కలిగితీఱును. పుట్టినట్టిచోటులోనో? సహజప్రతిభ, సహజశక్తి, సహజగుణసహజమహత్త్వము లందేకదా వ్యక్తమగును! ఇవి యాత్మను సోకినపుడు దివ్యభాషయందే అది తన

యానందమును వెలారింపగలదు. తలపై తల్లి ఆతరుణమున చిల్కరించిన సలిల మిట్టిదని యెట్లు తెలుపుదును? చల్లవలె చల్లనైన నీరందునా? పన్నీరువానయందునా? చందనవృష్టి యందునా? అత్తరుచిల్కరింత యందునా? అమృతధారయందునా? ప్రణయసేచనమే యందునా? ఈ యుపమలన్నియు గూడినను, అత్తఱి నాహృదయమున జనించిన ఉత్తాల భావతరంగముల నుచితరీతి బ్రకాశ మొనరించినవని తలపను. తగుతెఱగున నాత్మప్రకాశమందని భావము రచయితమనసున కెంతేని నెగులు గలిగించును.

భువనము లన్నింటిని మహోద్వేగభరిత మొనరింపజాలు భావమును వజ్రపుదుక్కపోలు చిన్నిమాట తన బొజ్జయం దిముడ్చుకొనుచో, సాహితీవియత్తలమున నది చంద్రవంకవలె తేజరిల్లును. ఆదర్శ భాషాలంకారము అవతారపూరుషుని బోలునది. బ్రహ్మాండమున నిండి యుండు జగదీశుడు గోపాలు డైనాడని యెఱుగుదుము. మథురలో నీతడు జన్మించెనని ప్రాచీనసాహితి తెలుపుచున్నది. ఈసాహితిలోని ప్రత్యక్షరము భావభాసురమైనది. భావమాహాత్మ్యమును వ్యక్తీకరించు మాటకే ఇందుచోటున్నది. 'మథుర' పదమందే అవతారమహత్త్వము నిహితమై యున్నది. అనంతమైన పాలవెల్లిని మథించినంతన గొంత మీగడ తేలునుగదా! దుగ్ధసింధువులోని గుణములన్నియు మీగడ తఱకయం దడగియున్నవికదా! అనంతవిశ్వము నావరించుకొని యున్న సర్వేశుడు ఆత్మమథనముగావించుకొనినాడు కావున మథురలో నీశ్వరమహత్వమంతయు గృష్ణరూపమున మీగడయై తోచినది! ఈశ్వరశక్తులన్నియు నొక్కకృష్ణావతారమున విజృంభించినవి.* ముద్దు

* మనుష్యరూపమున విజృంభించిన ఈశ్వరశక్తిని క్రైస్తవులు "మానవపుత్రుడు" "ఈశ్వరపుత్రుడు" (Son of man," "Son of God") అను వాక్కులతో దృష్టాంతీకరించుచుందురు. వీరు చూపుప్రత్యక్ష దృష్టాంతము ఏసుసంయమి. రాముని యందు మనుష్యశక్తి అధికము; కృష్ణునియం దీశ్వరశక్తి మెండు. రాముడు కన్నీళ్లొడ్చిన సమయములును, పలవించినముహూర్తములు నున్నవి. వీనికి కృష్ణజీవితమున తావు లేదు. జగదీశుడే తానని విశ్వరూపసందర్శనమున కృష్ణుడు రూఢిచేసినాడు. నరునకును 'భగవద్గీత' నిచ్చినాడు. పూర్వోక్తభావమందు శ్రీరాముని "Son of Man" అని, శ్రీకృష్ణుని "Son of God" అని తెలుపనగును.

కృష్ణుని ఉదరమున పదునాలుగు భువనములు నిహితమైయుంట గొల్లతల్లి కన్గొనెను. కృష్ణునిబోలు అలంకారమును, యశోదబోలు పఠితయును గోచరించి నపుడు సాహితీవసుమతి గోకుల కెనయై దివిషద్వర్గమునకు లీలాభూమి కాజాలును. అనంతభావము స్వయంభువు బోలు భాషా లంకారమున నాత్మప్రకాశము నందును. కవి దివ్యపురుషుడు కావున ఆతనిమనసు కనిన యలంకారము దివ్యశక్తికలది. అవతారమందలి ఈశ్వరమహిమను గుర్తింపజాలని నరుడు తోచుతటె శుద్ధ, బుద్ధ, నిత్య, సచ్చిదానందఘనస్వరూపము కాకమానె విశ్వరూపసందర్శన మక్కఱ గును. గ్రహణసాధ్యముగాని దృశ్యము సమ్ముఖమున చూపట్టినపుడే నరుడు దాని మహత్త్వమును గుర్తించినాడు. దివ్యశక్తి సమన్వితా లంకారసృష్టికై తడయవలసివచ్చినపుడును, ఇట్టి యలంకారములోని భావబ్రహ్మాండము నాత్మహృది జిక్కబట్టజాలు పఠిత గోచరింపనపుడును విషయ గ్రహణమునకు తోడుపడునది ప్రత్యక్షానుభవమే! పరానుభవ మును, పరభావమును ఆత్మసమ్ముఖమున ప్రత్యక్షమొనరించు ప్రవక్త పగిది అలంకారము నాశ్రయించి భావభిక్షనందుటకంటె, స్వీయానుభవ మున విషయమును హృదయంగమమొనరించుకొనుట ఘనతరవిష యము. బ్రహ్మగిరిశిఖరమున, చల్లనితల్లి యక్కున నుత్తమాంగము నొగ్గినపుడు నాయుల్లమందిన హాయి యెట్టిదో గ్రహింప నభిలషించు సోదరులు నావలె కడుకష్టమున బ్రహ్మగిరినెక్కి శైవలినీమాతహృదయ మున, నామె జనించిన తావలమున శిరములొడ్డితీఱవలెను.

పవిత్రాంబుధారలం దక్లే కొంతసేపు తలనునిచి, తనివార తాన మాచరించి, భావపూరితశీతలవారిని కడుపారద్రాగి, కనులుమూసి, మన సును హాయిలో ముంచి, పదపడి పశ్చిమదిశను పరికించితిని. అస్తంగతు డగు నాదిత్యుడు నన్ను జూచి పక్కున నవ్వుచుండెను! రాశిరాసులైన కెంపులు తెచ్చి, గుండజేసి, దివ్యతో యమునగలిపి, అపూర్వమైన వసంత మును గావించి, జగత్కల్యాణ మహోత్సవమని కాబోలు నగుమోమున వసుమతీవధువుపై చిల్కరించుచుండెను! రంగురంగుల రంగవల్లులు దివి భువి నొప్పుచు, కవిహృదయముబోలు కల్యాణమండపమున కగ్గలంపు

నిగ్గు గూర్చుచుండెను! సప్తద్యుతిసందీప్తములైన జలదములు మహో త్సవమును చూడవచ్చిన ముత్తైదువుల ట్లగపడుచుండెను!

బ్రహ్మగిరికి కొంతదూరమున నైఋతియునకొండ మఱొండు కలదు కవలలట్లున్న భూధరములనడుమ తాత్వికునిమనసుబోలు లోతులోయ యున్నది. రాజదంపతులకుఁబగట నెందరెందఱో వందిమాగధులు నిలుచులీల, జోడుకొండలచుట్టు నెన్నెన్నియో గుట్టలు చాలదూరము వఱకు వరుసగ నిలిచియుండెను. లోయనిండదోఁణుకు రంగారుబంగారు వెలుగు కొండయంచులనుండి యవ్వాలి కల్లనల్లన తుంపురులై రాలు చుండెను! కోటికోటికాంతిబిందువులతో తొలుకాడు నుపత్యక ప్రకృతి వధూటికై యేర్పడిన దివ్యహ్రదమట్లు తోచెను! కవిమానసమున రివ్వు మను భావపరంపరలట్లు శైలసామ్రాజ్యమున యథేచ్ఛగ శకుంతసంతతు లెగయుచు హృదయములు విప్పి మధుపూరమును లోయలోనికి కుమ్మ రించుచుండెను! పిట్టకుత్తుకలనుండి జలజలరాలు గణయతులు హృద్య మైనపద్యమై ప్రకృతివీనులకు విందు చేయుచుండెను! హేమ వర్షము బోలుసూర్యాలోకమున తానమాడు తరుణసాలములును, గగనచుంబిమహాద్రుమములును, కన్నుగుట్టు చెంగలువకేదారము లును, పైడిపూలనీను కుంజవాటికలును వికిరకవుల యాశ్రమము లగుడు భాసమానభావస్థగిత మహాకావ్యములకైవడి కానుపించు చుండెను! క్రేవల నల్లనల్లన నల్లాడు కమ్మతెమ్మెరలు ప్రాణపతి శరీరవల్లరి నంటిదోగు ఇల్లాలి గుసగుసలవలె నుల్లమును సోకుచు నందు కడలేని హాయిని వెలారించుచుండెను! ప్రణయినీపరిష్వంగము పగిది పర్వత హృదయము నంటి, అందు పులకలు లేపు పరిమళము, ప్రఫుల్ల హృద బ్జమునుండి గుప్పున నుప్పొంగు భావమట్లు, అదృశ్యమయ్యు ననంత మైన ఈశ్వరకరుణకరణి పచ్చనిమనుష్యాంతరంగమున నెన్నెన్నో ప్రే యానంద స్వప్నములను సృష్టించుచుండెను! ఆదర్శశిక్షణమును, ఆత్మనుతనుపు విద్దెను మానవు డందవలసిన దిట్టి దృశ్యములందే! ఇట్టి

ప్రశాంతతరుణములందే! ఇట్టి పవిత్రముహూర్తములందే! ఇట్టి విశ్రాంతిసమయములందే!*

ఉసురుల నూడవెఱకు ఉపద్రవములును, గుండెలను గుండజేయు అపాయములును, మనసును చీల్చి చెండాడు యాతనలును, కడుపునుకోసి వదలు చింతలును నాటి సంధ్యాదృశ్యమును చూచినంతనే ఎందెగసినవో! వసుమతి నెడనెడ దోచు రోతను, జఘన్య క్రియలందు పుట్టుకంపును, డొంకయట్లు నలువలకులందు నే డల్లుకొనియున్న ప్రవంచనమును మనసులను తట్టునపుడు "అయ్యో! పృథ్వియంతయును క్రుళ్ళుగోతిలో దిగబడినదే!!" అని యారాటమున క్రుంగిపోమా? ప్రస్తుతము ఐరోపాఖండమునుండియును, ఈజిప్టునుండియును, దూరప్రాచ్యభూమినుండియును వెడలు ఘోరసామరికశబ్దములును, విషవాయువులును, రుధిరస్రవంతులును మనుజునిగుండెయందు భయమును, జుగుప్సను, దుఃఖమును లేపుట లేదా? పలువురువిద్యాధికులే, పలుకుబడిపడసిన యదృష్టవంతులే చెడుచెయిదములకు దలపడుట జూచినపుడు అంతరంగమున గార్చిచ్చు రగులుట లేదా? "మనుష్యహృదయమును నేడేలునది పిశాచమా? హననక్రియలే, దురంత వధలే నేడు రాసక్రీడ లైనవా?" యని దూపిల్లుచుందుముగదా! † కాని,—కాని గభీరనిరాశయందు మనసు దొరలుచుండ, హృదయవీథియందు బడబానలము చెలరేగుచుండ, వేడిగాడ్పులట్లు నిట్టూర్పులు వెడలుచుండ, సర్వేంద్రియములందు చిటచిటలు రవరవలు రేగుచుండ, అగ్నివృష్టివలె బాష్పకణములు రాలుచుండ, తప్తశలాకవలె శరీరము రవులుచుండ, నేలగూలు నిసుగును అక్కునజేర్చు అమ్మవలె, నేదో యద్భుతశక్తి మానవహృదయమును ప్రేమసంశ్లేషమున జొనిపి, కనులు తుడిచి,

---

* నేటి జపాన్ మహాకవివాక్కులను గమనింపుడు :

"I wonder if the very soul of a man of high character, does not exhaust itself in that one Word—leisure. He whose hours exist only on the face of a clock is a worlding, a philistine, an earthworm. What a joy it is to feast on leisure!" Vide "*My Ideal Home*" By Yone Noguchi, Professor of English Literature, Keis Gijuku University, Tokyo.

† మేథ్యూ ఆర్నాల్డ్ మాట లెట్టివో చూడుడు :

"And we are here, as on a darkling plain, swept with confused alarms of struggle and flight, where ignorant armies clash by night."

సెవులందు మధురసాంత్వనము వోయుచున్నది! ఈశక్తి శంఖచక్రములు ధరించి ప్రత్యక్షముకాదు. అపరంజిలతికలు పోలు రవిమరీచులందు, రజతసలిలమున కెనయైన జ్యోత్స్నయందు, ఉద్వోత్తుగ నుప్పొంగు సౌరభమందు, దశదిశల నింపు మాధుర్యమందు, అపుడపుడు చెవుల బడుమంచి మాటలందు, కనులదోచు సొంపుచేతయందు, వెలుగురేకలు పోలు తలపులందు నది విరాజిల్లుచుండును! ఈ శక్తికతననే నిరాశాంధ కారము పటాపంచలగును. "వసంతసమయమున నిందందు ప్రస్ఫుటించు పలువిధప్రసూనములపగిది సదాశయములు వసుమతిలో కుసుమించి, హృదయము నానందసౌరభముచే నింపును! గాఢసంతమసమునగూడ చక్కనిచుక్కలు మింటిపై తేజరిల్లవా? ఎట్టికాళరాత్రియైనను, చక్కెర గోళీలని చుక్కలను దిగమ్రింగజాలునా? చీకటికొట్టునగూడ నెందుం డియో గురువాక్కువలె క్షీణాలోకము జొచ్చి మనసున నాశను లేపు చుండదా? అజాండమునంటు అంధకారము నొక్కొకపు డొక్కచిన్ని మెఱపు చీల్చివేయదా? జగతి నేలునది ఆలోకముగాని అంధకారము కాదు. అనంతకాలమున ననంతజీవియై వర్ధిల్లునది సౌందర్యముకాని కుత్సితముకాదు. విజయకేతన మెత్తువాడు జగదీశుడుకాని పిశాచము కాదు. ప్రతిభాపాణింధమమును మ్రోగించునవి ఉత్తమాశయములుకాని దురూహలు కావు. నిరాశను చిత్తముపై స్వారిచేయనీయకుడు. సహన కవచము దాలిచి శాంతిమంత్రమును జపింపుడు. ఆశారక్తాభను తప్పక చూతురుజుడీ! ఇహజీవనము తుచ్ఛమైనది కాదు. మహత్తరజీవితమున కది అక్కఱైనసోపానము. జగతిని జూచి 'ఇసీ!' యనకుడు. ఈశ్వర సామ్రాజ్యమున కది ప్రధానద్వారము! పంకిలముమీద మనసును రాలనీయరాదు. సహృదయుని అంతరంగమును, గగనలక్ష్మీసుంద రాననమును, ప్రకృతిసీమంతినీ ప్రశాంతహృదయమును, బాలకుని ముద్దుమోమును చూచి మురియు" డని ఈ యదృశ్యాధ్యాత్మికశక్తి పలుమాఱు మనకు ప్రబోధించుచునేయుండును. వెతకిన, రొంపి ఎం దుండదు? గాలించిన రొచ్చు కానంబడదా? ఉన్నదానిని లేదనుట ఎంతదోషమో, లేనిదాని నున్నదనుటయు నంతదోసగే? అనుమాన మును, అడలును, అసహ్యమును ఇలువేలుపులు చేసికొనువానికి పూజా

మందిరమున పిశాచగణమే ప్రత్యక్షమగును. ఇతడు మెచ్చగలది, చూచి యానందించునది జగతిలో నేమియు నుండదు. గులాబి పూవును చూచి"-ఈచోటు పవిత్రవంతమైన" దనిపలికి ముకుళితహస్తుడై ఒకప్పుడు ఎమర్సన్ మహాశయుడు సుమసమ్ముఖమున వంగి నిలిచినాడు! గులాబి పై కన్ను వేయక క్రిందిపేడలో చూడ్కి జొప్పించువాడు మనుష్యరూపమున నున్నపురుగందును. మనుష్యచరిత్రను గనిపెట్టుటకు ఏండ్లను, పూండ్లను గడపనక్కఱలేదు. కొలదినిముసములు వ్యక్తిచెంత నిలిచిన చాలును. మాటలందును, చేతలందును పరిమళమును వెలారింపగలవాడు మూర్తీభవించిన స్వర్గము! నిరంతరదూషణమందును, దురంత దుర్విమర్శనమందును రొచ్చులో పడిన పందివలె పొరలాడు వాడు రూపుదాల్చిన నరకమని నొక్కి చెప్పవచ్చును.

సహృదయులు ప్రకృతి నాశ్రయించి, సదాశయద్యుతిని గాంచి, దివ్యడింభకములనట్లు మహత్తరభావములను ప్రసాదించు తల్లియని దానికి ప్రణమిల్లుదురు. ఈసహృదయులెవరు? కవులును, ఋషులును, ఆచార్యులును, ప్రవక్తలును, గుణవంతులును గారా? వీరందఱును యాత్రికులే? వీరు ముక్తిదూతలని కూడ నిరూపింతును. సత్యవ్రతులై సౌందర్యోపాసకులై, భావపిపాసువులై, మహాజిజ్ఞాసువులై వీరు యాత్ర సలుపుదురు; తపమాచరింతురు.

మనుష్యసంఘమునకును, మహారణ్యములకును, మహోన్నతపర్వతములకును ప్రాచీనకాలమున దగ్గఱచుట్టఱిక ముండెడిది. మానవులను వదలి కొండలందును, బిలములందును ముక్కులు మూసికొని ఆత్మముక్తికై భారతమానులు తపించిరనియు, సంఘసేవ నించుకైన వీరెఱుగరనియు పలువు రనుచుందురు. మన కవిఋషులును, ఆచార్యులును చేసిన, నేడును చేయుచున్న మానవసేవను వసుమతియందుమఱెవ్వరును చేయలేదని ఋజువుచేయగలను. రమ్యప్రకృతియందుండియుండి, దానిని మనుష్యహృదయమున ప్రవేశపెట్టినవారు వీరే! వీరికతననే విజ్ఞానకుధర శిఖరములపై నుత్పన్నమైన భావధుని, స్వార్థదరులందు నక్కియుండక బహుయుగములనుండి స్రవించుచు, బహుళమానవమానస కేదారములను దనుపుచున్నది; భావభరితములైన వీరిప్రబోధములు ప్రజల నిత్య

జీవనములం దింకిపోయినవి. * వీరిరచనములును, వీరి జీవితవిధానము లును, వీరియుద్బోధనములును గలసి భారతవిజ్ఞానమై అన్యసీమ లందుగూడ స్వాగతమందెను. కొండసింగారమున, కాంతారసంతానములందు, గురుకులములలో ప్రశాంతాశ్రమములందు జనించిన విజ్ఞానమును దూరసీమలకును, భావియుగములకును అందించిన పరార్థ జీవులు వీరు! వీరికిని, వీరియుద్దేశసిద్ధికిని నడుమ నెన్నోకంటకములును, నెన్నోసంకటములును నిలిచినవి. సంకల్పసిద్ధికై నడుము గట్టిన యోధులు కావున నిచ్ఛాశక్తిదృఢ నిశ్చయములు, సహనశాంతులు, స్థితప్రజ్ఞవజ్ర సంకల్పములు మున్నగు గురుగుణములను దమయాత్రయందు దలవడుచు కొనిరి కావున వెనుకంజవేయక, వీనికి తన నవశక్తినంది,విక్రమసింహులై గమ్యస్థానముదెస వీరు నడచిపోయిరి. శ్రీశంకర రామానుజ, రామానందవల్లభాచార్య, మధ్వాచార్య శ్రీచైతన్యప్రభృతిమహాయాత్రికులాశ్రమస్థానములనుండి భావవిభూతినిగొని, క్లిష్టపథములగుండా కదలి పోయి మానవలోకము నుద్ధరించిరి. వీరిప్రత్యేకజీవితములను అనిమేషలోచనములతో పరిశీలించితిమేని ఎన్నెని దృష్టాంతములు చేజిక్కును.

---

*వీరీశ్వరుని నదులందును, గిరులందును, దరులందును, రాగరంజితనభమందును, చంద్రార్కతారలందును, సౌందర్యసంశోభితవనములందును (భారతసాహితియందలి 'ప్రతిపుట'యందును విని గోచరించుచునే యుండునుగదా!) విలోకించుటచే నీశ్వరభావసముద్భవభాస్వదాశయములగూడ నందే కాంచిరి. ఈవాక్యములను విలోకింపుడు:

"Think of the form of your *Ishtam* (ideal) as smiling and full of bliss...... Imagine that everything is shining through its lustre...... *Ishtam* pervades land and water, hills and dales, sky and stars—everything" (Vide Page 8. "*Spiritual Teaching*" – By Swamy Brahmananda)

"The water of the Ganges is verily the holiest of all waters; it fulfils one's desire and is a help to realising the *Ishtam*" Swamy Brahmananda.

"The water of the Ganges, the holy *Prasadam* of Jagannad and the sacred dust of Brindavan are verily Brahman in reality." Sree Ramakrishna Paramahamsa.

దక్షిణేశ్వరమందలి పంచవటీతీరమున పాడుచు నాత్మహృదయమున శ్రీ రామకృష్ణ పరమహంస దివ్యమధురనాదమును వినుచుండువాడు !

"To bring the idea of vastness within, one should see the Himalayas or the ocean or gaze at the sky" (Vide Page 234.) Brahmananda Swamiji's "*Spiritual Teaching*"

లుంబినీవనము, ఉరువేలవనము, జేతవనము, సారనాథమందలి లేళ్ల వనము, అనాథపిండికుని ఆరామము, బోధిద్రుమము, పూతనీరాజనార్ఝరి, రాజగృహసమీపస్థ గిరిదరి బుద్ధజీవితమందలి ప్రధానదృశ్యములు! దేవదత్తప్రభృతులు శాక్యసింహుని యాయువుదీయ సుద్యమించిరి. తన యిక్కట్టులను నెట్టివేసి, తథాగతుడు నిర్వాణమహత్త్వమును ప్రజల కుద్బోధించినాడు. ఈతడు చేసినట్లు సాంఘికసేవ మఱెవ్వడు చేసినాడు? మహావీరుడు? మహారణ్యములందు దుండగీండ్ర దెబ్బలకు వెన్నొగ్గియే కృతకృత్యుడైనాడు! కబిరుదాసు భారతపథికుడ నని చెప్పికొనినాడు! సృష్టియంతయు నొక్కకుటుంబమనియు, దీనియధినాథుడు జగన్నాథుడనియు వచించి ప్రజల నాతనిమ్రోల జేర్చుటకై మహాయాత్రికుడు మహమ్మదు కావించినకృషి ఎట్టిదో ఎఱుగమా?

కవియును ఈయాత్రికుల వర్గములోనివా డనియే కదా తెలిపి యుంటిని.* తక్కుంగల పథికుల క్లీతడును వసుంధరను చీకటినుండి, చింతనుండి, నెగులునుండి, దిగులునుండి, విషవాయువునుండి, గభీర కలుషమునుండి కాపాడును.

కళ, మతము, తాత్త్వికశక్తి, మనుష్యజీవితము దాశరథులట్లు కలసినపుడే జగతియం దీశ్వరసామ్రాజ్యము నెలకొనును. ఇట్టి కలయిక

*ఏదేశమున నేకాలమున నుద్భవించిననేమి కవులందఱును యాత్రికులె! వీరిభాషలును, వీరిసృష్టినాకర్షించిన రాజకీయార్థిక సమస్యలును వేఱువేఱై యుండవచ్చును. కాని వీరి ప్రధానోద్దేశములందు భేదభావములు లేవు. వీరందఱును సత్యవ్రతులే సౌందర్యోపాసకులే! మహదాశయముల నారాధించువారే! వ్యాసహోమరులును, వాల్మీకిసోఫోకిల్సులును, భట్టబాణగటేలును, కాళిదాసుషేక్స్పియరులును, భారవిడాంటేలును, భవభూతిషిల్లరులును, భానుభాసులును, బిల్హణస్పెన్సరులును, మల్హణటెన్నిసనులును, సుబంధుబ్రౌనింగులును, మాఘుబైరన్లును, మురారిషెల్లీలును, శివభద్రవర్డ్స్వర్తులును, సౌమిల్లిస్కాట్లును, చోరకీట్సులును, మయూరబెన్‌జాన్సనులును, దండిడ్రైడలును అన్నదమ్ములే! తన పాత్రములందలి కొండొకయాత్రికు నుద్దేశించి డాంటే మహాకవి తెలిపిన ఈనుడువు వానికే చెల్లును.

"He had gone through almost all the parts to which this language (Italian) extends, a pilgrim, almost a beggar." (See also the reference which Dante makes to his own exile at Verona and elsewhere in Paradise XVII 58-60)

నేడు గోచరించుట లేదు; కావున ప్రకృతియందలి మహత్త్వము నేడు మనుష్యచరిత్రను సోకుట లేదు. మహాయాత్రికులైన కవులును,* ప్రవక్తలును, తాత్త్వికులును, ఆచార్యులును గాక, సామరికసామగ్రిసృష్టికై తోడ్పడు భౌతికశాస్త్రజ్ఞులే నేడు పొడసూపుచుండుటచే అధునాతననాగరకత (గ్రీకు సారస్వతమం దుల్లేఖింపబడిన భీషణవృషభ మట్లు) చింతనిప్పులను క్రక్కుచుండుటచే, ఆత్మశక్తి యడగి పశుబలము హెచ్చుచుండుటచే, రక్కసివలెస్వార్థము వికృతనృత్యము సలుపుచుండుటచే నేటివసుమతికి దుర్దాంతదుస్థితి పట్టినది. ప్రపంచము నీదుర్గతినుండి యుద్ధరింపగలవారు యువకులు. మహత్తరమైన ఈక్రియను నెఱపుటకై వీరు తగుశక్తి నందవలెను. దీనిని పడయుటకుమున్ను వీ రెన్నోని కఠోరపరీక్షల నెదుర్కొనవలెను. వీనియందు గెలుపునందినంతన, నూతన బలమునందినంతన, మహోన్నతకర్తవ్యశిఖరమున గాలూనినంతన, అంతరంగ మానందప్లావితమైనంతన గనువిందొనరించు దృశ్యము, మహదా

---

*నైతికవిభూతిని సృజింప లేఖినిబూనిన కార్లయిలును, మానసవృష్టియందెన్నో యేండ్లు గడపిన ఆర్నాల్డును, మతమహత్త్వమును గుడిగోపురమట్లు నిలువబెట్టి గంకణము కట్టుకొనిన న్యూమేనును, కళోపాసనమందును, సంఘసముద్ధరణమందును మనసుంచిన రస్కిన్ మహాశయుండును ఆత్మజీవితములను ప్రత్యేకముగా నొక్కొక మహాగ్రంథము గావించుకొనిన యాత్రికులే! వీరిబృందమున చేరజాలనివారు కవులేకారు. ఇంచుక కృషి సలిపినచో, ప్రతిమానవుడును పద్యమల్లగలడును. కాని పద్యమనగ కవితయా? గుడియన దేవుడా? శరీరమన మనుష్యుడా? పద్యమును, గుడియును శరీరమును బాహ్యావరణములే! లేతమొగ్గయందు గభీరసౌరభసింధువు నిహితమై యుండునట్లు, తుషారకణమున మిహిరమండల మడగియుండునట్లు, చిన్నిపద్దెమున, ముద్దుగొలుపుగద్యమందు భావబ్రహ్మాండమును ఒక్కొత్తింపగలవాడే కవి! స్వీయప్రతిభను గుఱుతించి, జగతిలోని ఈశ్వరునిచే పుత్తెంపబడిన రాయబారినని యెఱిగి, బాహ్యప్రకృతికిని, మనుష్యప్రకృతికిని గల వియ్యమెట్టిదో, అందెంత సయ్యమున్నదో వివరించి, నిహితభావములను వ్యక్తీకరించుచు వసుమతియందు నవజీవనసృష్టి గావించువాడే కవి! పైన నుల్లేఖింపబడిన అద్భుతశక్తి ఆచార్యుని హృదయమున ట్రీజనియొడండన కూడి చక్కనైన తులసికోటను గావించి, అందు దివ్యదీపికను వెలిగించును. ఇందలి మణికాంతులనే ఈతని రచనమందును, జీవితమందును, ఈతడు వ.సలుసంఘమునందును విలోకించి ఆనందింతుము; నూతనబలమంది, లోనిపశువును కట్టుత్రాళ్లతో బంధించి, ఆత్మజీవితస్యందనములపై విజయధ్వజమును నిలుపజాలుదుము.

శయప్రదీప్తకాలవియత్తలము వీరిపురోభాగమున వెలయుట తథ్యము! నాటిసాయంసమయమున, బ్రహ్మగిరిశిఖరమున, దాశరథులపోలు ఉదుంబరవృక్షములనడుమ, విజ్ఞానశైవలినీజన్మస్థానమున మనోహరప్రకృతిమ్రోల ననిమేషలోచనుడనై చేతులు మొగిచి నిలిచిన ముహూర్తమున నే బడసిన పారమిదియే!

సూర్యుడస్తమించిన కొంతసేపటికి సంజకెంజాయ అదృశ్యమయ్యెను. ఆత్మజీవితమునుండి భాగ్యరేఖలు జలజలరాలినపుడు, చేటుమూకలందు ప్రవేశించి పైశాచికనాట్యము సలుపులీల, కారుచీకటులచ్చో జొరబడదొడగెను! నిముసములో బ్రహ్మగిరియంతయు నంధకారబంధురమైనది! ఎట్టిఘనుడైనను, ఎంతబలశాలియైనను, సమయసమయములందు లెక్కలేని సేగులకు నిజజీవితము నొడ్డవలసినదే! పుణ్యనదినిగని, గగనము నంటునంతటిమహోన్నతి నందిన బ్రహ్మగిరిపాడ నాటి నిశీథినీసమయమునగాఢతమసమునకు తలయొగ్గవలసివచ్చెనుగదా! రక్కసిమోమువలె భయంకరమైనవిభావరితో కాలము గడపు టెట్లు? సమీపమునగాని, కొంతదూరమునగాని ఏదేనియాలయమో, పర్ణశాలయో గోచరించిన సంతసించియుందును. అట్టిదేమియు గనబడలేదు. నాలుగు చెట్లనడుమ, తల్లి పుట్టినతావులోనే రజని గడప నిశ్చయించితిని. ఇరులందు నిందందు మసలిన, నేదేని ముసలము వచ్చునని యూహించి, అందే చతికిలబడితిని. రాత్రి అపు డేడుగంటలుమాత్రమే యాయెనని ఊహింపజాలితిని. కడపవలసినకాలము తక్కువకాదు. వచ్చివచ్చి కారుచీకటులందు తలదూర్చుట మంచిపని కాలేదేమో యనుకొంటిని. హృదయమందు తలయెత్తిన తీవ్రవాంఛయే నన్నచటికి బలబల యీడ్చుకొని వచ్చినదికదా! ఈవాంఛ నరికట్టుటకు నాకు శక్యము కాలేదు. 'మొండిసాహసము'నకు దలపడితిని. దీర్ఘయోచనమువలె 'మొండి సాహసము' కూడదని యూహింతుము. కాని మహాద్భుతములను మూటలనట్లు మూపునగైకొని కాలము నడచుచుండ, నాయద్భుతములను చేబట్టవలెననిన మొండిచొరవ యక్కరయై యుండునని అపుడపుడు తలపోయుచుందును. దీర్ఘచింతనము మనుజుని నిలిచిన తావులందే నిలిపి, రాతిబండ జేసివేయును! మొండిచొరవ వానిని ఘోరవిపత్తులందు గూల

ద్రోయును! విపత్తులందు బడమేని, మనమందు అనుభూతియెంత? సంపాదించు పరిజ్ఞానమెంత? నిదురించిన మనుష్యశక్తులు ఆపదలవలననే, సమ్మెటపోటున నువ్వెత్తుగ నులుకు అగ్గినెరసులవలె లేచును! వెన్క-నుండి వేటకాడు వాడితూపులు వదలుచు, తఱుముకొని వచ్చుటచే గదా కురంగము జవోపేతముగ పర్వెత్తి, తనపరుగున నాత్మశక్తిని గుర్తించినది! మానవుని సహానసామర్థ్యములు విజృంభించవలెననిన, మనుష్యులందొకండు మహిమోపేతుడు కావలెననిన, ఉదాత్తమైన ఉద్దేశసిద్ధికి మార్గదర్శకమగు ఆపదకై యాతడు తపించవలెనని (సర్వశక్తుల నీయత్నమున నాతడు కేంద్రీకరించును గావున) నొక్కి చెప్పుదును. ఆవాహనముచేసినను పిడికిట మానికములనుబూను ఆపదలు ప్రత్యక్షము కానియెడల, నడుముగట్టి తానే వానిని వెదకుకొనుచు పోయి సంగరమున ఢీకొనుమని సవాలు చేయవలెను.* కడలిగడచి జేసన్ ఇట్లొనరించెనని గ్రీక్ సాహితి తెలుపుటలేదా? ఆపదలందు లంఘించునభ్యాసమును బాల్యమందే, జేబులో నిండైన బండి సున్నను నిలుపుకొని, హౌరాస్టేషనులో దిగిన ముహూర్తమునుండియే యలవఱుచుకొంటిని.

చెట్లనడుమ జేరుకొంటినిగాని నిద్దురపట్టించుకొనుట అనర్థకహేతువగునేమో యని యనుకొంటిని.కనులు మూసిన నెట్టియపాయము

---

* ఈ యంశమును గుర్తించిన పాశ్చాత్యులలో నొకడు ముసోలినీ! ఈతడు సభ్యజగతి కెంతో యెగ్గుచేసినంటనిక్కమే! అబిసీనియనుల యెడల నొకప్పుడు దుండగమునకు గడంగినాడు. పదపడి చక్కని పాఠమును గ్రహించినాడు. హిట్లరుతో కలిసి నేటి ప్రపంచయుద్ధమున కొంతకాలము విజృంభించినాడు. ఈదోసగులటుండ నీతడు అద్భుతమైన ఇచ్ఛాశక్తి నలవఱుచుకొనినవీరుడని, ఆపదలందు భయరహితుడై మసలువాడని, స్వీయసీమపురోభివృద్ధికై ఎన్నెన్ని యత్యాచారములు చేసినను స్వార్థము నారాధింపలేదని, తనవారికైగాని తనకైగాని, ఈతడు హంసతూలికను కల్పము చేసికొనలేదని, నిరంతరవిలాసమున బొరలాడక తనరైతులతో, కూలివాండ్రతో గలసి శ్రమించువాడని యెఱుగుదుము. ఆపాయముల నాహ్వానించుట ఈతని యాశయమాయెను. ("Live daugerously" is his Motto.) పిల్లిపిల్లలనట్టీకడు సింహడింభకములను పెనుచువాడు!

తలపై వ్రాలునో! నలుతట్టులందును విద్రోహిమానసమట్లు దట్టమైనయడవి చూపట్టుచుండెను! అందెన్ని ఘాతుకమృగములున్నవో!ఏపులియో తటాలున మీఁద నెగిరిపడి, నిమరించునన్ను నిముసములో నుదరగోళమున ప్రవేశపెట్టునని అతిశయోక్తి కాఁజాలదు. కాని, మేలుకాంచిన మాత్రమేమి? గర్జించుచు మృత్యువుపై బడిన నేమిచేతును? వన్యపశువుతో పోరుటకు సంసిద్ధుడనై యుండలేదు. చేత నేయాయుధమును లేదు. తుదకు గఱ్ఱయైనను లేదు. క్రూరమృగము మార్కొనినచో "హర! హరా!!" యని దానికి కబళమై తీఱవలసినదే! కటికిచీకటిలో, కొండనేలయందెచ్చటికి పరుగెత్తుదును? పరుగెత్తినను, మఱొకజంతువు నోటిలోనికే! మృగముఖగహ్వరమునగాకమానె, ఏలోయలోనో గుభాలున గూలబడి, గుండనై పాతాళమున రాలుదునని యెఱుగుదును. నదీమతల్లి మంజులరవమున అనంతగీతిక నాలాపించుచునే యున్నది! కడుపు చలువగల జలధార కనిన గీతికాధార కరుణాధారయై నామనసును సోకుచునే యున్నది! ఆధార నాకు నూతనపాఠమును గఱపినది. భయంకరసమయమందైనను, పాడుకొనుచు, అవిచలితచిత్తయై తల్లి తనపనిని తాను చూచుకొనుచున్నది! కట్టెదుట పెద్దజోదులట్లు ఇక్కట్టులు నిలిచినను, అంతర్వాహినియైన సరస్వతిబోలు శాంతభావము నంతరంగమున ప్రవింప నిమ్మనియు, దానితో తననెయ్యంపుతియ్యనిపాటను సహకరింతుననియు గంగాభవాని* ఆదరపూర్వకముగ తెలుపుచున్నదని గ్రహించితిని. అవ్వల ఘోరఝంఝానిలము విజృంభించుచున్నను, హృదయమందలి శాంతిని మానవుడు గోల్పడరాదను ప్రధానపాఠము భగవద్గీతయందు కలదు. (Vide Swamy Saradananda's Bengalee Commentary on the "*Geeta*") కొండనంటుకెరటాలతో నెగసిపడు కడలికడుపున ననంతశాంతి విరాజిల్లుచుండునుగదా! ప్రకృతినుండి పాఠములను గ్రహించుటెట్లో పాఠకులకు తెలుపనే తెలిపితిని.

"కానవావానిగంగాభవాని" యనియు, "నను జూచి హోరని యేడ్చు గంగాభవానితో" డనియు కొందఱుకవులు మసనమందలి

---

* గోదావరికి గంగయనురూపాంతర ముండుట లోకప్రసిద్ధము పోతరాజు పలుమాఱు గోదావరిని గంగయని సంబోధించినాడు.

చంద్రమతిచే పలికించినారు!*నను జూచి, మందాకినీమతల్లి మఱింతమంజులముగ గీతికాలాపనము చేయుచు, నా గుండెనుండి దుడుకును దూరీకృత మొనరించుచు నందు పరితోషమును నింప యత్నించుచున్నదని యూహించితిని. కావున గీతికాపూరమునకు భక్తిపూర్వకముగ మానసాంజలి నొడ్డితిని.

కడచిననిశీథమందును, నేడును ఎంతో హైరానుపడుటచేతను, బొంబాయి విడిచినదాది ఆహారనిద్రల నెఱుగక పోవుటచేతను, మేను వాల్పవలెనను బుద్ధి పుట్టినను నొఱగక కొయ్యవలె గూర్చుని, అజాండముతో నన్ను గుటుక్కున దిగమ్రింగిన అంధకారము నబ్బురపాటున నవలోకించుచు యోచనామగ్నుడనై యుంటిని.

చీకటి పడినంతనే ఏవోపురుగులు ఎడతెగని రీతిగూయదొడగినవి. పొలములం దిట్టి ధ్వనిని చాలమాఱులు వినియుంటిని. కొంతసేపటి కిది ఆగిపోయినది. ఆగినపుడే అంతకుము న్నట్టిశబ్ద ముండెనను అంశము మనసున తట్టినది. చెవికి సలవాటైన రవమును పాటింపమనియు, ఆగినపుడే యది యుండెడిదని గ్రహింతుమనియు గదా మనశ్శాస్త్రము తెలుపుచున్నది! ఏదేనివన్యమృగమో, అపూర్వజీవమో, నాదెస వచ్చునేమోయని యూహించుచు, నలుతట్టులను పరికించుచుంటిని. అపుడు......ఏమని వచింతును! ఎందుండియో...అపు డెవరో పకపక

* ఈ పల్కులందలి అలంకారము(Pathetic fallacy) కడుంగడుచక్కనైనది. కవి, ఈయలంకారమును కడుకష్టముతోనైనను వదలుకొని, చక్కనితాత్విక భావము నిందుంచిన బాగుండెడిది. అమరకాంతల అంగలార్పుకూడ కలస్వనము గలదై యుండునుగదా! అందును దివిజకల్లోలిని, విశ్వేశ్వరసాన్నిధ్యమున జేలఱై వాఁరున ఏడ్చునదను భావమును గాక "బిడ్డా! అదె! ఈశ్వరుడందుండి కదలివచ్చుచున్నాడు. ఇక నచిరముగా సాక్షాత్కరింపగలడు. నీయిక్కట్టుల నీశ్మశానవాటికయందు ఊడ్చివేయును జుమీ!" యనుభావమును (నిక్కముగ నామె కడగండ్లందే కడతేఱెనుకదా!) కవి ఇందు జొనిపియుండవలసినది. ఇట్టిభావము చంద్రమతీహృదయమునకును, ప్రేక్షకుల యెడందలకును గొంత యూఱట గొల్పెడిది. రాబోవుదానిని నాటకకర్త చెప్పివేసిన యెడల నాటకరక్తి (Dramatic effect) కి చెఱుపువచ్చుట నిజమే! కాని, ఇన్ని

నవ్వినశబ్దము హఠాత్తుగ చెవిబడినది! ఉలికిపడితిని! గుండెలు దడదడ లాడినవి! అందు మనుష్యసంచారమే లేదుకదా! ఆశబ్ద మెట్లు వచ్చెనో ఊహింపజాలనైతిని. దొంగ లెవరైన నందు పొంచియుందు రనుటకు నట్టియవకాశము లేదు. కలవారియిండ్లను కొల్లగొట్టువారికి జోగులుండు నెలవున నేమిలభించును? అం దేదేనిపిశాచము లున్నవని యోచింతునా ? భూతములను గుఱించిన వింతవింతకథ లెన్నో జ్ఞప్తికి వచ్చినవి. కోటిపల్లి కాల్వయొడ్డున నొకప్పు డొకచెంచుయాడుది చని పోయి, పిశాచమై అచ్చటి చెట్టును పట్టియుండి, ఏమరుపాటున నెవ్వ రైన రాత్రులందు అచటినుండి పోవునపుడు "తవ్వాలమ్మా! తవ్వాలో!" అనియఱచుచు వారిని అడలగొట్టుచుండెడిదట! అట్టిపిశాచమేదైన నవ్వు చుండెనేమో ! కాని, కడుంగడు పవిత్రమై, దేవతల క్రీడాంగణమై, ఋషికంఠీరవులయాటపట్టయిన అచ్చోటున భూతము లెట్లు చేరజాలు నని తలపోసితిని. "బొంబాయినుండి బహుప్రయాసతో వచ్చినది ఈ భయంకరనిశీథమున, నీఘోరారణ్యమున, నీ నిర్మానుష్యప్రదేశమున, నీ భీషణాంధకారమున నే క్రూరజంతువుగొంతుకలోనో నీకుత్తుకను చొప్పించుటకా?" యని యెవ్వరో నాయంతరంగమున నట్లు నవ్విరేమో యనుకొంటిని. ఐదునిమిషములు కడచెను. మరల పకపకమనునవ్వు చెవుల బడినది ! అది నాయూహ కాదని గ్రహించితిని. అదేమో యెఱుగవలె నని మక్కువపడితిని. పరిసరమున పరికింపవలె ననుకొంటిని. చేతిలో టార్చిలైటైనను లేదు. అగ్గిపెట్టె వెంటనుండవలసినఅవసరము నాకెన్న డును లేదు. చీకటిలో తడుముకొనుచు మసలినయెడల ముప్పువచ్చు

---

మాటల నుచ్చరింపక "దూరదృష్టిగల లోకపావని వాకొనిన భావకృతివా" క్కాని యూహించుటకు చోటొసగు చిన్నిమాట వ్రాత దందు చొప్పించియుండిన, ఘనతరశక్తితో తననాటకరాజమును మహోత్కృష్టాదర్శసంశోభిత మొనరించువాడు; సదాశతో తళ్కొత్తించి యుండువాడు. (Idealism and Optimism would have been blended) ఏకావ్యమునకైనను ఏజీవనమునకైనను వన్నె దెచ్చునవి యీరెండుశక్తులే! వీని నంతరంగమున నిడికొనినవ్యక్తులే ధృతిసహితులై భయదకష్టములతో పోరిరి. ఈయంశమును గణింపక పోవుటచే మనకవులు మాటిమాటికి మహావీరులచే గోలపెట్టించిరి. శూరులందు శూరులై, కోటికోటిఘోరారిష్టములను చెండాడినవా రడుగడుగున గడవలకొలది కన్నీరో

నేమో! కావున ఆ "నవ్వు ఎవ్వరిదైనను సరే" యనుకొని కిక్కురు మనకుండ చెట్టునకానుకొని కొయ్యనై కూర్చుంటిని. అదూరమున గలలోతులోయలో అప్పుడేదో మంట కానుపించినది! ఏయోగియైన నందు ఆశ్రమమేర్పఱచుకొని వసించుచుండెనేమోయని యూహించితిని. మున్యాశ్రమ మొకటి అందున్నదని యెఱిగియుంటినేని, చీకటి పడకమున్నే తొలుత నం దరిగియుందునేమో! కాని లోయ మిగుల లోతైనదగుటచే, దానిని చేరుట కష్ట మేయని గ్రహించితిని. మరలిపోవు నపుడు ఋషికుటీరమును చూడవచ్చుననుకొంటిని. మంటదాపున ముని ప్రవరుడుగాని, శిష్యులుగాని అగపడుదురేమో అని యనుకొని ఆతట్టున దృష్టిని బద్ధ మొనరించియుంటిని. ఇంతలో నాజ్వాల యదృశ్యమైనది! కొంతసేపటికి మంట మఱికొంతదూరమున కానుపించినది! ఇట్లే మఱి కొన్ని మంట లగపడి అదృశ్యములు కాజొచ్చినవి! పాపికొండలలో * రాత్రులందు మంటలులేచు టెఱుగుదును. వనము దగ్ధమగుచుండ లేచినజ్వాల లవియని స్పష్టముగ దెలియును. దాగుడుమూతలాడు నేటి మంటలో? అవి కొఱవిదయ్యము లని యూహించుటకు నామన సొప్ప లేదు. ఏమైననేమి? చూడ్కుల నచ్చెరుపాటున నాదిక్కునందే నిలిపి యుంచితిని. ఈపర్యాయము కొండనేలయందు కొంతదూరమున శబ్ద

---

డ్చురని తలపజెల్లదు. గుండియలను పట్టి నీటిబుగ్గలు చేసికొనినచో వారియసిధారావ్రత నిష్ఠకు, సత్యాన్వేషణదీక్షకు తప్పక భంగము వాటిల్లియుండెడిని. ప్రేక్షకులహృదయములను కదలించుట నాటకకర్త పని. కావున విషాదమును పూటెక్కించినగాని పనిచెల్లదని మనకవు లూహించియుందురు. పొంగిపొరలు దుఃఖముపై, పాలకడలిపై తేలియాడు దేవదేవునివలె, మణికాంతు లీను ఆశాద్యుతిలేదని ఆదర్శకవులు తెలుపగలరా?

* తూరుపుకనుమలలో నివి మిగుల నెత్తైనవి. ఇవి శ్రీరామగిరికి కొంతదూర మీవల నున్నవి. ఇచటి గోదావరి మిగులలోతై మొసళ్లతో నిండియుండును. కొండల నడుమనుండి నదియం దాఱుమైళ్లవఱకు నావ పోవలెను. శ్రీరామనవమినా డయోధ్యను చూచినట్లు భద్రాచలమును. పర్ణశాలను జూచుటకై 1922 లో నాఇంటర్ మీడియట్ పరీక్షలకుముందు జని వానితో మఱికొన్ని గోదావరీక్షేత్రముల నవలోకించితిని. పాపికొండలందలి వింతదృశ్యముల నపుడు విలోకించుతరుణము తొలుత నాకు లభించెను. ఈపయనమును గుఱించిన ఉదంతమును చదువరులు మఱొకచో గాంతురు.

ముతోఁగూడ పెనుమంట యెగసెను! ఖాండవదహనదృశ్యము మరల ప్రదర్శింపబడునేమో యని తలపోసితిని. శబ్దసహితమైనజ్వాల! శైల శీతలమునకు, ఋక్కులుచ్చరించు ఋషీంద్రు డెవ్వడైన మంత్రప్రభావమున నిప్పంటించుచుండెనా? వెలుతురులో నేదోయుఱుకుచు, వలయముగ పరుగెత్తుచున్నట్లు తోఁచెను! అది వన్యమృగమో, కొండలందు మసలు కోయవాఁడో, అడవిమనుష్యుఁడో, అపూర్వమైన మతేజీవమో గుర్తించుట నాకు సాధ్యము కాలేదు. వింతకు, బీతుకు నాకరమైన నాదృశ్యమెట్టిదైనను, దూరముండే గోచరించుటచే దానివలన నా కెట్టియెగ్గు కలుగదని ధైర్యమూనియుంటిని. కాని అది పర్వతప్రదేశమున చిత్తము వచ్చినచొప్పున విహరించుచుండుటచే, నామ్రోల, మ్రోలనేకాదు నామీఁద నిలిచి చిందులుత్రొక్కునేమో యని పరక్షణమందే యడల జొచ్చితిని. నాలో నేను దండకముల నేకరువుబెట్టుకొన సాగితిని. మరల పకపకమను నవ్వు ! దూరమున నీరెలుంగు !! నైశనిస్తబ్ధతను చంపనెంచిన గర్జనము!!! భయంకరదృశ్యము! ! ! !



# నా మహారాష్ట్ర యాత్ర

## ఎనిమిదవ ప్రకరణము

దేనిని పాటింపక నిద్రించి ఉదయమే లేచినయెడల భయసంకోచములు కొండొకవడి మనసును మార్కొనకనే యుండెడివి! ఏజంతువు కన్నులబడక, కదలక, మెదలక, అందుపడియుండిన నపాయమే లేదు కాని ఆ భయంకరనిశీథమున నేదో యపూర్వశక్తి నా హృదయము నాకర్షింప సాగినది. అడలని, ఆపదయని అందుండి మనసు కదలిపోవుట కిచ్చగించుట లేదు.

ఆహా! మనుష్యహృదయ మెట్టిదో! నూతనసంఘటనలపై, అపూర్వదృశ్యములపై విహంగపతివలె వ్రాలనది మిక్కిలి మక్కువపడుచున్నది. లక్ష గ్రంథములను చదువుటకంటె అట్టి నిశియం దట్టిదృశ్యము నొక్కపరి పరికించుట మేలు. భావభరితమై అది మనసున చిరవాసము చేయును! నిద్రించుచుండు శక్తులను చఱచి చఱచి లేపి యది జీవితకదనాంగణమున బురికొలుపును. అత్తఱి నంతరంగమున నపూర్వోత్సాహ ముదయించును. ధమనిస్నాయువులందు విద్యుచ్ఛక్తివలె సాహసము కడువడిగ జాలువాఱు నని చెప్పుదును! కావుననే క్రుంగిన అంగప్రత్యంగములు మ్రుక్కడి రక్కసులను మార్కొనుటకు దలపడును! భయసంశయములు కొండొకవడి హృదయమున పొడసూపిన నేమి? ఇవి యం దిల్లు గట్టుకొనియుండ నేరవు. దొంగవలె నందు అపుడపుడు పిశాచము చొరబడిన నేమి? అందు విరాజిల్లువాడు జగదీశుడు కాడా? విజృంభించిన పిశాచమును చీల్చి చెండాడుట కాతని కెంతసేపుపట్టును? దేవదానవులకు మనుష్యహృదయము సమరాంగణమని నా యుద్దేశము! మనుష్య జీవితము సార్థకమగుట కీదివ్యకురుక్షేత్రమున నీ భీషణాహవము అనివార్యమైనదని నొక్కివక్కాణింతును. పిశాచము లేచినగాని ఈశ్వరున కంతగా పనియుండనే యుండదు. ఈతనిచేతినిండ బనియున్నగాని సృష్టి తేజో

వంతమై యుండనేరదు. సృష్టివృద్ధియందలి కృషిసూత్ర మెంత యద్భుత మైనదో! కృషియందు, మహదాశయమునకై సలుపు పెనగులాటయందు నెంతయర్థము, నెట్టి యభ్యుదయమునున్నవో! పదుగురు దుష్టదానవులు విజృంభించిరి కావుననే జగతియందు పదియవతారములు పొడసూపినవి! ఎంతయో కావ్యసృష్టి, ఎంతయో విజ్ఞానవృద్ధి కలిగినది. ప్రతిఘటించు శక్తులు లేకున్న మానవుడు శరీరమున క్రొవ్వు పెంచుకొనును! పంకిలమందలి పతంగమువలె సంతృప్తియందు పడియుండును! బ్రతికినను చచ్చినట్లుండువాడు కఠినశిలకంటె నధికుడని ఎవరందురు? పనిలేని యవయవములును కొఱగాని మనసును మానవజీవనమున మన్నుబోసితీరును! కృషి నెఱుగని మనుష్యశక్తులకు త్రుప్పుపట్టుట తథ్యము. అసంతృప్తినెఱుగని మానవుడు, నికృష్టశక్తులతో పోరనిమానవుడు పుట్టిననేమి గిట్టిననేమి? నాలుగు గోడలం దడగి, కలమాన్నమును కుడుచుచు, హంసతూలికలందు పొరలాడుచు, నిత్యభోగములందు మునిగి తేలువాడు గోరికడుపున, క్రుళ్లుమాంసమున, దుర్గంధమున దృప్తిగ నివసించు పురుగుపోలువాడు. సృష్టియుద్దేశమున తనకుతోడుపడువాడనియే కదా జగదీశుడు మనుష్యుని సృష్టించినాడు. ఇతడు క్రిమివలెనో, బండరాయివడువుననో యుండుచో బ్రదికిననేమి చచ్చిననేమి? మనుజుడీ దుర్గతికి దిగకుండుటకై సృష్టినియమము సంతృప్తినుండి వానిని బఱబఱలాగి,తఱుచుగ వాని మోఁల ప్రతికూలశక్తులను నిలిపి, పోరుమని వానిని ముందటికి పురికొల్పును. ఈనియమమే నాజీవితాంగణమున నెన్నోసిలుగులను నిలుపుచున్నది! ఇదియే నన్ను వివిధభూధరములందును, వివిధారణ్యములందును, వివిధ దుష్టపరిస్థితులందును, కడలేని కడగండ్లయందును నిలుపుచున్నది! బాలకుడనై తొలుదొలుత "అమ్మో!" యంటిని. నిజమే! కాని, ఈనీరసభావమును మనసుపై స్వారిచేయనిచ్చితినిగాను. కురుసేనల ట్లరిష్టములు మార్కొనుకొలది ధైర్యసాహసములు, సహనసామర్థ్యములు అధికమగుచు, నన్ను పురోభాగమందలి రణోర్వియందు లంఘింప జేయుచున్నవి. దుఃఖమును, నైరాశ్యమును దూరముగ నిలిపి జెబ్బగొట్టి సవా లొనరించుచుంటిని.

శర్వరి నాహ్లాదమున నెంతో యానందమును ధారవోయును. నగరమందలి రేబవళ్లకు భేదమే లేదు. అచ్చటినిశీథమందు భావమహత్త్వముగాని, గభీరతత్త్వముగాని ఉండనేయుండదు. అదియుండుట నిస్తబ్ధమయ కేదారములందును, అడవులందును, కొండలందును మాత్రమే! ఈయాతావులకు పోవుతఱి వెంట నెవ్వరినైన తోడ్కొనిపోవుట తప్పు. వీనియం దొంటరులమై సమయము గడపునపుడు ఆత్మయందు నానందము యనిర్వచనీయమైయుండును. శాంతశీతలవాతావరణమందే, సచ్చిదానందములందే కదా ఆత్మ యుద్భవించినది! పక్కిమూకలవలె తలపులపుడే మనసుపై రివ్వురివ్వున నెగయును! ఈయాచోటులందు అపుడపుడు తోచు వింత దృశ్యములును, భీషణశబ్దములును అనంతశాంతితో పోరజాలక (పోరినంతదనుక యాత్రికునకు క్రొంగ్రొత్త యనుభవముల జేకూర్చుచు) అదృశ్యమగును. హిమగిరులందు పయనము సాగించుచు, ప్రొద్దుగ్రుంకినంతనే ఏదేని కొండపల్లియ జేరుకొనువాడను. కాశ్మీరమున సంచరించుచు, కొన్ని రాత్రులు జీలమ్‌నదియొడ్డున గడపితిని. సంయుక్తరాష్ట్రములందు పరిహారము (సీతాదేవి పరిత్యజింపబడినచోటు) నుండి బ్రహ్మావర్తమునకు మరలుచు రాత్రి సమయమున గంగలోని లంకలందు, నెత్తయిన దుబ్బులందు, శ్మశానములందు నక్కగుంపుల పొంత మార్గముదప్పి మసలితిని.* ఈమహారాష్ట్ర యాత్రలోనే

* ఈ సంఘటనములను సంబంధించిన వృత్తాంతములను చదువరులు ప్రత్యేక గ్రంథములందు, ప్రత్యేకసందర్భములందు గాంతురు.

మంచుకొండలలో పయనము సాగించుచు, నొకరాత్రి కోహాలోయను కొండపల్లెను చేరుకొనినపుడు నన్నెదుర్కొనిన క్రూరసంఘటనము నీచరిత్రమందే కొండొక సందర్భమున నుల్లేఖించియుంటిని. గిరిపైనున్న బంగ్లాలో నాటిరాత్రి పరుండ నిచ్చగించితి ననియు, అందున్న ఒక హిందూస్థానీయుఁ డందులకు సమ్మతింపలేదనియు, అందుండి కదలుటకు నే నంగీకరింపనైతిననియు, ఆతఁడు నాకడ ప్రదర్శించిన కాఠిన్యమును మిగుల గర్హించితిననియు, కురుక్షేత్రమునుండి వచ్చి, ఆ దినములలో కోహాలోయందు వసించు చిరంజీవియగు నధ్యాపకుడు నాపొట్టిపిచికతోడను, నాచెల్లెలితోడను అందుండి నన్ను గొనిపోయెననియుం చదువరు లెఱుగుదురు. నాటిరాత్రినే గడపిన విధమును వారెఱుంగ గాంక్షింతురు. కావున నీసందర్భమున నాయుదంతము సవిస్తరముగ వివరింతును.

కృష్ణ, సావిత్రి, గాయత్రి, కొయనా, ఎన్నా నదుల జన్మస్థలములుచూచి, పశ్చిమపర్వతములందలి మహోన్నత శిఖరమైన ఆర్థర్ పాయింట్ (Arthur Point) నెక్కి, సూర్యాస్తమయము నందవలోకించి మరలివచ్చుతటి క్రూరమృగసంకులమైన బ్రహ్మారణ్యమున జిక్కుకొంటిని. వీరాగ్రేసరుడు శివాజీ నిర్మించిన ప్రతాపగడమహాదుర్గమున శివాజీప్రతిష్ఠితభవానిని దర్శించి, మరలుతటి వనమందొక గుడిసెయందు విడిసి, ఒక ముసలికాపు సాయమునంది ఎన్నెన్నివింతలనో (వీనిని గుఱించిన యుదంత మీ గ్రంథముయొక్క రెండవభాగమున గానంబడును) విలోకించితిని.

అత్తిచెట్టునానుకొని అట్లే చూచుచుంటిని. మరల పకపక మను నవ్వు వినబడినది! అనతిదూరమున నావెన్క నేదో భయంకరనినదము వినవచ్చినది! ఉలికిపడితిని. దూరమందలి యాపద రెక్కలు కట్టుకొని

---

ప్రొఫెసరు చిరంజీవితో మెల్లగ నుంచుగొండనుండి కొంతదూరము నడిచివచ్చితిమి. మేము వరుండుటకు తనబసయందు తగునేర్పాటు చేయుంగనని సాహు కదా ఆ సెయ్యరి! తన యింటికి దోడ్కొనిపోవుటకు మున్నాతడు మమ్ములను తెనువుచున్న సిక్కుల గురుద్వార మందిరములోనికి తోడుకొనిపోయినాడు. ఇది జీలమ్‌నది యొడ్డున నున్నది. సిక్కులకుంగనిది యచ్చరల విశ్రాంతిగృహమనుకొంటిని. ముందిమున నొక సిక్కువృద్ధుడున్నాడు. వశిష్ఠుడేమో అని యూహించితిని. మమ్ములనుచూచి, ముందటికి వచ్చి ఆదరపూర్వముగ నాతడాహ్వానించినాడు. సిక్కులుచూపు గౌరవము అద్వితీయమైనది. ప్రార్థనమునకు నిర్దిష్టమైన ప్రదేశమున నాతడాసీనుడైనాడు. మేమును సమీపమందే యధివసించితిమి. అతని కొకవైపున పండ్రెండేండ్ల బాలికయును, రెండవదిశ నామె కవలతమ్ముడనదగు బాలుడును గూర్చునియుండిరి. చిన్నవయసులోనే బాలుడు పాగా ధరించినాడు. ఇరువురును జోడుగులాబుల ట్లుండిరి! నడుమనున్న తాత ఆ వేళపూరితుడై పాడుచు, నొక్కొక చరణమును పిల్లల కందించువాడు. ఆలపించునపు డాతనియొడలు వీణాతంత్రివలె వడక దొడగినది. పిల్లలేకగ్రీవముగ పాడదొడగిరి. గులాబుల గుండియలందు రెండుకోయిలలడగియుండి పాడుచున్నవేమో యనియు, ప్రసూన హృదయములందలి సుధాపూరము గీతికాసుధయై కొండదారి దనుపుచు, వారి మేన పులకలు లేపుచుండె ననియు నూహించితిని. ఏకగ్రీవముగ నిసుంగులాలాపించు గీతికకు సమీపమందలి పరిల్లాలాపము తనయునంతశ్రుతిని సహకరించుచుండెను. పరమాత్మను వెదుకకొనిపోవు ఖగపతివలె నంబరచుంబిహిమశిఖరమునుండి యుత్పత్తిగ నాటిపాట నాయాత్మను గొంపోయి

పులుగువలె నాపై వ్రాలనుంకించుచున్నదని యడలి వెనుదిరిగి చూచితిని. ఏబదిగజములదూరమున నేదో మృగము మఱొకచిన్నజంతువుపై నురుకుచుండెను! చీకటిలో దానిపోలికపట్టుట నాకు సాధ్యముకాలేదు. తటాలుసుగ మనము తిట్టిపోయు చీకటియే నా కపుడు రక్షకమైనది. అంధకారములేకున్న, నంత సమీపమందలి దుష్టమృగము నన్ను గాంచి, ఒక్కయురుకున పైబడి, నాభావములతో నన్ను నిముసములో మ్రింగివేసెడిది. సృష్టియందు మానవునకు తోడుపడని దెద్దియు లేదేమో! "మనుష్యులం దుత్తము డొక్కొకప్పుడు మిగుల దుచ్ఛమైన పనులను, నీచులందు నీచుడు మహోత్కృష్ట క్రియల నొక్కొకపుడు చేయు" నని ఒక యాధునిక తాత్వికుడు వచించినాడు. చీకటి కాక వెలుగే నా కపుడు ప్రాపైయున్నచో బ్రహ్మగిరిశిఖరమున నద్దమరేయి నాపదలో నంతర్హితుడ నయియుందును. ఆపద కన్నతల్లివంటిది; జ్ఞానప్రదాయిని యనుచుందును. తనను గుర్తించినవారి నదేమియు చేయదు. నిశాకాంత నన్నా భయంకర ముహూర్తమున దనయొడియందు జేర్చుకొనినది!

---

స్వర్గసౌధములను కేర్చినది. కొండొకవడి ఆత్మవిస్మృతుడనై అందు నిలిచిపడియుంటిని. అనంతరము వృద్ధుడు ప్రేమసంసిక్తమై, కడుంగడు రుచ్యమైన ప్రసాదము మాకు బెట్టినాడు. అందలి మధురభావముచే నాత్మను, థానికాధారమైన పదార్థముచే నుదరమును దనిపితిని. పరుండుటకు తగు వ్యవస్థ సలుపుదునని తాత యనినాడు. ప్రొఫెసరు చిరంజీవికి శ్రమ గలిగించుట కిష్టపడక వృద్ధుడొనరించు వ్యవస్థకు సమ్మతించితిని. మందిరము నంటియున్న గదిలో మాకై యాతడు మంచములు వేయించినాడు. హంసతూలికలతో సరిపక్కములాడు పరుపులను వానిపై నమర్చినాడు. శీతకాలమున శీతశైలముమీది చలి దుస్సహమైనది. కప్పుకొనుటకు వృద్ధుడు దట్టమైన "సిరిక్" లిచ్చినాడు. నా యనుచరులు శ్రమానంతరము స్వర్గసుఖము నంది నిముసములో స్వప్నావని ప్రవేశించిరి. నిదురించుటకు నాకు మనసొప్పలేదు. పూర్ణిమ కావున మంచు కరళ్లతో గూడి వెన్నెల కరళ్లు రాలుచుండెను. అంబరవీధినుండి యమరులు కొండదొరతో మేలమాడుచు కడుంగడు చిక్కని పెరుగును వడివడిగ వసిపై పోయుచున్నట్లూహించితిని. నాటి విభావరీవిభవమును వర్ణించుట కిందు చోటులేదు. శైలతలమున విహరించుటకు స్వర్గమే దిగివచ్చెననియు, కవి స్వప్నమే మూర్తీభవించి ప్రత్యక్షమైనదనియు, అగోచరమై యంతరంగమున దివ్యబృందావనమును సృష్టించు గంభీరభావము రూపు దాలిచి ప్రణయప్రసంగము చేయ నుంకించు

నన్నుజూచి సహింపక కాబోలు నన్ను గప్పియున్న తమోవసనమును చించివేయ గొంతదూరమున వెనుక దెలిపినమంట తోచినది! చివాలున లేచి చెట్టుపెన్కకు తప్పుకొంటిని. అగపడినజ్వాల తోడనే అదృశ్యమైనది! కాని, అదియే నాపై దుముకునేమో యనుకొంటిని. మంట తళుక్కున మిగుల నల్లనైన వన్యపశువు కానుపించినది! అది పెద్దపులిగాని, సింగముగాని యైయుండదని, ఆడవిపందియో, ఎలుగుబంటియో యైయుండుననని యూహించితిని. ఆహారమును వెతకుకొనుచు అర్ధరాత్రమున నది ఇందందు నడయాడుచున్నది! వెలుగులేకున్న నేమి, ఆయెలుగు తోంటి చిన్నిజంతువును తలుముకొని నిముసములో నేనున్న యెడ నుఱికి, దానిని విడిచి నాపని పట్టునేమో యని యడలితిని. తాత్త్విక భావగర్భితమైన మహోపన్యాస మపుడు నన్ను గాపాడునా? బ్రతిమాలినయెడల నడవిమృగము కనికరించునా? తియ్యనిపాట పాడినను దాని మనసు కఱగునా? కాని గుండెలనుమాత్రము చిత్తమువచ్చినట్లు దడదడలాడ నిచ్చితినిగాను. దడనడంపకున్న, నది యార్తనాదమై కుత్తుకనుండి

---

చున్నదనియు, పయోధినీగిరికాప్రభృతులు ఘంటుగ జేసికొనుచు, వేడుకలందూగాడుచు శర్వరీసీమంతిని నట్లలంకరించి తాము చిఱుతరగలందు దాగి, కిలకిల నగుచు నా నగుమోము పదిలి నట్టే నిలిపిరనియుం దలచితిని. దట్టముగ గప్పుకొని అల్లనల్లన సాగరమునుండి దిగి, ఝరీపూరము దాపున గూర్చుని, రెప్పలు వాల్పక స్మితముఖియైన యామినీసుందరి నవలోకించుచుంటిని. నలువలపులందు దానే గోచరించుచు గగనతలముకూడ తన సామ్రాజ్యము లోనిదేయని కాబోలు పూర్ణస్వాతంత్ర్యముతో గిరీంద్రుదణ్డాండమునంత నాక్రమించుకొనియుండెను. ప్రీతిమెయి దేశాటనమునకై చను జీవనదీమతల్లి గిరిపైనుండియే మంజుల స్వరమున పాటపాడుచు వచ్చుచున్నది. నీరవమైయున్న పర్వతవలిని నిద్రపుచ్చుటకయి వెల్లువయుల్లాలు స్వాదుగీతిక నాలాపించుచున్నదేమో యని యొకమాఱును, మధుర యామినీసమయమున నిజవాంఛను దీర్చుకొనుటకై గాఢరంధ్రనుండి శైవలిని లేవనెంచి శైవలినీకామిని అల్లనల్లన నిశీశునకు గిలిగింతలు బెట్టుచు, నాతనియుల్లము చేరజాలు చల్లని గేయము నాలపించుచున్నదేమో యని వేఱొకపర్యాయమును నూహించితిని. చోద్యము చూచుచు నెంతోసేపందే యనిమేషలోచనుడనయి కూర్చునియుంటిని. ఇంతలో నా పొట్టిపిచికి ఏడ్చుచు, వెతకుకొనుచు నేనున్న యెడకు వచ్చినాడు. అత్తఱి నేనెందో యంతర్ధానమైతినని ఆత దడలినాడు. ఈ విచిత్రోదంతమును పాఠకులు నా "కాశ్మీర మజిలీ" లందు గాంచగలరు.

వెడలి అవలీలగ నన్నాపద కప్పగించి వేయునని ముందే గ్రహింపగలిగితిని. ముప్పు నోట బడకుండ నేదేని యుపాయమును పన్ని తీరవలె నను కొంటిని. చుట్టును జోదులట్లు నిలచిన నాలుగు మేడిచెట్లలో దేనిమీఁద నయిన నెక్కి, ఆకులందు నక్కియుంట మేలని యూహించితిని.

చిన్ననాఁడు మాయూరి బడిపిల్లలగూడి చెట్లెక్కుట, ఈతకొట్టుట మున్నగు క్రియల నభ్యసించితిని. గోదావరిలోను, హుగ్లీలోను ఈది యీది, సంతరణమున కౌశలమును సంపాదించితిని. కొంతకాలమునకు మున్ను రాజమహేంద్రవరముకడ మిత్రులతో పంతమాడి గోదావరి నీవలియొడ్డునుండి యవ్వలియొడ్డున కీది యుంటిని. కాళ్లేతులు కదల్పక గంటలకొలది శవ మట్లు నీటిపై తేలియుండుట నేర్చియుండుటచే, నాయాసమువచ్చినపుడు వెల్లువయే తల్పమగుటచే విశ్రాంతి యనంతరము శక్తినంది, ఉత్సాహపూరితహృదయమున నెంతదూరమైన నవలీలగ నీద జాలుచుంటిని. ఈతపందెమున తప్పక నెగ్గగలనను ధైర్యము నాకు గలదు. చిన్ననాఁడు నేర్చిన విద్య ఎన్నటికిని బోదు. ఎట్టిచెట్టునైన నవలీలగ నెక్కువాఁడను. శెట్టిపేట* మడుగు యొడ్డునందలి నేరేడు చెట్టునుండి ఊరిబాలకులతో కలసి నీటియందుఱుకువాఁడను. నాటి దుండగములు పదంపడి నన్నెన్నో గండములనుండి కాపాడినవి.

చెట్టెక్కుట సులభమైన పనియైనను, చీకటిలో పైకెగబ్రాకుట మంచిదికాదేమో యనియు, అందేదైన సర్పమున్నను ఉండవచ్చు ననియు, ఎక్కినను తఱుముకొనుచు వచ్చు ఎలుగుగొడ్డు వృక్షము నెక్క జాలినజంతువగుటచే ముప్పు తప్పదనియు, ప్రస్తుతస్థితికంటె తరువుమీఁద దుస్థ్సితి మఱింత దురంతమై యుండుననియు నడలితిని. భల్లూకము

* నా స్వగ్రామము తూర్పుగోదావరిజిల్లాలోని పేరవరమైనను, నా పెదతల్లి గారి యూరైన శెట్టిపేటలోనే పుట్టితిని. నా పెదతల్లిగారి దొడ్డియందలి గొడ్లచావడి నాజన్మస్థలము! నేను నా అమ్మలేదు! నా పెద్దమ్మయును లేదు. కాని గొడ్లచావడి అట్టే యున్నది! ఈచావడినుండియే నా యిహజీవితయాత్ర నారంభించితిని. అందుండి ఎన్నెన్నియోజనముల దూరమునకో కదలిపోతిని. యువకుడనై, యుత్సాహభరితుడనై కట్టెదుట నింకను విశాలమైన యాత్రాంగణమును చూచుచుంటిని. జగదీశుడు నన్నేయేచోటులకు గొంపోవునో! నన్నేమి చేయునో! భావభరితమైన ఏయే తావులను దర్శించినను, నివి యన్నియుం గూడియైన దోలంత నన్ను దన యొడంద నందుకొనిన

భూరుహమొక్కటి గలదని తెలుపు విచిత్ర 'సనేమిరా' కథ జ్ఞప్తికివచ్చినది. నది యుత్పన్నమైన తావలమున గొంత పల్లమున్నది. పోయి ఆ పల్లమున నడగియుండవలెననుకొంటిని. కాని, నీరు త్రాగుటకై వన్యపశువు వచ్చి సరిగ నందే నన్ను కన్గొని, సలిలసమీపమున సమయమునకు సిద్ధమైయున్న ఆహారమని తృటిలో నన్ను గుటుక్కున మ్రింగునేమో యని యడలితిని. ఏమి చేయుటకు నా కపుడు పాలుపోలేదు. కాని, ఊగిసలాడుటకును, దీర్ఘ యోచనము సలుపుటకును వ్యవధి లేదు. అనతిదూరములో మృగము గంతులువేయుచున్నది! అది పులికాదని, సింగము కాదని రాయి గ్రుద్ది చెప్పలేను. ఉచ్ఛ్వాసనిశ్వాసములను కొంతవఱకు బిగబట్టి చెట్టు మాటున నిలిచి, క్రూర పశువు గతి నుపలక్షించుచు, దాని గమనము ననుసరించి తటాలున తరుశాఖను పట్టుకొని వ్రేలాడుటో, పల్లములోనికి లంఘించుటో, భయసంశయములను వదలి దాని ముఖ గహ్వారమున ప్రవేశించుటో జరుప నిశ్చయించితిని. అదృష్టవశమున అది తఱుముకొని వచ్చినచిన్నిజంతువు ప్రక్కగల లోయలోనికి పరు గెత్తినది. పెద్దమృగము దానివెన్నంటి క్రిందికి లంఘించినది. "అమ్మయ్యా! జగదీశు డిప్పటి కీయాపదనుండి నన్ను కాపాడె" ననుకొని ఆతని నుద్దేశించి సాగిలపడితిని. ఇక నికెట్టివన్యపశు వచ్చుటకి వచ్చునో యని తల పోసితిని. మరల పకపకమనునవ్వు చెవుల బడినది! ఈ మా అది మఱింత వికృతముగా వినబడినది! ఎట్లెట్లూహించినను, ఈ నవ్వునుగుఱించిన

---

పశుల సాలకంటె నాకు బ్రిలకలిపములు కావు. ఈ పవిత్రస్థానము నుద్దేశించి ఎందున్నను జోహారసుచుందును. తఱచుగ దీనిని చూడవలెనని యుంత్వీక్షించు చుందును...... శెట్టి పేట నిడదవోలునకు రెండుమైళ్ల దిగువ నేలూరుకాల్వయొద్దుగ నున్నది. దీనీ కింకొక తట్టున నరసాపురపు కాలువయును, వేఱొకవైపున అత్తిలి కాలువయును గలవు. తామర లతో నిండిన కాలువ యొకటి మధుగునుండి పల్లెపొంతకు పాఱుచుండును. మిగుల విశాలమైన కాసారము కవిభాగములకు సహపాఠులైన ప్రస్ఫుటితపద్మములతో, ముత్తె యములవలె కెసరైన నీటితుంపురుల హృదయముల నిడికొనిన విశాలసరోజపత్రములతో నలరారుచుండును. పల్లెయ చుట్టు తరుణరమణులవోలు చేలు నిలిచి, కనులపండువొన రించును. "సుజలం, సుఫలం, సస్యశ్యామలం మలయజమారుతం" అను గీతికను నా జన్మ స్థలము వర్ణింపబడెను.

చోద్యమేమో నాకు బోధపడలేదు. క్రమక్రమముగ మంట లంతరించినవి. భయంకరశబ్దములును కడచినవి. దుండగపుజీవులను గర్భమందిడికొనిన రక్కసిపడతివలె భయదనైశనిస్తబ్ధత తోచినది! ఇక నెట్టి సేగుల నది యీనునో! కొలదినిముసములు కడచినవి. మఱే చెడుగుజాడ కానరాలేదు. మఱెట్టి చెట్టలు పొడసూపవని మనసు కుదుటపఱచుకొని, మరల వృక్షములనడుమజేరి కూర్చుండలేక వెలికిలబడి వియత్తలము నవలోకింప సాగితిని.

తరుశాఖల తుది కొబ్బలనుండి చూడ్కులు చివాలున వ్యోమతలములోనికి లంఘించినవి. కడుంగడు చక్కనైన చుక్కగుంపులు రెమ్మకొనలందు ప్రస్ఫుటించిన పూవులనిభ్రమసితిని. వానిని చూచినంతనగుండెయందలి దిగులు అదృశ్య మయ్యెను. ఉల్లమందలి తలపుననుసరించి ప్రకృతి గుణమును గ్రహింతుముగదా! నిశాసమయమందలి యనంతశాంతి అపుడీశ్వరకరుణాకరణి హృదయమును సోకినది! చెట్లజొంపములందు, ఆకు మూకలనడుమ మలయసమీరుడు ప్రణయముగ్ధుడై మసలుచు, మధుర నిస్వనమున బూవునెలంతలను నిదురనుండి లేపుచు, నగుమోముననల నావేశపూరితుడై కౌగిలించి, వానిహృదయములందుజొచ్చి,ప్రేమమరందమున నీదులాడి, వలసినంత ప్రణయ పరిమళమును మోచుకొని "అనురాగమందలి హాయి నెఱుంగుదువా?" యని గుసగుసలాడి దానిని నా యంతరంగమున గుమ్మరించెను. "అడవిగాచిన వెన్నెల" యనుచుందుము. "మానవదృష్టి నెఱుగక పుట్టి గిట్టు పూవు" *లని థామస్‌గ్రే పలికినాడు. పూవుగాని, వెన్నెలవాకగాని నిరర్థకజీవికాదని నాతలంపు. వీనిని గుర్తించి, వీని హాయి నందు భాగ్య మేకవికైనను, ఏమునికైనను, ఏ పథికునకైనను గలుగకపోదు. గుర్తుపట్టజాలని వేయిమందికంటె గుర్తు పట్టగల వాడొక్కడున్న మేలు. సౌందర్యమనుడు, సౌరభమనుడు, సత్యమనుడు, మాధుర్యమనుడు, మఱేగురుగుణమనుడు కన్నుగలవానివలన, గుండెగలవానివలన, ప్రశంసింపజాలువానివలన సార్థకమగును. ప్రజానీకమందుండియు, గుర్తింపబడక దిక్కులేనివారివలె మడియుచున్న ప్రతిభావంతులులేరా? అడవిగాచిన వెన్నెలవలని హాయినందు ప్రకృతి లేకపోలేదు. ఎడారిపూవుతో సుఖక్రీడల దేలని సమీరుడు లేడని

* "Full many a flower is born to blush unseen" Vide Gray's "*Elegy*.

నుడువువా రెవరు? తనబిడ్డసోయగమునకు తానెంతో యలరి, ఏకవి కుమారునకో దాని నప్పనమని, తన నిసుంగు యెడందలోని విభవ మా జామాతకతన విశ్వవిఖ్యాంతము కాగలదని ప్రకృతి మహిళ మఱిమఱి మురియుచుండును. కవికంధరమున మాల్యమైయొప్పిన చంద్రికకళా సామ్రాజ్యమును సుధాసంసిక్త మొనరించు టెఱుగమా? కవిహృది నానందవీచికల నూగాడించిన కుసుమసీమంతిని సాహితీజగతి నెన్నెన్ని ముద్దుగొలుపు తలపులకు కన్నతల్లి కాలేదు? ఈతలపులే కావ్యకేదార మున నెంతో సౌందర్యమును పండించుకాపులై ఎన్నెన్నియో మానస ములను తనుపుచుంట నెఱుగమా?

నడిరేయి నెవ్వరుగాని దాపునలేని యడనున, నభోవధూటీగళ మున మల్లెదండవలె వఱలు నక్షత్రమాలికపై కన్ను వేసినపుడు మన సున నెన్నెన్ని మధురభావము లుత్పన్నములుకావు? చుక్కలందలి చోద్యము వర్ణనాతీతముకాదా? స్థలకాలము లనంతములు. అనంత శూన్యమున మిణుకుమిణుకుమని కాంతిలు తారకలు దేవతలు చెరిగి పాఱబోసిన నూకలుకావు. ఇవి యసంఖ్యాకములైన భువనములు. ఒక్కొక్క యుడుభువిదూరమును గుఱించి కన్గొనినపుడు మానస మద్భుతానందములతో నిండిపోవును. ఒక్క సెకండునకు వెలుతు రెన్నో మైళ్లదూరము సాగిపోవును. సుమారు రెండువేలేండ్లకు భూమినిజేరు వెలుంగును వెలారించుచుక్కలు కలవు! అనంతాకాశమున నివి యెందు న్నవో యూహింపుడు. ఇన్నిలోకముల ననంతశూన్యమున సృష్టించిన శక్తి యెట్టిదో కదా! మనసును దూరమునకు గొంపోవు దివ్యదృశ్య ములే సృష్టిలో నత్యద్భుతమైనవి. ఇవియే మనుష్యశక్తిని మహోన్నత స్థితి కెగయ బురికొల్పును. ధ్రువాదులు నక్షత్రములై, మింటికొన గాంతిలుచుంట లేదా? వియత్తలపత్రముపై గాంతిలు నక్షత్రాక్షరము లీశ్వరుని హస్తాక్షరములు! ఒక్కొక్క యక్షరమును విలోకించినపు డందేమి మహత్త్వ మున్నదో, నీలంపురంగున ననంతదూరమునుండి మిణుకుమనుచున్న భావ మెట్టిదో యని యబ్బురపడమా? "ఎంత మహత్త్వ మున్నదో?" అనుప్రశ్నను పురికొలుపురచనమే దివ్యరచ నము! దివ్యరచనమునకు మాఱుపేరు కవిత్వమందును. విశ్వపతియైన

జగదీశుడు కవిసార్వభౌము డందును. ఈశ్వర రచన మాదర్శకవిత యందును. నిక్కంపుగవి కాగోరువా డీశ్వరలిఖితహస్తాక్షరములకు కనులప్పగించి తీఱవలెను. చుక్కలను కన్ను లెదుట బెట్టునుగాని ఈశ్వరుడు వానియందలి భావభువనములను గుఱించి మహోపన్యాసమిచ్చునా? తన భావములకు భాష్యము చెప్పుకొనువాడు కవియే కాడు. ఊహకు చోటిచ్చి, అబ్బురపాటున కనకాశ మొసగు దృశ్యమే సృష్టిలో గణనీయమగునట్లు పఠితమనసునకు కొంతపని కల్పించు రచనమే కావ్యసృష్టియందు గణ్యత గాంచును. సృష్టిక స్పష్టము బట్టబయలైన, ప్రేక్షకుని యూహకు పనికలుగకున్న, ధ్వనికి తావు దొరకకున్న, శాంతిభావము స్ఫురింపకున్న, గభీరమై, ఉదాత్తమై, దూరస్థమై, మహిమాఢ్యమైన ఆశయ స్పర్శానుభూతిని (Sense of the beyond) అంతరంగ మెఱుగకున్న విశ్వరచనము చప్పిడికూడువలె నుండునని నాతలంపు. ధ్వని (Suggestion) రచనమందలి ప్రధానగుణమని తెలుపుట నాయాశయము. ఇది లేని కవిత్వము పఠితమనసునకు రెక్కలిచ్చి దానినూహా విహాయసమున రివ్వుమనిపింపజాలదు. కావున కవిత్వమనిపించుకొనదు. సుదూరవియత్తలమందలి రచనమున కెనయైనకైతయేఆదర్శకవితయగును. చుక్కలోని వ్యంగ్య మెట్టిదో గ్రహింపజాలు కన్ను అందొక ఘనభువన మున్నదని, కోటిసూర్యుల తేజస్సును మించిన భావద్యుతికలదని యెఱుంగును. అరేబియన్ నైట్స్‌లోని ఒకానొక కథయందలి ("Alibaba and the forty thieves") భూరంధ్రమున కొండొక సాంకేతికశబ్దము ("Open Sesame") నుచ్చరించి ప్రవేశించినంతననవరత్నరాసులులోచన గోచరమైన తెఱగున వ్యంగ్యగర్భితవాక్కున మనసును చొప్పించినంతన వివిధానంతభావరాసులు తళుక్కులీనుచు*చిత్తగోచరమగును. కార్లయిల్ తెలిపిన చూపుగలకన్ను (Seeing eye) ఈకన్నే యందును. ఇట్టికన్నుగల పఠిత ప్రతిసృష్టిచిత్రమందును, ప్రతి ప్రకృతిచిత్రమందును కవిత్వమునకు

---

* ఈ భావరాసులను పాశ్చాత్యకవీంద్రులు మనమునీంద్రులట్లు వివిధశక్తి (Idealism, Harmony and Optimism, Imagination, Vision, and Cagitation and Co-ordination of Truth, Beauty and Goodness of Thinking, Feeling and Willing,) సముద్భవములనిరి.

వలసిన లక్షణములను కన్గొనజాలుదును. కావుననే మహాకవు లీచిత్రములను పట్టుకొని ప్రాకులాడిరి! ఈకవుల నెఱిగినవారు, వారిజాడల గాంచినవారు వారిరచనములను పురికొల్పిన దృశ్యముల నెఱుగుదురు. నక్షత్రఖచిత నభము, బాలార్కప్రభాకలితదిగ్వలయము, కౌముదీస్నాతయామిని, "నందనచందనోత్కరము," "కన్నెమావిగుంపు," "లవలీనికుంజము," "తీవముత్తయిదువచాలు," "రత్నకందరము," "ముత్తైపుముగ్గు లీను మొగ్గ," "ప్రత్యూషపవనాంకురము," "మల్లియలబూచిన కోన," "గాంగసైకతము," "వరుణాతరంగిణి," "అంబరచుంబి శిరస్సరజ్ఝరి," "మిహికాహార్యము," "బహురత్నద్యుతి" "మేదు రోదరదరీభాగము," "నభోవాహినీలహరి" "శీతలగంధవాహపరిఖేల న్మంజరి" "సౌరభగ్రహణేందిందిరతుందిల కాంతారసంతానము" మున్నగున వేకదా యిట్టి దృశ్యములు! ఈదృశ్యములును, ఆరచనము లును మనుష్యాత్మను దుఃఖమునుండి, దౌష్ట్యమునుండి, జుగుప్సనుండి, యాతననుండి గొంపోయి, మరల నందనమున ప్రాతకాపు జేసి, దానిచేతి కానందకలశమునందించును. ప్రకృతియందును, ప్రకృతికవ్వలను జగదీశు డున్నాడని తత్త్వశాస్త్రము వాకొనుచున్నదికదా! (God is immanent and transcendent) ప్రకృతికి ప్రతి చిత్రమైన రచనమందును ఆత డున్నాడనుట స్పష్టాంశము. ఈశ్వరశక్తికై తపించుచు, "విశ్వపతీ! విశ్వకవీ! విశ్వాత్మకా!" యని కవిభక్తుడు మానసాంజలి నొడ్డి సంతన, దేవకీగర్భమున నిమిడిన బ్రహ్మాండభరిత కృష్ణపరమాత్మవలె, నీశ్వర ప్రేరితమైన భావభువనములందు జేరుకొనును. ఈభువనరాసులనే సూన రాసులనట్లాతడు తనపల్కులందు గురియించును.

నాటినిశీథిని తప్పటడుగు లిడుచునే కడచుచుండెను. ఒకమాఱు దివిదిశకును, వేటొకపర్యాయము విస్తృతశైలసామ్రాజ్యమందలి వివిధదిక్కులకును చూపుల బుత్తెంచుచు, కొండకోననుండి మేఘుడోలిక లోనికి లంఘించులాగున, పరిశీలనమునుండి భావనావీథులలోని కెగ యుచు, కనులబడువింతలకు అపూర్వమైన విద్దారములను జేరు కొనుచు, అంతరంగమున నాశ్చర్యానందములను నింపుకొన సాగితిని.

విశాలపర్వతప్రదేశమున నిందందు కారుచీకటిలో తళ్కొత్తు
నీటిగీతలు ఏయచ్చరచానకుత్తుకనుండియో పుటుక్కున తెగిపడిన
ముత్తైపుజేరులట్లు, కృష్ణపక్షమని ఈవలికి రాక నీరజారి నిభృతనభో
భవనమున తానమాడుచుండ నీటి బిందువులనంటి నేల రాలిన కొలది
పాటి చంద్రికలచందమున, కామధేనువు పొదుగునుండి రాలి గిరిపార్శ్వ
ములనుండి ధారధారలై చాలువాఱు దుగ్ధముభంగి, చదలునుండి కొండ
కొనపై చివాలున సుఱికి నేలదెస బఱితెంచు చుక్క చెల్వాలలీల, మబ్బు
నుండి గొబ్బున కూలబడి తున్కతున్కలై పర్వతసానువులందు దొరలు
మెఱుపుదీవవలె, చిమ్మచీకటులందు భీతునంది, అర్ధమరేయి ముద్దునిద్దుర
నున్నతండ్రియంగ ప్రత్యంగములనుండి వ్రేలు శైలసంతానముకైవడి,
సాంద్రసంతమసమున సానుమంతముపై దాగిలిమూతలాడుచు, మఱుగు
చోటులనుండి కిలకిలనగుచు, చరచరబర్వెత్తు కిన్నెర బాలికలపోలుపున,
జ్యోత్స్నపక్షమున కుంభవృష్టిగ గురిసిన వెన్నెల దరీభాగముల నెం
దైన గొంతమిగిలెనేమోయని వెతుకబోవు చకోరములచాడ్పున,
ప్రణయకలహమున డీకొనిన దేవదంపతులచేతులనుండి జారిపడిన పూవు
దండలడంబున, స్వర్గసౌధమునుండి వసుమతి నవలోకించు సురసుంద
రాంగుల చూపుతళుక్కుల పోల్పున, సచ్చరిత్రుని మహోన్నత హృదయకు
ధరమునుండి నలుదెసల స్రవించు సుహృద్భావధారలవడువున, “శైల
శిఖరమున మీనెచ్చెలి యొక్కండు ఒంటరినై యున్నాడు; పోయి
చూడు” డని గజాసురాదులకు దెలుప బర్వెడు గిరికింకరులపగిది, కవి
హృదయమును దనుపనమృతసూతికరములనుండి ధారధారలై వెలారు
సుధాసంసిక్తసుమరజముకైవడి, నన్నుజూచి జాలిపడక పరిహసించు
వనవధూటి నవ్వుబెళుకులట్లు, వాసవునెడల నేలకో కినిసి, వజ్రపాణి
రాణి గిరవాటువేసినంతన తున్కతున్కలైన వజ్రదామవ్రజము వడు
వున, జీమూతప్రాసాదమున నెవ్వరో యుంచిపోయినపిదప భూధర
ముపై ఖండఖండములైపడిన ప్రదీపముపగిది, విశ్వసంచారముచేయ
సృష్టికర్త యంతరంగమునుండి కడువడి జను భాస్వదాశయములలీల
గోచరించినవి!

అపుడప్పుడించుక వెలుగు చీకటియందు కొలదితళ్ళుకులను రాల్చుచుండెను. నిశీథినీ గహనదృశ్య మెన్నెన్ని చిత్రరూపులు దాల్చనేరదు? స్వప్నప్రపంచమునుండి కదలివచ్చి కాబోలు పిట్టయొకటి చెట్టుపైనపుడు వ్రాలినది! తుదిరొబ్బకొన గల ఆకుతుద గూర్చుని నిద్రామగ్నమై యున్న విశ్వమును విలోకింపసాగినది. ఏచప్పుడు చేయక, కదలమెదలక వెలికిల బరుండియే రెండుకన్నులను పిట్టపడుచున కప్పగించితిని. అత్తఱి ఆకుతుదనుండి బ్రహ్మాండము నవలోకించిన నెట్టి చిత్రవిచిత్రదృశ్యములగపడునో! వీని నప్పగిది జూచుటకై ముహూర్తమాత్రము పక్షిగాగలిగిన నెంత యదృష్టవంతుడ నగుదునో! గుప్పిట నిముడగల పిట్ట పిల్లగాలితాకుడున నల్లన నూగాడు చిన్నియాకుపై జేరి అనంతవిశ్వము నవలోకించు కెట్టిదో! అజాండమునంతను తన లేజూడ్కులనుండి యాప్రశాంతసమయమున నాచిన్నిజీవి తన చిత్తములోనికి లాగుకొనుచున్నది! కోటి కోటిబాహ్యాశక్తులకైన లొంగని బ్రహ్మాండము పిట్టచూడ్కియుచ్చుల కెట్లు లొంగిపోయినదో! ఆ చిఱుచూపులందలి యనంతాద్భుతశక్తి యెట్టిదో! పిట్ట జిజ్ఞాసువు! సర్వప్రపంచమును యాత్రాంగణము గావించుకొనిన ప్రాణము! తన్నొకరు ప్రశంసించవలెనని యపేక్షింపని నిష్కామజీవి! భూమ్యాకాశములందు నెందును దాని కడ్డుగట్టులు లేవుకదా! ఆహా! దానిభాగ్యమెట్టిదో! పూర్వభవమున నదెట్టితప మొనరించినదో ప్రస్తుత జన్మమున ప్రకృతియింట నాడుపడుచై పుట్టినది! వాల్మీకి ప్రభృతులహృదంతరాళముల గరుణాతరంగిణుల నుప్పొంగించి, సాహితీకేదారమున కవితాధారలకు బ్రోదిజేసి, కావ్యజగతియందు ప్రాతకాపై యున్నపుణ్యజీవి! భావ సంసిక్తములై, తేనెతుంపురులబోలు గణయతుల నుగ్గు జేసి కవిడింభకుల కుత్తుకలబోయు చల్లనితల్లి!

కవికిని, ముముక్షువునకును పక్షిజీవితము మేలుబంతి కాజాలు నదని నాయభిప్రాయము. ఒడలునిండ చిత్తమువచ్చినతెఱగున కండలను నింపి, మహాదారువువలె దోచువాడే విశాలవిశ్వమును నిజబాహువులందు పెనవేసికొనజాలునని తలపరాదు. శరీర మెట్టిదైననేమి? ఏతీఱు రూపైననేమి? అంతరంగమున నణుమాత్రమైన జిజ్ఞాస తేజరిల్లునేని,

మహేశుని గొలుచు ప్రమథగణమువలె, జిజ్ఞాసువుచుట్టు బహుళభువనములు చేరుకొనును! తామరాకుమీది నీటితుంపురు ఎంతపరిమాణము కలది ? శిశిరకణమట్లు జిజ్ఞాసువగ్గాు సహస్రమయూఖు నాత్మ హృది నిడికొని యది కులుకుటలేదా? మంచిముత్తైము బోలు బిందువునందు సూర్యమండలమును జొనిపి, బహుళరత్నమరీచుల నీనించునది జిజ్ఞాసయే! స్థలకాల ప్రతిబంధకములు జిజ్ఞాసయున్నయెడ గోచరింపవు, పూవు కడుపున ననంతసౌరభమును, మరందపూరమును, భావమహోదధిని నింపి కళాప్రతులకు, సౌందర్యపిపాసువులకు, భావోపాసకులకు, ఆనందవ్రతులకు వానిని ధారవోయుచున్నది సూనహృదయమందలి జిజ్ఞాసయే! జిజ్ఞాస తపసునకు కన్నతల్లి! తపసున కసాధ్యమైనదేది? జిజ్ఞాసగల యెడ తపోభూమియందును. దేవగణములుకూడ తపోభూమిని దర్శించి పోవుచుండునుగదా! పక్షిహృదయము కంటికి చిన్నదిగనే చూపట్టును. అది కడ నెఱుగని తపోభూమి! ఇందుండియే శాంతివీచికలు, ఆనందమరీచులు అవిరతముగ వెలువడును. వనస్థలియందు మత్తగజము నిద్రించుచుండ చిన్నిపిట్ట మేల్కాంచి నిస్తబ్ధవిశ్వసామ్రాజ్యముపై కన్నువేసి, ఆవర్మతపస్వియై, భావప్రపూర్ణయై, ఆనందమయియై, శాంతివీచికలందు దొప్పదోగుచున్నది! తమోగుణము నారాధించి, జిజ్ఞాసను తలెమికొట్టిన మహాశయు లెందఱో ఉదరములు పూరించి, గుండెలపై చేతులిడికొని, తమ గుఱుచే రోదోంతరాళమును ప్రతిధ్వనింప జేయుచుండ, సగుణోపాసనమందును, కళారాధనమందును నారితేఱిన జిజ్ఞాసువు నిద్దురను దూరముగ తలెమిగొట్టి, విశ్వపతికిరాయబారము లంపి, చుక్కచెల్వలతో గుసగుసలాడుచు, సుమసుందరీమణులకు ప్రేమసందేశము లంపుచు, మధురభావాస్వాదనమున జొక్కుచు, నిజమానసమును కరువలిమూపున నిలిపి విశ్వవిహారము సలుపుచు, "ఇది నా సొమ్ము"ని అనంత బ్రహ్మాండమును నిజహృదయమున జేర్చుకొనును!

పక్షిపై మనసు నిలిపి అట్లే పరుండి యుంటిని. కులాయమునుండియో, లోయలోని చేలనుండియో మఱొక విహిర మెగసివచ్చి తొంటిపిట్టదాపల జేరినది. ఈ శకుంతము లాలుమగలై యుండనోపు! విశ్వమునంతను తమ సామ్రాజ్యము గావించుకొనిరాణియు, రాజునువలె దాని

నేలుచున్నవి! సచ్చిదానందములకు పిట్టజంటయెడంద దివ్య త్రివేణీక్షేత్ర మగుటం దక్కడజ మే మున్నది? వైనికజీవనమును పట్టి పల్లార్చు కఠోరా రిష్టములను శకుంతదంపతులు పాటింపనే పాటింపవు. ఆహా! అవి యాదర్శదంపతులు కదా!......తమపై కన్ను వేయనివారిని చూచు టకు సిగ్గుపడి, కాలుకొలది కడగండ్లు పాటిపోవును గదా! కావుననే కాబోలు ఏసుసంయమి పక్షులట్లు చింతదక్కి, ఈశ్వరునిపై మనసుంచి మసలుడని తనయంతేవాసుల కుద్బోధించినాడు! ఆ రెండుపిట్టలు పార్వతీపరమేశులబోలు దంపతులగుట గాంచి, మఱిజన్మమున నాపుణ్య దంపతుల కడుపున బుట్టి, చిరసౌందర్యమును గ్రోలి, చిదానందమున మునిగి తేలి, చిరమాధుర్యమును వసుమతి కీయజాలిన ధన్యుడగాజాలుదు ననుకొంటిని.

నిస్తబ్ధకృశ్యముసుండి తామందిన పరితోషము నవి వెలారింప దొడగినవి! వానికుత్తుకులనుండి మధుకణములు రాలసాగెను! ఎడబాటు గనని ద్విపదపంక్తులట్లు, అలమగనెఱుగక జీవితోద్యానమున దోచు జోడుమల్లెలలీల, శకుంతదంపతుల మధురకూజితములు కలసి మెలసి హిల్లోలతరంగములం దూగాడుచుండెను! సరిల్లలామ అందు పుట్టినదని జన్మోత్సవము నెఱపనెంచు భక్తద్వితయమని యాజంటను గాంచిన ఏ యొక్కరుండైన గ్రహింపకపోడు. కిన్నరకంఠముసుండి జారితెగిపడిన రాగమాలికవలె శైలపార్శ్వములందు నిండునందు జాలువాఱు వారి ధారలు పక్షిగీతికలకు తమ మధురాలాపమును తోడుచేయుచున్నవి!

అల్లనల్లనమేనిపై చల్లగాలి సోకుచుండ, మనసుపై మధురగాన సుధాబిందువులు కురియుచుండ, అంతరంగమనంతశాంతిని దనివార గ్రోలుచుండ నెనలేని హాయి హృదయమున గ్రొక్కాడుచుండ, ప్రకృతల మున నల్లె యాత్మవిస్మృతుడనై పన్నుండియుండ జూచుచు జూచుచున్న నాకన్ను లిట్టె మూతలుపడినవి. 'పొంచి పొంచి, యదనుజూచుచున్న నిద్రాదేవి చప్పున నిజాంకమున నన్ను జేర్చుకొని జోకొట్టినది. వనమాలి వంశీరవమునకు వీనులొగ్గి, రాసక్రీడల దేలితేలి, ప్రణయసంశ్లేషమున పరవశలైన, సుఖవీచికలం దుఱ్ఱూతలూగు నగుమోము గోపికమానసమున దోలుకాడు మధురభావములవలె, పుణ్యతీర్థమునజేరిన బహుళయాత్రి

కులకై వడి, పుష్పవృంది నాశ్రయించిన తేంట్లగుంపులవలె, బాలకృష్ణుని తో ట్రైచుట్టును జేరుకొనిన కోటికోటి సురనారీమణులకరణి, తీవయిల్లాలి రొమ్మునంటు మొగ్గనిసుంగులలీల నెన్నెన్నో సుఖస్వప్నములు నామనసు నాశ్రయించినవి ! అట్టి నిద్రను, అట్టి మధుమయ స్వప్నములను అంతకు మున్నెన్నడు నెఱుగను. కాని దుర్విధి ఆసుఖమును దునుమాడుటకై పొంతపొంచియుండును. మునిమానసము చందమున చలన మెఱుగని శుభ్రకాసారమున దొరలిన పెద్దకొండవలె, తేటగీతిపై బడిన బండ మాటమాడ్కి, గీతముగ్ధ హరిణముపై నుఱికిన భయదహర్యక్షమట్లు, తియ్యని వీణారవమును మార్కొనిన రుంజవాయిద్యమువడువున, పూల కుప్పపై తటాలున పడిన పిడుగుదెబ్బభంగి, చంటిబిడ్డపై బడిన రక్కసి చఱపుచాడ్పున నింతలో నేదో భీషణనిర్ఘోషము దివ్యడోలికయందుయ్యా లలూగు నామానసముపై పడెను! త్రుటిలో కుసుమకేసరముల కెనయైన స్వప్న సూత్రములు తున్కతున్కలైనవి! స్వర్గద్వారమునుండి నిష్ఠురులై నన్నెవ్వరో యవ్వలికి ద్రోసినట్లయినది! చూచి కాబోలు మరల నెవ్వరో పక పక నవ్విరి! చచ్చిన దిగులున కెవ్వరో సంజీవినిచ్చిరి! చివాలున నా కాళ్ల నేదో కఱచినట్లయినది! తుదకేదో వన్యమృగము నన్ను బట్టి దిగువనుండి దిగ ద్రింగ దొడగినదని యడలితిని! ఉలికిపడితినో, ఉఱుకులెత్తితినో, కెవ్వుమంటినో, పెనగులాడితినో, మఱేమి చేసితినో యెఱుగను!



# నా మహారాష్ట్రయాత్ర

## తొమ్మిదవ ప్రకరణము

అల్లనల్లన రెప్పతలుపులు మూసి, బాహ్యావనినుండి పోయిపోయి అనంతాంతరంగమున నిందందు మసలి, ప్రభాకలిత స్వప్నఖచిత దివ్య నభమును విలోకించి, రెక్కలు కట్టుకొని సుదూర రమ్య భావోద్యానమున నెగసియెగసి, లలిత లవంగ లతికలందు, భ్రమరవ్యాధూత కుంజ కుటీరములందు వ్రాలి, అవిరళపరిమళమున గ్రుంకులిడి, తేనెచినుకుల తనివార గ్రోలి, ఆకుమూకలందు మసలి, మలయపవనాంకురములందు నృత్యమొనరించి, కొండొకవడి తడసి, చిన్నితుంపురుల గుసగుసలకు వీనుదోసిల్లొగ్గి, పసిపాపలుపోలు పూల నొడిజేర్చుకొని, భావోద్వేగమున వాని నగుమోముల జుంబించి, కెంపుతలంపుల గైతకై సేతలల్లుచు, నేమేమో యోజించుచు, పాడుచు, నాడుచు, కులుకుచు, మధుమాసమున మరియు కోయిలవలె మనుష్యాత్మ మాటలకందని హాయిలో నాత్మ విస్మృతినందియుండ, నాకస్మికముగ పెనుగొండను మూపున నిడికొనిన పెనుభూతమొకటి మీద లంఘించి, గుండియలను గట్టిగ పిడికిటబట్టి నపుడు, స్మృతిద్వారమును చేరుకొనకమున్నె తలక్రిందులై మనసు మిగుల దొట్రుపడదా? అత్తఱి ఎట్టియోచనమునకైన నది కడంగ గలదా? కొండవిఱిగి పైబడినట్లు భయంకరశబ్దమైనంతనే, చరణము నేవో క్రూరదంష్ట్రిలు పట్టినట్లు తోచినతోడనే, ఆత్మరక్షణమునకై ఏమియత్నము కావింతును? కొంతసేపటి కించుకస్మృతి నందితిని. అపాయమునుండి గుభాలున లంఘింపవలెననుకొంటిని, కాని, ఎంతయత్నించి నను కదలమెదల జాలనైతిని; కన్నులు తెఱువనేరనైతిని. ఎవరో నన్ను గట్టిగ నేలమీద నదిమిపట్టినట్టు లయ్యెను! నాధమనిస్నాయువులందు విద్యుత్ప్రవాహము కడువడిగ చలించుచున్నట్లాయెను! అంతరంగమున నేదో పెనగులాట జరగుచుండెను! మఱల శబ్దమేమియు వినబడలేదు.

క్రమక్రమముగ మనసు తెప్పిరిలసాగినది. రెప్పలమీఁది ఘనభారము కొంత తొలగినది. వాని నించుక విప్పితిని. కన్నులనుండి నిప్పులు రాల్పుచు, పులియో, సింగమో ప్రత్యక్షమగునని యడలితిని; కాని నాకేమియు నగపడలేదు. గుండె కుదుటపడినది. కొంతధైర్యము చిక్కినది. కన్దోయి పూర్తిగ తెఱచి, తేఱిచూచితిని. అప్పుడును నాకందేమియు జూపట్టలేదు. కాళరాత్రి మఱింత భయదమ్మై తోచినది! అడవిమృగ మందు లేకుండుట నాయదృష్టమేయని యూహించితిని. కాలికడ చిన్న ముండ్లకంప తోచినది! అంతకుమున్నది అందు కానరాలేదు; పైనున్న గూటినుండి పదపడి రాలియుండును. నిద్దురలో నాకాలు వాడిముండ్లపై పడియుండును. అందుగాకున్న నా సమీపమున నేగుహాలోనో అడవి మృగము గర్జించియుండును. లేదా, కొంతదూరమున పిడుగు పడి యుండును. గాలి మిగులతీవ్రముగ వీచుచుండెను! ఝంఝానిల ముత్పన్న మగుననుకొంటిని. నాటి దురంతానుభవమునకు చెట్లను పెళపెళమనిపించు పెనుగాలియును, రాళ్లను గుండజేయు వానదెబ్బయును కొఱతలుకావనుకొంటిని. తీవ్రానుభవముల నందవలెననియే మక్కువ పడుచుందును. తొలుత నవి మనసుకు మిగుల నెగులు కలిగించుట నిక్కమే! భావికాలమునుండి వానిని పరికించినపుడు అవి యొసగు నానంద మింతింత కాదు. “ఘుమఘుమారావసంకుల ఘోర జీమూతపటలము” చిఱుతప్రాయమున కృష్ణకుచేలులకు కష్టమే కలిగించినది. కాని పదంపడి ఆయనుభూతినుండి వా రెంతయానందమును తోడుకొనిరికారు? అత్తఱి గాలివాన నన్ను మార్కొనినచో, నైశనిస్తబ్ధతయం దింకను నేను నేర్వవలసిన యంశములు దూరస్థములగుట సత్యమే! కాని గాలి వానదెబ్బ నాకేదేని అపూర్వానుభూతిని ప్రసాదించెడిదేమో! కావున నించుక చింతిలితిని.

సమీపమున పరికించితినిగదా, అందు మరచెంబులేదు. నాల్గు మేడిచెట్లనడుమ నీరుబుకుచున్న తావులోని కది దొరలెనేమో అని యూహించి అందు జూచితిని. నా కది కానంబడలేదు. అందుండి అ దెట్లు మాయమయ్యెనో! ఎవ్వరైన దాని నపహరించియుందురా? ఈపాటివస్తువును దొంగిలించుటకై ఆముహూర్తమున నెవ్వ రచ్చటికి

వచ్చియుందురు ? ఏదో యదృశ్యశక్తి తొలుతనుండి నన్ను పరికించుచు నాకు త్రొట్రుపాటు కలుగజేయుచున్నదని యూహించితిని. పక పకమను నవ్వేమి ? చెంబు అదృశ్యమగు టేమి ? పెద్దనోరుగల భీకర రాత్రి దానిని సలుకలు నమలివైచెనా ? చెంబును నమలి మ్రింగిన దాని నోటికి మనిసనవుడు రుచింపడా ! అం దాతడు పట్టడా ? కునుకుపట్టుటకుమున్ను అంత యాందోళన మెలుగను. దగ్గఱగాని దూరమందుగాని ఏమేమి చలనమున్నదో నాకు స్పష్టముగా గోచరించెడిది. నిముసము నిద్రబడితినో లేదో అంతయు [illegible] హేళకన్గై తోచినది ! దానికతననే, కొండొకవడ గుండెలం దడలుపాటును, సంశయమును జేరుకొని వానిని దడదడ లాడించినవి ! చలి యెక్కువైనది. నిముసమునేపు తల్లిపృథ్విన నెలవున గూర్చుని, దోసిట నీళ్లుగొని ముఖము కడుగుకొని, శేషించినకునికిపాటును కనులనుండి తొలగించితిని. ఎప్పటట్టులు చెట్టుమొదటగూర్చుని రెప్పవాల్పక నలుదిక్కుల బరిశీలింప సాగితిని. గాలివడి పూర్తిగ తగ్గిపోయినది. కొంతసేపటికి మరల నెల్లకడలందు నిస్తబ్ధత విరాజిల్లినది ! చలనమెఱుగక చచ్చినగొడ్డువలె పడియున్నట్లు రాత్రి తోచినది ! మరల గర్జనలు వినపడవని, పులి మ్రోలకు రాదని ఎట్లూహింతును ? చీకటి పగ సాధించునట్లు తోచినది ! యామినీసీమంతినిపై కినిసి ఆమెమోముపై నేరక్కసియో దట్టముగా మసి పులిమియుండును. చెట్లగోంపమునందు గూర్చుని నిముసనిముసము వన్యపశువును గుఱించిన భీతును గుండెయందు నింపుకొనుటకంటె మెల్లగ నుదుంబరవృక్ష మెక్కి దట్టమైన ఆకులం దదృశ్యుడనైయుండి శేషించినరాత్రి గడపిన బాగనియు, చెట్టుపై నేదేని పాముండినచో అది ఇప్పటికే బుసగొట్టుచు బయల్వెడలి యుండెడిదనియు, నిక్కముగ కాలసర్పి తరుశాఖలం దుండెనేని క్రిందనున్నను, చెట్టుపైనున్నను నాకపాయము తప్పదనియు, గావున కుజబాహువును నాశ్రయించుటే యుచితమనియు నూహించితిని. ఇక చెంబుజోక్యము లేనే లేదు. లేచి తువాలును నడుమునకు గట్టిగ బిగించి దగ్గఱనున్న చెట్టును తేఱిచూచి మెల్లగ పై కెగబ్రాకితిని. మరల నెవ్వరో పక్కున నవ్విరి ! నే జెట్టెక్కుట చూచికాబోలు ! కొంతయెత్తున కొమ్మలు కొన్ని అల్లు

కొనియుండుటచే ఆకు లందు దట్టముగనున్నవి. మెల్లగబోయి వాని యందు జేరుకొంటిని. ఆస్పృష్టతల్పమును ముందే చూడనైతినని వగచితిని. కొసరొబ్బమీద నింకను పిట్టజంటయుండెనేమో యనియూహించి, కొమ్మతుదకు చూపును పుత్తెంచితిని. అందా మిథునము తోచలేదు. గడియక్రిందటి భయంకరశబ్దమువలన పక్షు లెందో ఎగసియుండును. అనంతవిశ్వమున స్వేచ్ఛమెయి పయనము సాగింపజాలు జీవి, కొండొక యెడ పిడుగులు దుల్లపడిననేమి, నిముసములో నందనమున కెగసి, భావాంబరమునందువలె,పూలగుంపులో నక్కి యుండగలదు. నే గూరుచున్నచోటికనతిదూరమున చెట్టుపై నేదో తెల్లగాతోచినది! మానవుడో! దానవుడో! ఆసమయమున తోడిమానవుడు తోచి నను గుండె సడలు పట్టుకొనును గదా! ఆ తెల్లరూపు కదలుచున్నట్లుండెను! గాలితాకుడున కొమ్మయే ఇంచుక యూగుచుండెను. అదేదో తెల్లని వస్తువై యుండుననియు, దానివలన నేయపాయము కలుగదనియు మనసున గుదుటపఱచుకొంటిని. ఇపు డెత్తుచోటున జేరితినిగావున, చూపులను మఱింతదూరము పుత్తెంపజాలితిని. దివినుండి అంధకార సముద్రమున నందందు రాలిన సత్యమల్లెలవలె, చిన్నిచిన్ని దీపికలు దూరస్థపల్లెనుండి తోచినవి! చిరనిస్తబ్ధతయందు కాపురముండు కొండ పల్లెవాసు లెంత యదృష్టవంతులో! పోయి, ఆయూరున వసించిన నెంత హాయినందుదునో యని యూహించితిని. చెట్టుకొన నించుక వెలుతురు మిణుకుమిణుకున దోచినది. మెఱపునిసుంగు ఒత్తుక మొయిలుకొన నుండి జారి ఆకుగుంపులో పడి దానియం దిఱుకుకొనెనేమో! కటికిచీకటి నించుక చీల్చి పచ్చని ఆకుపైతోచిన తళుకు నాకన్నుదోయికి విందుజేసినది. వైకుంఠవాసి దీపకళికయై అపుడపు డందు వసించుచుండు వేమో! వెలుగున నచ్చో చక్కనికులాయమొకటి కలదని తెలిసికొంటిని. శకుంతములు మిణుంగుఱుబురుగుల దమపర్ణశాల జేర్చుకొనెనని గ్రహించితిని. మరల పకపకమనునవ్వు వినబడినది! నా కనతిదూరమున దిగువనుండియే అది వినవచ్చుచుంట ఈ పర్యాయము నాకు స్పష్టముగ బోధపడినది. ఆ వింతనవ్వేమో తెలిసికొనవలెనని దృష్టి నా దిక్కుగ బంధించియుంచితిని. మనుష్యరూపేమియు గానుపించలేదు;

కాని మఱొక భయంకరదృశ్యము నాకన్నులబడినది! అదేమని చెప్పుదును! చదువరులారా! కదుంగడు కాంతివంతమైన నెత్తురు పొంగి పొరలుచున్న ట్లగపడినది! ఆఘోరదృశ్యమ్మందు ఏల తోచుచుండెనో ఊహించుటకు నాకు సాధ్యము కాలేదు. [illegible]డియో [illegible] యొడలుతెగి అందు పడియుండెనేమో! కినిబలు[illegible] న[illegible]కులు సుదూరద్వీపము[illegible]దలి యడవులనుండి వచ్చి ఆనందనిడిసి మహోత్సాహముతో రుధిరపానీయమును దయారొనరించుచుండిరేమో! షేక్స్పియరాదులు* తెలిపిన మంత్రకత్తెలు కొందఱు మనుజుల నాల్కల నెన్నో త్రెంపుకొనివచ్చి, పెద్దగూనయందు వానినుడుకబెట్టి, గంజి నచ్చోవార్చుచుండిరేమో! పులిగుంపొకటి అందు జేరి, లెక్కలేని లేళ్లకుత్తుకలనుత్రుంపి, త్రుంపి రక్తప్రవాహమును వెడలించుచుండెనేమో! రక్కసులు కొలువు దీర్చి నిండుకుండలతో నెత్తురుతెచ్చి లోతులోయను నింపుచుండిరేమో! ఆహా! అంధకారమున, నరణ్యస్థలి నెట్టెట్టి ఘోరములు జరగుచుండునో! చెట్టుకొమ్మలందు చేరకొనుటచే విపత్తునకు దూరమందే యుంటినని ధైర్యమూనియుంటిని. అదేమో తెలిసికొనవలెనను వాంఛ అంతకంత కధికమైనది. రెప్పలువాల్పక అట్లే చూచుచుంటిని. రక్తపూరమున పిల్లకెరటాలు తోచినవి! సరిగ దాని ప్రక్కనుండియే మరల పకపకమనునవ్వు వినబడినది! నవ్వునకును, నెత్తురునకును సంబంధమెట్లు కలిగెను? అది కులుకవలసిన సమయమా? అది నవ్వుదెప్పించు దృశ్యమా? లేక నది పైశాచికహాసనమా? అట్టి పవిత్రప్రదేశమున భూతములు చేరజాలవను దృఢవిశ్వాసమును నాహృదయమునుండి తటిమికొట్టజాలనైతిని. నవ్వుతో మఱొకశబ్దమేదైన వినబడినయెడల, ఆ భయదదృశ్యమును గుఱించిన ఉదంతమును కొంతయూహించుటకు వీలుండెడిది. నిద్దురలో నన్ను అడలగొట్టిన ఘోరధ్వని అందుండియే వెడలెనా? అట్టి దృశ్యమునకును, ధ్వనికిని కారణకార్యసంబంధ ముండుట సహజమే! కాని అందు మానవుడుగాని, దానవుడు గాని, ఘాతుకజంతువుగాని, మఱే భయంకరజీవిగాని కానంబడకుండుటకు కారణమేమి? నవ్వే వినబడనేల? మీదుమిక్కిలి ఇప్పు డది యధికమైనది! కాని, యింతలో చెట్టుకొననుండి మరల మధురకూజితము వినబడినది.

---

* vide; Shakespear's "*Macbeth*" and D. L. Roy's "*Chandragupta*".

ఆహా! ప్రతికూలశక్తులు సయితము ఒక్కదృశ్యమున నొక్క సమయమున నెట్లు విడసియున్నవో! భయదసంఘటనము లదూరమున విజృంభించుచున్నను వానిని లెక్కింపక, వానిపై నొక్కచూడ్కి నైనను సారింపక, శకుంతములు తియ్యని కూహూకూహూలను రజనీరమణిసెవు లందు రాల్చుచున్నవి! అవమానిత పిశాచములవలె నరిష్టము లానంద ప్రతులనేమియు జేయజాలక దూరముగ తొలగును కాబోలును! ఆహా! విహగము లెట్టి లౌకికులో! ఎట్టి సంయములో! ఆదర్శకవులు కావున నవి యద్భుత తాత్త్వికశక్తి నందినవి! నైశవిహారము ముగించి, పక్షిదంపతులు తమ మనికిపట్టునకు మరలియుండును. ఒకదానిశిరము నింకొకటి మూర్కొనునట్లు సమ్ముఖనమై నిలిచిన నాలుగు ఉదుంబరవృక్షములపై పలుచనిపిండివలె క్షీణనక్షత్రాలోకము పొడగట్టినది! మరల బ్రహ్మాండమును పరికించుచు, కొమ్మతుద నూగుచు, పిల్లగాలిలో మధురగీతికాకళల రాల్చుచు, విశ్వమున కవ్వల విడిసిన తమనెచ్చెలులకో, పాలవెల్లిపై తేలియాడు దేవదేవునకో చుక్కవెలుంగునుండి శకుంతములు ప్రేమసందేశ మంపుచున్నవి! ఈపర్యాయము వాని సమీపమున జేరితిని గావున కన్నులార వానిని పరికించి, చెవులార వానిగీతిక వినవలెనని ముచ్చటపడితిని. దృష్టిని పిట్టజంటపై నిలిపి, అపుడపుడు మాత్రము అదూరమందలి వింతదృశ్యముదెస నొకటిరెండు చూడ్కులను పుత్తెంచుచుంటిని. నేనేకాక పదపడి పక్షులును నెత్తుటివెల్లువను పరిశీలించుట గంటిని. కాని అవి ఏయెడలు నెఱుగవు. ప్రశాంత స్వభావుల చిత్తములను విపత్తు లిండ్లుచేసికొనజాలవుకదా! పక్షిహృదయము శాంత సముద్రమని యెఱిగియే కావలయును విహంగము నొండు శ్రీవిష్ణు వన వరతము చెంతజేర్చుకొని, దానిమూపెక్కి తన విశ్వసామ్రాజ్యము నపుడపుడు పరీక్షించుచుండును. కూహూకూహూ లెందెందుపోవునో యెఱుగ గాంక్షించితిని. చెట్టుతుదనుండి రెక్కలుకట్టుకొని యెగసి విస్తృతపర్వతసామ్రాజ్యమున నెందుచెవియొగ్గినను అది శ్రుతిగోచర మగుట నిక్కమనుకొంటిని.

తనకూహూకూహూరవమును తెలుపుకొనుచు జవోపేతముగ నెగయు విహంగ మైనను దానిగమ్యస్థానము నెఱుగజాలదుకదా! వ్యక్తికింటెవ్యక్తి

హృదయసముద్భవ ప్రతిభ ఘనతర ప్రాభవమున నెట్లువిజృంభించునో! అయ్యకంటె బిడ్డడే అధికుడగుట అక్కజమెట్లగును? తొలిసృష్టికంటెమలి సృష్టివిశేషశక్తిసమన్విత మైయుంటవర్ధమాననియమ(evolution) మందలి స్వతస్సిద్ధగుణమేకదా! చిన్నదైన పిట్టగుండెయునుండి వెడలు సన్నని పల్కు లంతదూర మెట్లుపోజాలునో! మాటలో మహత్త్వముండెనేని, అది సన్ననిదైననేమి? చిన్నదైననేమి? విశ్వవలయమందంతటను విహరించి భావపరంపరను గురియించును! మధురగీతికి నాలాపించుచినుకు ఏపాటిది? ప్రణయసందేశము నదెందుండి గొనివచ్చుచున్నది! నింగిలో నెందో మసలు మొగులుగుండెయునుండికదా! అందుండి పయనమై సచ్చరిత్రుని తలపువలె కడుంగడు చల్లనై, ఆత్మహృదినుప్పొంగు పరితోషమును పట్ట జాలక మధురాలాపనమున నాత్మప్రకాశము గావించుకొనుచు, ఆకు లందును, మొగ్గలందును, తీవలందును, పూవులందును మఱలీలు సలుపుచు వసుమతి జేరి, కొండొక ప్రశాంతభావంపు ప్రసన్నత సంది మహా గ్రంథమును రచించు కవీంద్రునివలె, విశాల స్రవంతిసామ్రాజ్యమును సృష్టించును. ఎంతో భావపూరము లభించునని కదా మేధాసముద్రుని ప్రశాంతహితవాక్కును వినుటకై కోటికోటిజిజ్ఞాసువు లాతనిచుట్టు మహోత్కంఠ ననవరతము చేరుచుందురు! ఘోరపిశాచాక్రందనమునుండి దూరముగ పాఱి, ఇంద్రసభాంగణమున దేవనర్తకీ మృదుమధురమంజుల రాగమాలికపై నిజాత్మల దేలింప ననిమిషులాతురపడు టెఱుగమా? ఆత్మ కనంతమైనహాయి నొసగునది శబ్దాడంబరము కాదని, మహానినదము కాదని, ఘోరాటోపము కాదని, ఆర్భాటముకాదని, ఘోరవిజృంభణముకాదని, మధుమయ భావబంధుర సౌందర్యసందీప్త శాంతివిలసిత లలితపదమని ప్రకృతియును, దాని ప్రబోధమందిన జీవులును మనకు బోధపఱచుచుండుట లేదా? ఆహా! ఎల్లకడల జేరుశకుంతసంగీత మెంత మహత్తర మైనదో! భావించినకొలది నాహృదయమున నానందమహోదధు లుప్పొంగదొడగినవి! ఆకసమునకు వసుమతిని లగించు బంగారు తీవలవలె తోచు ప్రభాతమరీచులను, రేలందు స్వర్గమర్త్యములను గలుపు వెండిదారములలీల గానంబడు జాబిలివెలుగురేకలను విలోకించి దివ్యసంయోగమున నవి కావించు కర్తవ్యమును ప్రస్తుతింతుము గాదా!

వ్య_క్తీకరణము వేఱుతీఱుల జూపట్టిన నేమి, కిరణములును, గేయహృదయమునుండి ఆత్మవ్య_క్తీకరణ మొనరించుకొను రాగమాలికయును ఒకే యుద్దేశము నొకేహృదయమును గలవియే! స్వరమాలకును, మరీచికాగుచ్ఛమునకును [illegible] లున్నవని తెలుపువారెవరు? మయూ[illegible] అనంతజ్ఞాన భాండారమైన [illegible]హృదయము జేరుట్లో, మధురగీతికాసూత్రము నారోపించి రమ్యదివ్యోద్యానము పేరి, అందలి యానందహ్రదమున గ్రుంకులిడుటయు నట్లే! ఈ యద్భుతశక్తులను జగదీశుడు మనుష్యమానసమున కొసగినాడు. వెలుగునకై 'గాయత్రి' జపించినపుడు, రసస్రవంతులందు గ్రుంకులిడ దమించినపుడు పరిణతినంది చిత్తమీశక్తులను సార్థకము గావించుకొనును!

శాఖాతల్పమున శరీరమును వీడి, పికగీతికతో చిత్తమును పుత్తెంచి, విశ్వసంచారము చేయసాగితిని.

ఆత్మపరీక్షయం దారితేఱుటకు, మననిదిధ్యాసనములందును, గభీరధ్యానమందును, శిథిలముకాని సమాధియందును ఉపాసకుడు సిద్ధహస్తుడగుటకు భావనావీథులం దెగయుటకు, అవిచలితపరిశీలనము నలవఱుచుకొనుటకు, ఏకాగ్రదృష్టి నభ్యసించుటకు, మౌనమందలి, యోచనమందలి, శాంతమందలి, ఆనందమందలి ఉదాత్తభావములను గ్రహించుటకు, భూమినుండియే యన్యగోళములను పరిశీలించి అన్యగోళవాసులతో ప్రసంగించుటకు, మనుష్యజీవిత ముదరపోషణమును వృథాకాలక్షేపమును మాత్రమేకాక ఒకేరితిగమనికతో నొకే తెఱగు క్రియతో నొకేచొప్పుచప్పుడుతో చలించు జంత్రముకాక ప్రాణప్రదీప్తమై, ఆత్మసందీప్తమై బహువిధానుభవముల పటుత్వమహత్త్వముల నంది ఈశ్వరప్రజ్ఞకు ప్రతిచిత్రము కావలెనని మనుజుడు గుర్తించుటకు యామినీశైలవనని స్తబ్ధతల సమావేశమును, దీనిబోలు భావవిశిష్ట సంఘటనసమయసమావేశమును జగదీశుడు నిర్దిష్ట మొనరించుచుండును.

కొంతసమయము కడచినది. చెట్టుమొదలునుండి వికృతమైన కూతయొకటి వినవచ్చినది. మండూక మొకటి దురంతయాతనకతన

పొగులుచున్న బ్లాకూతవలన గ్రహించితిని. పాప మది ఏదేనిపాము నోట బడినదేమో! అచ్చోటునుండి చెట్టుపైచేరుట మంచిపనిగానైన దను కొంటిని. ఆహా! ఈశ్వరేచ్ఛ యెంతయద్భుతమైనదో! కోటిపక్షులవలె జట్టును ఘోరారిష్టములు పొంచియున్నను, జగదీశునానందిక న్నెయు మీదలంఘింపదు కదా? కొండొకసమయమున, నొకానొకస్థలమున విపత్తు విజృంభించునని ముందేయూహించి, ఏదేనిమానసికప్రేరణమున నాతడు మానవుని దూరముగ దొలగించును!

చెంతనుండి చెవిజొచ్చి, హృగయకుంజమందలి ఆత్మనుసోకిన కోకిలకూజిత మెట్టిదో, అంతరంగమున నది ధారవోయుహాయి యెట్టిదో ఎఱుంగజాలితిని. పిల్లతెమ్మెర మూపెక్కి దూరమునుండి అల్లనల్లన నరు దెంచు మనోమోహాన మంజులనాద మేదేని చేరునేమో యని ఆశపడి వీనులొగ్గితిని. భావశక్తిమీది విశ్వాసము సడలకున్న, నెట్టి మనోరథ మైన క్రియారూపమున సాక్షాత్కరించునుగదా! వాంఛ పూర్ణముకాని యెడల, నందుండ వలయుశక్తికి కొఱత గలిగెనని రూఢిచేయవచ్చును. పుష్పించుట కిచ్ఛకు సమయము పట్టినబట్టవచ్చును. ఇచ్ఛాశక్తికి సహాన శక్తి నెచ్చెలియై నపుడు, ఉత్తుంగ శిఖరములుపోలు ఉద్దేశములు కూడ తలలొగ్గి మనపాలబడును! ఈయంశ మిట్లుండ నట్టి యీప్సితము ఫలించుట కనుకూలమైనది కదా ఆవేళ! దిక్కుల జుంబించు వటవృక్ష శాఖల నుండి, బుడుతల బుడిబుడిసుడువుల వడువున పెడలు లేత యాకులవలె నిస్తబ్ధనిశీథినీ యంగప్రత్యంగములనుండి కలస్వనము లుదయించుటందు అక్కజ మేమున్నది? హృదయమందలికాంతు సుదూర వనస్పతియందు వసించు గొండొక శకుంతమానసమును తట్టి దానిని మేల్కొలిపినదేమో! కోకిలకాకలీకలరవము తోడన జెవిసోకినది! అందలి మధురభావకణములు మనసును నిండించునని ఆశపడితిని. కాని, ఇంచుక చవిజూపి, ధ్వనివలన ననంతభావమును సూచించు కావ్యకర్త కరణి నది యూరకొనెను. హిల్లోలతరంగములం దాప్రమదగీతి మునుంగుచు దేలుచుండనోపు! అవ్యక్తమధుర కలకలస్వనమై యది కర్ణ గోచరమగుటకు కారణము కరువలికెరటాల తాకుడుకాక మఱేది? అంతరంగమున నది వీడిచనిన భావమునుండి వలసినంత ఆనందామృత

మును పిండుకొని జుఱ్ఱుచుండ, దేవదేవు నూగాడించు పాలవెల్లి కెరటమట్లు పరమాత్మ నాత్మహృదయమం దిడికొనిన మురళీరవ మొండు కర్ణపుటముల బ్రవేశించినది! నలుదిశల బరిశీలించితిని. కారుచీకటి తెర ఇంచుక తొలగినట్లు తోచినది. కాని, నా కెవ్వరును కానుపింపలేదు.

నాటికి తనపని ముగియవచ్చినదని కాబోలు విభావరీభామిని అల్లన నభమునుండి తరల నుంకించుచున్నది. తూరుపున గగనమహిళాగళమున మిగులతేజోవంతమైన శమంతకమణి ప్రేలు స్వచ్ఛ శుక్రతార పొడగట్టెను! ఆంగ్లసాహితీ వియత్తలమున ప్రభాతనక్షత్ర (Morniug star) మని ఛాసరుకవి సుద్దించి టెన్నిసను పలికిన దీచుక్కను స్మరించితిమే! ఈ చుక్కవెలుగును కబళించిన చకోరములు స్పెన్సరు, మార్లో, షేక్స్పియరు, బెన్‌జాన్‌సన్, బ్యూమంట్, ఫ్లెచ్చర్ ప్రభృతులు. ప్రతిభకు జోహారను కళోపాసకు లాత్మప్రతిభను గుర్తించి భావభాస్వన్మరీచికలచే సాహితీవసుమతిని దనుపుదురు కదా! ఉదయశోభ సమీపమందే యున్నదని శుక్రతార తెలిపినంతన సంతసించితిని.

గడియ కడచెను. నొసటగుంకుమ దిద్ది, ఎవ్వరో దిగ్వలయభిత్తిక వెన్కనుండి తొంగిచూచుచున్నట్లు తోచినది. అనూరుడో, అగ్నిహోత్రుడో! పిలుపునందుటచే కాబోలు నిక నాలసింప నిచ్చగింపక నిశి కడచుచున్నది. కులికించియు, నడలించియు నాడు నా కది కఱపిన పాఠములు నామనసున చిరాంకితములై యున్నవి! ఇట్టి పాఠముల నా కేవిశ్వవిద్యాలయమును బోధించియుండలేదు. వింతయుపాధ్యాయినిదైన నాటి యామినీకాంత కనవరతము కృతజ్ఞుడనై యుందును.

తోడనే తూరుపుదెస యంతయు గందిపోయినది. పూర్వదిక్కామినిచెక్కిళ్లపై నిష్ఠురభావమున నెవ్వరో చఱచిరి కాబోలు! అరుణచ్ఛవి అల్లనల్లన నధికమగుచుండెను బొగ్గుపొడిపైబడిన అగ్గి నెరసులవలె, అజాండము నలముకొనిన అంధకారముపై తునకతునకలైన మంట రాలినది! మేఘములం దెవ్వరో చలికాగుచుండ మొయిలు యంచుల నుండి నెరసులు రాలియుండును! కాటుకరంగు మోము గలదని ఎవ్వరో రజనీకాంతమోమునను పరిహాసమునకై జేగురుపులిమి యదృశ్యులై యుందురు; ఉదయపూజకై కావలయును ఎవ్వరో నల్లకల్వలరాశిపై

నిత్యమల్లెల రాల్చుచుండనోపు! కాలపురుషుడు చీకటిబ్రదుకునుండి తప్పుకొని, తేజఃపటలమున జొరబడు జడదారివలె కావిశాటువులు దాల్చి, ముందటికి కదుదెంచుచుండెగాబోలును! "ఇక నెంతకాల ముందు విసీ!" యని ఎవ్వరో నిశీరమణిగుండియలో వాడిఛురికను గ్రుచ్చుటచే రుధిరధారలు వెల్లుబ్బుచుండెనేమో! తమోయవనికను చింపి, తేజస్విని యొర్తు జలదకుటిమముపైనిలిచి, బ్రహ్మగిరిచిత్రములను విస్మయముతో విలోకించుచుండెనేమో! ఇక రానున్నది హోళీపండుగయని పొంచిపొంచి కులుకుచు నెవ్వరో శర్వరీసీమంతినిపై వసంతముచు చల్లుచుండిరేమో! నిరాశను తెగటార్చు శుభాశీస్సువలె సమ్ముఖీనమైన కెంపు తళ్కునకు తరుశాఖలనుండి మహోద్వేగముతో కేలుమొగిచితిని.

తూరుపుదెసనుండియే వంశీరవము వినవచ్చుచున్నది. ఆ దిక్కునందే దృష్టినిలిపి యుంచితిని. బహుదూరమున నొకగొల్ల చూపట్టినాడు. తలమీదిపాగాయును, కట్టుకొన్న చిన్నిచేలమునుదక్క, వానియొడలున (అది తీవ్రమైన శీతసమయమైనను) నికే వలువయు లేదు. నిష్ఠురమైన చలి ఆతనియెడల బ్రసన్నమై యుండెనేమో! ఇక్కట్టులందేపుట్టి, ఇక్కట్టులందే పెరుగుటచే వాని కవి మిగులగూర్చు చుట్టము లయ్యెనేమో! లేక కఠినశిలలవంటి వాని యరిష్టము లాతనిపాటకు కరగి ద్రవమై పూతగోదావరీవారిపూరమున గలసిపోయెనేమో! ఇంచుక వలయముగ నిలిచి గొల్ల పిల్లనగ్రోవి నూదుచున్నాడు. వానిమోమున నానందదీప్తి తళ్కొత్తుచున్నది! ఆతనిసమీపమున గొన్నిగోవులును, కొంతదూరమున గొఱ్ఱెలును మేయుచున్నవి. కడుచనవున గోవులు గొల్లదాపున వాలములూపుచు పచ్చికమేయుచున్నవి. తమయొడయని పాటకు చెవులొగ్గి అందలి మాధుర్యము నవి తనివార బడయుచున్నవి. ధేనువు శాంతగుణమునకు మాఱుపేరు. కవిమానసమువలె సుందరమై శాంతిప్లావితమైన కేదారమున నరుణోదయసమయమున వెలయు, ఆవుల జూచినపుడు నా యానందమునకు మేర లేకపోయెను. మురళీధరుడైన గోపాలుడును, గోవులును నాడు తొలుత నాకు గోచరించుట నా యదృష్ట మనుకొంటిని.

గోపాలురును, గొఱ్ఱెకాపరులును, చేలకాపులును తొల్లింటి నుండియు ప్రాచీప్రతీచీవసుంధరలం దాదర్శ జీవులై యుండిరి. సాహితి జీవితప్రతిబింబము కావున వీ రందు (See Pastoral Poetry) ఉత్కృష్టస్థానముల నాక్రమించుట గాంతుము. వాల్మీకి, కాళిదాసు, మాఘు, భట్టి ప్రభృతుల రచనము లిందులకు తార్కాణములు. పరార్థ జీవులు కావున నాచార్యు లని ముఖ్యమతములు వీరిని బ్రస్తుతించినవి. అవతారములందు తలమానిక మని మనము గోపాలుని గొలుతుము కదా! క్రైస్తవమతకర్త గొఱ్ఱెకాపరినని తెలుపుకొనలేదా? ("I am the good shepherd: the good shepherd giveth his life for the sheep" *vide* verse 11. Chapter 1o. "*Gospel of St, john*") పేదలందుపేదలై, పరార్థజీవియైన వాని నెల్లమతములు నెల్లయుగము లందు నవతారపూరుషుడని ప్రస్తుతించినవి. సేవామహత్త్వ మీశ్వర తత్త్వమున నంతర్భూతమైయున్నది కదా! తన "గీతాంజలి" యందు రవీంద్రుడీ యాశయమును బహుభంగుల వ్యక్తీకరించినాడు. నాటి ప్రభాతమున పర్వతరాజ్యమునంతను మధుమయ మొనరించినది పిల్లన గ్రోలా? దాని హృదయమునుండి వెడలినసన్నని యాలాపనమా? మంజులనినదమును బహిర్గత మొనరించిన భావోద్వేగమా? దిశాంగ నలను మేలుకొలుపుపాట,—క్రోవుల, గ్రేవల, బూవుందీవెల, కను విందొనరించు లోయల బులకిత మొనరించు మధురవము పిల్లనగ్రోవి యొడందలోని చిన్నిరంధ్రముల నుండి యెట్లు వెల్వడెనో! అణువునగూడ ననంతభావమును కన్గొనుదుము! ఉపాధి గోపాలుని మోవియైనపు డందలి వెదురుగొట్టము మాధుర్యమహోదధిని గ్రక్కుటం దక్కజ మేమున్నది?

పిడికిలికంటె పెద్దదికాని గుండె భావవనధి కాకరమై కావ్యకర్తల కెట్టి దృష్టాంతము చూపుచున్నదో! గోపాలహృదయ మట్లు నిర్మలమై, ప్రతిభాసమన్వితమై, మహిమోపేతమైన గుండెగల రచయిత ఆత్మభావ ప్రకాశ మొనరించుకొనుతటి సుధాసింధువును సృష్టించును. మనయా రాధ్యదైవమైన గోపాలుడు ఎట్టి కవియో ఎట్టిగాయకుడో భువనము లెఱుగును. ఆంగ్లకవులలో మొదటివాడు గోపాలుడేసుడీ! శైలపార్శ్వ

మున శయించి, మధురమంజులపంక్తుల నుచ్చరించుచు నీతడు మేలు కాంచినాడు కదా!

ఈరీతి కవులొక్కొక యక్షరము నొక్కొక్క యమృతకలశము గావించిరి "అల్పాక్షరముల ననల్పార్థరచన కల్పించుటయకాదె కవివివేకంబు" అనికదా మనశైవకవి పలికినాడు! అల్పాక్షరములం దనంతార్థమును నిండించునది దండితెలిపిన నైసర్గికప్రతిభ. ఇట్టి ప్రతిభలేని గుండె అట్టి యక్కరములకు జనయిత్రి కాజాలదు. భావజలధిగల అక్కరము పఠితహృదయమున మఱొకభావరుహోద్భవమును బుట్టించును. అక్కరమువెన్కగల ప్రతిభ దివ్యశక్తికావుననే, దివ్యశక్తి ప్రధానగుణము సృష్టికావుననే రచయితహృదయమునందువలె పఠితహృదయమందును సృష్టిమహత్త్వము పొడసూపును.

ఇత్తఱి మనదృష్టి నాకర్షించునది ఆంగ్లమందలి "టేలంటు" ('Talent') అనుపదము. దీనికి నాణెమను నర్థము కలదు. వేఱొక యర్థము ఆంతరంగిక ప్రతిభ యనవచ్చును. బైబిలులోను, మిల్టన్ కవీంద్రుని రచనములందును ఇది భావగర్భితమైన శ్లేషకు తావొసగినది. నాణెమందలి ప్రయోజనమున కవగతుడు కాని అభాగుడు భూమిలో దానిని (బైబిలులో నుల్లేఖింపబడినట్లు)పూడ్చిపెట్టినాడు. వానియట్లుగాక ఈశ్వరదత్తమైన ప్రతిభను వినియోగించి తీఱవలెనని తన ఇరువది మూడవయేటినుండి మిల్టన్ కవిచంద్రుడు పొగిలినాడు. ప్రతిభాప్రయోజనమును భారతీయులు నాణెపు ప్రయోజనమునకే ఉజ్జీజేసిరికారు. దాని నంతకంటె మిన్నగ జూచిరి. ప్రతిభ "నవనవోన్మేషశాలిని" యని మన ప్రాచీనులనిరి. ఈశక్తి అక్కరములను నిమిత్తముల గావించుకొని రచయితయంతరంగమునుండి పఠితహృదయమున ప్రవేశించి తానే అందు పనిచేసియో, పఠితహృదయమందలి తోడిప్రతిభను లేపియో అం దద్భుతభావసృష్టి గావించునని పలుకుదును. ఈ ప్రతిభ దివ్యగీతిక కెన యైనదని తెలుపుట నాయాశయము. సంగీత సాహిత్యములు సరస్వతీ స్తనద్వయమని భారతీయు లందు రేల? వానియం దాంతరంగిక వ్యత్యాసము లేకుండుటచే గదా! వానియందు మహిమోపేతమైన పొందు వెలయుటచే కదా! వానికాధారమైన దివ్యశక్తి యొక్కడ

గుటచే గదా! అవి ప్రతిభాసముద్భవములగుటచే గదా! పిట్టపొట్టయు, పిల్లనగ్రోలును, సారస్వతోపాసకుని హృదయమును ఈశ్వరునకు, వంశీధరునకు, సృష్టికర్తకు నిమిత్తములు మాత్రమే! మధురగీతిక ఎట్లు మనుష్యహృదయమందును, ప్రకృతి సీమంతినీహృదయమందును ఆనంద సృష్టి గావించునో ఆదర్శకావ్యరచనము జిజ్ఞాసువు నంతరంగమున నట్లే యద్భుతభావసృష్టిని గావించుననుట స్పష్టమైనదికదా!

అరుణచ్ఛటకు నిక నచిరములో పొడుపుగొండపై పొడసూపు స్వర్ణాభతో హైమపచ్ఛలనీను కొండసింగారమున నవతరించి, వివిధ కుసుమ విలసిత లతావితానమునుండి వెలారి నిర్మలధునీహృదయమున తళుక్కు-లీనుట గనులార విలోకించి, బహురాగ సందీప్త పూత వారిపూరమున నుదయస్నానమాచరించి, అందలి యనంతభావముల నాంతరంగికముగ నాపోశన మొనరింప నువ్విళ్లూరుచుంటిని. కొమ్మమీది పిట్టజంట ఇపుడు స్పష్టముగా గోచరించినది. ఈ శకుంతమిథునము నుపలక్షించినవారు అనురాగసందీప్తదాంపత్యమందలి మహత్త్వమెట్టిదో గ్రహింప జాలుదురు. *

---

* క్రౌంచదాంపత్యము వసుమతిలోని ఆదికవి వాల్మీకిహృదయమున కెంతో ఆనందము గొలిపినది. వాల్మీకి పై కన్నించిన కాళిదాసు మధురమిథునానురాగమును వేర్వేఱు జీవులందును గాంచి, తన కృతులందు దానిని కడుంగడు చక్కగ వర్ణించినాడు.

"అర్ధోపభుక్తేన బిసేన జాయాం సంభావయామాస రథాంగనామా"
"లతావధూభ్యస్తరవోఽప్యవాపుః వినమ్రశాఖాభుజబంధనాని."
"మధు ద్విరేఫః కుసుమైకపాత్రే పపౌ ప్రియాం స్వామనువర్తమానః."
"దదౌ రసాత్ పంకజరేణుగంధి గజాయ గండూషజలం కరేణుః."
"శృంగేణ సంస్పర్శనిమీలితాక్షీం మృగీమకండూయత కృష్ణసారః."

మహాకవుల రచనలయం దిట్టి దృష్టాంతము లనేకము లున్నవి. సాధుజీవక్కులందలి యనురాగమహత్త్వమును సుప్రసిద్ధవంగనాటకరచయిత ద్విజేంద్రుడు మానసిచే ("మీ వారు పతనమును మాడుడు") గీర్తింపజేసినాడు. రవీంద్రుడు విహంగములతో భావసాపీథులం దెగసినాడు. భారతమహాకవులరచనలకును ప్రకృతి కనుంగుచెచ్చెలులై మసలిన ఆంగ్లకవుల (E. G. Poets of the Romantic Movement) రచనలకును అందందు పోలికలు కలవు. షెల్లీకీట్సు వర్డ్సువర్తు ప్రభృతులు పికజీవితములను చిత్రించిరి. ప్రకృతిలో పెల్లకదలందు షెల్లీకవీంద్రుడు దాంపత్యప్రణయమును విలోకించినాడు. ఆతని నుడువులను పరికింపుడు:

దొర తోచుటెఱిగి పంచబంగాళమా దొంగమూకవలె నిను డేతెంచునని గ్రహించి, కడువడిగ నిరులు కొండబిలములలోనికి పఱ తెంచినవి. నాటినిశి నేగావించినతపము ఫలించెనో యన బొడుపు కొండపై బాలభానుడు ముగ్గినపండువలె తోచెను. దుర్గ్రాహ్యమైనపద్య భావము స్పష్టమైనట్లు రమ్యశైలసామ్రాజ్యము దృష్టిమ్రోలదేజరిల్లెను ! జగద్బాంధవునకు గీతికార్ఘ్యమీయ నల్లిబిల్లిగొను కాంతారశాఖల నుండి శకుంతసంతానములు రివ్వురివ్వున నెగసివచ్చినవి ! పాడుచు బాడుచు నేనున్న ఉదుంబరవృక్షముమీది పిట్టజంటకూడ తూరుపు కొండమీది కెగసిపోయెను. బృందావనవిహారిని చూచినంతన ఆనంద పరవశులగు గోపికలవలె, కట్టెదుట (మేలు కాంచిన మునిమానసమట్లు) కాంతిలు కమలాప్తుని కాంచినతోడనే కుట్మలములు నగుమోమునవై, అనురాగ సౌరభసంభరితములైన తమహృదయముల నుద్వేగముతో మయూఖబాహువుల కప్పనమొనరించెను. సరిల్లలామము అమరగీతిక నాలాపించుచు, వింతతళుక్కులీనుచు, కొండకొననుండి లోతులోయ లోనికి లంఘించుచున్నది! పిల్లనగ్రోవిపాట సన్ననిసలిలధారవలె తెమ్మెర లందు జాలువాఱుచుండెను! "ఈ సౌందర్యము, ఈ సౌరభము, ఈ మాధుర్యము, ఈస్వర్గసామగ్రి నావి"యని మురిసిపోతిని.

---

"The fountains mingle with the river
And the rivers with the ocean,
The winds of heaven mix for ever
with a sweet emotion;
Nothing in the world is single,
All things by a law divine
In one another's being mingle."

..................................

" See the mountains kiss high heaven
And the waves clasp one another;
No sister-flower would be forgiven
If it dis-dain'd its brother:
And the sunlight clasps the earth,
And the moonbeams kiss the sea—"

"*Love's Philosophy*

# నా మహారాష్ట్ర యాత్ర

## పదియవ ప్రకరణము

చెట్టునుండి దిగి యించుకసేపు కొండసింగారమున మసలి, ముఖ ప్రక్షాళన మొనరించుకొని, దివ్యాపగాజన్మస్థలి జొచ్చితిని. వనలక్ష్మి కుదయలక్ష్మి తోడై గిరిపై నొప్పులకుప్పనాడుచు, నలువలంకుల చిఱునవ్వు తళ్కొత్తించుచునేయుండెను. వీని చెలికారమున నెంతచెలువ మున్నదో!

సుదినములు పలుకరించినంతన వాడిముక్కులతో మనసును బొడుచుకొని తిను చింతలు రివ్వున నెగసిపోవునట్లు, ఈశ్వరకరుణాస్పర్శకతన జీవితలతనుండి నెవ్వగ దిగజారునట్టులు, శైలహృది గిరణశాబకము లడుగులిడినంతన దాని పీడించుచుండిన కారుచీకటులు చిడిముడిపడి, కాలు కొలది పరుగిడుటచే హృదంతరాళమందలి రాగసాగరపూర మిక నేయంకిలి గనక ఉవ్వెత్తుగ బొంగి దశదిశల రంగారు బంగారుకెరటాలరూపు మేలుకొలిపెను...కొండొకకవి చంద్రుని మానసమీనిన తీపితలపులు కాబోలు రూపులంది లేదీగల ట్లగపడెను! ఆనందబిందువులు వీనిపై మంచు తుంపురులచాడ్పున తళ్కొత్తి అనంతవియత్తలమున భావభువనములను దొరలించుచుండెను. కలకంఠకంఠములనుండి జలజలరాలు సూక్తిసుధా కణములు అదృశ్యప్రేమబిందువులని గ్రహించి, "మా కీభిక్ష పెట్టు" డని యెడంద లొడ్డి ప్రాప్తమనోరథలై, మిగులనలరి, దిశాంగనలు పులకిత లయ్యెను. ప్రఫుల్ల హృదబ్జమునుండి గుప్పున నుప్పొంగు భావనావేశ మట్లు నిండుకొండ గుండెనుండి వెడలు నిర్ఝరధార చిత్తమున నెయ్యమును, తియ్యమును చిల్కరించుచుండెను. శైవలినీ-గీతిక దివ్యవిహంగమ ట్లెగసియెగసి విష్ణుచరణకమలములనంటి, దేవదేవుని మూపునగొని, విశ్వవలయమున విహరించుచుండెను. కావుననే దిగ్వలయమున నమర జ్యోతి మిన్కులీనుచుండెను! సరిత్తటమున హాసన్ముఖియై నిలిచిన సరోజిని

యొసగిన ప్రణయసందేశమును వహించి, అల్లన సమీారు డాత్మకందీయ నది సౌరభసందేశమందలి భావప్రకరమును గ్రహించి, ప్రమోదసంభరిత మాయెను. అఱవిరితమ్ములరొమ్ముల నల్లనల్లన స్పృశించుచు, కుంజ శయ్యలందు తుమ్మెదలు, కవిహృదయము నాశ్రయించు భావరాజివలె గుసగుసలు సలుపుచుండెను. గుసగుసలందలి తేనెబొట్టులు కర్ణపుటము లందు రాలుటచే మేను గరుపాఱుచుండెను.

స్వర్ణకాంతులీను గోదావరీపయస్సున మాటిమాటికి మునుం గుచు ఆపవిత్రస్థానమున నా కాభాగ్యమును ప్రసాదించిన జగదీశునకు సహస్రధన్యవాదములు సమర్పించితిని. తనివారతానమాడుచు సలిల మందు చిందులాడు చిఱుతరగలకు నాతలపులను సహకరించి మురియ సాగితిని. చెప్పనేల? భావోద్వేగముచే నాయాత్మ దేవశైలూషివలె నృత్యమొనరించినది. మధుమయమైన ఇట్టి సన్నివేశము పొడసూపినపుడే కదా తన్ను దాను గుర్తించి ఆత్మ ఇట్లలరును! ఈ యానంద మెంత మహత్తరమైనది! ఈ యుద్వేగ మెంత యద్భుతమైనది! పూవున కాపురముండు కలపమువలె ఆనందమున సదాశ కాంతిలుచుండును. సృష్టికి—అది కావ్యసృష్టియనుడు, మఱేసృష్టియనుడు—కర్త యగు నది సదాశయే! కావుననే, సృష్టికర్తలు కాగోరు కళోపాసకులు సదా శయసందీప్త ప్రకృతిపై (అది బాహ్యావని గోచరించునదైనను, మనుష్య హృదయమున దోచునదైనను) కన్నుంచియే తమకలములను, తూలిక లను చేబట్టుదురు. ఈ కన్నులకు వెన్కనున్నది మానసమహోదధి! నిండుచందురుని చూచి యుప్పొంగు నుదధివలె, సదాశలో షోడశకళల నీను సృష్టిశక్తిని గాంచి మనుష్యమానస ముప్పొంగును! ఈ పొంగునే భావోద్వేగమని నేను పిలతును. అమృతసూతిని చూచినను, అమృత కలశమును గాంచినను మురికగుంటలు చచ్చినట్లే పడియుండును. ఈ గుంటలందు జీవకళగాని, సృష్టిశక్తిగాని ఎట్లుదయించును? సౌందర్య మును జూచినను, వెలుగురేకల వెలార్చు సదాశయమును విలోకించి నను చలింపని మనసు (చేరలంతకన్నులు దానిముందున్న నేమి) మురి కితో నిండి, పురుగులుపోలు తలపుల నీనునదని నొక్కిచెప్పుదును. భావోద్వేగమెఱుగని స్వాంతము చచ్చినదానితో జమయనియు, జీవ

చ్ఛటల జిమ్ము సృష్టి ఇందుండి తలసూపలేదనియు స్పష్టముగ తెలుపవలెనా? అద్భుతాభ్యుదయగర్భితమైన ఈ యుద్వేగమును మానసమెట్లుందగలదు? అలవఱచుకొనవలెనన్న నిది యబ్బునా? కడలి తన గభీరత నెందుండినైన దెచ్చిపెట్టుకొనినదా? అంబురాశిలోని తరగలను పరికింపుడు. ఒక్కొక్క కెరటమందు శమంతకద్యుతిబోలు తళ్కు తోపదా? వీచికలందలి బెళ్కులేమి? కడలికన్నులనుండి వెడలు దీప్తులని వచింతును. దీప్తివంతములయిన కోటికన్నులను, సహజగభీరతను గలదికావున సంద్రము చంద్రుని గుర్తించి, ఉద్వేగపూరిత మగుచున్నది! నైసర్గికగభీరతగల చిత్తమును, సహజశక్తి సందీప్తదృష్టిని గల వ్యక్తియే నిజాంతరంగమున దివ్యభావోద్వేగమునంది తనసృష్టికి గడంగును.

ఆనందమున సదాశ కలదనిన, సదాశనుండి సృష్టిపొడసూపుననిన ఆనందము కడుపుచలువగల తల్లి వంటిదని గ్రహించుట కాలస్యము పట్టునా? ఈతల్లికరుణ నందుటకై కవులును, ఋషులును, వేలుపులును తపసుచేసిరి. గంగాగోదావరులను తల్లులని మనము పేర్కొనుటకు కారణము అవి యానందపూరము లగుటయే! అక్కసెల్లెండ్రయిన ఈ ఝరీమతల్లులను దివిజకల్లోలినులనుచుందుమేల? ఆనందము దివ్యమై, ఆధ్యాత్మికమై విష్ణుపాదరాజీవములనుండి, ఈశ్వరశిరమునుండి చాలువాఱునది కావుననే! భారతావని అమరులకు లీలాభూమియైనదని ఎవ్వరెఱుగరు? గంగాగోదావరులు దివినుండిదిగి మననేలయందు మసలుచుండుటచేతనే తమవెల్లువలమీఁది మక్కువ పెంపున ననిమిషులిందు విడిసిరి. వ్యవసాయమున నిలింపుల కెంతనేరిమి కలదో యెఱుగుదురా? నదీకూలములను, ధునీజన్మస్థలులను పరిశీలింపుడు. చావులేని పచ్చందనము నందు గాంతుముగదా! నందనమునుండి కొన్ని బదనికలను దెచ్చి తొలుత నీ తావులం దమరులు నాటి, తమసేద్యమునకు దొడగిరి; కావుననే జరామరణము లెఱుగని పండుతలపులు నిండుపైరులట్లు తోచుచు కనులకుపండువొనరించుచున్నవి. జిజ్ఞాస(కవిహృదయములోనిదైనను మునిమానసమందలిదైనను) ధేనువువంటిది. ఈ ధేను వీనిండుపైరున జొచ్చి, ఇచ్చవచ్చిన తెఱగున మేతమేయును. “గౌతమీ

మాహాత్మ్యము" నకు (ఇందు గోవుకథ కలదు కావున) నే జెప్పు అర్థ మిది.

అనంత సౌందర్యమున నదీజన్మస్థలి బ్రాంజలినై నిలిచినపుడు నా యంతరంగ మెట్లుండెనో తెలుపుటకు నాకు మాటలు లభించుటలేదు. సముద్రములన్నియు నా గుండెలందు జేరుకొని పొంగుచున్న ట్లూహించితిని. అనురాగమయి యైన హృదీశ్వరివలె కన్నెదుటనిలిచిన స్వర్గము "నేను మీదానను. నా లావణ్యమును, నా సౌందర్యమును, నా సర్వస్వమును మీ కర్పణ మొనరించితిని. వీనిపై మీకు నిండుహక్కు లున్నవి. మీచిత్తమువచ్చిన తెఱగున నన్నేలుకొనుడు" అని స్మితముఖియై నన్నుద్దేశించి పలికినది. నాకన్నులనుండి ఆనంద ప్రవంతి పడివడిగ ప్రవహించినది. నదీతోయమున కానందబాష్పముల సహకరించి, ఇట్టి యద్భుత సౌందర్య సామ్రాజ్యమును, ఇట్టి యనంత ప్రణాయమహిమను నావశ మొనరించిన అదృశ్య యాధ్యాత్మికశక్తికి మహోద్వేగముతో నమస్కృతి మొసగితిని. మనసున గాయత్రి నిదేలించి విజ్ఞానమరీచులు సారించు జగముకన్నుకు జోహారంటిని. అచ్చటి నందనదృశ్యమును అల్లనల్లన నంతరంగమున జేర్చుకొనుచు కొండొంకవడి నిమీలితనేత్రుడనై నిలిచి, ధ్యానమగ్నుడనై, ఆ పవిత్రముహూర్తమున నా కట్టిభాగ్య మొసగిన జగదీశునుద్దేశించి నొసట జేతులుమొగిచి, ప్రార్థన సలిపితిని. మఱికొంతసేపటికి స్నానము ముగించితిని.

రాత్రి తోచిన వింతదృశ్యములేమో యెఱుగ నాతురపడితిని. అవి తోచినవంకకు కొండనుండి కొంతవఱకు దిగితిని. ఎడమచేతివైపున పండుముత్తయిదువులవలె వృద్ధసాలములు కొన్ని గోదావరీజనయిత్రికి నివాళి యిచ్చుటకోయన గుంపుగ నిలిచియుండెను. చిఱునవ్వులు రాల్చుచు పరితోషమున నాహ్వానించు ముద్దుబిడ్డలవలె కుసుమవిలసితలతలు వానిదాపున తోచినవి. అచ్చోటికరిగి దోసిట బూలుకోసికొంటిని. చెట్ల జొంపము వెనుక నొకకొండతెరువు కానుపించినది. అది ఏదేనిగుహలోని కరుగుటకై ఏర్పడిన తెన్నేమో అని యూహించితిని. గుహాలో వసించునది ఏదేని మృగమో, మునిరూపమో ఎఱుగను. ఒకానొకచెట్టు వెనుక నిలిచి, గుహనుండి ఎట్టిశబ్దము వినబడునో యని చెవులొగ్గియుం

టిని. నాకేమియును వినబడలేదు. అపు డాకస్మికముగ పకపక మను నవ్వు వినబడినది! సింహగర్జనము కాదు, పెద్దపులి యఱపుకాదు, నవ్వే నను పగటివేళ నడలనేల? పోయి, ఆ వింతయేమో కనుగొనెదగాక యని నిశ్చయించితిని. చిన్ని తెరువున ప్రవేశించి, కొన్ని యడుగులు వేసితిని. ఎదుట నొక చిన్ని కోనే రగపడినది. నెత్తురువెల్లువ తోచినది అందే! చరచర కాసారాంతికమునకు నడచిపోతిని. దరిద్వారము సరిగ సరస్సు వైపున నున్నది. కొండబిలములో పాతాళహోమము జరుగుచున్న దేమో! గుహాలోని యగ్నిజ్వాల సమ్ముఖస్థసరోవరమున ప్రతిఫలించు చున్నది! కావున నందలి సలిలము అర్థరాత్రమున రక్తపూరమట్లగపడి నది! బిలములోనికి తొంగిచూచితిని. అగ్నిహోత్రము జాజ్వల్యమానమై యున్నది! ఇంతదనుక తనువును దుస్సహమైన చలికి నప్పగించితిని గదా! నిప్పు సెగ నాకిపుడు సిక్కంపు నెచ్చెలి కాగలదని యుబ్బితిని.

అగ్నిసమీపమున నిరువురు పురుషులున్నారు. ఒకడు మిగుల వృద్ధుడు. నూరేండ్లను దాటి, వయసున నతడు చాలదూర మరిగి యుండును. జడదారి! వెండిగడ్డలో నక్కినవానివలె తోచినాడు! రెండవవాడు యువకుడు. వానికి ముప్పదేండ్ల వయసుమాత్రముండును. కైలాసమందలి బూడిదయంతయు నిర్వురయొడళ్లను జేరుకొని అందే కాపురముండెను! వృద్ధుడు నన్ను చూచినాడు. చేసన్నచే గుహాలోని కాహ్వానించినాడు. పోయి, స్వాము లిరువుర మ్రోల ప్రణమిల్లి, హోమాగ్నిదాపున గూర్చుంటిని. దీర్ఘజీవి గుండెకాయవలెనున్న గుహాంతర్భాగమును పరికించితిని. స్వామీజీ కమండలువుకడ నామరచెంబు కానుపించినది! నా యబ్బురపాటునకు మేరలేదు. గతనిశి నాకు నించుక కునుకుపట్టినంతన, అది యదృశ్యమైనదిక దా! అది ఇచ్చోటి కెట్లెగసివచ్చి వ్రాలినది? వృద్ధస్వామి మునిమ్రుచ్చని, వెతకివెతకి చీకటిలో నా చెంబును గాంచి, దాని నపహరించెనని ఎట్లూహింతును? కలశమును గుఱించిన చిత్రసంఘటనమును యోజించుచు నవాక్కైపోతిని. ఇంతలో గుహ యంతయు ప్రతిధ్వనించులాగున పకపకమనునవ్వు వెడలి, పరధ్యానమున నున్న నన్ను ఉలికిపడజేసెను! నవ్వినవాడు యువకసన్యాసి. అచ్చెరుపాటున నాతని దేఱిచూచితిని. వృద్ధుడు మొగమెత్తి నన్ను చూచి "మీ

రెక్కడివారు?" అని హిందీలో ప్రశ్నించెను. ఉక్కిరి బిక్కిరియైన నే నించుక తెప్పిరిల్లి "మహాత్మా! నేను గోదావరీతీరవాసినే! నాజన్మస్థలము సాగరసంగమమున కనతిదూరమందే యున్నది. అది నాకపురియొక్క ప్రస్తుతసంపుట మనుట నిక్క" మని యావేశముతో తెలిపితిని.

యథార్థముగ నాకు కాపురస్థలములైనవి కలకత్తా మదరాసులైనను, నాయూరున నాదియని చెప్పుకొనవలసిన దేదియు లేకపోయినను, అందలి మన్నుమీది ప్రీతి పెంపున నెన్నడైన నచటి కరిగినపుడు పెరిగి పెద్దనైన నన్నచటివారు పల్వురు గుర్తుపట్టక 'మీదేయూ'రని నన్ను ప్రశ్నించుచు నుండు టెఱిగియు, "నాజన్మస్థలము, నాస్వగ్రామము పేరవరమ"ని గర్వముతో తెలిపి దాని సొంపును నన్నట్లు పృచ్ఛచేసినవారిమ్రోల వర్ణించుట నా యలవాటు. నా కథన మింకను గొంత మిగిలియుండగనే ఒకమాఱు తలయెత్తి యువకసన్యాసీ మరల పక్కన నవ్వినాడు! "ఈచిత్రమేమ"ని స్వామీజీ నడుగ నుంకించునంతలో నాయభిప్రాయమును గ్రహించి యాతడు "ఈతని నుత్తరహిందూస్థానమున 'శండీలా'* యను తావున కొన్నినెలలకుముందు మాత్రము చూచితిని. తఱచుగా నీత డిట్లు నవ్వుచుండును! ఇత డెవ్వరితోగాని ప్రసంగింపడు. ఒకపర్యాయము ధ్యానించును. వేరొకమాఱు ఏమో గొణుగుకొనుచుండును. ఎవ్వరైన నేదేని యాహార మొసగిన, మితముగ నారగించును. లేకున్న బస్తుండును. ఈతడు పిచ్చివాడని అచటివా రూహించిరి. కొన్నాళ్లందుండి ఈతని బరిశీలించి ఈతడు మహాభక్తుడని గ్రహించి ఇచటికి గొనివచ్చితిని. నిరంతరము ఇతడు ధ్యానము చేయుచుండును. తఱచుగ రాత్రులందుగూడ మేలుకొనియే యుండును." అని పలికెను.

"ప్రాతఃకాలమున నిచట నెట్లు చేరగలిగితిరి?" అని యోగీంద్రుడు నన్ను పదంపడి ప్రశ్నించెను. బొంబాయినుండి నేను బయలు

---

* కొన్నేండ్లకుముందు నే నీ చోటున కరిగితిని. అది సంయుక్తరాష్ట్రములలో 'బాలమా'నకు అనతిదూరమందే యున్నది. ఈ ప్రదేశమున నొకప్పుడు శాండిల్యమహర్షి వసించువాడట! నేటికిని అందొకచక్కని యాశ్రమము కలదు. శాండిల్యస్థానము కావున దాని కిపుడు 'శండీలా' యను పేరు వచ్చెను. నా పొట్టిపిచితో కలిసి మూడుదినము లందు వసించితిని.

దేఱిసిన ముహూర్తము మొదలు నా ప్రయాణమును గుఱించిన ఉదంత మును పూసగ్రుచ్చినట్లు ఋషికి తెలిపి, కడచినరేయి జరగిన సంఘటనో దంతమును, మఱింత నొక్కి చెప్పి "మహాత్మా! ఈచెంబు నాది. నా పేరును నాయర్ధాంగినామమును గూడ సూచించు 'జే. ఏస్' అను నక్కరములు దీనిపై చెక్కబడియున్నవి. ఈకలశము మీకెట్లు లభించినది ?" అని యడిగితిని.

కడచిననాడు నే బడినపాట్లకు వృద్ధు డెంతో దుఃఖించినాడు. "నాటిసాయంసమయమున మిమ్ముజూచియుండినచో ఆనందపురస్సరముగ నీగుహాలోని కాహ్వానించి, సత్కరించియుండువాడ"నని ఆత డనినాడు. "మేమిరువురము నడిరేయి నిట్లే ఈ యగ్నిచెంతగూర్చునియుంటిమి. ఆకస్మికముగ నేదోచప్పుడయినది. అది బెబ్బులిబొబ్బకాదు సింహగర్జన మునుకాదు. సమీపమందును, అవ్వలనుగూడ రాత్రులందు తఱచుగ భీకరారావములు వినవచ్చుచుండును. ఈ గుహాసమ్ముఖమున వన్యపశు వులు సంచరించుచునే యుండును. అవి బిలములోనికి రావు. గతనిశి నూతనశబ్దము చెవిబడినందున నించుక ఆశ్చర్యపడితిని. గుహానుండి అవ్వలికరిగి చూడనైతిని. ఉదయమున చెట్లజొంపములో మసలు చుండగా కలశము నా కన్నులబడినది! కొండకొననుండి ఎట్లో ఇది రాలియుండుననియు, దీనిధ్వనియే రాత్రి చెవిబడినదనియు, నిదెవ్వరిదై యుండునో యనియు నూహించుచు, పదిలముగ దెచ్చి దీని నిందుంచి తిని." అని పలికి యోగీంద్రుడు నా కలశమును నాకిచ్చివేసెను. చచ్చిన బిడ్డ బ్రతికి చేతుఁబడినట్లు సంతసించితిని.

ఈ చెంబుపై నాకు మిక్కిలి మక్కువయుండుటకు కారణము లేకపోలేదు. భారతపర్యటనమున పెక్కుచోటులందు నాతో నట్టాడిన ఈ కలశము నావలెనే ఎన్నోఢక్కాలు తినినది. ఢిల్లీస్టేషను ప్లాటు ఫారముపై జారిపడినపుడును, కైబరుతెరువున కవ్వల పర్వతగర్భ మున నేదో దేవాలయమున్నదనిన విని, అంగరిగినపుడు చివాలున దిగువనున్న ప్రాచీనభిత్తికపై పడినపుడును, శ్రీనగరమున మా బసలోని సిక్కు యజమానిచేతినుండి జారినపుడును, హృషీకేశమున దఱుమ

బడిన దొంగ చేతినుండి క్రిందబడినపుడును ఇది తీవ్రమైన దెబ్బలు తిని నది. చెంబుమీది చొట్టలను బాగుచేయించుటకు నా మన సొప్పలేదు.

దీనివలె చారిత్రిక ప్రాముఖ్యముగల మఱికొన్ని సరకులు మా యింటగలవు. పసితనమున మూఁడునాళ్లముచ్చటవలె నేనందిన గారాబము నానడతయందు కొంత 'సూర్యకారము'ను గలిపియుండును. శైశవముననిది విజృంభించినపుడు చెంబులను, గిన్నెలను నేలవిసరివైచువాడనట! ఇవి నాదుండగమునకు తలలొడ్డి, వంకరటింకరలై కూర్చున్నవి! వీనిని బాగుచేయించవలెనని నా యక్క లూహించిరి. వీరిపూనికను ప్రతిఘటించితిని. బుడుతడనయియున్నపుడు నాచదువుకుతన మిట్టిదని తెలుపు తలిదండ్రులు నేడు నాకు లేరు. అర్ధశిథిలములయిన కలశములే నా సర్వస్వములో నాకుమిగిలినవి! వికృతరూపులందున్న ఈ పదార్థములే నాకు మిక్కిలి ప్రియములయి నాశైశవమును నా మానసనయనము మ్రోలప్రత్యక్షమొనరించుచున్నవి! నిలుచుననుకొనినవి కడతేఱినవి! నాడు ధ్వంసమైనవే నేడు నిలిచి భావభరితములై, నా కన్నులనుండి అశ్రుకణముల నాకర్షించుచున్నవి! వీని చొట్టలపై బడుదెబ్బలు వీనిపైగల భావములపైబడి, తోడ్తోడనే నా గుండెలను గుండజేయును! భావభరితమైన గతమును తునియలుచేయు నాఘాతములను నేను క్షమింపను.

"గతము" చచ్చినదని పల్వురు విద్యార్థికులు దానిపై దుమ్మెత్తిపోయుచుండుట గాంచినపుడు నామన సెంతేని వ్యథనందును. "గతము" కంటె భావికాలము మహత్తరమైయుండవలెనని యభిలషింతును. గతమహత్త్వమును నేటియున్నతికి, రేపటి మహోన్నతికి పునాదిచేసికొనిన దప్పేమి? తాతల బుజము లెక్కి కదా విశాలకాల దిశావలయమంటలి క్రొంగ్రొత్తదృశ్యములను విలోకించి, దానిపై నులుకు లెత్తనువ్విళ్లూరుదుము! ఉత్తుంగవీథుల జేర్చు బుజముల నెండుకట్టియలట్లు చూచి 'తూ!' యనజెల్లునా? గతమున చొట్టలేకాదు, గోతులును ఉండవచ్చును. ఇవికన్నులను తెఱపించు నాచార్యులయి పురోభాగమందలి కాలపథమున క్రమగతి జరించుటకై జ్ఞానప్రదీపకళికల నెత్తిచూపును! మహాత్ముల జీవితములను నెమకితిమేని, ఈసత్యమును బుజువొనరించు

దృష్టాంతములెన్నో కనులబడును. నా యింటగల కలశములమీది చొట్టలు నేడును నా కాచార్యులై యున్నవి! చిఱుతప్రాయమునాటి దుండగమును, ఆగ్రహావిజృంభణమును నాతలపునకు దెచ్చి, ఆత్మసంవరణమునకై ఇవి నన్ను బురికొలుపుచుండును. ఆ కలశములట్లు, యాత్రసమయమున నాతో మసలిన మరచెంబుకూడ భావసమన్వితమైనదనుటస్పష్టాంశమేకదా! నాగుండెపై తగులుచువచ్చిన దెబ్బలు నాక్రమనిష్ఠ యందు ప్రయోజనములని నాదృఢవిశ్వాసము. ఈ దెబ్బలందలి యర్థమును స్మరణకు దెచ్చుచెంబుచొట్టలు (వాని కివి ప్రతిరూపములగుడు) నాహితులు * నాహితులను కాపాడుట నాపవిత్రకర్తవ్యము కాదా?

యాత్రను గుఱించిన కథనమును వ్రాయుతఱి నాహితుల నాత్మహృదిగొనిన మరచెంబునై నాతురంబుజూడ్కుల సారింతును దీనిమీది కడపటి రెండుచొట్టలు తెలుపుచుండ బ్రహ్మగిరియాత్రనుగుఱించిన ఈ యుదంతమును వ్రాయుచుంటిని.

స్వామిజీ అనంతర మాప్రదేశమందలి మహత్త్వమును నా కెఱి

---

* ఈ హితులకంటె నాసృష్టిలో సగ్రస్థానము వహించిన పవిత్రవస్తువొక్కటి మాత్రము గలదనున్నది. అదిస్వర్గీయజతీంద్రనాథదాసుని యెమ్మనినమ్ముడు. కలకత్తాలో 'విద్యాసాగరకళాశాల'యందు జతీంద్రదాసుకొంతకాలము నాకుసహపాఠియైయుండెను. అనంతర మీతడు 'వంగవాసికళాశాల'యందు జేరి, పిదప చదువుమానుకొని, ఐచ్ఛిక భటసంఘమున ప్రవేశించెను. నాకు సహపాఠియైన జతీంద్రుడు భారతమెక్స్వినీ కాజాలు మహాపురుషుడని నాడు గుర్తింపజాలనైతిని. అరువదినాలుగుదినము లుపవాస ముండి, ఈతడు దివంగతుడైన మర్నాడు లాహోరునుండి వీనిశవము కలకత్తాకు గొని రాబడెను. నాటి మహోత్సవమున గలసి, నాడుకవార మొనరించి, సాయంసమయమున కాళీఘట్టముకడ జరగిన అంత్యక్రియలందు పాల్గొని, దహనానంతరమున నా మిత్రుని యెముక నొండు కైకొని దాచియుంచితిని. నా హృదయమున దౌర్బల్యము పొడసూపిన ముహూర్తమున నీయస్థిని ముందిడికొని అద్భుతధృతి త్యాగములనుగుఱించి అదియొసగు నిస్తబ్ధ భావోద్వేగపూరిత మహోపన్యాసమునకు నాంతరంగిక కర్ణము లొగ్గి, ధైర్యస్థైర్యము లందుచుందును. మంచుకొండనుండి తెచ్చిన గంగోదక మింకను నాకడ నున్నది కావున, అపుడపుడీ సలిలమును మరచెంబున కైకొని, దానిచే యతీంద్రుని యెమ్ముక నభిషేకింతును. ఒరులకీ పూజ మిగుల వికృతమై చూపట్టిన నేమి, నన్ను ధన్యునిజేయు పూజ ఇదియని మురియుచుందును.

గించి, కొంత ప్రసాదమును, విభూతిని నాకొసగెను. తన యాశ్రమమున కొన్నిదినము లుండుమని ఆదరానురాగములతో నన్నాతడు కోరినాడు.

జడదారినుడువులు నామనసు నానందముతో నింపినవి. సద్భావ మెందున్నదో, సత్పురుషు డెందుండునో అందే తీర్థముండును! 'ఆత్మ' యొక్క శక్తిమహత్త్వములను హృదయంగమ మొనరించుకొనిన వ్యక్తి ఈయోగి యని గ్రహించితిని. సుఖదుఃఖములనేకాదు, భయ సంశయములనేకాదు భీకరమృత్యువునుగూడ ధిక్కరించి, జయభేరి మ్రోగించునది 'ఆత్మ' కదా! ఇట్టియద్భుతశక్తి తనయందు కలదని విశ్వసించు మనుష్యు డందు స్వాతంత్ర్యమును, ఆనందమును అనిర్వాచ నీయములు. ఇట్టిమహానీయుని చెంత నిముసమునే వున్నను, మనలను మనము గుర్తింపజాలుదుము. అట్లుగుర్తించిన ముహూర్తమందే అద్భుత సృష్టికై, అసాధ్యములను సాధించుటకై నడుము గట్టుదుము.

అద్భుతసృష్టికై కడంగిన కవులును, అసాధ్యములను సాధింప నెంచిన వీరులును ఆశ్రమములను జేరి, ఋషులను సేవించి, తాముకు ఋషులయి, ఉత్తమాశయములను కమండలువులందు జేర్చుకొని ప్రీతిమై వానిని పురిషిల్లతో క్రోలిరి కావున నమృతజీవులయిరి! ధనంజ యుడును, *ధ్రువుడును, దిలీపుడును ఆశ్రమవాసులైన మహావీరులు

---

* అర్జునుడు ప్రాచీనభారతమహాసంయమి యనునంశము నీవరలో నుల్లేఖించి యుంటిని. గిరి నెక్కుట, నదియందు గ్రుంకు లిడుట, పితృతర్పణములు చేయుట మున్నగు విషయములు పాఠకులదృష్టి నాకర్షించుచున్నవి కదా! ధనంజయయాత్రికునిగురించి మహాభారత మేమనుచున్నదో చిత్తగింపుడు:

"అర్జునుండును గంగాస్నాన పవిత్రీకృతగాత్రుండయి దేవఋషిపితృతర్పణంబులు జేసి, మాతలిప్రయుక్తం బైన యా దివ్యరథం బెక్కి,

చ. అలఘుతపస్సమాధినియ తాత్ములకున్ బహుపుణ్యలోకకాం
క్షులకు విశుద్ధమానసులకున్ సతతంబును సంశ్రయంబనై
లలిత నిలింపదంపతి విలాసవిహార మహోత్సవంబులుం
గలిగి వెలుంగురత్నమయ కందర సుందర మందరాచలా.

అవని యందలి పుణ్యతీర్థంబులు సేవించుచు గంగాంబుధౌతస్థలీరుహ వనస్పతి ఫలంబు లుపయోగించుచు సుఖం బుండితి......"

(ఆరణ్యపర్వము, ప్రథమాశ్వాసము

కారా? ఐశ్వర్యమందుగాక అసిధారావ్రతమందు,— నిరంకుశత్వము నందుకాక సేవయందు ఆత్మను తనువు అమృతపుగ్రుక్కలు లభించునని వీరు గుర్తించిరి. మనుష్యసేవయేకాక సమస్తభూతములసేవయు మహత్తరమయినదని వీ రెరిగిరి. రాజులందు రాజైవెలిగిన దిలీపుడు అరణ్యమున నావును కాచుకొనలేదా? జానపదులను గలియలేదా? వశిష్ఠాశ్రమమున నీత డెన్నెన్ని సదాశయములను బుడుకలేదు? "రఘువంశము" ను దెలుపుచు. మహాదాదర్శములందు కోటివత్తులట్లు వెలుగొందుట గాంతురు. ఈ మహాకావ్యమును కనిన కవిసార్వభౌముడు, బృహదారణ్యకతైత్తిరియారణ్యకాది ఉపనిషత్తుల సృష్టించిన సంయమీంద్రు లట్లు అరణ్యము లందును, ఆశ్రమములందును నిజాత్మను చొప్పించి ఆక్కడనైన భవ్యసామగ్రి నందినాడు. సరిత్తటమున, శ్యామల తరులక్ష్మి కాటపట్టయిన ఆశ్రమమున ఋషీంద్రునిర్మోల నాసీనుడనై యున్నతఱి నామానసవీధియందు నెందఱెందఱు కావ్యకర్తలో, ఎందఱెందఱు మహాత్ములో, ఎందఱెందఱు వీరులో పొడసూపిరి,

ఆశ్రమమున మునినిఁగూడి కొన్నాళ్లుండవలెనని మిక్కిలి మక్కువ పడితిని. అచటిపూతవాతావరణ ప్రభావముచేతన నేనెంతేనియాంతరంగిక పరిణతి నందజాలుదునని యెఱుగుదును. కొంతకాల మందు విడియు మని స్వామిజీ అవ్యాజవాత్సల్యముతో నన్నడిగి యుండెనుగదా! కాని దురదృష్టవశమున నట్లొనరించుటకు నా కపుడు వలసినంత యవకాశము లేకపోయెను. ముందు దినకను సలుపవలసిన పయన మెంతోయున్నది. శారద చెన్నపురిలోనే యున్నది. ఆశ్రమములందును, కొండలందును, లోయలందును, వనములందును హిమాలయయాత్రలోవలె నిపుడు విశేషకాలము వెచ్చింపజాలను. అయినను, వలసినంత పైక మంపుచు, ధైర్యము చెప్పుచు ఆమెకు జాబులు వ్రాయుచు, నాయాత్రను ఫొడిగించుచునే యుంటిని. స్వామీజీతో రెండుమూడు దినములైనను ఉండవలె ననుకొనినను, ఎట్లుందును? నాడేకదా నాతల్లితద్దినము! ఊరిలోని కరిగి, డైమాక్ రాజుతో డ్పాటున నాపవిత్రక్రియను నెఱపవలసి యున్నది. ఈయుదంతమును యోగివరునకు తెలిపి, ఆధ్నికమును ముగించుకొని, నాసికకు మరలిపోవుటకు మున్ను మరల బ్రహ్మగిరిశిఖ

రముజేరి, ఆశ్రమమున కొలదిదినము లుండుటకు యత్నింతునని మాట యిచ్చితిని.

"కొండకొనయందు నుదయించిన గోదావరీధార ఆప్రాంత లంఘించి, ఈదిక్కుగా స్రవించి, పల్లమున నీ సరస్సును నిర్మించి, ఇందుండి దిగువకరిగి, కుశావర్తమున ప్రవేశించి, అందుండి దేశాటనమునకయి వెడలును" అని యోగీంద్రుడనెను.

చెరువున కవ్వలితట్టున చిన్ని చిన్ని కొండసారంగములందు గోదావరీమహేశుల విగ్రహము లున్నవి. జలధార వీని నభిషేకించుచు సరోవరమున దుముకుచున్నది.

అనంతరము స్వామీజీకి కొంతపైక మిచ్చుట ఉచితమేమోయని యూహింపసాగితిని.

హృషీకేశమునుండి బదరీనారాయణమున కరుగుతటి మార్గమున నందందు నాశ్రమములను గాంతుము. నిక్కంపు జడదారులు, కపట సన్యాసులుకూడ గానంబడుదురు. కొందఱు సన్యాసులు యాత్రికుల కడనుండి పైకమునంద గాంక్షింతురు. హిందీలో అచ్చువేయబడిన కొన్ని కరపత్రములను చేతి కిచ్చి, తాము చేయదలచిన సత్కార్యములను గుఱించిన జాబితా నేకరువు పెట్టుచుందురు. వీరిలో కొందఱు దిగంబర సన్యాసులు. "స్వర్గాశ్రమము", "రామాశ్రమము" అనుచోటులందు సొమ్మువసూళ్లపద్ధతిజూచి అబ్బురపడితిని. 'కాలీకమలీవాలా' ధర్మశాలలందు పైకము గొనుటయు, గొనకపోవుటయుగూడ కలదు. కొన్ని చోటులందు సత్కార్యములు జరగుచుండును. కాని పైకముచేరు ప్రతిప్రదేశమందును ఇవి నెఱపబడుట గాంచనయితిని.

స్వామీజీకి కొన్ని ఫలములిచ్చిన, సర్వోత్కృష్టమైన పనియై యుండెడిది. నా కపుడవెట్లులభించును? కూడ దోడ్కొని రావలసినది ఆత్మప్రకాశముకొఱకును, భక్తిభావవ్యక్తీకరణముకొఱకునుదోలుత స్వామీజీకి బుష్పాంజలి నిచ్చితిని. సౌరభదానము భావభరితమగుడు యోగివరుని ఆత్మ నించుక తనుపవచ్చును. ఉదరముమాటేమి? పవన పర్ణాంబువులనే ఈతడు భక్షించుచుండెనేమో! ఈ కాలమందును ఇట్టి భక్షణమున మనుచుండు మునులను గాంచిమురియుభాగ్యము నా కొద

వెను. ఏ యాహారమును గొనక వీరు కొన్ని నెల లుండజాలు రెఱుగుదును. ఏమైన ననుకొనునుగాకని కొంతపైకమును స్వామీజీ చరణోపాంతమున నిడితిని. యువకయోగితో ప్రసంగింపదలంచి, ఆతనిని పలుకరించితిని. జవాబేమియు నీయక అతడు పక్కున నవ్వినాడు! మఱి కొంతసే పందు నధివసించి, మునులకీర్వురకు జాగిమ్రొక్కి, వృద్ధుని యాశీస్సులగొని, నిష్క్రమించుచు "క్రింది కరుగుటకు క్రమమైన తెరు వేదేని కలదా?" అని యాతని నడిగితిని. "ఎడమతట్టునుండి కొంతదూర మరిగినపిదప గిరిపార్శ్వమున నొకతె న్నగపడు" నని స్వామీజీ తెలిపెను. ఆతనికి ధన్యవాదము లొసగి పయనమైతిని. అరుణకిరణవిభవమున గనువిందొనరించు పర్వతదృశ్యములను జూడ్కితీవలనుండి యంతరంగమున జేర్చుకొనుచు, అల్లనల్లన నడుగులువేయుచు ముని తెలిపిన తెరువున బ్రవేశించితిని. అపుడు దవ్వుననొక నూతనపురుషుడు కానుపించినాడు. నన్ను చూచి వంగి దండమిడుచు సమీపించినాడు. వైఖరిబట్టి అతడు నిరుపేదయైన మరాటీకాపని గుర్తించితిని. ఆత డెబ్బనిపాగా ధరించినాడు. వానిచేతిలో బలమైన కఱ్ఱకలదు. "బా-అ-అ-బా! అయి - యే! సాత్ - సాత్ (అయ్యా! రండు - కూడా - కూడా)" అని నత్తితో సన్నని గొంతుకతో నాతడు పలికినాడు. మరాటీమాటలలో * తప్పు

* మహారాష్ట్రభాషలో విశేషపరిశ్రమ చేయకపోయినను, కలకత్తాలోనుండగనే ఆబాష కొంతనేర్చితిని. ధార్వాడకాపురస్థుడు కులకరణియను నొక కన్నడవిప్రుడు ఆమహానగరమున నాకు పరిచితుడై యుండువాడు. ఈతడు మహారాష్ట్రభాషనుగూడ నెఱుగును. ఆదినములలో నేను 'విద్యాసాగరకళాశాల'లో చదువుకొనుచుండువాడను.

కులకరణీ, నేనూ ఒకేహోటలులో (25 Eden Hospital Road) భోజనము చేయువారము. హోటలు పంజాబీ ప్రొప్రైటరుకు చెందినది. వంటవారు భగల్పూరు బ్రాహ్మణులు. చపాటీ పుల్కా మున్నగు రొట్టెదినుసుల కది ప్రసిద్ధికెక్కినది. కొంద రాంధ్రుల మందు బ్రవేశించితిమి. తెలుగుతిండి లేక నోరు చచ్చి ఊరకొనినది. పప్పుచారు (కట్టాడాల్) కాచుపద్ధతిని 'లంబామహాగాజ్' అను పొడలలొట్టియవంటి అచటి వంటవానికి చెప్పితిమి. ఆ రోజులలో మాకు "కట్టా-డాల్" రక్షకుడైయుండెడిది! కులకరణి ఈ కట్టాడాలును సేర్దకొగ్గి పిల్చువాడు; హోటలుయజమాని పైకమడిగినపుడు కోపోద్దీపితుడై, కనులెఱ్ఱజేసి, 'సకేషముగకు' తావొసగక ఆడాలం నుదరమున బట్టించువాడు! వానిపొట్ట

లతో నిండిన కొన్ని హిందూస్థానీ శబ్దములను పొగుపువతుగా నాతడు కలుపసాగినాడు.

---

రబ్బరుతో చేయబడిన దమటను జనో్న ప్రత్యక్షదృష్టాంతము లగపడినవి!......ఒకప్పుడు నేను జ్వరపీడితుడనై కొన్నాళ్లు పస్తుంటిని. చారుమీదికి (ఒకానొక సుముహూర్తమున ననుకొందును) బుద్ధిపోయినది. చారుసింధువు పెద్దపెద్ద కెరటాలతో పొంగిపొరలుచు ఒకనాడు నాకు కలలో కానుపించినది! పోపుసామానులు కాబోలు చిన్నచిన్న డింగీలవలె తరంగములలో కొట్టుకొనసాగినవి! మనసును పట్టియుండుట నాతరము కాలేదు. పరుగు పరుగున బోయి కెరటాలలో లంఘించినాను. ఈతవచ్చునను ధైర్యముండెను. కాని ఉక్కిరిబిక్కిరియగుటచే మునిగి కొన్నిగ్రుక్కలు మ్రింగితిని. చారుకెరటాలు గొంతుకలో ప్రవేశింపగనే ఏదో అపూర్వమైన శక్తి ఒకటి నా ఉదరగోళమున ప్రవేశించినట్లయినది! తన్మయభావమున మునిగితిని! అట్లు మాటలకందని హాయి నందుచుండగా, దురదృష్టమేమని చెప్పుదును, నా నిద్రకుభంగమువచ్చినది! నా స్వప్నమునకు ముసలము వచ్చినది! నిమిషములో చారుమహాసముద్రము అదృశ్యమైనది! మిగుల ఖిన్నుడనయి నాగదిలో నన్ను చూడవచ్చినకులకరణికి స్వప్నోదంతము చెప్పితిని. నా భంగపాటున కా పెద్దమనిషి కన్నీరోడ్చునని యాశపడితిని. కాని ఆ పెద్దమనిషి ఒకమారు పకృున నవ్వి, "అయ్యో; పాపము" అనినాడు. "కఠినాత్ముడ"వని మొగమువాచునట్లు వానిని తిట్టినాను. తనతప్పు గుర్తించి ముందుగ హోటలుకు బోయి పొడలలొట్టియచే చారు కాపింతు నని నాకు మాటయిచ్చి మిత్రుడు నిష్క్రమించినాడు. లొట్టలువేసుకొనుచు వంగదేశములో ఇట్టి పథ్యము ఎన్నడోగాని దొరకదని మురియుచు, ఎంతో శక్తి తెచ్చుకొని హోటలులో ప్రవేశించినాను. కులకరణి కూర్పరి చారు తెమ్మని హుకుం జారీ చేసినాడు. రెండు పట్టుకారులతో ఒక పెద్దగిన్నెను బట్టి తెచ్చి పొడలలొట్టియ నా ముందుంచినాడు! మహోత్కంఠనడంచి సాభిప్రాయ దృష్టిని దానిపై సారించినాను. అగపడినదృశ్య మెట్టిదని వచింతును? జలరూపము దాల్చిన అగ్నిహోత్రుడు గిన్నెలో ప్రత్యక్షమైనాడు! "అమ్మో." అని ఒకమారు కెవ్వుమంటిని. జ్వరప్రకోపమని సోదరులు అపోహపడిరి. వేడినీళ్లలో రెండుమూడుచాల క్రొత్తకారమును మాత్రమే మిళాయించి మహోత్సాహముతో చారు తయారుచేసినాడు పొడలలొట్టియ! వీని సహజశక్తి (Originality) కి కులకరణి పాకకళాకౌశలము (Cooking genius) తోడుపడినది! చెప్పనేల, "నిమిషములో నన్ను వైకుంఠమునకు పంపవలెనని ఈ యిద్దఱు పెద్దమనుష్యులు పెద్దస్కీము వేసినా"రని గ్రహించినాను. ఎంతఘోరము! పాప మెట్లు పెరుగుచున్నదో

"రాబిన్సన్ క్రూసో" ("*Robinson Crusoe*") లోని ఫ్రైడే (Friday) అనుకేనిబాలు-చిన్నవాని మాటల తీఱును దలపించు వీని ప్రసంగధోరణి నాకు కొంత ముదము గూర్చినది. "చూపుము; నీకే

---

చూడండి! నాకు నోటినుండి మాట రాలేదు వడకు పుట్టినది! కొంతసేపటికి తేఱుకొని నోసట చేతులు మొగిచి "హే మహనీయగుణగరిష్ఠులారా! కారుణ్యముతో నాపలుకుల నాలింపుడు. నేను వివాహితుడను. భూమిమీద మఱి కొంతకాలము నిలువవలెనని ముచ్చటపడుచున్నాను. అంతియకాదు. పెరిగి పెద్దవాడనయి పెద్దపనులను నిర్వహింప వలెనను సంకల్పముతో నున్నాను. సమస్తవసుంధరను మరమ్మతుజేయ నిశ్చయించితిని. కాబట్టి ఈ చారును ప్రస్తుతము నా ముందునుండి తొలగించండి. లేకున్న, నాకీ దడతగ్గదు. ఈ పదార్థము తప్పకుండా ప్రళయకాలమునాటికి పనికివచ్చు"నని గంభీర స్వరమున దెలుపదలచి దగ్గుత్తికతో చెప్పితిని. "పీలీజియే! బుఖార్ నహి రహేగా" ("త్రాగండి, జ్వరముండదు.") అని నాడు పొడలలొట్టియ! "జాన్ భీ నహి రహేగా" ("ప్రాణమూ ఉండదు.") అనిపలికితిని. ఆ యోధుల ధోరణిచూచి నన్ను గట్టిగ పట్టుకొని గిన్నెలోనున్న వేడి నెత్తురువంటి ద్రవమును గూవత్తూ సత్తువకొలది వారునాగొంతుకలో పోయుదురేమో యని యదలితిని. కాని ఆయాపత్కాలమున పరాత్పరుడు నా పాలిట నున్నాడు...... కులకరణిని గుఱించిన కథ లెన్నో ఉన్నవి. భోజనసమయమున వంగీయుల తిండిపద్ధతిని గుఱించిన చర్చలు రగులునవి! వంగీయులలో బ్రాహ్మణులు కూడ మత్స్యమాంసాదులను భక్షింతురుకదా! "మాంసము తినుట కూడదు. చేపలను, కోడిగ్రుడ్లను తినవచ్చును. తప్పులేదు." అని కులకరణి గంభీరవదనుడై యనువాడు. కొందఱు వంగీయులవలె వీని నాతడు కూరగాయలు (Vegetables)గా గణించువాడు! వాని వింతవాదము నాకు నచ్చెడిదికాదు. ఉగ్రరాముడనై కులకరణిని మార్కొనువాడను.

కొంతకాలమునకు మా స్నేహము ముదిరినది. అతడు నా గదికి వచ్చి నాకడ సంక్షిప్తలేఖనము (Shart-Hand,)ను, బంగాళీ పాళీ హిందీభాషలను నేర్చుకొనువాడు. నాకు కన్నడమహారాష్ట్ర భాషలు నేర్పువాడు. కొంతకాలము కడచినది. ఒకనాడు "అర్జంటైన అవసరమున్న"దని కొంతపైకము నాకడనుండి తీసికొని, మాటలు వానినోటిలో గట్టిగా కరక్కాయకొట్టి, నాపుస్తకముల సహితముగా కులకరణి కలకత్తానుండి అదృశ్యుడైనాడు. అందుచే కన్నడమహారాష్ట్రభాషలందలి నా కృషికి ధక్కాతగిలినది! ఈ భాషలలో వలసినంత పరిజ్ఞానము సంపాదింపనయితిని. కాని అవి సుబోధకములు కావని చెప్పను. ఎటువంటివారు పండితులు కానిచో, ఈ భాషలలో గంభీరోపన్యాసము లీయగలను.

మైనా యిస్తాను." అని నేనంటిని. ఆనిరుపేద మొగము కొండంత దైనది! తెరువు చూపుచు నాముందునుండి ఆతడు నడువసాగినాడు.

విమలతరనిర్ఝరిణీజలప్రవాహము మధురాలాపన మొనరించుచు నీశ్వరాశీస్సువలె నన్నుసుగమించుచుండెను. శైలేంద్రముపై శోభిలు నిగురుజొంపముల, ఇంపారువిరుల, పొలుపైనపొదల, అందంపు మావి మ్రోకల, అలరునెత్తమ్ముల, ఎలదేటిగముల, వికసన్నూతప్రసూనముల కాటపట్టిల్లయిన యెలదీవల, మందసంచారితమారుతము నంటి మసలు గండుగోయిలతండముల, దీర్ఘబాహువులచే దిక్కామినుల గవుంగిలించు సుర్వీధరముల, కవిహృదయములు పోలు తమ్మికొలంకుల నాలోకించుచు దిగ్వలయమునుండి దినేంద్రుడు చరచర చదలున గపల నొల్లకుండెను. అరుణాంశువృష్టి దవుల్కొనిన వనలక్ష్మి చెక్కిళులు సిగ్గుచే, ననురాగముచే, నానందముచే కెంపెక్కినవి. కెంజాయలీను పొడుపుకొండ పెద్ద పవడంపుగిబ్బవలె తోచినది! దివసనాథు నలంకరించుటకై కాబోలు దివిగల ముత్తయిదువులు కొందఱు దివాభామినికి కెంబట్టు పుట్టము గట్టి పలుతెఱగుల కైసేసిరి.

సేవకుడు ముందు నడచుచుండుటచే, తెఱువునకయి తడవులాడవలసినయక్కఱ లేకపోవుటనే, మెదడునకు పనిగల్పించు ప్రతికూలయోచన లెవ్వియును మనసును మాఱ్కొనక పోవుటచే నాదృక్కులును, తలపులును మఱెందును పరుగిడక ప్రాగ్దిశకును బ్రహ్మగిరికిని నడుమ నిష్టవిహారము సలుపుచు, నిత్యలక్ష్మిలతికాలవాలమైన నాతావునుండి—బహుశతాబ్దులు ప్రాబలుకుల తావయిన ఆప్రదేశమునుండి—నిలింపులకు కర్మక్షేత్రమైన ఆ ధర్మక్షేత్రమునుండి-తపస్వినైన బ్రహ్మకు మనికిపట్టయిన ఆ పూతస్థానమునుండి, సురభిళభావబంధురమై, జ్ఞానారుణచ్ఛవి దళుకొత్తిన దొల్లింటి ప్రాచీవిభవముదెస బఱతెంచినవి. భావికాలమున భారతమాత దిగ్విసరము నలరించు సంస్కృతీవిభవము నందవలె నని కాంక్షించుచు, వక్రనాగరికతవలన, పాశ్చాత్యవిద్యకతన నాదరమందక పడియున్న భారత గతమును, నిత్యనవీనభావవిలసితభారత గతమును పునరుద్ధరింప నాతురపడుచు, కనుకొలకులం దాశాద్యుతుల బూరించుచు మహోత్సాహమున ముందంజవేయు యువకులలో నే

నొక్కుండను. బెర్ ట్రాండ్ రస్సెల్ మున్నగు నాధునికులు కడచిన సంఘటనములు చచ్చినవేయనియు, సమసిపోయిన గ్రీకు సౌందర్యమును ఇటలీభావోద్యమమును దుఃఖముతో స్మరించుటేలయనియు వచించుచు పలురీతుల గతము నీసడించిన, నీసడింతురుగాక!*

'ప్రాచీగతము నిత్యసంజీవినియైనదని, † వసుంధరపై నేడు చెలరేగు పాష్ట్యమును, మృత్యువును నిర్జించి, పాశ్చాత్యజగతిమ్రోల పరంజ్యోతిని నిలిపి వసుమతీసీమంతినిని నవనవోన్మేషశాలిని గావించునదని నాదృఢవిశ్వాసము. కన్నతల్లి భారతాంబ ధూళ్యవలుంఠితయైన దని ఎన్నో మాఱులు కన్నీరొత్తును. కాని కన్నీటిని నేనెన్నడు కన్నులందు కాపుర ముండనిచ్చువాడను కాను. సదాశయను నమరజ్యోతికి నాత్మహృదయమును ప్రమిద గావింప నువ్విళ్లూరుచుందును. కొండసింగారముతోడను, విమలతరంగిణులతోడను, కన్నుదోయికి విందుసేయు తరుచయముతోడను, వింతచెలువమున శోభిలు పూదీగలతోడను అరుణచ్ఛటలందు భారతజనయిత్రి భూసురభూషణాం

* "Passive awareness of dead facts......"Regretful hankering after the extinct beauties of Greece and the Renaissance............" (Vide Page 167 "*Principles of Social Reconstruction* " By Bertrand Russell)

† ప్రాచీగతము నిత్యసంజీవి యైనదనిన నన్నికాలములందును నమృతజీవియై యుండు భావవిభవము మన సంస్కృతియం దున్నదనియు, వెనుకబడని దీనిని దునుమాడుట కెవ్వరికిని సాధ్యము కాదనియు, భారతావని ఎన్నెన్ని యాఘాతములు తినినను, సనాతనసభ్యతామహాత్మ్యమును వ్యక్తీకరించుచునే యున్నదనియు చదువరులు గ్రహింతురు గాక! తన రొమ్మున విజ్ఞానామృతమును నింపి, దానితో నవయుగమును భారతాంబ తనిపి భావికాలమున బలవత్తరమొనరింపవలె నని ("It is for India to keep her breast supplied with the Amrita of wisdom, with which to feed the new born age and nourish it into a mighty future" Vide Tagore's "*Letters to a friend*" *page* 124) రవీంద్రుడనినపుడు ఆ కవిచంద్రుని దృష్టి సనాతనసభ్యతపై (ఇది విజ్ఞానసుధాపూరితము కావున) వ్రాలె నని తలచుట తప్పుకాదు.

బరాన్వితభామినిభాతి భాసమానయై గోచరించుతఱి నాకన్నతల్లి మరల వసుమతి కుపాధ్యాయినియై, విశ్వజననియై, జగద్ధాత్రియై, దేవియై దిగంతముల జేజేల నందగల దని మురియుచుందును.

మహారాష్ట్రసేవకుని వెన్నంటి నాటిప్రభాతముననిట్లు మురియుచు, భారతాంబాప్రభావమును తలపోయుచు, శైలతలమున జరింపసాగితిని. "తొందరపడక కొండనుండి దిగునపుడు యాత్రికులు దర్శింపవలయు స్థానములనన్నిటిని చూపుము." అని వానినుద్దేశించి పలికితిని. కొంతదూరము నడచి, చివాలున నిలువంబడి యాతడు "బాబయ్యా! ఇక్కడ చూడండి! ఇదిగో శివునిజడ! ఇందులోనుండి గోదావరిదేవి ఏరీతిగా వెడలుతూ ఉన్నదో చూసితీరాలండి" అనినాడు. అచ్చటికొండనేల జడలుకట్టిన కేశభాగమట్లున్నది! అందుండి నీరుబుకుచున్నది! "గంగకుమున్ను గోదావరి ఈశ్వరశిఖనుండి వెడలినది. ఈ యంశమును వ్యక్తపఱచు దృశ్యము బ్రహ్మగిరిపై కలదు." అని కొందఱు మహారాష్ట్రవిప్రు లంతకుమున్నే నాపర్యటనమున దెలిపియుంట జ్ఞప్తికి వచ్చినది. కొండొకవడి నిలిచి, రెప్పలనెత్తియుంచి, ఆ ప్రదేశమును పరిశీలించితిని.



# నా మహారాష్ట్రయాత్ర

## పదునొకండవ ప్రకరణము

హిమగిరియందలి కైలాసశిఖరమును వీక్షించినపుడు ఈశ్వర భ్రూలతికలను, ఈశ్వరశిరమును పోలు దృశ్యములుంట నెఱుగుదును. మంచుకొండ మహేశ్వరధామమైన వెండికొండవలెనే యుండును గదా! వెనుక నాదృశ్యములను విలోకించినట్లే నేడు నాపురోభాగమున నున్న దృశ్యములనుగూడ గౌరవభావముతో పరిశీలించితిని. కాని, వీనిని గుఱించిన ఉదంతమును నే నెన్నడు నున్నదాని నున్నట్లుగా గ్రహించితినిగాను. గిరిశిఖరములు రాళ్ల ప్రోవులు మాత్రము కావనియు, వానియందాత్మను తనుపు అనంతభావఘుగు లుద్భవించుననియు తెలుపుట మన ప్రాచీనుల యాశయము.

ఎట్టి మహత్తరభావమైనను, సాధారణవ్యక్తీకరణముకతన సామాన్యప్రజల మనసుల బ్రవేశింపదుకదా! రూపుజూపని భావము, గట్టిమెదడునకే లొంగుభావము, తీవ్రతార్కికరణమును బురికొలుపు భావము, కఠినతాత్త్విక సమాలోచనమునకే పనికివచ్చుభావము అవమానితుడైన అతిథివలె నిట్టిమనసులనుండి తరలిపోవలసినదే! మనుష్య మానసము బాలకునివంటిదని తెలుపుదును. బాలకుడు పరుగులెత్తుచునే యుండునుగదా! తనదృష్టి నాకర్షించిన బొమ్మనే ఆతడు పట్టి ప్రాకులాడును. పొంతనుండి గట్టిపండితుడు నడచుచుండినను వాని నీతడు పరికింపడు. మనసు స్వేచ్ఛాకామి! ఆనందకామి! చేతులుజోడించు ఉద్యోగివలె నది పనిచేయదు. ఒకరిచ్చు పరిశ్రమకు తలనొగ్గుట కది యిచ్చగింపదు. ప్రమోదమే దీని పరమావధి! పరిశ్రమను కాంక్షించు కొన్ని మనసులుండుటకు కారణమీ పరిశ్రమ స్వయం నిర్ణయమై, ప్రమోదసంభరితమైన దగుటయే! తపసులుండు టెఱుగుదుము. రేబవళ్ళు పఠనమున, గ్రంథరచనమున, గభీరయోచనమున నిమగ్నులైన

వారుండు టెలుగుదుము. ఇవి కష్టభూయిష్ఠములని, మనసును నొప్పిం చునవని వీరు యోజించియుందురో, వీనినుండి తక్షణమే—తక్షణమే కాకున్నను, మఱొక్క నిముసములోనైనను తొలగిపోదురు. జయప తాకమెత్తలేక వీరు వ్యర్థజీవులగుదురు. ఈయాశమును దృష్టియం దిడికొనియే, శ్రమభావము ఉద్దేశసిద్ధికి ప్రత్యర్థియని మనీషులనిరి. * తపసియును, జిజ్ఞాసువును, విద్యార్థియును, కవియును, యాత్రికుడును, ప్రజాసేవకుడును తమ క్రియలందు చెమ్మటబొట్టులనుగాక అమృతబిందువు లనుగాంచి మురియుదురు. "అబ్బా!" అనువారును, దుఃఖపడు వారును కర్మక్షేత్రమున నానందఝరులను విలోకింపక అస్సురస్సు రను కొనువారును సోమరులై, ఎందుకట్టులై, నేడో రేపో తమ బ్రదుకును బూడిదప్రోగు జేసికొందురు. కాలక్రమమునగాని, శ్రమనిష్ఠకతనగాని మానవుడు తపసికాడు. కావున తపసియందు ప్రమోదము కాలము కడచుకొలది మనసునం దూటలై నధికమగుచుండును. ఈ పరితోషము అమృతకలశము వంటిదని వచింపవచ్చును. తపస్వి అమరుడనవచ్చును. అమరున కాహార మమృతమే కదా! తపస్వి క్రోలు పానీయము ఆనం దము; ఈతనికృషి ఆనందపూరితమైన కలశము. ఈకలశమును నేల బడగొట్టితిరేని, అతడును నేల గూలును. చూచితిరా?—(విజ్ఞానపిపా సువు కావున) సామాన్యుడు గుర్తింపని ఆశయమునకై తపసి ఎట్లు వ్రేళ్లూరునో! తపసి ఘనభావములకై తల్లడిల్లును. యాత్రికు డుత్తుంగ శిఖరములకై పొగులును. గురుగంభీరదృశ్యముల నన్వేషించుచు, తుచ్ఛ సుఖములను పడదన్ని ఇతడు ముందంజవేయును. తపసికాని మానవుని, (ఈత డవలీలగ లభించు పరితోషమును కాంక్షించును కావున) గురు గంభీరదృశ్యములే యన్వేషించుచు పోవలెను. కన్నుగుట్టు నీదృశ్యము లను గాంచి, సాధనకు దూరస్థుడగుడు తన పరుగునుండి తరలి, ఈతడు సంతసమందును. చోద్యము జూచుట కెందఱెందఱో పోదురేల? అది ప్రమోద సంభరితమగుటచేగదా! కవులును, ఋషులును కన్నతల్లుల బోలువారందును, ఘనతాత్త్వికాంశములను హృదయంగమ మొనరించు కొనినవారే యయ్యు, బిడ్డలబోలు సామాన్యప్రజల మనసుల కివి

* "Strenuousness is the open foe of attainment" Rabindra Nath Tagore *Vide* page 43 "*Letters to a Frien* [illegible]")

కడుంగడు కర్కశములై యుండునని యెఱింగి, వానికి రూపులిచ్చి, వానిని కనువిందొనరించు దృశ్యములను గావించి, కథలని కావ్యములని వానికి పేరులిడి వీరు జనాళి కొసగుదురు. మన కావ్యములగల కెంబట్టు పుట్టముల దొలగించి చూడుడు. అందు నుపనిషత్తుల నవలోకింతురు ! వజ్రములుపోలు గట్టితలపు లందుంట గాంతురు. మన ఋషికవులెంత విశాలహృదయులో కనుగొనుడు! గ్రంథములందు, అక్కరముల వెనుక సుందరదృశ్యములను చిత్రించి వారు మిన్నకొనియుండలేదు. తమ శిల్ప కౌశలమందలి సుధాధారల గ్రోలుటకై, తమ కావ్యములనే కొందఱు మాత్రమే తెఱచిచూతురని వారెఱుగుదురు. కావున తమభావము లను—ఆనందసుధాసంసిక్తము లైన తమభావములను బాహ్యదృష్టి నాకర్షించు దృశ్యములందు విరబోసి, వానిని బహుళసంఖ్యాకుల కప్పన మనిరి. మిఠాయిని చూచి పాపాయిలు పరుగెత్తుచురారా ? మన కావ్యములందును, తీర్థస్థలములందలి దృశ్యములందును ఎంతో భావ మృష్టాన్నమున్నదని తెలుపుట నాయాశయము. పతితలును, పథికులును వీనికై పరుగులెత్తుచుందురు. మనమతమందలి యుద్దేశములను, మన రచనలందలి భావములను గ్రహింపనేరక, భావపతనము నంతగా నెఱు గని పాశ్చాత్యులు మనము మూఢులమని, మనమతమును, మన యాచారములును మౌఢ్యగర్భితములని మాటలు మిగులుచుందురు. ప్రతిమానవునిగూడ మహావిజ్ఞానిగను, నిర్మలచారిత్రునిగను గావింప నుద్దేశించి భావగ్రహణమునకుతోడ్పడు దృశ్యపరికరములను సమ కూర్చుటయేకాక భావానుష్ఠానమునకు మనుజుని బురికొలుపుటకై మన ఋషులు చక్కని యాచారముల నేర్పఱచిరి. కర్మకాండయన బిచ్చి పనియా ? జంత్రమువలె జేయుక్రియయా ? కండ్లుమూసికొని, ఒకని మ్రోల బానిసయై నిలిచిచేయవలసిన కర్జమా ? బాహ్యదృష్టినుండియు, నంతరంగదృష్టినుండియు మనసున జేరుకొనిన మహితభావములను ఆత్మజీవములందు చొప్పించి, వానిని దేవగర్భితములైన మహామంది రములట్లు మహిమోపేతములు జేయుటకై మన ప్రాచీనవిజ్ఞానులు నిర్ణ యించిన మహదాశయమండితకర్తవ్యము కాదా ? మన విజ్ఞానమేమో మన మెఱుగము కావున మన కర్మకాండ యెట్టిదో, నిత్యభావాను

ష్ఠాన మెట్టిదో యెఱుగక మనమతమును గాంచి, మన యాచారము లను జూచి కిచకిచలాడుచున్నాము. ఈమతమునకును, ఈ యాచారములకును ముప్పుదెచ్చు నిరక్షరకుక్షులను, దుర్మతులను నిక్కంపుపూజారులని, నిక్కంపు పురోహితులని నమ్మి వీరి దుష్క్రియల కతన వానిని వక్రదృష్టితో, జుగుప్సాగర్భిత నేత్రములతో విలోకించు చున్నాము. మన విద్యావిధానమున మార్పులు తోచినగాని మన మన సులు క్రమపంథయందు పనిచేయవు; మన గ్రంథములందు, మనపుణ్య భూమిగల దృశ్యములందు, మన తీర్థములందు, మనవిహిత కర్మలందు గల గంభీరోద్దేశముల నవి గ్రహింపనేరవు. హిమగిరియందు దీర్ఘ యాత్ర సలిపినపు డచటి రాళ్లయందును, రప్పలందును దివ్యాక్షరముల గాంచితిని. ఈ యక్కరములందు భావభువనములను విలోకించి, * వీని నన్వేషించియే నిలింపు లిపుణ్యభూమియం దవతరించి, ఈకర్మ క్షేత్రమున ధర్మక్షేత్రము నాలోకించి, ఇందుండియే ముక్తి నందు కొని రని గ్రహించి, ఉత్తమాశయవిలసిత మృత్తికపై మసలు భాగ్యము నా కలవడినందుల కెంతో మురిసితిని. అందు నే గాంచిన భావభువన

---

* భావపతనమంను, అంతర్దృష్టినుండే భావించిన పతనమును మనము ను ఆ నందమునూనమైనది. కళో పాసకులందుఁ గూడ నిట్టిపతనము నలవఱుచుకొను వారి సంఖ్య అత్యల్పమై యుండును. ఇట్టివారిలో, ఆధునికులలో, భారతీయులలో ప్రధానుడు రవీంద్రుడు. ఈ పతనము తన కెంతో జరితోష మొసగునని ఈతడు తెలుపుకొను చుండువాడు. ("I cannot tell you the great Joy of seeing everything through the sight which comes from within" (Vide page 41 Tagore's "*Letters to a Friend*") హృదయముతో సంపుయోచన మిట్టి పత నమునకు దారిదీయును. ఆదర్శ సూంగ్ల విద్వాంసులిట్టి యోచనమును మిగుల నుగ్గడించిరి. ఈయోచనాశక్తి వంగీయునకు కలదని అరవిందుడు తెలుపుకొనుచుండును. ("The Bengalee has the invaluable gift of thinking with the heart" Vide 4, "*The Brain of India*" By Sri Aurobindo Ghose") హృదయముద్వేగమున కాటపట్టు. ఉద్వేగభరితమైన యోజనము అద్భుతప్రభావము గలదై దివ్యరచనమును గనును. ఇట్టిరచనమే పాఠకుని యాత్మచే తన్మయునృత్యము చేయుంచును.

ముల నెప్పటికైనను పాఠకమహాశయుల చిత్తముల కందీయగలనని ఆశపడుచున్నాను. తుషారాద్రిని పరికించి, అందలి దివ్యదృశ్యము లందలి "గంగా మహాత్మ్యము" ను పఠించి పరితోష మందినట్లు నేను బ్రహ్మగిరిపై నిలిచి, మహారాష్ట్ర సేవకుడు చూపిన దృశ్యమునగల "పుణ్యగోదావరిచరిత్ర" ను పఠించి ఆనందించితిని. మహితభావనకు నిమిత్తమైన వస్తువు పూజనీయమైనదని నా యుద్దేశము. దీని నిట్టి నిమిత్తముచేసిన మునిమానసమునకు జోహారంటిని. జడములైన రాళ్ల యందును ఇట్టి యాథాత్మ్యక సృష్టి జూపజాలుట భారతకవిబుధులకే సాధ్యమైనది. వీరికనుడు, భావభరితమైన గోదావరీచరిత్రకు ననుడు, శైలతలమందలి గభీరతత్త్వమహాత్త్వమునకనుడు సాగిలపడితిని. నాశిరము సలిలసంసిక్తమయ్యెను! మనసు భావప్లావితమైనది. కూడనున్న సేవకుడును నావలెనే అందు సాష్టాంగపడినాడు. వీని విశ్వాసమే విమల తరంగిణియై వీనిని పునీతు జేయుచున్నది. నాచేతిలోని మరచెంబును గైకొని, సేవకుడచటి పవిత్రోదకమున బుడుంగున ముంచినాడు. నాచెంబుకూడ యాత్రికుడే యంటినిగదా! మునిగినంతనే దాని యంతరంగము నవభావపూరముచే నిండిపోయెను. భావబ్రహ్మాండమును మోచుకొని యమునాసరిత్తీరమున మసలిన వసుదేవునివలె, భావభారమును వహించి గోదావరీధారలందు జరించితిని. ఆ భావబ్రహ్మాండము ముద్దుకృష్ణునందుండెను! ఈభావభారము నాముద్దుకలశమున నుండెను.

అనుచరసహితుడనై ప్రదక్షిణముచేయుచు, గిరిశిఖరమునుండి అల్లన దిగదొడగితిని. క్లిష్టమైనను మార్గమంత యధ్వాన్నముగ లేదు. కడచిన సాయంసమయమున నన్నెదుర్కొనిన కడగండ్లు నేడు తోప లేదు. త్రోవతప్పి అట్టిపాట్లలో (ఇవి పడరానివనినే దెలుపను) పడి పోతిని.

కొండచుట్టు అందందు జలధారలు రాలుచున్నవి. కొంత దూరము దిగినపిదప నివి రాలుచోటులందు ఏదో బొమ్మను ముంగిడికొని దానికి కొంత కుంకుమను పులిమి ఒక్కొక్క అవ్వ కూర్చుండును. కుంకుమనేకాక ముందున్న రాళ్లకును, బొమ్మలకును వీరు చక్కని భస్మమును కూడ పూసియుండవలసినది! గోదావరి జన్మస్థలమని తెలుపుచు, "ఉదంబ

శేర్ మూలే” అనుసంస్కృతపదమునకు బహుళమహారాష్ట్రశబ్దములను సంధించుచు, ఆవేశపూరితులై ప్రసంగించుచు “యాత్రను జయప్రదముగ ముగించుకొని పోతున్నారు; దయచేయండి” అని ఇంత బిల్వపత్రిని, కుంకుమను, హారతికర్పూరమును, కొన్ని పూలను, అగరువత్తులను, ఒకటి రెండు కదళీలనో, ఒక కొబ్బరికాయనో వీరు చేతికిత్తురు. వీని పూజ ముగిసిన వెనుక చేతనైనంతవఱకు దక్షిణనులాగి, అప్పుడును యాత్రికుని వదలక “మఱొక్క దేవుని చూతురుగాని రండు” అని వెనుకతట్టుననున్న బిలములోనికి గొనిపోయి, అందు రాలు నీటిబొట్టుల దిగువనున్న బొమ్మరాతిని జూపి “దక్షిణా దోడో!” అని పలుకుచుందురు. ఈవృద్ధనారులు పాపము కడుపేదలు. ఆప్రదేశము భయంకరమైనదయ్యు ఎట్లోనాలుగుడబ్బులు దొరకు నను ఆసతో అందు జేరుకొని, చీకటి పడకమున్ను వన్యపశువుల బారిబడక దిగువకు బోవుచుందురు. వీరి మాటలు నవ్వు పుట్టించిననేమి, వీరియవస్థ కనికరమును కలిగింపక మానదు. కావున వీరికి సాయము సలుపుటకు సంశయింపము. కాని తెరువున అందందు పసపుపూసినరాళ్లనో, ఎన్నో చేతులు గలబొమ్మలనో, వింత వింత విగ్రహములనో నిలిపి వానినిగుఱించి అబద్ధపు గాథలనేకరువుబెట్టుచు, చిత్తమువచ్చిన దక్షిణవందుటకై ఎన్నెన్నో పోకళ్లను పోవుచు తమయాటలు చెల్లనపుడు మాటలు మిగులు పూజారులను చూచినపుడు కోపము రాకమానదు. క్రమక్రమముగ క్రింది కరుగు కొలది త్రోవలో ఇందును అందును అబద్ధపు బైరాగులును, నిక్కంపు యోగులును, భిక్షకై పొంచియుండు అభాగులును, కోతిమూకలును, సెనగలమ్మువారును, దమ్మిడీల చిల్లరనిచ్చువారును తోచుచుందురు. అందందు యాత్రికులును ప్రత్యక్షమగుచుందురు.

పర్వతపార్శ్వమున అచ్చటచట తోచు కొన్ని కట్టడములు మిగుల పురాతనమైనవి. అందందు పాడుపడిన సాలలున్నవి. వానిలోనెవ్వరు లేకున్నను, పోయి లోపల ప్రవేశించిన నూతనాంశ మేదేని కనులబడునని ఆశపడి, అందు జొరబడి, నలుతట్టులను పరికించువాడను. “చూచేందుకు అక్కడ వింత ఏమీ ఉండదండి. పాములు మాత్రము ఉంటాయి రండి పోదాము.” అని సేవకు డనుచుండువాడు. “పట్ట

పగలు అడలనేల? నీ చేతిలో బలమైన కఱ్ఱ కలదు కదా!" అని ఆశ్రమములను విలోకించినట్లే జిజ్ఞాసువునై శిథిలాలయములను వీక్షించువాడను. సీప్వాలకు ముందునుండి అవి యున్నవని కొంద అనుచుండువారు. వానిలోని దుమ్ములో చరిత్రకును, పురాణమునకును సంబంధించిన నిదర్శనము లెవ్వియైన గోచరించునని మక్కువపడువాడను. కొన్ని కొన్నిచోటులు నాకెంతో ప్రీతిగొలిపినవి. మఱికొన్నిట గొందలు జోగు లగపడువారు. ఒకానొక పాడుకొంపలో నేవో ప్రాతగుడ్డ లగపడినవి. వాని వెనుక నేదో మెదలుచున్నట్లు తోచినది! "పాము! పా" మని కఱ్ఱతో కూడ నొక్కదుముకుతో నేనకు డీవల బడినాడు. ఇకేమి చేతును? ఈవీరప్రవరునితో నవ్వాలికి లఘింపక తప్పినది కాదు.

కొండనుండి చాలభాగము దిగిన పిదప వీరప్రవరుడు వేఱొక త్రోవగుండా మరల పర్వత మెక్క సాగినాడు. కొండయొక్క మఱొక్క దిక్కున నెత్తయినచోటున కొన్ని విగ్రహము లున్నవనియు, వానిని చూడవలెననియు మావాడు సెలవిచ్చినాడు. అందున్నవి కేవలము విగ్రహములే యగుచో వానిని చూచుటకై కొండమీదికి నెగి రెగిరి పడరా దనుకొంటిని. కాని, ఆయెత్తుచోటున చక్కని దృశ్యములును, మనసునకువచ్చు చిత్రములును, గంభీరభావ విలసితములైన మఱెట్టి పదార్థములైన నున్నవేమోయను నాశ నాహృదయమున తలయెత్త సాగినది. మరల నెత్తుకొండనెక్కుట కష్టమైనపనియేయయ్యు, వీరప్రవరుడు మార్గదర్శకుడై యున్నాడు కావున, క్రమపంథనుండి కదలిపో జాలుదుననియు, మరలమరల బ్రహ్మగిరినెక్క నవకాశము కలుగదేమో యనియు యోచించి, నడుముగట్టి, కాలుసాగించితిని. కొంతసేపటి కా చోటుజేరుకొంటిని. జలధారయును, సామాన్యమూర్తులును తక్క అందు నూతన వస్తు వెద్దియు గోచరింపలేదు. ఉన్నతస్థానమునుండి నలువలంకులను పరికించి, చూడ్కివలనుండి పర్వతదృశ్యమును అంతరంగము లోనికి లాగుకొని, తృప్తినంది, దిగువకు తరలితిని. ఈతీఱున బ్రహ్మగిరి చుట్టుగల నాల్గుతట్టులనుండి కొండొక తెన్నుబట్టి, కొంత మేరదిగి, మఱొండు తెరువుగుండా మీదికి నెక్కి విస్తృతశైల సామ్రాజ్యమును కడుకౌతుకమున పరిశీలించితిని. కడచిన సాయంసమయమున కండ్లబడిన

భయంకరగుహాగాని, దురంతయాతన నొదవించిన బండమిట్టగాని ఈవిచరణమున మఱొక్కమాఱు సాక్షాత్కరించునేమో యని యూహించితిని. వీరప్రవరుని తోడ్పాటుకతన నీపర్యాయము మనుష్య సంచారముచే కొంత నలిగిన దారులందే నడచుటచే వెనుకటి భయంకర దృశ్యములు మరల దృగ్గోచరము కాలేదు.

అప్పటికి పగలు పదునొకండు గంటలు కడచెను. దివంగతయైన అమ్మకు నేడు కొంత ప్రసాద మర్పింపవలెను గదా! ఇక కొండనేలయం దాలసింపరాదు. నేటిపవిత్రకార్యమునుగుఱించి డైమానురాజుతో ముందే తెలిపియుంటిని. మహాతీర్థమున సాధారణముగ నెఱపవలసిన తీర్థవిధిని నేడు జరపితీఱుదునని ఆత డెఱుగును; కావున పితృకార్యమునకై చేయవలసిన సన్నాహమునంతను ఆతడు నెఱపియుండునను దృఢవిశ్వాసము నాకు కలదు. ఇట్టి కార్యములం దాతడు సిద్ధహస్తుడు కదా! ఇవి పండావిప్రుల నిత్యకృత్యములు. జరుగవలసినయత్నము నిలిచినను, నిముసములో నాతడు నిర్వహింపగలడనుట అతిశయోక్తి కాదు. 1930 లో నాఱవమాఱు (శారద సహితముగ) కాశీపోయి నపుడు, సి యస్. రావుగారు పదునొకండు గంటలప్పుడు* 'కో' అని కేకవేసినంతన నాగ్గురు బ్రాహ్మణులు మ్రోల వ్రాలిరి! గంటలో వంట ముగిసినది! డైమాఱారా జీవర్గములోనివాడే! ఇక నాలసింపరాదనియు, నీపర్వతభూమిపై మసలుటకు మఱునాడు మరల రావచ్చుననియు దల పోసి, "ఇంక నూరిలోనికి దారిదీయు" మని వీరప్రవరునితో నొక్కి చెప్పితిని.

మఱికొంతసేపటికి కొండదిగువకు వచ్చితిమి. చెట్లగుంపులో ప్రవేశించితిమి. ఊరినుండి మెల్లగ నడచివచ్చుచు, వరంగలుమిత్రులు నా కందు నెదురైరి. నన్ను పలుకరించుచు, "అయ్యవారూ! ఏమై పోయినారు నిన్న? చీకటిలో ఎక్కడోపడిపోయారని దిగులుపడ్డాము" అని వారు దేవులాడిరి. ఈ యమాయికుల వాక్కులు అనురాగపూరితములై యుండెను. చదువుసంధ్య లెఱుగరనియు, నాగరకతకు దూరమం

* త్రివేణీకుంభమేళ మహోత్సవానంతరము ప్రయాగనుండి కదలిపోయి వారణాసి నావేళకు చేరుకొంటిమి.

దున్నారనియు మనము చులకనచేయు వారి హృదయములు కరుణాప్లావితములనుట కెన్నేని దృష్టాంతములను స్వానుభవమునుండి పేర్కొనగలను; మహామేధావులని నేడు కీర్తినందువారిలో పలువుర హృదయములనుండి యనుకంపమదృశ్యమయ్యెననుటకు నెన్నేని దృష్టాంతముల నీయగలను. రాజస్థానమున హనుమాన్‌గడ్ అనుచోటున చాజీయను నిరుపేద నన్నెట్లు సత్కరించెనో, భటిండా దుబేజీ ప్రభృతులు నాయెడల జూపిన యాదరానురాగము లెట్టివియో నా "కాశ్మీరమజిలీ"లను పఠించిన పాఠకు లెఱుగుదురు. వరంగలు తెలుగు సైదోడులు నాకేమియు సాయముచేయలేదు. వారిసాహాయ్యమందు తరుణము నాకు లభించలేదు. కాని ఆతురపాటుతో నిండిన వారి మాటలు నాకు పదివేల మాటలకంటె పెగలవై నా మనసున కెంతేని యానంద మొనగూర్చినవి. అహా! సద్భావమును, సద్వాక్కును ఆత్మకు నమృతంపు గ్రుక్కలగును కదా! వీనిని గూడిన సత్క్రియ మధుమయమైనదగును. వీనినెఱుగని క్రియ—ఒక్కొకపుడది దొడ్డదియయ్యు—మానసమునకు ప్రీతిగాక బాధనే కలిగించును. తిట్టిపోసి యొకడు పాయసమొడ్డించుచో, మన జిహ్వ కది చేదును, చిత్తమునకు రోతను బుట్టించును. అనురాగగర్భితమైన పలుకెద్దియో, నాటకమునకును, బూటకమునకును సంబంధించినమాట యెద్దియో అనుభవముకతన గుర్తింపకపోము. తియ్యనిమాటలచే సంతోషపెట్టి, శక్తిసంపన్ను లయ్యు ఆచరణసమయమున గాళ్లు ముడుచువారును, ఎగ్గుచేయువారును గూడ గలరు. ఇట్టివారి జీవితము యమలోకమునకు గూడ డోకుపుట్టించును. ఎంతో సేవజేయ, నెంతో సాయము సలుప గాంక్షించి; కృతకృత్యులు కానివారు కన్నీరోడ్చుచు, చల్లనిమాట చెప్పువారును గలరు. ఆలివర్ గోల్డుస్మిత్ ప్రభృతు లిట్టివారు (Vide "*The Citizen of the world*" "*The City Night's Peace*"). వీరిమాటలును, వారిమాటలును చల్లనివేయయ్యు వీని యంతరంగములందు వ్యత్యాసము లుండునుగదా! వీనిని గుర్తించుట కెన్నేని వెరవులున్నవి.

భావము కేవలము వచనమునుండియే వ్యక్తముగాదు. ఇది నీటియందలి మంచుకొండను పోలునదని తెలుపవచ్చును. ఈ కొండయందలి

తొమ్మిదివంతు లుదకమున మునింగియుండును. ఒకవంతుమాత్రము జలముపై తేలును. (Vide Frend's Book on Psychology) ఇంతకంటె నధికముగ నది యాత్మప్రకాశము గావించుకొనజాలదు. అంతరంగ మహార్ణవమందలి భావము ప్రసంగమునందు కొంతదనుకమాత్రము ఆత్మప్రకాశ మొనరించుకొనగలదు. కాని భావము జడముకాక జీవానలసందీప్తమైనది కావున కొండవలె నడగిమడగి యుండనేరదు. మాటలందుగాకమానె, కన్నీళ్లందును, నవ్వునందును, అంగాంగ భంగిమమందును, ఉద్వేగపూరితమైన చేష్టలందును అది వెలువడును. కొండొకవడి సంయమి భావము నంతరంగమున బంధించియుంచినను, ద్విగుణీకృతశక్తితో కాలక్రమమున నేరూపమందైన నది విజృంభించి తీఱును. లతలందును, రెమ్మలందును నెలలకొలది నిదురించియుండు భావము వసంతసమయమున మొగ్గలందును, పూవులందును, కాయలందును, పండ్లయందును హాస్యముఖయై ఆత్మప్రకాశ మొనరించుకొనదా ? కమ్మతావియందు తనచరిత్ర మిట్టిదని ప్రకటించి బహుళాత్మల నలరింపదా ? మనుష్యమానసమున పొడసూపిన భావము బహుజన్మలందు గూడ నవతరించి వివిధక్రియలందు ప్రస్ఫుటించునని హైందవతాత్త్వికు లెఱుగుదురు. భావము సత్యముకావున, ఆత్మకు దగ్గఱిచుట్టము కావున నెన్నడు మృత్యువునెఱుగదు.

అభినయమం దావిష్కరించునది అసత్యమే కదా ! ఎరువునగలు దాలిచి సత్యమనితోచు లీల భావమువలె నిది నటించును. నేడుకాకున్న, రేపైన నీనగలు రాలితీఱును. ఇపుడుకాకున్న బిదపనైనను మోము మీఁదిపూత యంతరించి తీఱును. చక్కని చుక్కవలె కొండొకవడి తోచిననేమి, అనృతము నిజగర్భమున మృత్యువును ధరించియే యుండును. నిండుకడుపున నిప్పునెసుల నిడికొనిన కొండ ఏదేని ముహూర్తమున పెఠిల్లుమనక మానునా ? కాలవియత్తలమున సత్యము చిరసందీప్తమైయుండ, నసత్యము తా ద్రవ్వుకొనిన గోతిలోబడి చచ్చి కంపుగొట్టదా ?

చిఱుతప్రాయమునందే గృహము వీడి, విశాలభూభాగములందు మసలి, వివిధప్రకృతులను పఠించు తరుణములు నా కెన్నో లభించుట

చేతను, క్లిష్టమైన జీవనమార్గములందు ప్రతికూలపరిస్థితులందు నడచుచు, బహుళగుణదోషములను గాంచి సర్వవిధమనుష్యచరిత్రల నెఱుగవలసిన యక్కఱ నాకు పలుమాఱు కలుగుటచేతను, దైనిక జీవితమున నే గలియు వ్యక్తుల ఆంతరంగికశక్తు లెట్టివో, వారి హృదయములం దెట్టిభావములు సంచరించుచున్నవో, వివిధసమయములందు వారి మానసికగ్రథన మెట్లు పరిణమించుచుండునో అవలీలగ గ్రహింపగలనను ఆత్మవిశ్వాసము నాకు కలదు. క్రమగతి నైహిక యాత్ర సలిపి, విభిన్న జీవితసమస్యలను ధృతినైపుణ్యములతో నెదుర్కొనుటకై జీవితరహస్యములను గుఱించిన పరిజ్ఞాన మెంతో అవసరముకదా! ఆర్థికముగను, నైతికముగను పల్వురు నేడు పతితులై యుండుటచే, మతమహత్త్వముపై, ధర్మనిరతిపై, ఘనచరిత్రపై, సుందరభావముపై, సదాశపై నుల్కావృష్టి నేడు మిక్కుటముగ గురియుచుండుటచే తఱచుగ నహితులనే, ప్రవంచకులనే, ద్రోహులనే, దుర్మతులనే మనము విలోకించుచుందుము. అడుగువేసిన కొలది బొప్పి గట్టించుకొనుచుందుము. నేడును ఇట్టిగాయములు నాకు లభించుచున్నవి. దెబ్బతిని దెబ్బకొట్టిన నాధ్యాత్మికనియమమునకు భంగము వాటిల్లు టటుండ, తీవ్రసంఘర్షణము పిశాచమును లేపుననియు, ఆత్మశాంతిని దునుమాడుననియు, పరస్పరవిధ్వంసము తలసూపుట తథ్యమనియు నెఱుగుదును. ప్రతికూల ప్రకృతులనుండి సంఘర్షణమును గాక సఖ్యమునే సృష్టించుటకును, విషబిందువులను గాక అమృతకణములను లాతివారి నడవడియందు చిందింపచేయుటకును, తెరలుతెరలై ఎదుటిజీవనమునుండి దుర్గంధము మీదికి పొరలి రానున్నతఱి సుగంధపూరమునకు దానిని గంగోత్తరి గావించుటకును, చీకటికోణమైన మనసున దివ్యజ్యోతిని నిలుపుటకును, ప్రకోపమును పాలియించి ప్రణయమునకు పట్టముగట్టుటకును, కలుషమును కడతేర్చి ఉత్తమాశయములకు విజయధ్వజము లందించుటకును, హాహాకారములను తఱిమికొట్టి జయమంగళ మాలాపించుటకును, మనుష్యహృదయమున పెరుగుచున్న డొంకలను తెగగొట్టి మరల నందు మందారపారిజాతములను కుసుమింపజేసి నందనశోభను పునరుద్ధరించుటకును నేటిమానవుడు

మాటలకందని యాంతరంగికశక్తి నలవఱచుకొనవలెను. ఆత్మసంయమ మనుదు, నిశితబుద్ధి యనుదు, దూరదృష్టి యనుదు, అద్భుతకౌశల మనుదు ఈశక్తిలోనివే! దీనినందిన ముహూర్తమందే మహత్తర జీవనకళ నలవఱచుకొంటిమని తలపవచ్చును. వడగండ్లవలె కడ గండ్లు పైబడుచున్నను, విండ్లును, ముండ్లును నిముసనిముసము మార్కొనుచున్నను, ఆమహత్తరముహూర్తమున పండువెన్నెలను జుట్టు సుధాంగములవలె, సుధాబిందువులను గుటకవేయు తేటి గుంపులట్లు, పూలపానుపున తొలితూరి గలియు దంపతులచందమున, భావాంబరమునుండి రాలుచల్లని తలపులకు మనసులొగ్గు కవిచాతక ముల చాడ్పున ననంతానందము నంది, ఎంతేని మురియుదుము. మధురరాగాలాపమునకు, మంజులధ్వనిసృష్టికి సంగీతమూర్ఛనమందలి ఆరోహణావరోహణము లవసరమగు లాగున, మధురమంజుల జీవిత గీతికాసృష్టికి భావమూర్ఛనమును, క్రియాకౌశల్యమును అక్కఱలైనవి. వివిధగుణసూచకములగు మన హృద్వీణాతంత్రులును సప్తస్వరముల సమ న్వయము తేటపడు వడువున నేరిమిమెయి మీటజాలినపుడు మన జీవిత ముల నమరులకు కూడ పాటకచేరుల గావింపగలము. ఈసామర్థ్యము నందుట కెంతో సాధన మవసరము. ఇంటనుండి గ్రంథములగుట్టయందు పద్మాసనము వేసికొని రుద్రాక్షలను త్రిప్పునట్లు గ్రంథాక్షరములను మనన మొనరించిన నిట్టిసాధనము కానేరదు. ఈసాధనమును, పైన నుల్లే ఖింపబడిన పరిజ్ఞానమును స్వీయపరిశోధనమువలన, స్వయంకృషికతన, గంభీరపరిశీలనమువలన, హృదయపరీక్షమూలమున, ఆత్మసంయమముకతన నిశితబుద్ధివలన, నూతనశక్తిసంపాదనముకతన నలవడును. పాడుచుండ, నాడుచుండ నెల్లరవములను, ఎల్లరూపములను ఆకర్షించుకొని, మన మ్రోల బ్రదర్శించు టాకీజంత్రము లట్లు ప్రకృతి జీవనమందును, మను ష్యజీవితమందును బహుళచలనదృశ్యములను దాగైకొని, సాహితి దాని నాత్మహృది బ్రత్యక్ష మొనరించును గావున, నాదర్శజీవితనిర్వహణ మునకేకాక, ఆదర్శసాహిత్యసృష్టికినిగూడ నట్టిసాధనము నట్టిపరిజ్ఞాన మునవివార్యములైనవి.

సాహితీసుకృతియందును, ప్రత్యక్షప్రపంచమందును పూర్ణాదర్శములను నిండుపండ్లనట్లు పుడికిలీఅవలెనని కాంక్షించువాడను కావున నీ పరిజ్ఞాన సాధనలందు క్రమవృద్ధినంద నాతురపడుచునే యున్నాను.

వరంగలు మిత్రులతో కలసి నేనెంతకాలమో మసలకున్నను, వారితో దీర్ఘప్రసంగము సలుపకున్నను వారి హృదయము లెట్టివో, వారి చరిత్ర లెట్టివో, వారి జీవనవిధానము లెట్టివో గ్రహించుటకు నాకు నిముసముసేపుకంటె నాలస్యముపట్టలేదు. అభినయమునకుగాని, నాటకమునకుగాని వారి జీవనములందు చోటులేదని గ్రహించి, ఆ యమాయికుల నిష్కళంకచిత్తములకు జోహారంటిని. కంటిచూపు చల్లగ నున్నంతకాలము, మానసికదృష్టి వాడిగ్గాయి యున్నంతకాలము (ఈచూడ్కుల నెదుటివారు చూడనితెలుగున పారించినను పారించుచు) ఏది సత్యంపువ్యక్తీకరణమో, ఎయ్యది యసత్యపువిజృంభణమో గ్రహింపజాలుదును.

కడచిన రాత్రి నా కెట్టి యవస్థ ప్రాపించెనో యని వరంగలు సైదోడు లెంతో వందురియుందు రని గ్రహించి, పరార్థచింతకు తావొసగిన వారి పవిత్రహృదయములకు ధన్యవాదము లొసగితిని. నిరపాయముగ నేను బయటబడినందులకు వా రెంతో యానందించిరి. సమీపమున నేదేని దేవాలయ ముండియుండునని యూహించి దానిని చూచుటకై పయనమైతిమని వారనిరి. మతావేశముతో కాబోలు, వారితో నున్న అబల తాటిపండును చంకబెట్టికొని, ఎంతో చులుకుగ నడచుచున్నది. తనముం దొక యెత్తుకొండ కలదని పాపమామె యెఱుగదు. ఎఱిగినను ఆవేశభరితహృదయమై యున్నంతదనుక ఆమె వెనుకంజ వేయదు. ఆహా! మతావేశ మెంత మహత్తరమైనది! అది యొసగు శక్తి ఎంత యద్భుతమైనది! మనుజునకు రక్తమాంసములిచ్చు బలమెంత? భావోద్వేగమును, మతావేశమును అదృశ్యదివ్యశక్తులై, అంతరంగమున విరాజిల్లుచుండ నంగుష్ఠమాత్రశరీరులుకూడ ధైర్యహేమాచలు లగుదురు; అసాధ్యములను సాధించితీఱుదురు. గిరీంద్రములును, కరీంద్రములును వీరి కరుణకై దోసిల్లొగ్గి వీరిమ్రోల నిలుచును.

తెలుగు సైదోడులనుండి కదలిపోయి, సేవకునిగూడి మఱికొంత దూర మరిగితిని. తరుబృందమున ప్రవేశించుచు, గజాసురుడు నా కెదురై "నమస్తే బాబూసాబ్! అభీతక్ జంగల్ మే హావా ఖాతేహై క్యా? పహాడ్ పర్—("అయ్యా! వందనము ఇప్పటివఱకు వనములో వాతూలము నారగించుచున్నారా? కొండపై—") అని చిఱునవ్వుతో పరిహాసస్వరమున నేమో ప్రశ్నించుటగాంచి, "నమస్తే" యని మాత్రము పలికి, వానితో ప్రసంగింపక, అప్పటికే చాల ప్రొద్దెక్కుటచే వడివడిగ నడిచిపోతిని.

కష్టభూయిష్ఠమైన ప్రయాణమున గజాసురుడు నాకెంతో తోడు పడునని ఆశపడితిని. ఉత్తరహిందూస్థానమున నేను సలిపిన దీర్ఘ యాత్రలో నాపొట్టిపిచికి నాకెంతో పరిచర్యసలిపి, నాకు ప్రాణాధికుడైనాడు. పిచుకవలెనున్న వాని గుండెయందు మేరువుబోలిన యౌదార్య మ్ముండెను! గుప్పిట నిముడు వాని యంతరంగము వియత్తలముకంటె విశాలమై యుండెను. మహత్తర సేవాధర్మమునకై పురికొలుపు దివ్యభావము పరంజ్యోతివలె వాని హృదయగర్భాలయమున తేజరిల్లినది! తాను చేయునది మహత్కార్యమని ఆతడెన్నడు దలపోయడు. అతడాడును! పాడును. అంతియే! కోపించినపుడు తనలో తాను నవ్వుకొనువాడు; నామనసునకు నెగులు కలిగెనని యూహించి నపుడేడ్చువాడు. వాని యెడంద 'కుసుమాదపి కోమలము.' అది బాలకుని గుండె కెనయైనది; మంచుకంటె శుభ్రమైనది. కఠినమైన ప్రణాళికను నిర్దిష్ట మొనరించుకొని, క్లిష్టమైన పయనము సలుపుచు, నిష్ఠురుడనై నే బ్రవర్తించినపు డించుకైన గనలక, విసుగుజెందక, దిగులుపడక, తనకష్టమును కష్టమల్లెంచక, నేబడుపాట్లకు దుఃఖించుచు, తన నిద్రాహారములను పాటింపక నానిద్రాహారములకై వింతవింత వ్యవస్థలు సలుపుచు, తన మాటలచే, నాటపాటలచే నాకెంతో సంతసముగూర్చుచు, నాకు తోడై నా నీడయై మసలిన వాని నెన్నడును మఱువజాలను. ఆంతరంగికముగ నాతడు మహాత్ముండని గుర్తించియే ఆతడెఱుగనితీఱున తలచుచుగ వాని హృదయమహత్త్వమునకు సాగిలపడువాడను. మరల వానిని గలిసికొని, వానిగూడి మాటి

మాటికి హిమగిరియాత్ర సలుపవలెనని మక్కువపడుచుందును. ఆతని జూడవలెనని అనవరత మాతురపడుచుందును. గజాసురుని దాపున నున్నపుడు మనశ్శాస్త్రమున నిర్వచింపబడిన వ్యతిరేకసూత్రము (Law of Contrast) ననుసరించి నా పొట్టిపిచికి తలపునకురా, నిరువురందు గోచరించిన వ్యత్యాసము గలచి అబ్బురపడిపోతిని. శారీరకోన్నతియందు గజాసురుడు బ్రహ్మగిరి తలదాటినాడు! హిమాచలమున కుజ్జీకాగల వాడు! ఉన్నత శరీరమునకును, ఉన్నతభావమునకును దగ్గఱిచుట్టఱిక ముండునని తలపజెల్లదని ఈతని దృష్టాంతము గ్రువపఱచినది. పొట్టి పిచికిపరిమాణము గజాసురుని చిటికెనవ్రేలియం దరపాలైన నుండదు. పరమాణువునందు కొండంతభావమును గాంచి, కొండంతకాయమున పరమాణువంత మహత్త్వమును గాంచక, ఇదేటి సృష్టిచిత్రమని యచ్చెరువొందితిని.

అప్రమత్తులమై సూక్ష్మపరిశీలనము గావించితిమేని, సృష్టియం దెన్నేని చిత్రములను విలోకింతుము. ఒక్కొక్క చిత్రమున నొక్కొక చిత్రాలంకారమును గాంతుము. పరస్పర ప్రతికూలములట్లు తోచు రెండుభావముల కలయికలో నద్భుతసత్యమును ప్రదర్శించునదే ఈయ లంకారము (Epigram) కదా! మృత్యువునుండి జీవితమాత్మవిజయ మందుటయు, దుఃఖమునకు సుఖము హేతువగుటయు నిట్టి సత్యములే! అనంతమైన బ్రహ్మ హృదయగల నిజసృష్టియం దాత్మప్రకాశ మొనరించు కొనుట నిట్టిసత్యమే! నెగులునుండి సుఖ ముద్భవించుటయు నిట్టిసత్యమే! కమలముఖమున దోచు కన్నీటిబిందువు ప్రభాతసమయమున చక్కని రతనమట్లు కాంతిలదా? నిజేశునకు సరోజినియొసగు రత్నాంకితహారము బాష్పసముద్భవమైనదే కదా!

మనుష్యచరిత్రయందు తోచు చిత్రములనుండి చిత్రములను సృష్టించుట అసాధ్యముకాదు. ఈచరిత్ర ప్రాణసంచారము గలది కావున చలనయుతమైనది; పరివర్తన మందజాలునది. మనుష్య దృష్టి గాంతిలునది పరిపూర్ణత్వము (Perfection) కావున దీని దెస సాగిపోవుట మానవుని సహజగుణము. దీనికతన గుత్సితంపు చరిత్రలు కొన్ని యాంతరంగికపరివర్తన మందుట గాంతుము. ఈపరివర్తనమునే

తాత్త్వికులు పునర్జీవిత (Resurrection) మనియు, ఆంతరంగికపరివర్తన మనియు, (Inward renewal) అనియు దెలుపుచుందురు. హైందవ సారస్వతము దీనిమహత్త్వమును వేనోళుల బ్రకటించినది. గెటే టాల్‌స్టాయిప్రభృతు లీ యాధ్యాత్మికగుణమును బహుభంగుల నుగ్గడించిరి. (Vide Leo Tolstoy's famous novel '*Resurrection*') క్రైస్తవ మతచరిత్రయం దిది ఎంతేని ప్రాముఖ్యము నందినది. అంధకారబంధురములై యుండిన *ఆగస్టయిను పాల్ ప్రభృతుల జీవితములు దీనికతననే ఆలోకితములై సౌదర్యసందీప్తములు కాజాలినవి.

గజాసురుడు పొట్టిపిచికివలె మహాత్ముడు కాడు. నిష్ఠురునివలె దోచినాడు. కానిక్రమనిష్ఠకతన కరుణాశరధి కాగలడని నాదృఢవిశ్వాసము. కొంతకాల మీతనితో మసలి, ఈతని చరిత్రయం దుదయించు నూతనశోభను గాంచవలెనని యాశపడితిని.

నడచుచు నడచుచు సేవకు డేమేమో పలికినాడు. నా మనసు వేఱుగ పనిచేయుచుండుటచే వాని నుడువులు వాని "స్వగత" మందే నిలిచిపోయినవి! వాడు గంభీరవదనుడై పోయినాడు. ఇంతలో మిరప పండు, పండ్లీవల బాఱవైచి, ప్రత్యక్షమైనాడు! నా యాగమనమును తెలుపుటకై కాబోలు పరుగుపరుగున వెన్కకు పోయినాడు. వీరప్రవరుని గూడి అల్పసమయములో డైమార్ రాజుదివ్యభవనమును జేరుకొంటిని.

తీర్థయాత్రలను చేయించుటందును, తిథులను పెట్టించుటందును డైమార్ రాజుఅందెవేసినచేయి. ఈకృత్యులలో వానిబుద్ధి పరిణతినందినది; తలపండినది. తాతముత్తాతలనుండి అవతరించుచు వచ్చిన క్రియాకలాపమును ఉగ్గుబాలనాటినుండి చేపట్టి సాధించుచున్న ఘటము! ఆ క్రియా ప్రణాళికలో నాతడింతటివాడగుటలో నక్కజమేమున్నది? నిన్నటిదినము నేననిన నాతల్లి తద్దినము మాట ఆతనిచెవి బడి ఊరకొనలేదు. వానిమనసున ప్రవేశించి,మంచి మందుకణికవలె పనిచేసినది! మరల దానిని గుఱించి వానికి జ్ఞాపకముచేయవలసిన అక్కఱ లేక పోయినది. అతడు బ్రహ్మగిరి

---

* ఆగస్టయిను ఘోరవ్యభిచారియైయుండువాడు. ఈతని దుశ్చరిత్ర వీనితల్లి కెంతో సంతాపము గలిగించెను. పదపడి ఆంతరంగికపరివర్తన మంది, ఈతడు యోగీంద్రుడై క్రైస్తవమతమహత్త్వమును దశదిశల నుగ్గడించినాడు.

తెరువుదాపున వెలుగునుగాంచిన ముహూర్తమందే పాల్ మహాత్ముడైనాడు.

వృత్తాంతము నెఱుఁగనివాఁడు కాఁడు. కొండకొన జేరుదునని పోయిన యాత్రికుఁడు ఇంతలో తిరిగిరాఁడని నాపలుకు వినినపుడే గ్రహించినాఁడు. గిరిశిఖరము నెక్కినను ఎక్కఁజాలకపోయినను, వార్షిక శ్రాద్ధమును నెఱపి తీఱవలెను. కనుక దొరలిగ్నెనను, తనమేడపై పడితీఱుదునని ఆ బుద్ధిమంతు డూహించినాఁడు. ప్రాణపతి చిత్తమును కనిపెట్టి, ఆతని యడుగుజాడలననుసరించు దొడ్డయిల్లాలైనను కాకపోయినను కాపురమునకు వచ్చినప్పటినుండి ఆతని యుద్యోగమున పాల్గొనుచు విశేషానుభవమును సంపాదించిన దగుటచే, మదాము నేటి వంటకై వలసిన సన్నాహమును నేను మరలిరాకమున్నే చేసికొనినది. * నేను వచ్చినంతనే కబురు తెలుపుమని తనయున కాదేశ మొసగి, ఎవరిచేతనో అమావాస్య తర్పణమును విడిపించుటకై కాబోలు డైమార్ రాజు కుశావర్తమున కరిగినాఁడు. చేతినిండ గావలసినంత ప్రాక్టీసుగల అదృష్టవంతుఁడు!

మిరపపండు తూరీగవలె ఎగిరిపోయినాఁడు! అచిరములో డైమార్ చక్రవర్తి హాజరైనాఁడు. వెంటనలుగురు మహాశయులున్నారు. నలువురు డైమార్ వర్గములోనివారే! శరీరములపై బుక్కా చల్లుకొనిరేమో అని యూహించితిని. ఒక్కఁడు మాత్రము లంకగుమ్మడిపండును బురుడించు బొజ్జతో నలరారుచున్నాఁడు! నలుగురును పెద్దమీసములు గలవారే! తక్కుంగలవారి ముఖభాగములును, తలకాయలును నున్ననై యున్నవి. గడ్డిపరకలవలె పుంజెడు వెండ్రుకలు ఒక్కొక్కని నడినెత్తిపై శోభిలుచు, మందమారుతమున నూగాడుచున్నవి! కొంతదూరమున నిలుచువారికివి గోచరింపవు. నాలుగు మెడలపై అప్పడముల పిండిముద్దలు నాలుగు రంగారియున్నవని చూపఱులు గ్రహింపకపోరు. గుమ్మడిపండును చూపి, "ఇతడు మంత్రము జెప్పును. తక్కిన ముప్వురును భోక్తలు. ఉత్తములైన బ్రాహ్మణులు" అని

* ఈరీతి అక్కరలు ఆకస్మికముగ పొడసూపినను, ఇంతగొంతుకు లేక వాని తెమల్చుకొనజాలు శక్తిపండాల కుండును. కాన్పూరునుండి పగలుపదునొకండుగంటలకు కుటుంబసహితుడనై కొన్నేండ్లకుమున్ను నేప్రయాగ జేరినపుడు తెలుగుపండా హరశాస్త్రిగారు "ఓ" అనినంతనే ప్రమథగణమువలె నలువురు ప్రత్యక్షమై నాటి సన్నాహమును నిమిషములో నెఱపిరి.

డైమార్ రా జనినాడు. "నిజముచెప్పితిరి" అని వారిని తేటచూచితిని. "పదునేనుదినములనుండి నాసికస్టేషనులో మీకై ఎదురుచూచు చుంటిమి బాబుజీ!" అని యొకమాలు దగ్గి "ఎప్పుడు దయచేసినారు తమరు?" అని గుమ్మడిపండు గౌరవపూర్వకముగా నన్ను ప్రశ్నించి నాడు. పండ్లూడిన నేమి, ముసలివాడు రసికుడని, గట్టిఘటమని గ్రహించుటకు నాకాలస్యము పట్టలేదు. ఇట్టి వృద్ధులను చూచి నపుడు ఎంతో సంతసమందుచుందును. వృద్ధుడు కాక యువకు డిట్లు ప్రశ్నించియుండిన, గోపించియుందును. పదునేనుదినములకు మున్ను అమృతసరమునందుంటిని. నాకై ఈతడు నాసికలో నెదురుచూచుచుండె నట! తొలుతటి పర్యాయము (1917-లో) కాశీపోయినపుడు సి. ఎస్. రావుగారి ఏజంటు "అబ్బాయీ! నీకై మొగల్‌సరాయి స్టేషనులో చాలసేపు ఎదురుచూచితిని" అనినాడు. ఈవచనము పండాబాపలందఱి నాల్కలపై తేలియాడుచుండు నేమో! "పదునేనుదినములకు మున్ను రాత్రివేళ జలియన్‌వాలాభాగ్‌లో మీవంటిరూపమే గోచరించినది. మీయన్వేషణ మచ్చటికరుకు ప్రాకియుండును." అని గుమ్మడిపండుతో పలికితిని. "ఇతడపుడపుడు భూత మగుచుండును. భాగ్‌లో మీకు భూతస్వరూపమున నీతడు గోచరించినాడు!" అని ఒకభోక్త పలికినాడు. గుమ్మడిపండు కనులెఱ్ఱజేసి, నాల్కనాడించినాడు; హుంకరించి ఆభోక్తపై సుఱుక గమకించినాడు. విజృంభించు గుమ్మడిపండుపై మఱొకభోక్త చన్నీరు (పన్నీరుకుమాఱు) చిల్కరించినాడు! ఇక నాలసింపక నాటి క్రియకై గడంగవలెనని ఆమహాశయులను హెచ్చరించి, స్నానమునకై వారితో కుశావర్తమున కరిగితిని.

పితృకార్యములందు ఆంధ్రులకు మహారాష్ట్రభోక్తలు (వారును పంచద్రావిడులలోనివారే కావున) పనికివత్తురని మనపెద్ద లను చుందురు. కాశీప్రయాగలందు, పిండప్రదానసమయములందు వీరు

విరివిగా చెల్లుబడి యగుచుండురు; కాని తెలుగుతిండికి వీ రలవాటు పడ లేదు. *

కన్నతల్లి తద్దినము! ఈపవిత్ర సాంవత్సరిక కర్తవ్యమును నేనిప్పుడంతగా విమర్శింప బూనుకొనను. తర్కశాస్త్రము తెలుపు ప్రత్యక్ష ప్రమాణమువలనగాని, అనుమానమువలనగాని దీనితత్త్వమును గ్రహించుట సాధ్యముకాదు. ఆప్తవచనముకూడ నొక ప్రమాణమే కదా! వేదవచనమే హిందువులకు ప్రధానమైన ఆప్తవచనము. దీని మహాత్త్వ మచింత్యమని విందుము. ఇది సనాతనమైనది. మనుష్య ముఖమునుండి కాక ఈశ్వరముఖమునుండి వెడలినదని విందుము. "వేదములు పౌరుషేయములో అపౌరుషేయములో" అను విషయమును పరిశీలించుట కిందు తావులేదు. మనుష్యమానసము దివ్యభావో

---

* ఇడపటిమాటు ప్రమాణము నే వ్యథ పెట్టినపుడు ఇపుడు మహారాష్ట్ర భోక్తలు తిప్పిరి కాగు. తెలుగుముద్దలు కంఠములో చొరబడినంతనే(ఇంజనునుండి గుప్పుగుప్పున పొగయు ఉబుకునట్లు) వారివదను భోక్తల నాసరంధ్రములనుండి వెడలినది! సెగలును, పొగలును అధికమైనకొలది వారికన్నులనుండి నీరు బొటబొటరాలినది! పురుషులు! అందును మహారాష్ట్రబాలికలం దుద్భవించినవారు! మహావీరులు! ఆడువారివలె వెలవెలలగుచుండిరో నాకు తెల్లముకాలేదు. ఆశ్చర్యాన్వితుడనై, "ఆస్తే, ఆస్తే,—ధీరే, ధీరే ఖాయియే"("మెల్లమెల్లగా ఆరగింపుడు") అని నేనంటిని. "హం రోతే-రోతే క్యా—" "మేము ఏడుస్తూ ఏడుస్తూ ఏమి—")అని ఇక వారుమాటలాడజాలకపోయిరి. "అసలైన సరకు, ఆవకాయ బోలునది, సుదూర యాంధ్రవసుంధరలోనే యున్నది! దాని నెట్టయిన తెప్పించి వీరికి వడ్డించినయెడల, చప్పున వీరు నా పితృదేవతలను చేరుకొనగలరు! వారి హారాదులమ్రోల ఆంధ్రప్రజ్ఞను గుఱించి మహోపన్యాసము లీయజాలుదురు! నేడు వీరు విలపించుచు ముద్దలు మ్రింగినదేమి? నా పితృదేవతలు కారమునకలవడిన ఆంధ్రవీరులే కనుక, తమరుచికి సరిపడిన పదార్థములు లభించుచున్నవని(భోక్తలేడ్చినకొలది) తాము సంతసించుచునే యుందురు."అనియూహించుకొని ప్రకాశముగా నేమేమో పలికి వారిదుఃఖము నుపశమింపజేసితిని.

ద్వేగముచే చలించినపుడే అందుండి వేదవాక్కు వెడలెనని నమ్మ జెల్లును. రాధాకృష్ణుడును, * ఆతనిబోలు మేధావులును ఇట్లని వచించిరి.

వేదవిజ్ఞాన మనంతమైనది. ఈవిజ్ఞానమహోదధిని మథించి క్రొంగ్రొత్తదగు భావామృతమును వెడలించు శక్తి మహామేధావులకే సాధ్యము. శంకరరామానుజాదు లిట్టివారు. కాలపథమున బహుశతాబ్దులు కడచుతఱి కొండొక మంగళముహూర్తమున వీరు జనించి, యుగమర్యాదకు సరిపడు పంథగుండా జనసమూహమును దోకొనిపోదురు. స్వతంత్రగమనిక మహత్తరమైనదే! కాని విజ్ఞానముపై, ప్రజ్ఞపై, ప్రతిభపై నాధారపడిన స్వాతంత్ర్యమే గురుగంభీరమైన ఫలములను చేగొనును. విజ్ఞానరహితుని స్వాతంత్ర్యము విచ్చలవిడినడవడియై, తీఱనిచెఱుపు దెచ్చిపెట్టును. సంస్కృతాక్షరము లెఱుగనివారు, తత్త్వశాస్త్రమును మందునకైన గాంచనివారు, మతమహత్త్వమున గ్రుంకు లిడజాలనివారు, భౌతికశాస్త్రదృష్టితోడనే ఆధ్యాత్మికాంశములను గూడ పరికించువారలు వేదములను నిరసించి, అం దుల్లేఖింపబడిన కర్మకలాపమును గర్హించి, ఆధునికదృష్టియందైనను అందలి గభీరతాత్పర్యమును గననేరక, హిందువులమని తెలుపుకొనుచున్నను, హిందూధర్మవిరుద్ధముగ జీవనములు గడపుచు, స్వతంత్రపథమున నగ్రేసరుల మగుచుంటిమని యెంచువారు తమ జీవితరంగముల నిట్టిచెఱుపునకు క్రీడాంగణములను గావించుకొందురు. వీరిగణమందు చేరుటకంటె, తెలియరాని,—భౌతికమైన ఋజువు కంపరాని ఆధ్యాత్మికవిషయములకు దూరస్థులమై సంశయాత్ములమై మానసికయాతన నందుటకంటె, విశ్వాసము నాధారము జేసికొని, విహితకార్యము లొనరించి, † ధర్మ

---

* The Veda is called 'Sruti' or the rhythm of the infinite heard by the soul. The words *drsti* and *sruti* which are the Vedic expressions point out how the Vedic Knowledge is not a matter of logical demonstration' but an intuitive insight. The poet's soul hears or has revealed to it the truth in its inspired condition, when the mind is lifted above the narrow plane of the discursive consciousness. According to the Vedic Seers the contents of the hymns are inspired and ravelatory only in this sense'' (Vide page 128 chapter on "*Transition to the Upanishads*" Volume I. Radhakrishnan's celebrated work "*Indian Philosophy*,")

† "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ, జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి."—శ్రీ భగవద్గీత.

పథమున పదస్ఖలన మెఱుగక చరించుచు, ఆత్మశాంతి నందుట మేలు కాదా ?

ఆత్మ మృత్యువు నెఱుగదని ప్రధానమతము లన్నియు నంగీకరించుచున్నవి. ఒకశరీరము చచ్చినను, తనకర్మను నెఱపుకొనుటకై ఆత్మ మఱొండుకాయమున ప్రవేశించునని శాంతీదేవి తెలిపిన కథనము నన్గొంటిని. ఢిల్లీలో కొన్నిదినము లీబాలికను పరీక్షించి, ఈ ప్రత్యక్ష దృష్టాంతమందలి మహత్త్వమును లోకమునకు దెలిపితిని. ఒక యగారమునుండి వేఱొకయగారమున ప్రవేశించుతెఱగున నొక భవము నుండి మఱొకజన్మమున జొచ్చి, కాలక్రమమున కర్మబంధమును త్రెంచుకొని, ఆత్మ ముక్తినందును. చినిగిన వలువలు వదలి మానవుడు నూతనాంబరముల నెట్లు దాల్చునో, జీర్ణదేహములను వీడి ఆత్మ నూతనశరీరములను గ్రహించుచున్నదని కదా భగవద్గీత తెలుపుచున్నది.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ."

నాయమ్మయాత్మ అమృతజీవి. ఈయమృతజీవి నారాధించినపుడు హృదయమున కెంతోసాంత్వనము నెంతోపరితోషము జేకుఱును. భావము కైదీమైయుండజాలదు. ఆత్మప్రకాశమందే అది యానందము నందును. అందును, ప్రేమభావము అద్భుతశక్తిగలది! విశ్వసృష్టియందాత్మప్రకాశము గావించుకొని జగదీశుడు కులుకునట్లు దీని వ్యక్తీకరణమున మనుష్యహృదయము సంతసమందును. ఆరాధన మిట్టి వ్యక్తీకరణమే! అమ్మకును, అయ్యకును జోహారనలేనివాడు, అర్ధాంగినాత్మ హృది జేర్చుకొనలేనివాడు, తోడిమానవులయెడల సద్భావము జూపజాలనివాడు, సౌందర్యమునకు ప్రణమిల్లలేనివాడు ఇట్టియానందమునకు బహుయోజనముల దూరమున నుండును. ఈతనిజీవితమే ఈతని గోరీమైయుండును. ఇందే ఈత డడగిమడగియుండును; పురుగు లట్లు దుశ్చింత లీతని బీడించి పీడించి, తుదకు తమపొట్ట బెట్టుకొనును!

నాయమ్మ పసితనమందే నన్ను బాయక, నేడును నామ్రోల నుండిన, సచ్చిదానందములు నాజీవితాంగణమున పాడియావులై యుండెడివి.

నిభృతమున హృదయమును విప్పి "అమ్మా!" యని ఆతురపాటున కంఠమెత్తి పిలిచినపుడు గుండెనుండి దుఃఖపూరము పొంగిపొరలును. కరుణామయికై ఆక్రందనమొనరించినపుడు అంతరంగమందలి యాతన పంజరమునుండి విడివడినపిట్టవలె, అంతర్ధాన మగును. కనిపెంచిన ఆనంద మయి, ఇంచుకసంతపించిన సంతప్తహృదయయై, ఇంచుకసంతసించినపరమ సంతోషసంభరితయై, నెగులుచూచి పొగిలి, వేయివిధముల దల్లడిల్లి, వేయినెరసులను క్రీగంటనైన పరికింపక, నిరంతరప్రేమదానమున ననంతపరి తోషమందుచు, ఆటలందును, పాటలందును పాఠములు గఱపుచు, సిసు గునకు నెట్టులైన మోదమును, శాంతమును గూర్చుటకై ఆత్మార్పణ మొనరింప నాతురపడు కన్నతల్లి చిఱుతప్రాయమందే కఱవైనపుడు, వడగండ్లవలె పైబడు కడగండ్లకు గొడుగైనయెడద అకాలమున నెందో యెగసిపోయినపుడు, అంధకారమందును, పరసీమయందును, ఘోరా తపమందును, భయదారిష్టమందును దురంతదుర్దాంతబాధల నోర్వజాలక దగ్ధమౌ యెడదనుచేతబట్టి కసుగాయ "అమ్మా! అమ్మా!! పలుకవేమి?" అని యఱచినపుడు, రెక్కలు కట్టుకొనియైన వచ్చి అక్కున జేర్చుకొన నెంచు తల్లిప్రాణమును మృత్యువు తనపిడికిట నొక్కిపట్టినపుడు గుండె గుండయై నేలరాలదా? అమ్మఅయ్యల ఆత్మలు తీర్థస్థానములందు హంస దంపతులై తానమాడుచుంట గాంచి స్వాంతమున సాంత్వనము నందవలె నని యెంచి, పసితనమున నొంటరినై పరిభ్రమణము మొదలిడి, తొలుత వారణాసిపోతిని. నాటి నామాటల కాదరపూర్వకముగ వీనులొగ్గి, నా యుద్దేశమును గ్రహించి, అది సిద్ధించుటకై తోడ్పడిన శ్రీ సి. యస్. రావుగారు నేడును సుఖులైయున్నారు. కన్నవారియాత్మల నావాహన మొనరించుకొని, మహాక్షేత్రములందు వాని నాత్మహృది గాంచి, లోని యలమట నపనయించుకొని చిత్తశాంతినందుటకైయే నేను తీర్థవిధులను నెఱపుచుందును. ఈవిశ్వాసబీజమును చిఱుతప్రాయమున నాహృదయ మున నెవరునాటిరో నే నెఱుగను. ఇది తొలుతటి పుట్టువులోని పంట

గింజయేమో! ఈ బీజమును చితుకకొట్టదలపదు ఆంగ్లవిద్య నాకు తప్పనిదైనను, దీనిని తాకనీయక దానిధాటీని హద్దులో నుంచుటకై యత్నించుచునే యుందును.

బాల్యావస్థ కడచినంతన, అమ్మ నుద్దేశించి వెడలిన ఆర్తనాదము ఆంతరంగికానునయ మొసగుటకు కారణ మది భావగర్భిత మైనదగుట యని గుర్తింతుము. ఈ దీనారవమును పంథగావించుకొని, అందుండి అమ్మయాశీస్సు గాంగనిర్ఝరమట్లు హృదయమున ప్రవించి, అందలి యగ్నికుండమును చల్లార్చును. అమ్మకై పొగులగలశక్తి అంతరంగమున నడుగంటనంతదనుక, ప్రణయప్రసన్నతకై, భావోన్నతికై తల్లడిల్లజాలు సామర్థ్యము హృదయమున మడియనంతవఱకు ఎన్నియిక్కట్టులు తలపైబడినను, గోళీలట్లు పిడుగు లెన్నితలపై డుల్లిపడినను మానవుడు నిట్టూర్పులు వీడనక్కఱలేదని నొక్కిచెప్పెదను.

కాని, మానవమానస మనవరతము బేలగాయుండదు. వ్యక్తీకరింపదగు ముహూర్త మాసన్న మగునంతవఱకు భావోద్వేగము నది నిలిపియుంచగలదు. అద్భుతమగు మానసికశక్తి నలవఱుచుకొనినవానికే ఇట్టి సంయమసామర్థ్యము సాధ్యమగును. మేఘగర్భమున నెన్నో నెలలు తడసియుండి, అందు పెరిగి పెంపొంది, మృగశిరప్రవేశసమయమున కువలయమున లంఘించువారిధారయే చల్లనై, అవిరళమై, ఆనంద గీతిక నాలాపించుచు శ్యామలసస్యములకును, పైడిపైరులకును కన్నతల్లి యగులీల, ఐదుఋతువులు కడచువఱకు లతాహృదయమున తడసియుండి, వసంతసమయము పొడసూపినంతన కుట్మలములందును, కుసుమములందును, లలితములైన చిగుళ్లందును శృంగారమున రంగారియుండు పండ్లయందును నాత్మప్రకాశ మొనరించుకొను సౌందర్యము చందమున, జననీగర్భమున తొమ్మిదినెలలు తడసి, తడయుతటి వృద్ధినంది, తల్లియందలి శారీరక, మానసిక, ఆధ్యాత్మిక గుణములను తనవిగావించుకొని యుదయించు శిశువు సర్వాంగలావణ్యమున రాజిలు చొప్పున, నిశియంతయు నెంతో తపసుచేసి శక్తి సంచిత మొనరించుకొని పదంపడి అద్భుతప్రభలను పృథ్వీపై ప్రసరించు రవిచాడ్పున, కృష్ణపక్షమున నిభృతతపసు గావించి, పిదప నాత్మవ్యక్తీకరణ మొనరించుకొను

లమృతసూతి వెన్నెలవానయందు తనప్రతిభను గాంచి మురియుఁ గైవడి, మానసప్రసూతిగృహమున నీశ్వరసంపర్కముకతన నాత్మకు నుదయించిన భావడింభకము కొంతసమయము తడసి మనననిదిధ్యాసనముల పరిచర్యవలన పెరిగి పెంపొంది ఉచితకాలమున, మంగళముహూర్తమున నవ్వలియవని నాత్మప్రకాశ మందెనేని, మన్మథునివలె (అతడును జగదీశునిబిడ్డయే కాదా ?) సౌందర్యసందీప్తమై యుండును.

సహనసంయమములందును, నిభృతనిస్తబ్ధతలందును, మౌనశాంతములందును, ఏకాగ్రదృష్టిధ్యానములందును,సమాధిప్రార్థనములందును, పూర్ణవృద్ధి నందినప్రతిభ పూర్ణప్రకాశమునే కాంక్షించును. తడసి, తగుముహూర్తమున నాత్మవ్యక్తీకరణము గాంచినపుడే తనజన్మము సార్థకమైనదని ఇది మురియును. సముచితవ్యక్తీకరణావకాశమును, తనను గుఱుతించుకన్నులను గానక ప్రతిఘటించు ప్రతికూలపరిస్థితులు ప్రత్యక్షమగుట వీక్షించినచో ప్రతిభపడు బాధ దురంతమై, దుస్సహమై యుండును. రవిసుధాంశువులును, పూవుపంక్తులును ఆత్మప్రకాశము నెఱుగజాలవేని, తమకన్నీళ్లచే ముల్లోకములను ముంచివేయును. విశ్వసృష్టియం దాత్మవ్యక్తీకరణ మొనరించుకొననివాడు జగదీశు డందు పరితాపము అనిర్వాచ్యమైయుండును.

మనుష్యాంతరంగమున ప్రతిభ కడపు జీవితమును పరిశీలించితిమేని, అది విశేషముగ వేదనతోడను, పరిశ్రమతోడను గూడినదనియే గ్రహింతుము. ఈయాంతరంగిక యాతనానుభూతి నందుశక్తి మనుష్యలోకమున నే కొలదిమందికో కాని యుండదు. రక్తపూరముబోలు కాంతియందే బంగారువన్నెగల బాలభాను డుదయించు లీల, అంగలార్చు చైతన్యుని కన్నీటియందే ముద్దుకృష్ణుడు మురళివాయించుచు ప్రత్యక్షమైనట్లు హృదయఖేదమందే పండువంటి ప్రతిభ యుద్భవించును. ప్రతిమానవుడును ప్రతిభావంతు డేలకానేరడో చదువరులు గ్రహించియె యుందురు. కూడుగుడ్డలే బ్రదుకనియెంచువారి సంఖ్యయే పెద్దది. అశనవసనముల నంది, భోగభాగ్యములు పడసి సంతసమంది, సుఖముగాంచి, వీనియందే వీరు చత్తురు. సంతృప్తినందిన సన్న్యాసి కంటె సంతృప్తినందనిపాపియే ఘనుడని ఒకయాధునికతాత్త్వికు డనినాడు.

సంతృప్తిప్రయత్నమును నేలగూల్చును. అసంతృప్తియో! ప్రయత్నమును పురోపథమున పురికొలుపును! ఘనయత్నమే మహాతపము. దీని నెఱుగక అలసదనమున కాళ్ళుముడుచుకొను సన్న్యాసి ప్రలోభము కన్నుగీటినపుడు సంయమమెఱుగక, లోతుగోతిలో గూలును. అవిరతమైన జతనముకతన పాపి గభీరపంకమునుండి లేచి, గాఢతమమునుండి కడచి, వెలుగును గాంచి, జగదీశునకు సన్నిహితుడగును. కావుననే ఆరీతి జోగికంటె నీరీతి కూళయే ఘనుడని ఆతత్త్వవేత్త అట్లు వచించినాడు. పాఠకులారా! అవిచలితపరిశ్రమమునందు, నిరంతరప్రయత్నమందు నెంతమహత్త్వమున్నదో గ్రహించితిరా?

కాని పరిశ్రమమందలి పటుత్వ మహత్త్వములు అవార్యముగ ఫలమున ప్రస్ఫుటించునని తలపజెల్లదు. నిష్కామకర్మను గీతాచార్యు డుగ్గడించినాడు. ఫలముపై కన్నువ్రాలనపుడు కర్తవ్యనిర్వహణము నరునిచేతికి ముక్తిమందారము నందించును. ప్రతీచీతాత్త్వికులు కొందఱు భగవద్గీతలోని భావపీయూషమును మనసార, తనివార గ్రోలిరి. ఆసుధాబిందువులు హృదయకలశమునుండి తొనకి, వారి రచనములందు రాలెనని సూక్ష్మపరిశీలనమున కనుగొందుము. తాము గీతావిభూతికి ఋణపడియుంటిమని గురుశిష్యులైన కార్లైలు ఎమర్సనులు ముక్తకంఠములతో వచించిరి. సుప్రసిద్ధపాశ్చాత్యతత్త్వవేత్త హాల్డేన్ మహాశయుడును గీతామృతమునకు మానసాంజలినొడ్డినవాడే! ఎడింబరో విశ్వవిద్యాలయ విద్యార్థులను సంబోధించుచు నాతడు "ఫలమెట్టిదైననగుగాక, గొప్పందనము పూనికయందే కల"దని పలికినాడు. ఆతని మహోపన్యాసము గీతానుకరణమనియు, గీతానుసరణమనియు ఋజువొనరింపవచ్చును.

క్రియాఫలము బహుళాంశములపై నాధారపడియుండును. కర్మవీరుని ఇచ్ఛాశక్తి విశేషప్రభావము కలదనుటనిక్కమే! కాని, అంతరంగశక్తికి బహిరంగపరిస్థితు లనుకూలములై యుండవలెను. ఇవి బహుళములు; విశేషించి స్థలకాలములకు సంబంధించినవి; ప్రత్యేకసాంఘిక రాజకీయాంగణములందు విజృంభించునవి. తరుణమును తరలనిచ్చి జెబ్బగొట్టి సవాలొనరించిన, ప్రయోజనముండదు.

చేజిక్కిన మహాత్తమును జారనీక తమయోడను కడలి యందు నడపువారు భాగ్యరేఖ నవలోకింతురు. అదనును కదలనిచ్చి, ఉపేక్షింత్తు రేకటాలజొచ్చు వారి వారియానము సుడిగుండమున బడి బుడంగుమనును. *

జతనమున నెట్టినెరసు తలసూపకున్నను, చంపిరుని పై బడు సూర్యాలోకమువలె, పురుషకారముపై ఈశ్వరకటాక్షము ప్రసరింప వలెను. ఫలమును నిర్ణయించువాడు జగదీశుడే!

ఈశ్వరప్రేరితుడై, శ్రీరామదూతయై, సీతాన్వేషణమునకై వెడలిన మహావీరుడు (కార్యరంగమున కాలూనకమున్ను క్రియా ప్రణాళిక నంతరంగమున నిర్ణయమొనరించుకొని, హృదయవీథియందు దానిని నిర్వహించుట కర్మవీరునికర్తవ్యము కావున) మానసికముగా తొలుత గమ్యస్థానమునుచేరి, మహేంద్రమహీధ్రమునకు తరలి, మహాకాయుడై, మహాయోగియగుడు ఊర్ధ్వదిశకు దృష్టిసారించి, మహానాదమొనరించి, మహోద్వేగముతో కుప్పించి యెగసి, మేఘ మార్గమునపోయి, సింధువును దాటి, నిశితదృష్టి సమన్వితుడైన సంపాతి నిర్దేశించి తెలిపిన తావలమున మహీసుత నవలోకించి కృతకృత్యు డాయెను గదా! హనుమంతుడు మహాతపస్వి! తపోమార్గమున సుపా సకుడు ఉపాస్యదైవతము ప్రసాదించుశక్తి నందుట తథ్యము! ఈశక్తి సర్వతోముఖమైనది! అనిర్వచనీయమైనది! శారీరక మానసిక యాత్మ శక్తు లిందు అంతర్భూతములై యుండును. మరున్నందనుడు కొండ నుండి యెగయుతటి గిరిపై వసించు కిన్నెరాదులు కుధరకంపమున కడలి, గగనమున కెగసి, రామదూత నవలోకించి ఆతనిశక్తి కబ్బుర

---

* షేక్స్పియర్ మహాకవి నుడువు లివి:

**There is a tide in the affairs of men,**
**Which, taken at the flood leads on to fortune;**
**Omitted, all the voyage of their life**
**Is bound in shallows and in miseries.**

**(Vide Scene 3; Act IV *Julius Caesar*).**

పడలేదా ? అచలము చలించినపుడు అందు నధివసించిన మునిముఖ్యులు సయితము కారణమెఱుగనితఱి అట్టిటులాడి, హేతువున కవగతులైన యనంతరము ఆశ్చర్యాన్వితులు కాలేదా ?

దృష్టి అవిచలితమై, ఏకాగ్రమై యున్నపుడు ఉపాసకు డుపాస్య దేవతయం దైక్యమగుననియు, ఆదైవతమునకు ప్రతిరూపమగుననియు ఈశోపనిషత్తు తెలుపుట లోకప్రసిద్ధము. బలవత్తర భక్తిభావము కతన తపస్వి ఈశ్వరసామ్రాజ్యమున ప్రవేశించునని హైందవ క్రైస్తవమత శాస్త్రములు వాకొనుచున్నవి. భక్తుని హృదయమున ఈశ్వరసామ్రాజ్యము నెలకొన నువ్విళ్లూరుననియు, జగదీశు డుపాసకుని జేరుటకై గ్రుక్కిళ్లు మ్రింగుచుండుననియుగూడ నవి ఘోషించుచున్నవి. దూరస్థాశయము తపసిదృష్టిపథమును రాజపథముజేసికొని, ఆవ్యక్తిని జేరుటకై మిక్కిలి మక్కువపడును. నలువలంకులందును వివిధఫలపుష్పసమన్విత వృక్షములు విలసిల్లినను, పలురీతుల గుఱుగట నసురరమణులు పలుకరించు చున్నను జానకి శ్రీరామచరణములనే అంతర్దృష్టియం దవలోకించు చుండెడిది కాదా ? బహిరంగనయన మంతరంగనేత్రమునకు బాసటయై యుండును సుడీ ! అంతరంగికచక్షువుతో సీత పతిచరణసరోజముల నాలోకించునవసరమున పరిసరదృశ్యముల నవ్వలికన్నులు విలోకింప లేదు; రక్కసిపడుచుల నుడువు లామె వీనుల బడలేదు. ఆమె ధ్యాన పథమున నాత్మారాముడు వెలసెను. ఆపథమున శోకముండజాలదు. చదువరులారా ! జానకి "అశోకవనమున" వసించెనని ఏల జదువుచుందుమో గ్రహించితిరా ? జనకాత్మజనుజేర రాము డాతురపడె ననిన, తపస్వి మ్రోల సాక్షాత్కరింప జగదీశుడు మక్కువపడునని యెఱుంగుదుము కదా ! ధ్యానశక్తికి సంకల్పశక్తి సైదోడే ! ఇది దొడ్డదైనపు డుద్దేశ సిద్ధి కరస్థలామలకమే యగును.

మనుష్యసంకల్ప మీశ్వరసంకల్పమును కాదని విజృంభింపనేరదు. ఇట్టివిజృంభణము పూర్వోక్తధ్యానసూత్రమును ఫుటుక్కున త్రెంపును; అత్తఱి ఈశ్వరసంపర్కము కడముట్టును; మనుజు డొంటరి యగును

వాతావరణస్పర్శ నెఱుగని పక్షియుగ్మమువలె వాని పదద్వయము నిరర్థకమగును. వీరునియుద్దేశమునకు ప్రసూనదాన మొసగున దీశ్వరోద్దేశమే కదా! సవ్యసాచియై, ధర్మక్షేత్రమైన తనకర్మక్షేత్రమున సారథియాజ్ఞ దలదాలిచి, విల్లెక్కుబెట్టుటే వీరునికర్తవ్యము. నీతిశాస్త్రమున నుల్లేఖింపబడిన స్వతంత్రసంకల్పము (vide Chapter on "Free Will" in any book of Ethics) దొడ్డదియేయయ్యు, ఈశ్వరసంకల్పమున కిది విరోధియై నెగ్గజాలదు. నరుని నడపునది నారాయణోద్దేశమే! "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అనువాక్కు ప్రతికురుక్షేత్రమందును ప్రతిధ్వనించుచునేయున్నది కదా!



# నా మహారాష్ట్రయాత్ర

## పంద్రెండవప్రకరణము

వాడిమైన నాగలితో ధరిత్రీగర్భమును చీల్చినగాని, అందలి సారము సార్థకముకాక మట్టికడుపులోనే కైదీమై మటుమాయమగు. మాడ్కి అంతరంగమును చీల్చు హాలమువలనగాని అందలిసారము బైటపడక లోపలనే కుమిలికుమిలి చచ్చును. జిజ్ఞాసాసహితమైన వేద నయే ఈ హాల మందును. ఇదెంత యధికమైయుండునో, ఆత్మ కావించు తపసును, తపఃఫలమైన ప్రతిభావృద్ధియును, ప్రజ్ఞాప్రకాశమును అంత యధికమైయుండును. వీనికితోడు అదృష్ట ముండవలెను. కష్టైదుట కను పట్టక, మఱుగువనుండి ప్రసన్నభావమును ప్రసాదించు ఈశ్వరశక్తియే అదృష్టమని వచింతును. ఈరీతి సదుపాయముల నందినవారిసంఖ్య అల్ప సంఖ్యాకులైన ప్రతిభావంతులలోనే మిగుల స్వల్పమైనది. వ్యాసవా ల్మీకి, హోమరుడాంటే, కాళిదాసుషేక్స్పియరుల బోలుకవులును, రామకృష్ణులపగిది గురుగుణసంశోభితులును, మహాపురుషులును ఇట్టి వారు. వీరి సంయమగుణమెట్టిదో, వీరితప స్సెట్టిదో, వీరి భావంపుఫల సాయ మెట్టిదో (దీని నందినవగుడు) సకలలోకములును, సర్వకాలము లును ఎఱుగును గదా!

"కోరికను పరిత్యజింపుము. లేనిచో దుఃఖపడెదవు" అని బుద్ధు డనినాడు. ఐహికసుఖమునకును, స్వార్థవృద్ధికిని సంబంధించిన కోరికపట్లనే శాక్యమునిపల్కులు చెల్లును. మహద్గుణములవృద్ధికై, ఉత్తమాశయ సిద్ధికై ఆత్మ పడు వేదన పవిత్రమై, ఆధ్యాత్మికమైన కోరికకైయే! ఇది బలయుతమైనది కావున దీనిబాధ అధికమై యుండును. గర్హింపదగినది గాక అపేక్షణీయమైన ఈ బాధ కాలక్రమమున మనుష్యత్వమును దేవత్వము గావించి వదలును. ఆతనిచే 'సోహమ్' అనిపించును. దీని నెఱుగని మర్త్యుడు మృగమే యగును.

వయస్సువలననేమి, విజ్ఞానమువలననేమి, వివిధానుభవములకతన నేమి, మనసు గంభీరిమ నందును. ఉత్తమాదర్శములకై అపుడును అది యార్తనాద మొనరించును; కాని అది బాలకుని ఆక్రందనమువలె బాహ్యజగతియందు శ్రుతిగోచరము కాదు. జేగంటవలె నంతరంగ గర్భాలయమున నది ప్రతిధ్వనించును! ఆత్మ కావించు ఈ యాంతరంగికాక్రందనమునే వేదనయని పైని పేర్కొంటిని. తపసనుదు, దీక్షయనుదు, ఉపాసనమనుదు ఇందుండియే జనించును.

ఈ వేదనకును, తపసునకును గల సంబంధము మిగుల చిత్రమైనది. ఈ యాతననుండి,—తీఱికగొననీయని ఈ యాంతరంగిక ప్రోత్సాహమునుండి మానసము తపసున జొచ్చినంతన, అగ్నికుండమునుండి జారి పన్నీటిసరస్సున పడినవానివలె నెంతో పరితోషమును (ప్రసవ వేదన బడిపడి, పండువంటి బిడ్డను గని మఱిమఱి మురియు కన్నతల్లిని దలపించుచు) పడయును. ఈ పన్నీటికొలకున గ్రుంకులిడ గాంక్షించునాత డాయగ్నికుండమున దొలుత నిలిచితీఱవలెను. కఠోరమైన ఆంతరంగికపరీక్షను పీఠికగాగల మనుష్యచరిత్రయే ఆనందప్రదీప్తమై యుండజాలును. అనలకీలలను సోపానముల గావించుకొనినప్రాణియే దివ్యపుష్పకము నధిష్ఠింపజాలెను గదా! ఆత్మారాముని సహధర్మచారిణియై, ఆనందమున నోలలాడెను గదా!

తపసున జొచ్చుటన, ఆంతరంగికముగ పరితోషమును పన్నీట గ్రుంకులిడుటయన ధ్యానమున మగ్నమైయుండుటే!

పుష్పహృదయమున పొంగిపొరలు మరందమట్లు, గగనహృదినుప్పొంగు నీలిమమువలె ధ్యానమున భావోద్వేగము తొలుకాడును. సద్బ్రాహ్మణుని పుడిసిటగల ఆపోశనోదకము చందమున, అగస్త్యుని గుండెలోని జడధివలె, నిలింపుల జవరాండ్రు జలకమాడు నాకకాసారముకైవడి, చతుర్ముఖుని గనిన కరుణాపూరితనళినగర్భముభంగి, మరాళమును నిజాంతరంగమున నిడికొనిన మానససరోవరము పోలుపున ధ్యానము దివ్యప్రభావముతో దొల్కాడును. ఇందు మునుగుట సచ్చిదానందములందు గ్రుంకులిడుటే!

ప్రసంగముసలుపుటన ధ్యానమున గండివేయుట. నిండుగుండెలో గండిపడినపుడు భావస్రోతము పిల్లకాల్వలై నలుదిక్కుల జెల్లాచెదరగును. ఈ పరుగున మధురాలాపన ముదయింపదు. గుండెలో చేయిబెట్టి కలచివేయక, భావమునకు స్వాతంత్ర్య మొసగితిమేని, తుషార హ్రదమునుండి మంజులగీతిక నాలపించుచు జాలువాఱుసురాపగపగిది మధురనిస్స్వనమున విశ్వసందేశ మొసగుచు నది వెలారును. నవసమాగమ ప్రణయపరిష్వంగమున (పరమాత్మ జీవాత్మలట్లు) చొక్కియున్న పుణ్యదంపతులను వేఱొనరించు కెట్టిచెట్టయో, ధ్యాననిరతుని ధ్యానమునుండియు, యోగనిమగ్నుని యోగనిద్రనుండియు దొలగించుటయు నట్టిచెట్టయే! అనుభవసమయమున, ఆనందముగ్రోలు తఱి నిశ్చలత్వనిస్తబ్ధత లుండవలెనుగాని శబ్దము కాదు. గభీరతను ముసలము దెచ్చునది వాచాలత్వమే! కావున యోచనాపరులు మితభాషులై యుందురు. నలువలకులందు గగనమును చుంబించుచు హిమగిరులు నిలిచియుండ, నడుమ నిభృతజీవితము గడపుకొలను తనలో తెట్టిదోయని భావించుచు, బహుళాంశములను మననము చేసికొనుచు, యోగనిద్రలోని మునిమానసమట్లు అనంతశాంతియందు మునిగి, సుందరమైన నిజాత్మను ఈశ్వరహృదయమునకు లగించి, ఆత్మవిస్మృతి నందియుండ, గులకరాయియొండు దానిగర్భమునబడిన నదెంత నెగులు నందదు? తన యానందపేటికలో రంధ్రము తలసూపెనని సంతపింపదా? సుషుప్తిమగ్నమై యున్న యెడందయం దీటెపోటు చొరబడినపుడు లోనిప్రాణ మెంతకొట్టుకొనదు? ప్రభాతసమయములందును, శారదరాత్రులందును, సంధ్యాకాలములందును నొయ్యారిభామవలె తోచు ప్రకృతి నవలోకించి, చూడ్కులందు వింతకాంతులను, మనసునందు తళుక్కుతలపులను మనము నింపుకొనుతఱి, వెన్నెముకపై దుర్విధిబలముగ గ్రుద్దినచో నెంతఘోరము ఘటిల్లదు? అంతరంగమందలి శాంతినిదురంతమైన అత్యాచార మెదుర్కొనదా? సౌందర్యసంగ్రహణమునకును, వికృతనినదమునకును, ఏకాగ్రదృష్టికిని అల్లకల్లోలమునకును ఘోరవైరమనుట స్పష్టాంశము. తన్మయానుభూతికి ప్రతికూలచింతన భంగపాటు దెచ్చితీఱును. వారచూపులు పెడతెన్నులై ధ్యానహ్రదమందలి ఆనందపూరమును ఇందందు పాఱించి దుర్వ్యయ మొనరించును.

మహత్తరాశయములను మానసికదృష్టియందిడికొనియే, వానిని పడయనెంచియే, వానికై పరితాపమంది, ఆంతరంగికవేదన బొగిలి, తపించి, తదేకదృష్టితో ధ్యానించి, తన్మయభావమున మునిగి, శక్తిగని ధన్యులమగుచుందుము. మానవజీవితముపై దివ్యముకుటమును నిలుపు నీయాశయములం దెట్టిశక్తి విరాజిల్లుచున్నదో!

ఎదుటివ్యక్తి యెడలగాని, ప్రత్యక్షమైన ఎద్దాని యెడలగాని యొకడు భక్తిశ్రద్ధలను, ప్రేమభావమును చూపుటకు హేతువు హృదయము నాకర్షించుమహత్త్వమందుండుటచేతనే! మొద్దు నెవ్వడైన "అర్ధాంగి!" యని కవుంగిలించుకొనునా? "దేవదేవా!" యని కట్టెలగుట్ట కెవ్వండేని ప్రణమిల్లునా? చీకటిని చూచి "జన్మము సార్థకమైన" దని గంతులు వేయునా? "ఆహా! ఎట్టిదృశ్య!" మని పెంటప్రోగునకు దీపారాధన మొనరించునా?

ఉత్తమాశయములు ఎందుండియో వ్రేలాడు కొయ్యముక్కలు కావు. కొయ్యపై విడిది నేర్పఱచుకొనునది మృత్యువు. ఆకులందలి పచ్చందనమందును, పూవులందలి చక్కందనమందును తోచు ఈశ్వరశక్తికే మానవలోకము చేతులు మొగుచును. ఉన్నతాదర్శములం దెట్టి దివ్యశక్తి కలదు. వీనిమహత్త్వమెట్టిదో, సుందరసృష్టిదృశ్యములను విలోకించినపుడు కొంత తెల్లమగును. ఈ దృశ్యము లివి ధరించు శరీరములు. వీని ముఖకాంతి నవలోకించితిమేని, వీని యంతరంగములందు తేజరిల్లు భాస్వదాశయజ్యోతిస్సుల యెట్టిదో గ్రహింతుము. వ్రజయువతీయుతుడై బృందావన సౌందర్యమున రాసక్రీడల దేలు మురళీధరుని చందమున తారకాంగనాసహితుడై గగనకుంజమున సయ్యాటలాడు చందురునందును, స్వయంవరాంగణమందలి సౌందర్యతిలక పొలుపున రమ్యోద్యానమున రాజిలు గులాబియందును, కవికుమారుని యెడందలోని భావమౌక్తికమట్లు శిశిరకణమందు శోభిలు ప్రభాతకిరణశాబకమందును, అర్ధాంగిహృదయమునలె కాంతిలు రాగరంజిత సంధ్యాకాశమందును మినుకులీనునవి దివ్యశక్తి సమన్వితములైన ఆశయములే! వీని నీశ్వరభావములని వచించితిమేని, ప్రకృతి దృశ్యము లీశ్వరవాక్కులని మానవులు గ్రహింపకపోరు. జీవ మెందున్నదో, చలనమెందుకలదో, కాంతి ఎందు వెలయునో, సౌందర్య

సౌరభమాధుర్యము లెందువిలసిల్లునో, సచ్చరిత్ర ఎందు వఱలునో, ఈశ్వరలిఖితాక్షరములు,—క్షరముగాని సదాశయమును మణిమరీచుల ప్రసరింపుచు నందేపరగును.

ఇవి తమ యందచందములతో సంతసపడి అంతరింపవు. ఈశ్వరుడు మృత్యుంజయుడు కదా! ఈశ్వరహృదయ సముద్భవభావములు మిత్తిగొంగలనుట నిస్సంశయముకాదా? అనంతకాల మివి కాంతిలుట అనంతప్రాణుల యాత్మలను తనుపుటకే! వీనిని గాంచిన కన్నులు, వీనిని గ్రహించిన మనసులు, వీనిని ధ్యానించిన ఆత్మలు, వీనికై తపించిన హృదయములు శ్రీకృష్ణసంయోగమున దనియు గోపికలవలె పరమపరితోషమందును.

మహత్తరాశయములకు త్రోసిరాజను మానవులు కొందఱుండుట నిక్కమే! అన్యచింతలు పలుగుపులుగులవలె వీరి చిత్తములపై వ్రాలుటచే ఉన్నతాదర్శములదెస వీరు చూడ్కుల బుత్తెంపరు. కాని యీ చింతలు వీరి చిత్తములను చిరకులాయముల గావించుకొన నేరవు. మానవహృదయము చిలుచితుకులతో గాక దివ్యసామగ్రితో తయారైనది! రంగారు బంగారుపై మలినముచేరినను, అది దానిని తిని వేయజాలదు. ఎట్టికలుషమైనను మనుష్యహృదయమును కబళింపలేదు. నేడు కాకున్న రేపైన నీరదనిర్ముక్తవియత్తలమువలె నది నిర్మలము కాగలదు. పండువెన్నెలను పాయసమట్లు జుఱ్ఱి, నభోమానిని ముదమందు లీల సదాశయాలోకమును గ్రోలి మానవహృదయము మఱిమఱి మురియును.

విశాలవారాశిలో నొక్క కెరటము చలించినంతన, తక్కిన యలలన్నియు జలించులాగున విశ్వమందలి ఒకదొడ్డ హృదయము సదాశ కతన కదలిక నందినంతన నసంఖ్యాకములైనయెడందలు కదలితీరును. కడలియం దెన్నో కరళ్లుండును; వీని యన్నింటికి కన్నతల్లి కడలియే కావున సమీరస్పర్శచే నొక్క వీచికలేచినతోడనే సింధుకుటుంబ మందలి తరంగసంతానమంతయు తలయెత్తును. ఎట్టి 'పేగుసంబంధమో!' ఎట్టివియ్యమో! ఎట్టితియ్యమో! బహుళాశయరూపములం దీశ్వరశక్తి సమస్తసృష్టియందు కాంతిలునని తెలిపియుంటినికదా! సృష్టిలోని ప్రాణులన్నిటికి నీశక్తి కన్నతల్లి. మాతృప్రేమ ఒకేడింభకుని హృదయమును

పోకియుండదు. అనురాగస్పర్శ, సద్భావస్పర్శ, సదాశయస్పర్శ సృష్టిస్థిత ప్రాణుల నన్నిటిని జలింపజేసి యలరించును.

సౌరభాస్వాదనమందును, సౌందర్యానుభవమందును, రసానుభూతియందును, మధురగుణరుననమందును ఆనందమందని హృదయమేది ?

అనంతవిశ్వమున తేజరిల్లు భాస్వదాశయము లన్నియు నొక్క జనయిత్రియందు వెలయును. ఈమె హృదయము నీలాకాశమువలె నిర్మలమైనది. ఈమెమానసము రత్నాకరముకరణి గుణమణిపూరితమై, గభీరమైనది. ఈమెకన్నులందు సూర్యచంద్రులు తేజరిల్లుచుందురు. ఈమెనుడువులు జలజలరాలునుడురాశి కెనగ్గొయుండును. ఈమెభావములు సౌందర్యసందీప్తములు. ఈమె ఇలువేలుపు సత్యము. "శివమ్మగు ధర్మపథమ్ము" నందే ఈమె మసలుచుండును. సచ్చిదానందము లీమెడెందమున త్రివేణీక్షేత్రములు సృష్టించును. భూమీజనులను తనుపుటకై మేఘుడు తనగుండెను చీల్చుకొని, శీతలవారిధారలై చాలువాఱు నిజాసుల నర్పించులీల, ఆర్తుల ననేకుల దనుప నమ్మ తన యుసుఱులను ధారవోయును. అరుణాలోకమున చివాలున లంఘించు పిట్టవలె, తామరలందు తటాలునప్రాలు అంచవలె కన్నబిడ్డకై తల్లడిల్లు తల్లి అగ్నికుండమున నటాత్తుగ లంఘించును.

ఈప్రాణి ఎట్టిదని వర్ణింపగలము? అమ్మచరిత్రను వర్ణించుట కెరికి శక్యము? కవులును, భక్తులును ఈమెను వేర్వేఱుతెఱగుల బ్రస్తుతించిరి. "పెరుగును, వంటకంబు, వడపిందియలం గొనితెచ్చిపెట్టు దుర్భర కరుణాధురీణ యగు ప్రాణము ప్రాణము" అని తల్లి నుద్దేశించి శ్రీనాథుడనినాడు. పాశ్చాత్యమహాకవులును, ప్రాచీప్రతీచీ సాహిత్యపంథల జరించిన ఆధునిక భారతకవులుకొందఱును మాతను బహుభంగుల ప్రస్తుతించిరి.*

---

*"Thy constant flow of love, that knew no fall,
Ne'er roughen'd by those cataracts and breaks,
That humour interposed too often makes;"

ప్రపంచసారస్వతమును పరికించితి మేని, తల్లినిగుఱించిన సంస్తుతి ఎంతేని గోచరించును. కవులును, తాత్వికులును ప్రకృతిని జనయిత్రి యందురు. యాత్రికులు గంగను "అమ్మా!" యందురు. గోదావరినిగూడ నట్లె పిలుతురు. దేశభక్తులు స్వదేశమును "జనని" యందురు. రామకృష్ణాదులు భగవతిని "మాతా!" యని సంబోధించువారు. "దుర్గమాయమ్మ యిచ్చుత మహత్వకవిత్వపటుత్వ సంపదల్" అని పోతరాజనినాడు. తల్లిచరిత్ర ఎంతటెందఱు మహనీయులకు మేలుబంతియైనదో!

కాని, మాటలవలన మాతృదేవీమహత్త్వమును సంపూర్ణముగ నెవ్వరైన వ్యక్తీకరింపజాలుదురని తలపజెల్లదు. సృష్టిలోని జ్యోతులన్నియు, సుందరదృశ్యములన్నియు నొక్కమాఱు పురోభాగమున నిలిచి, తమప్రభావమును మనసొమ్ము గావించినపు డేమియనగలము? పిడికిలికంటె పెద్దదికాని గుండెయందు భావమహోదధు లుప్పొంగ, నెట్టి కథనమునకైన నది కడంగగలదా?

దేనినిగాని ఇచ్చుటకంటె గైకొనుట సులభమని పలువురు తలంతురు. ఇది సరికాదని నాతలంపు. మనుష్యహృదయగ్రథన మెట్టిదో కాని అందొక ప్రేమబిందువు రాలినంతన ననురాగసింధు వుప్పొంగును.

---

అని కొఱుకవి పలికినాడు. "కేరియోలేనస్" ("*Cariolanus*)" లో షేక్స్పియరుకు, "చంద్రగుప్త"లో ద్విజేంద్రుడును కడుకౌశలమున మాతృప్రణయమును చిత్రించిరి.

"On woman it is not only the lover, but the mother also, than is awakened by love" (Vide page 188 "*Annette and Sylvie*" by Romain Rolland.) అని నేటి సుప్రసిద్ధ ఫ్రెంచిగ్రంథకర్త తెలిపినాడు. చిన్ననాటి తల్లిముద్దులను వర్డ్సువర్తుకవీంద్రుడు తలపోసెను. ("Sallies of mother's kisses" Vide Wordsworth's Ode on "*Intimations of immortality from recollections of early childhood*") "The spirit of sacrifice in the parents is the touch of the Infinite" అని కొలదిరోజులక్రిందటనున్న కవీంద్రుడు రవీంద్రు డనినాడు. (Vide Dr. Tagore's Presidential Address delivered at the Parliament of Religions' Calcutta 2-3-37.)

ఒక్కసద్భావ మందు విత్తనమై పడినంతన నిలింపుల నందకేని తనుప జాలు మేలిపంట దానిలో నుదయించును. లలితహృదయ ములం దిట్టిచోద్యములు మెండుగా నుండును. ఏ మహాపురుషుడో, ఏ సుందరదృశ్యమో, ఏమహత్తరసంఘటనమో మనసున నొక మహిత భావమును రాల్చినంతన మృదుహృదయుడు—ఈతనినే కవియం దుము—నిజాంతరంగమున బహుళభావములను గని తన పాటలందును, తన ఆటలందును, మధురంపుమాటలందును హృద్యమైన గద్యపద్యము లందును వానిని వెడలించును. ఈతనికడుపు చేపువచ్చిన ఆవుపాదుగు వంటిది. క్షీరము వెడలకున్న "అంబా!" యని గగ్గోలుపడక ధేను వూరక కొనగలదా? పద్యములు వ్రాసినను వ్రాయకున్నను, గ్రంథములు లిఖించినను లిఖింపకున్నను, గంభీరభావప్రకటనమునకై పోగులువా రందఱును కవులే యని వచింతును. పాఠకలోకము వత్సమై, తమ్ముజేరి నపుడు వీరి యానందమునకు మేరయుండదు. సౌందర్యపిపాసువైన కవి "భిక్షాం దేహి!" అని తనహృదయమును ప్రకృతిమాతమోల్ల నిలిపి, సౌందర్యదానమంది, భావనావేశముకతన దన్నుదాను మఱచి, లోనుబికిన సౌందర్యపూరమును వేయివిధముల వ్యక్తీకరించును. కన్నతల్లికిని, ప్రకృతి మాతకును ఎంతోపోలిక కలదనిగదా వచించితిని. కన్నతల్లి కదలిరాగల, ప్రసంగింపగల, ఊడిగముచేయగల, ప్రత్యక్షభావమున ననుకంప జూపగల, వెతకివెతకి అనురాగము ప్రసాదింపగలదేవి. ఒక్క ప్రేమ బిందువునుగాదు, ఒక్కసద్భావమునుగాదు ప్రేమార్ణవమును, భావ బ్రహ్మాండము నీమె మన యెడందలందు వర్షించును. ఇవి మన యంత రంగములందు పెక్కుమడుంగు లగు నను నంశమును మఱువకుడుజుడీ! ఇవి హృదయమున కుమిలికుమిలి ఎంతకాలముండును? ప్రేమకణము నందినగుండె భక్తి-సింధువు నొసగ నువ్విళ్లూరును. వాణిజ్యవీథి యందు వినబడు "వినిమయము" (Exchange, Barter, or Interchange) ప్రేమసామ్రాజ్యమున శ్రుతిగోచరము కాదు. ఒక రేమో ఇచ్చిరని మరల దానినో మఱొకదానినో విధిలేకనో, తప్పని సరిగనో ఇచ్చుట కాదు. అర్థితుడు కాక అంబుధరుడు జలమిచ్చుచొప్పున, కుముద హర్షంబుగావించు నమృతసూతికై వడి, పద్మాకరమును వికచముగజేయు

ద్యుమణికరణి పరహితాచరణమతియైన మాత ప్రణయదానము చేయు నట్లే, అర్థితుడు కాకనే తనయుడు అమ్మకు భక్తిజూప గాంక్షించును. ఈభక్తి ప్రత్యుపకృతికంటె, కృతజ్ఞతావ్యక్తీకరణముకంటె కోటిమడుం గులు ఘనతరంబైనది. పూజామందిరమున, దేవీసమ్ముఖమున "కృతజ్ఞత" యును, "ప్రత్యుపకృతి" యును భావగంభీరము లనిపించుకొనవు. నిస్వార్థప్రేమనందిన హృదయము వేయివిధముల నాత్మభావప్రకాశము గావించుకొనును. తల్లిపదములు పుడికియో, ఆమెమ్రోల నతజానువయి యంజలిఘటించియో "అమ్మా! అమ్మా!" యని యావేగభరితహృద యుడై ఆమెను సంబోధించియో, బహుభంగుల నామెను కీర్తించియో, పూజాపీఠమున నామె నాసీనజేసి తనివారపూజించియో, ఆమె దివ్య మూర్తిపై దృష్టినిలిపి హృత్పీఠి నామెకు చిరస్థాన మొసగి మధురధ్యాన మున మునింగియో తృప్తిమెయి ఆమెకు సేవసలిపియో, ఆమెచరణ సరోజములపై నిజోత్తమాంగమిడి నిదురించియో, కవికుమారునివలె పలవించియో తనూభవుడు గుండెలోని ఉత్తాలభావతరంగములను గుమ్మరించును.

తా దల్లి కావలెనని దుహితయే తపించియుండ సామాన్యమానవి తపింపదా? తల్లి కానిచో స్త్రీమహత్త్వము సంపూర్ణముగ వ్యక్తము కాదని, స్త్రీజన్మమే సార్థకము కాదని ఈమె తల్లడిల్లునేమో! తనయలకు తల్లియయ్యు, తనయునకుగూడ తల్లి కావలెనని స్త్రీ తపించును. అపుడు కాని తనహృదయము పూర్ణప్రకాశము గలది కాదని ఈమె తలపోయు నేమో!

కొడుకునకై నాతల్లి తల్లడిల్లినదట. నన్ను కని పరమానందభరిత యైనదట! తలనొప్పిపగర్పులచే తఱచుగ బాధపడునదయ్యు, అనవర తము నన్ను తనగుండెమీదనే నిలుపుకొనినదట. అమ్మగుండె దివ్యమంది రమని నాడు గుర్తింపక చిందులుత్రొక్కి అపచారమున కొడిగట్టి యుందును. అమ్మచెప్పిన జాబిలిపాట నా స్మృతిపథమున చిరాంకితమై యున్నది. కాని ఆమె ప్రబోధించిన పాఠము ముగియకమున్నే, తల్లి కడుపులోని చలువను తనివార నేబడయకమున్నే, మాతృదేవీహృద్వీ ణకు చెవియొగ్గి అనంతప్రణయగీతికామాధురిని సంపూర్ణముగ మాన

సాంజలి జేర్చుకొనకమున్నే, తల్లి మాటలోని గభీరసాహితీరత్నాకర మునుగాంచి మనసునకువచ్చినలీల అందు మున్కలేయకమున్నే అమ్మ రొమ్మునుండి దుర్విధి నన్ను గుభాలున క్రిందికి గూలద్రోసి,పిచ్చుకపిల్లను చివాలున నెగదన్నుకొనిపోవు గ్రద్దవలె, నాకన్నతల్లిని నాకన్నులనుండి ఎందో గొంపోయెను! తల్లిపటమును చూచుకొని కొపరుకవి కొంతసాంత్వన మందువాడు. అమ్మచిత్ర మొక్కటైన నాకు లేదు. ఐదేండ్లవఱకు ఆమె మోమును చూడజాలితిని; కావున మాతృదేవీపవిత్రరూపమును హృదయయవనికపై జిత్రించుకొని బాష్పాకులలోచనుడనై, చిత్తము లోని చిత్తరువుకు ప్రణమిల్లుచుందును. నా హృదయమున నామె ధారవోసిన ప్రేమబిందువులు క్రమాభివృద్ధి నందినవి. అంతరంగమందు తొలుకాడు భక్తిభావమును కన్నతల్లిమ్రోల ప్రకాశము గావించుకొన జాలు భాగ్యము నాకు కలుగలేదు. కాని ఆమె సుందరమూర్తి ఆత్మ హృత్సింహాసనమున విరాజిల్లుచునేయున్నది. బాలకుడనై, ఒంటరినై, దూరసీమలందు చరించుతఱి ఆమెకై ఆర్తనాదము *సలిపితిని. పదంపడియైనను ఈ యాక్రందనము గుండెనుండి యంతర్హితముగాక అందు గట్టుపడి జిజ్ఞాసయైనది. అమ్మకై పొగులునపుడే ఉత్తమాశయములకై అంతరంగమున పొగులజొచ్చితిని. అవిచలితచిత్తుడనై, అమ్మనుధ్యానించి

---

* బాల్యమున తెలుగు నేలనుండి కదలి ఆర్యావర్తమున మసలి, అనంతరము ఆక్కరైన పైకము సంపాదించుకొనుచు కలకత్తాలో నే జదువుకొంటిని. కాని ఆనగరములో పూర్ణ పరిచయము కలుగునంతదనుక దుష్టకష్టపరంపరలకు కాలిబంతినై పోతిని. తొలుత కొన్నిదినములు ఈడెన్ గార్డెన్ (Eden Garden) లో నుంటిని. ఎందైన పార్టు హేండ్ టైపిస్టు పని (దినమంతలో గాని కొంతసమయమున గాని— Whole-time or part-time—చేయుటకు) దొరకునేమో యని మధ్యాహ్నము లందు ఉన్నతవాణిజ్యసాస్థలకు (Firms) పోవువాడను. తక్కుంగల వేళలందును, మనసు పూర్తిగ దుఃఖానలమున దగ్ధమగుదినములందును తోటలోనే పడియుండువాడను. అది వర్షకాలము. తోటలోని ఒక చెట్టుక్రింద నుండువాడను. లోనివేడిమి చల్లారు నని ఆశపడితిని. అప్పటికి సుమారు పదునేనులక్షల జనసంఖ్యగలిగి, మహాసౌధముల మహానగరమని పేరందిన కలకత్తాలో అత్తఱి నన్ను పలుకరించువారుగాని, నాకు నీడనిచ్చువారుగాని లేరైరి. మహానగరమున నేకాంతజీవినై యుంటిని. దుస్సహమైన నాదుస్థితిని నవలోకించి కాబోలు వెనుకవైపున గంగాభవాని హోరని విలపించినది. పెలికిలబడుండి,

నపుడే ఉన్నతాదర్శములను ధ్యానింప దొడగితిని. హృదయమున నేను దురంతమైన యాతనకు గురియైనముహూర్తము లెన్నోయున్నవి. ఏకాగ్రచిత్తుడనై కౌపరుకవి తెలిపిన దివ్యధ్యానమున (Elysian Reverie) లోని పరమానందమునందిన ముహూర్తములును ఉన్నవి. సుందరదృశ్యములను విలోకించినపుడును, మహత్తరక్రియలు కనుల బడినపుడును, భావ్యదాశయములు హృదయాకాశమున తళ్కొత్తి నపుడును, పుణ్యతీర్థములను సేవించినపుడును, తిథిదినములు ప్రత్యక్షమైనపుడును స్మృతిపీఠమున నాజనయిత్రి ద్విగుణీకృతసౌందర్యమున దేజరిల్లును. ఈమెను తలచి ఈమె పవిత్రాత్మకు భక్తికుసుమాంజలి నర్పించినపుడు, నాహృదయము శాంతినికేతనమై, ఆనందధామమై తనరును. అదృశ్యమై అమ్మపుత్తెంచు ఆశీర్వాదము దేవదేవుని మూపున నిడికొనిన ఖగపతివలె వైకుంఠమునుండి అవతరించి నా హృదయమందిరమును జేరుకొనును. దానితో నిలింపులుపోలు తలంపులు అంతరిక్షమునుండి పరుగెత్తుచువచ్చి, అందు విడిది నేర్పఱచుకొనును. చిత్తమత్తఱి దివ్యాలోకప్రదీప్తమగును. మాతృదేవినుండి మాటలకందని ఇట్టి మానసికవిభవమునందు నవకాశమిచ్చు మంగళమయవార్షికోత్సవమే ఆర్ధికమని నాయభిప్రాయము.

---

చెట్టుకొమ్మలనుండి మేఘావృతమైన అంతరిక్షమును చూచువాడను. ఆదిక్కునజరి, దివిగల అమ్మను చేరుకొనవలెనని నాప్రాణము లాతురపడినవి. ఆకులనుండి వానచినుకులు నాపై రాలునవి. అది స్వర్గోద్యానము (Eden Garden) కదా! అమ్మ స్వర్గమందేకదా వసించుచున్నది! నా కన్నతల్లి నాటి నాదుస్థితి గాంచి అదృశ్యయై ఆకుమూలలనుండి నాకై కన్నీ రోద్చుచున్నదని యూహించితిని. వృక్షమందు అమ్మను విలోకించితిని నా కన్నతండ్రి నీటిబుగ్గవంటి తనగుండెను నా కిచ్చిపోయెను. వెలుపలివర్షముతో సహాకరించుటకై లోనుండి దుఃఖపూరము పొంగిపొరలినది. సంవరణశక్తిని గోలుపోయి, ఏ దిక్కు లేని బాలుడనై "అమ్మా!" అని పెద్దపెట్టున నేడ్చితిని. మూడునాళ్లట్లే పొగిలితిని. పదంపడి జీడిగుంట వెంకటసూర్యనారాయణ రావును తెలుగునై దోడుకన్నుల బడితిని. ఈతనిస్వస్థలము శ్రీకాకుళము. కలకత్తాలో చౌరంగీపథమున డబ్ల్యుం. లెస్లీ కంపెనీ (W. Leslie & Co, Chouranghee) లో పార్టు హేండ్ టైపిస్టుగా నుండువాడు. కుటుంబముతో కిదరుపురములో నుండువాడు. నాకమును హృదయము గావించు

స్నానానంతరము భోక్తలగూడి కుశావర్తమునుండి ద్రైమార్కు రాజు నామాంతరముగల లంబోదరభట్టు సౌధమునకు మరలితిని. విధ్యుక్తముగ తల్లితద్దినమును నెఱపితిని. తోడ్తోడనే మహాక్షేత్రములందు నెఱపవలయు తీర్థవిధినిగూడ నిర్వహించితిని. పితృదేవతల నుద్దేశించి కుశావర్త క్షేత్రమున బిండములు వీడితిని. "అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచప్రభురేవచ" అని జగదీశుడే (గీతయందు) వచించుటచే నేడు నేనుజరపిన విధ్యుక్తకర్తవ్య మీశ్వరునకు ప్రీతికరమగునని విశ్వసించితిని.

ఈ పితృదేవతలలో ముఖ్యులు నా తండ్రిగారేకదా! అమ్మ దివంగతయైన అనంతరము అమ్మయు అయ్యయు దామెగ్గైరి. ఆధునికులదృష్టిలో మిన్నగ్రెయున్న ఆంగ్లవిద్యను వీరెఱుగరు. ఆంగ్లాక్షరములు మా యూరి పొలిమేరలో జొరబడజాలకపోయెను. కావున వీనిని పరికించు నవకాశము వీరికి కలుగనేలేదు. సంస్కృతాంధ్రములనైన వీ రంతగా పరిశీలించిరని తెలుపజెల్లదు. మాతాతగారు గొప్ప భూస్వాములు; లక్ష్మీప్రసన్నులకు సరస్వతీసేవ అక్కరకుమాలినదనియో,అనుచితమైనదనియో వారు యోచించియుందురు. గ్రామమున లౌకికజీవితనిర్వహణమునకు వలసినచదువే తమవంశీయులకు చాలునని తలపోసియుందురు.

గ్రంథపఠనమే విద్యార్జనమని తలపజెల్లదు. విద్యాదర్శసిద్ధికి అక్కరైన నిమిత్తములలో గ్రంథపఠన మొక్కటియయ్యు, అది ప్రధానమైనదని యూహింపరాదు. మహామేధావులును, ప్రతిభావంతులును ప్రకృతిపుస్తకమునే పఠించిరి; చెదపుర్వులై గ్రంథములను మ్రింగక, విహంగములై విశ్వదృశ్యములను కన్నుల జొనుపుకొని, మిగులనలరి, భావవిభూతి నందిరి. హృదయపరిశీలనమువలన సహజప్రజ్ఞను కన్గొని,

కొనిపోయెను. తోటనుండి నన్ను తనయింటికి గొనిపోయినాడు; అతనితల్లి అత్తటి నన్నెంతో ఆదరించినది. తల్లిప్రాణము! ఒకపూట ఈ సెచ్చెలియింట నుంటిని. మహానగరమున నరులెవరును నన్ను లక్ష్యింపనితఱి, వారికంటె మిన్నయై (మెత్తని చిత్తముగలది కావున) నాకై అశ్రుధారలఁబోసిన వృద్ధమాత సేనుగలించిన యనంతరముకూడ పెక్కేడులు మని యుండును. ఈతల్లిని,—నాటి నాదిక్కును చూచినపుడు నా హృదయమున భక్తిభావము వెల్లివిరియును. నాకు మిగులఁగూర్చు కలకత్తాకు పోవువేళలందు తప్పక నా చెట్టు తల్లినిచూచి, కొంతసేపు చెంతగూర్చుని, అప్పటిదినముల యనుభూతిని ఆత్మగతమున దలపోయుచు మున్నీరగు కన్నీట మునుంగుచుందును.

నైసర్గికమానసికవిభవమును గుర్తించి, ఆత్మవిశ్వాసమును బలపఱుచు కొని, ఈశ్వరారాధనమున జిజ్ఞాసను తనిపి, * మహిమోపేతమైన స్వతంత్రసృష్టిగావించి, బహుభువనములకు భావభిక్షబెట్టి, ప్రభాకలిత జీవులయిరి. ప్రకృతియూరువున జనించుటచే నా కన్నతండ్రి, గోరుముద్ద లట్లు ప్రకృతిమాతయొసగిన మధురాశయములను మనసార నారగించెను. ఇట్టి మృష్టాన్నమేకదా ఆత్మను దనుపును! పవిత్రసంప్రదాయము నిర్దేశించిన పథమందే వారు నడచిరి. కావున వారి యంతరంగము కరుణా తరంగిణులకు జన్మస్థలమైనది; వారి హృదయము ప్రేమకలశాంబుధి యైనది; వారిమనసు నందనోద్యానమునకు అందచందములు తెలిపినది; వారియాత్మ పరంజ్యోతికి ప్రతిరూపమైనది.

తాము మనియున్న అరువదేండ్లలో నెన్నడును గోదావరీ క్షేత్రమునుండి కదలిపోయి, వారు మఱెందును వసింపలేదు. లంకలను కొలుచునలవాటు గలవారు కావున గోదావరిదీవులను తమ మనికిపట్టుల గావించుకొనినారు. అమ్మ తరువాత అక్కలిద్దరు దివిజేరుటచే, కొంతకాలము నన్ను మఱెందును విడువక పచ్చపట్టులట్టులుండు నీమనికి పట్టులకు కూడ గొంపోవువారు. కావుననే గోదావరీహృదయముపై రంగారియుండుచేలు నా శైశవక్రీడాంగణములైనవి. శాంతిసౌందర్యములు నాబాల్యము నెత్తిముద్దాడిన దాదులగుట నా భాగ్యము. గోదావరీ కల్యాణవేదికలందు పెండ్లికూతురట్లు శోభిలునది స్వర్గమే! ఈ నగుమోముచెల్వ యుచ్చరించిన మంగళాశీస్సు దివ్యకుసుమమట్లు నా శైశవశీర్షమున రాలియుండకుండునా? "స్వర్గము శైశవమున మనకు సన్నిహితమైయుండును" అని మహాకవి వర్డ్స్‌వర్తు † పలికిననుడువు సత్యదూరముకాదని పలుతెఱగుల ఋజువుచేయగలను. "స్మృతిపథమున మరల శైశవానందమున నుఱ్ఱూతలూగితిని"‡ అని కౌపరుకవి చంద్రుడు వాకొనిననుడువు మధురభావ భరితమైనదికదా!

---

* "చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున, ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ" (శ్రీ భగవద్గీత, విజ్ఞానయోగః.)

† "Heaven lies about us in our infancy"

‡ "By Contemplation's help, not sought in vain, I seem to have lived my childhood o'er again"

అవును! అంతరంగవీథినుండి పరుగుపరుగున వెన్కకు తరలి నపుడు దివినుండి బొలదివముపై రాలు తుషారబిందువులవలె నానంద కణములు హృదయమున రాలును! "స్వర్గసంపర్కమునుండి కడచి ఎన్నో యడుగులు వేయలేదు కావున బాల్యమున నింకను దివ్యద్యుతులు తళ్కొత్తుచునేయుండు" నను భావమునుకదా మహాపురుషుడు 'మజ్జినీ, సూచించినాడు! బాల్యమందలి స్వర్గప్రాభవమును కన్గొనికదా "ఈశ్వర సామ్రాజ్యమున ప్రవేశింప నాశించునాతడు శిశువట్లుండవలె" నని ఏసు క్రీస్తు పలికినాడు!

హూణవిద్యకై పట్టణమున ప్రవేశించినంతనే పల్లెవాతావర ణము ప్రసాదించిన ఈ స్వర్గసౌఖ్యమునుండి దూరమైపోతిని. ప్రకృతి సౌందర్యముతోగాక తెచ్చిపెట్టుకొనిన అందముతో వెలయునగరము లందు వాసము మొదలిడినంతన నాకవాసనలకు మఱింత దూరమైతిని. నా తండ్రిగారో! శైశవమును కడపిన సుందరాంగణములందే తమ యావజ్జీవనమును గడపిరి. నాల్గయిదుమాఱులుమాత్రము వీరు రైలెక్కి యుందురు. గోదావరీమండలమున (ఒక్కమాఱుతక్క) ఈదిక్కున నిడదవోలును ఆవైపున అనపర్తిని వారు దాటిపోలేదు. నా పెండ్లికిమాత్రము సింహాచలమువఱకు నరిగిరి. నిత్యకల్యాణమునకు, పచ్చతోరణమునకు పట్టుగొమ్మలైన చేలనుండి కదలుటకు వారి మన సొప్పెడిదికాదు. హాలమును చేబట్టియు, నోరులచేతులకు హాల మొసగియు, భారతభాగ్యమునకై తోడ్పడి, వారు పుణ్యాత్ములైరి. గోదావరీక్రోడతలమున నుదయించి, ఆలోకపావని యూరువందే యస్త మించి ధన్యులైరి. పూతగోదావరీ పులినతలమునుండి కదలిపోక, నే గలమును కాక హాలమునే చేబట్టియుండినచో, నగరమం దల్లాడు నాజీవితమున నేడు దుమ్ము రేగకుండెడిది. కలమునకు ప్రాపించు దౌర్భాగ్యముగాక హాలమునకు లభించు సౌభాగ్యము నేడు నా సొమ్మ య్యెడిది. గోదావరీదీవులందు కనకవసనసుందరియై విలసిల్లు ప్రకృతిమోల నిత్యానందమున నాజీవన మీదులాడు చుండెడిది.

ఈనుడువులు తాత్కాలికమైన నిట్టూర్పుతో వెడలెనని యంగీ కరింతును. ఆర్థికమైన విభూతిపై కలము కన్ను వేయకున్నను, అది ఎండు

బెండువడువున పడియుండవలెనని తలపజెల్లదు. వాణీపాణి యందలి వీణె కది సహపాఠి! సౌందర్యమాధుర్యసృష్టి అందుండి వెడలును. కాని లక్ష్మీప్రసన్నత దానికి చేకుఱకుండుట లోకప్రసిద్ధమైన విషయము. ఆధునికయుగమున కొన్ని దేశములందు కలముపై రమామందిరము నుండి కొన్ని శుభాక్షతలు రాలుచున్నవి. అంగప్రత్యంగములను హంస తూలికలపై జేర్చుకున్నను, కలమాన్నముచే కడుపు నింపకున్నను కొందఱుకవులు నిష్ఠురమైన నిప్పచ్చరంపు పట్టునుండి విడివడిరి. తెలుగు నేలలో కవు లింకను శుభోదయమును గాంచరైరి. అపుడపుడు నిట్టూర్పులు వారికి తప్పకున్నవి.

విశ్వవిద్యాలయములందును, కళాపరిషత్తులందును నాయయ్య ఎట్టి సర్టిఫికేటులను పడయకున్న నేమి? నిర్మలమైన వారిహృదయపత్రమున అనంత విశ్వవిద్యాలయాధ్యక్షుడైన ఈశ్వరుడు స్వర్ణమయాక్షరములతో దివ్యయోగ్యతాపత్రమును (Divine Certificate) లిఖించినాడు. ఉద్యోగములకై, సద్యోగములకై, బానిసదనమునకై, దాస్యమునకై పనికివచ్చు దరఖాస్తు ఇదికాదు. భాస్వచ్చరిత్రచే కనుల పండు వొనరించుకొని గాంఛించు భావోపాసకులమ్రోల నిది సదా శయసందీప్త పత్రమై తోచినది! ఈయాధ్యాత్మికగుణపత్రము కతననే ముక్కోటి యేకాదశినాడు పరంజ్యోతిః ప్రదీప్త వైకుంఠద్వారము లందు నాకన్నతండ్రి కద్భుతస్వాగతము చేకుఱినది.బహువిధగానయంత్రములు చేబూని, దివ్యసంకీర్తన మొనరించుచు, నృత్యము గావించుచు, నిలింపులీ పవిత్రహృదయపత్రమునకు 'జోహా'రనిరి. ఈ మహోత్సవమునుగాంచి, అహిపీఠినుండి శ్రీనాథుడు చివాలున దిగి, ముదమార దానిని చేగొని, పదిలముగ నాత్మహృత్పేటిక నిడికొనెను. చదివిచదివి పసదనములతో యోగ్యతాపత్రికల దస్తరములను పడసి, భారత విశ్వవిద్యాలయములందు తలమిన్న యనిపించుకొనిన విశ్వకళాపరిషత్తు శిఖరమున గగనచుంబియై తేజరిల్లు డిగ్రీలగుత్తి నవలీలగ త్రుంపి నిజ మౌళి దురాయిగావించుకొని, నేడు అభాగ్యులైన భారతయువకులం దగ్రగణ్యుడనైన నేనునాజన్మదాత పొందిన మహోన్నతస్థానమునెట్లందజాలుదును? దానిసౌందర్య మిట్టిదని యూహింపనైన నూహింపగలనా?

తల్లికడుపుగల నాతండ్రి నన్ను ప్రాణాధికముగ ప్రేమించి, కడుగారాబమున బెనిచి, చిఱుతప్రాయమునందే నాచే శారదకు ముడి పెట్టించి, మాయిర్వురను చూచి మఱిమఱి మురిసి, ఈ బొమ్మల పెండిలి నుండి వెడలిన మంగళగీతిక మలయపవనపథమున నల్లన నెగసి, గగన గవాక్షములందు ప్రవేశింపకమున్నే తమయర్ధాంగలక్ష్మిని గలసికొను టకై దివ్యవిమానారూఢులై వెడలిపోయిరి.

ఇహజగతినుండి తరలవలయు ముహూర్తమును మున్నే తాము గ్రహించియే కాబోలు నన్ను ప్రక్కలోనికి జేరదీసికొని, కన్నుల నీరు నించుచు వారు "తండ్రీ! ఇక నీ కేదిక్కును ఉండదు కాబోలు! పక్షివై ప్రపంచమున అల్లాడుదువేమో! దేశదేశములం దెన్ని పాట్లుపడెదవో నాయనా!" అని గద్గదస్వరమున పలికిరి. ఈమాటలు వినినంతన నాగుండె క్రుంగిపోయినది! ప్రాణములు కొట్టుకొనినవి! దుర్విధి తలపై నధిష్ఠింప దొరకొనె నని యూహించితిని. "ఇక నీ బ్రతుకు వేయి యిడుములకు కబళమగు"నని ఎవరో యంతరంగమున నఱచినట్లయినది! కడుపులో కల్లోలము పుట్టినది! నా యారాటమునుగాంచి నాతండ్రి "భయములే" దని యూరడించిరి. వైద్యుడును పలుమారు నాకు ధైర్యముజెప్పి, బడికిపోయి మర్నాడురమ్మని నన్ను నాకన్నతండ్రి చరణసరోజముల నుండి లేవందీసి, రాజమహేంద్రవరమునకు పంపిరి. నేబోయిన నాటి రాత్రియే నాకై తల్లడిల్లుచు, మహాత్ములైన నాయనగారు ప్రాణములు వదలిరట ! మరుచటిదినమున నా బావమఱది నన్ను రా[illegible]గరమున బడిలో కలిసికొని, మరణవార్త దెలుపక నన్ను దోడ్కొనిపోయెను. నాగుండెలో గగ్గోలుపుట్టెను! "అంతయు ముగిసినది" అని విషాదాక్తమైన ఆతనిముఖము తెరువున నాకు తెలిపినది! ఎట్లోపోతిని. నాకు నా అయ్య కానుపించలేదు. ఝురీతీరమున బూడిదతోచినది! ఈ బూడిద నన్ను గన్నతండ్రియా ? శ్మశానవాటికనుండి వేయియీటెలు లొక్కమాఱుగా నెగసివచ్చి నాగుండెలో గ్రుచ్చుకొనినవి! గృహాంగణమునకు బదులు ప్రత్యక్షమగునది శ్మశానభూమియా ? ఇక నన్ను పోషింప నున్నదిబూడిదప్రోగా? నన్ను కని, నన్ను పెంచి, నన్ను కడుపున బెట్టుకొని నాకై దుఃఖించిన నాయయ్యను ఇట్లు బూడిద జేసినవారెవరు?

"ఇదియే నీదిక్కు; దీని నిక చేతులనెత్తి పోయుము" అని నిష్ఠురపరిహాసము పలుపుచు దుర్విధి నన్నా బూడిదప్రోగుమీఁదికి నెట్టినది! ఈతీరున నాచిత్తమునకు చిచ్చు పెట్టుటకంటె నది చివాలున నన్ను గూడ బూడిద జేసి రెండుప్రోవుల నొకేమాఱు ధునీమతల్లికి నంజుకొనపెట్టిన బాగుండెడిది. ఈ దుర్విధికి నాడును నేడును నే జేసిన యపకారమేమో?

మృత్యువు! నిదురించునట్లు పడియుండుటను మృత్యువనిన, మన సెట్లు కుదుటబడును?

"ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః"

అని గీతాచార్యు డనినాడు. ఆత్మ, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, సూక్ష్మస్థూలదేహములు మనుష్యగ్రథనమున వెలయును. ఆత్మ కగ్రస్థానమును శరీరమునకు కనిష్ఠస్థానమును నిర్దిష్టమైనను, మనము చూచునది శరీరమే! అనురాగాదులు చూపు అంతరంగమున కిది నిమిత్తమే! ప్రత్యక్షమగుదు ఇది నిక్కముకాదని ఇది యంతర్ధానమైనపుడుగాని విశ్వసింపము. "అవు" ననిపించునది కనబడునది. కాబోలు ననిపించునది ఊహ! ప్రత్యక్షమైనదానియెడల మనకు నమ్మికయును, మక్కువయును కలిగితీఱును.

పలుకువలనగాని, క్రియవలనగాని ఎట్టిభావవ్యక్తీకరణము గావింపని వస్తువునెడల సయితము సంపర్కము కతన ప్రీతిగలిగియుందుము. మనికిపట్టు వీడిపోవుటకు మనకు మనసొప్పదు. తియ్యమును, నెయ్యమును చేకూర్చు జన్మస్థలమును ("Sweet Auburn") దలచి గోల్డుస్మిత్ కవి అంజలిఘటించినాడు గదా! "నిజదేశము నవలోకించినంతన నెవ్వాని హృదయ ముప్పొంగదు!" అని స్కాట్ మహాశయుడు వాకొనుట పలువు రెఱుగుదురు. జడవస్తువైనను (అందు మనముకాంచు భావముకతన) మనసు నాకర్షించితీఱును. జడముగాని శరీరముదశేంద్రియములకు ప్రాపైనశరీరము, మనసునకు మనికి పట్టయినశరీరము, బుద్ధికి నిధానమైనశరీరము, ఆత్మకు ఆలయమైనశరీరము సర్వతోముఖజీవన నిర్వహణమున నెంతప్రాముఖ్యము గలిగినదో యూహింపుడు.

భావము గంభీరమైనదయ్యు, కొండొకనిమిత్తము నాధారము జేసికొనియే అది హృత్ప్రీతి నాసీనయగును. భావమునకు నిమిత్తము దిక్కు; నిమిత్తమునకు భావముదిక్కు. నిమిత్తములేకున్న భావ మాత్మ వ్యక్తీకరణము నందదు. భావములేకున్న నిమిత్తము సజీవముకాదు.

క్రమములేని వట్టియక్కరముల గుంపులోను, రాళ్లగుట్ట యందును భావముండదు. అక్కరములందు భాసురభావము ప్రవేశించి నంతన నది వచనమగును; రచనమగును. రసభరితస్రవంతియగును. రమ్య సృష్టియగును. రాళ్లప్రోవున మధురప్రణయభావము చొచ్చినతోడన నది తాజమహాలగును; రంగమహాలగును. శిల్పమందును, కళయందును నగుమోము భావము తళ్కొత్తును. దీనిమహిమచే కళయందు మంత్ర శక్తియై వెలయును; కాని శిలాగ్రథనము లేకున్న, నక్షరగ్రథనము లేకున్న, క్రమగతవర్ణనిర్ణయములేకున్న శిల్పమును, లలితకళయును నెందు సాక్షాత్కరించును? శరీరగ్రథనమున కళావైభవము ప్రస్ఫుటించును; సృష్టిశిల్పము ప్రత్యక్షమగును; జీవసంచారము దృగ్గోచరమగును. శరీర మును త్రోసిరాజన జెల్లునా?

నిర్జనప్రదేశమున కనులు మూసికొని సామాన్యులు భావస్పర్శ మెట్టిదో, ప్రణయస్పర్శ మెట్టిదో అనుభవింపజాలరు. ప్రేమించినవ్యక్తిని చూచినపుడును, ఆతనిపలుకులకు వీను లొగ్గినపుడును, ఆతనితో ప్రసం గించినపుడును, ఆతని గవుంగిలించు కొనినపుడును ప్రేమస్పర్శ యెట్టిదో ప్రణయప్రకాశ మెట్టిదో వీరు గ్రహింతురు.

భావమునకు నిమిత్తమైన శరీరము వెన్కనిలిచినను, దేహమునకు ప్రతినిధియైన వేఱొకనిమిత్తమును ముందునిలిపికొని ఒకయింద్రియ కవాటమునుగాకున్న వేఱొక యింద్రియద్వారమును తట్టి, భావ మెదుటి మనసున బ్రవేశించును. ప్రేమించువ్యక్తిని చూచియు, నాలింగన మాచ రించుకొనియు సంతసపడుదుము. మనసులోని మక్కువదీర్చుకొందుము. వ్యక్తిప్రత్యక్షము కానితఱి దానిమాటను టెలిఫోనులోనో, గ్రామఫోనులోనో వినియు, లేఖలం దావ్యక్తిహస్తాక్షరముల నవ

లోకించియు కొంతదనుక తృప్తినందెదము. భావమునకు బలా దూరనినపుడే ఇంద్రియములకు దిగదుడు పనజెల్లును. *ఆత్మ కగ్రస్థాన మిచ్చిన గీతాచార్యుడు ఆత్మవృద్ధికై, ఆత్మోద్దేశసిద్ధికై శరీరమును, ఇంద్రియములును, మనసును, బుద్ధియును సేవసలిపి తమమనుగడ గడపవలెనని యుద్దేశించియుండును. ప్రత్యక్షమగు ప్రధాననిమిత్తము బూడిదప్రోగైనచో, శరీరము బుగ్గియైనచో ప్రత్యక్షానుభవమునే యెఱిగిన సామాన్యుడు, సామాన్యులందలి బాలకుడు సర్వనాశనమైనదని దుఃఖింపడా?

ప్రత్యక్షానుభవావకాశము కడతేఱినపుడు అంతర్ధానమైన వ్యక్తియాత్మతో ప్రార్థనమువలన, ధ్యానము మూలమున, యోగము కతన కలసిమెలసి వర్తించి ఆత్మానంద మందవచ్చును. కాని మనుష్యాత్మ అత్యద్భుతశక్తినందినపుడే యిట్టిపరితోషమందుట సాధ్యమగును. విశేష తపసువలన గాని, దీర్ఘమైన అభ్యాసమువలనగాని మానవుడు యోగీశ్వరుడు కాజాలడు; "భావాంబరవీథి విశ్రుతవిహారి" కాలేడు.

సామాన్యు డనవరతము తాత్త్వికవీథులందు పరిభ్రమణ మొనరింపజాలడు; ప్రత్యక్షప్రపంచమునుండి చని అదృశ్యవసుంధరలందు, ఊహాజగతులందు వాసమేర్పఱచుకొనలేడు. రక్తమాంసములందలి ఉష్ణము చెప్పుచేతలందు నిలువనంతదనుక, దశదిశల నుడాయించు దశేంద్రియములు వెనుదిరుగుట నేర్వనంతవఱకు. ఆత్మారామునిమ్రోల మానసము మారుతి కానంతదనుక, మనుష్యు డాత్మసామ్రాజ్యమున పట్టాభిషిక్తుడు కానంతవఱకు ధ్యానమార్గమున, భావభువనమున ప్రాతకాపై యుండజాలడు.

---

* ఈ సందర్భమున తెలిపిన 'భావము' ప్రత్యక్షప్రమాణ సముద్భవముకాదు. దీనితరువాత పాటింపవలసినది అనుమానమని తార్కికులందురు. అతీంద్రియమును, అనాదియు నైన బ్రహ్మపదార్థమును గ్రహించుటకు ప్రత్యక్షానుమానప్రమాణములు చాలవు. కావున "ఆప్తవాక్యము" లేక "శబ్దప్రమాణ" మక్కరైనది. ఆంగ్లతాత్త్వికులు "ప్రమాణ" మనియు "ఆధ్యాత్మికాంతరంగికశక్తి" యనియు "Authority" "Intuition" (Vide "*Sources of Knowledge*") దెలుపుదురు. వీనియన్నిటి వలన గాని పూర్ణజ్ఞానము లభించదు.

భావభువనమున ప్రాతకాపులై యుండజాలు వారిసంఖ్య మానవ కోటిలో మిక్కిలితక్కువ.లోగల ఈశ్వరతేజమును వృద్ధిగావించు కొను వాడే,—ఆత్మశక్తి నధిక మొనరించుకొనినవాడే ఇట్టికాపు కాగలడు. ఇది సామాన్యక్రియకాదు. హృదయగర్భాలయమున నీశ్వరుడుంట నిక్కమే! మానసప్రాంగణమున పశువుకూడ కలదు. ఇది లొంగిన గాని ఆధ్యాత్మికశక్తి వృద్ధికాదు. ఒకపరి పశుప్రవృత్తిని చెలరేగనిచ్చి నచో, అది చులకనగా లొంగదు. విచ్చలవిడిగా ప్రవర్తించు ఇంద్రియ ములు దీనికి వలసినంత మేత నొసగును. దీనిని తలయెత్తనీయక లోగల రెండవశక్తిని— దివ్యశక్తిని —క్రమతపసుకతన వృద్ధిజేయించుటకే ప్రాచీనులు తమడింభకులను బ్రహ్మచర్యమున ప్రవేశపెట్టిరి. పశుప్ర వృత్తిని కట్టిపెట్టుటన నాత్మసంయమము నందుట. ఇది యలవడిన మహామార్గమున చిత్తము చిత్తమువచ్చినతెఱగున పరుగులెత్తక, అధో గతియందు కూలబడక, ఎగిరెగిరి కొండకొనను చేరు పిట్టవలె నున్నతా శయము దెస జనును ఏకాగ్రదృష్టియందే ఈగమనపంథ కలదు.

దివ్యశక్తి లోగల ఓజస్సున గలదు. తేజస్సు కావున దివ్యశక్తి దానికి స్వతస్సిద్ధమైనది. ఓజస్సు ప్రాణభరితము. అద్భుతసృష్టి ఇందుండియే వెడలును. దుర్వ్యయ మొనరింపక, దీనిని నిలుపుకొనువానికసాధ్యమెద్ది యునుండదు. చంద్రతారార్కులు చావనంతవఱకు సజీవములైయుండు రచనలను గను ప్రతిభయనుడు, సర్వకాలములందు విజయపాణింధమ మును మ్రోగింపగల ప్రజ్ఞయనుడు, మానవునిచే "సోహమ్" అనిపించు సామర్థ్యమనుడు, ఆతనిదేవుని పట్టమహిషిగావింపగల మహాద్భుత శక్తియనుడు ఇందుండియే యుద్భవించును. బ్రహ్మచర్యమువలనగాని ఇది సంచితము కాదు. నియమబద్ధజీవులు, వివాహితులైనను, బ్రహ్మ చర్యము నెఱపువా రగుదురు. పదునాఱువేల యెనమండుగురకు పతి యైన శ్రీకృష్ణుడు నిత్యబ్రహ్మచర్యమున నారితేఱినాఁడు; బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠించువారు తనదెస దృష్టినిలిపియుంచవలెనని తెలిపినాడు.

"ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్తఆసీత మత్పరః."

దివ్యసుందరమూర్తిని మనశ్చక్షుస్సమక్షమున నిలుపుకొనిన వాడే బ్రహ్మచర్యమున నెగ్గును. మనసు చెదరిన ముహూర్తమున దీనికి భంగము వాటిల్లును. లోగలవృషభము రంకెలువేయుచు, కుమ్మికుమ్మి మానవుని లోతుగోతిలో పడద్రోయును. మదించిన ఎద్దుతో కుస్తీ పట్టు సెవరితరము? దీని దెస జూడనినాడు ఇది కృశించును; క్రుంగిపోవును. చిత్తవృత్తి దిగువకైనబోవును; ఎగువకైనబోవును. అది కట్టువలెగాని, రాతిరీతిగాని యుండదు. అది గోతినైనకూలును, కొండనైననెక్కును. మంచిగోనము నభ్యసింపనివాఁడు ఎద్దుకాలిక్రింద పడితీఱును. ఇతడు చెడ్డవాడగుట నిక్కము. ఉత్తమభావములను మనసున నిండించుకొని, వాని నాత్మజీవనమున నింకింపజేయుటే ఈయభ్యాసము; ఇదియే బ్రహ్మచర్యానుష్ఠానము. బ్రహ్మచర్యమును కొంతవనుకైనను అభ్యసింపనివాని చరిత్రనుగూర్చి శంకించుట నుచితముకాదు. ఈ యభ్యాసము కడుంగడు కష్టమైనది; క్రమనిష్ఠవలనగాని నది యలవడదు. దుశ్చింత మనసును మార్చునువేళ అవధానమును (Attention) మార్చవలెనని మన శాస్త్రము (Psychology) తెలుపుచున్నది. ఇట్లుమార్చుట మొదలిడిన నాడే మానవుడు క్రమనిష్ఠలో ముందంజ వేసినవాడగును. శ్రవణ మనన నిదిధ్యాసనములవలన నీ నిష్ఠ బలవత్తర మగును. ప్రబోధమువలన విశేషాభ్యుదయము కలుగునని యయాతిప్రభృతుల చరిత్రలు తెలుపు చుండుటలేదా? క్రమనిష్ఠయందు, బ్రహ్మచర్యమున విజయుడైనవాడే పూర్ణత్వ (Perfection సిద్ధినందినవాడగును. ఈశ్వరుడే యగును. ఇట్టివానికే వృషభము పూర్తిగ లొంగియుండును. ఈశ్వరు డెద్దునెక్కువాడందురు. లోని యెద్దును లొంగదీసినవాడని మనమూహించుటకే ఇట్లందురని నాయభిప్రాయము. మహేశుని దృష్టి విష్ణువుపై నుండునందురు. ఈతని ఏకాగ్రదృష్టియే ఈతని నంతవానిజేసినది.

ఈదృష్టి ఎట్లలవడును? ఇట్టిశక్తి మనుష్యహృదయమందే కలదు. ఇది సత్యమును వలచునది; సౌందర్యమునభిలషించునది! కావున నందంపు దృశ్యముపై కన్నునిలుప మక్కువపడెదము. సౌందర్యసందీప్తరూపమును ముందిడికొనినముహూర్తమున నేకాగ్రదృష్టి తనంతదాను వృద్ధియగును. మరలుమనినను, చూడ్కి మరలదు. జగన్మోహిని జూచి,

ఆత్మవిస్మృతుడై ఈశ్వరుడు పరుగులెత్తలేదా? సదాశక్తై, సుందరాశయమునకై పరుగులెత్తువారు ఈశ్వరునిబోలు భక్తులు. ఆయతనయనారవిందములను శ్యామసుందరుని నగుమోమున కప్పగించి, వ్రజవీథులందు పరుగులెత్తినగోపిక లిట్టిబ్రహ్మచారిణులని, ఇట్టి భక్తురాండ్రని కంఠమెత్తి వచింతును. మహనీయతేజుడై క్రేపులమేపు మోహనమూర్తిని ప్రేమించినవారందఱు నాతని యిల్లాండ్రే! బృందావనమున భక్తబృందపరివృతుడై యుండిన గోస్వామి మీరాబాయి నుద్దేశించి "నీవు శ్రీకృష్ణుని యిల్లాలువుకదా! మేము మీతో బుట్టువులము" అని పలుకలేదా? "నాథా! నాథా!" యని శ్రీచైతన్యుడు శ్రీకృష్ణు నుద్దేశించిపలికి, తన్మయనృత్యమొనరించువాడు కాడా? ఈతనిదృష్టిలోగల దివ్యసుందరమూర్తిని, భావనాసృష్టియందారితేఱనివారు శిలయందు నిర్మించి, తమదృష్టిని దానిపై నిలుపుచుందురు. గౌరాంగమతప్రచారకులును, వంగవైష్ణవులును తెలుపు ఆరాధన మిట్టిక్రియయే! చైతన్యప్రభృతు లావాహనము గావించుకొనజాలిన సుందరసత్యస్వరూపములను మనము దృష్టిమ్రోల నిడికొందుము. ఈయంశమున కవగతులుగానివారే కేవలము విగ్రహారాధకులము ('Idol-worshippers') మనమని ఈసడించి పలుకుచుందురు.

సుందరభావము దెసను, సుందరమూర్తి దెసను దృష్టిపాఱుతఱి అత్యద్భుతదివ్యభావ మొండు హృదయహ్రదమున పొంగిపొరలును. శశికిరణము వెన్క నెంతయమృతముండదు? నగుమోము సిరి ఇందు మున్కవేయు టెఱుగమా? పూవురేకుల యంచులనుండి కమ్మతావి వెడలుతఱి పువ్వుకడుపున సుధాసింధువు తరంగసంకులముకాదా? రెప్పదెబ్బ తిననిచూడ్కిలో ననురాగాంబురాశి తెరలుతెరలై పొంగిపొరలును. గాఢమైనభక్తియే ప్రేమ; గాఢప్రణయమే భక్తి. ప్రేమకును ఏకాగ్రదృష్టికిని గలసంబంధము వృక్షమునకును, విత్తునకును గలసంబంధమువంటిది. ఏకాగ్రదృష్టివలన గలుగునది ప్రేమ; ప్రేమసముద్భవమేకాగ్రదృష్టి.

సౌందర్యము సృష్టిగర్భితము. సుందరసూర్యకిరణమును పరికింపుడు. అందు సప్తరాగములు తళ్కొత్తుట గాంతురు. ఇవి కిరణడింభకము లేకదా! అంతియకాదు. రవిమయూఖము ముద్దిడికొనిన చోటులం దెట్టి యద్భుతసృష్టి గోచరించుటలేదు? మొగ్గమోము నిది చుంబించి, దానియంగప్రత్యంగములను మక్కువమెయి కవుంగలి జేర్చుకొనినపుడే కదా పూవుమేనిపులకలందు భావభువనములు పుట్టును! నగుమోమునన సౌందర్యప్రసవినియై, కవిహృదయమును అల్లని గావించుకొని కులుకునుగదా! దినకుణిద్యుతి కమలాకరహృదయమును స్పృశించినంతన బిలబిలలేచు కలహంసలబోలు తళ్కు లెన్నెన్ని తెలికెరటాలకొనలం దుదయింపవు? తూగుటుయ్యాలలందూగు రాచముద్దియలవలె నయ్యాలలపై నూగాడుపువ్వుల ముద్దుమోములపై తళుకొత్తు నవ్వులం దెట్టి యద్భుతసృష్టి గోచరింపదు?



# నా మహారాష్ట్రయాత్ర

## పదమూడవ ప్రకరణము

రవికిరణ మట్టి చిత్రవిచిత్రసృష్టికి కన్నతండ్రి కాగలిగినపుడు సూర్యుని సృజించిన జగదీశుని సృష్టిశక్తి యెంత యద్భుతమైనదో యూహింపుడు. ఒక్క సూర్యునిగాక పెక్కు సూర్యులను, ఒకేలోకమునుగాక అశేషలోకములను సృజించిన శక్తిని దలచినపుడు, భావనాశక్తిచే కోటి కోటి దివ్యచక్షులను సంపాదించి అనంతాకాశమున, ననంతకాలమున నిండియుండు తేజమును గొంత గాంచినపుడు, శరీరపంజరమున కట్టువడియున్నను, మనుష్యాత్మ కొంత దేవశక్తి నంది తీఱును. వియత్తలమున విహంగ మెగసినకొలది, నూతనదృశ్యములు దాని దృగ్జాలమున బడువడువున, సౌందర్యముపై కన్నుంచు కళోపాసకుని ఊహాశక్తి ఘనతరమైన కొలది బ్రహ్మాండమందలి బహుళాద్భుతదృశ్యములు వానిదృక్కులందు జవోపేతముగ ప్రవేశించి, తోడన వాని హృదయబృందావనమున విడియును. బ్రహ్మచర్యముకతన, నియమబద్ధజీవితమువలన, తేజస్సు నంతరంగముననింపి, ఓజస్సును మనస్సున నిలుపుకొని మునిముఖ్యు లీశ్వరశక్తిని కొంత నంది, అనూనమైన సృష్టిశక్తిని జూపజాలిరి. సాగరతీరమున శారదయామిని నొంటరినై మానవుడు నలుకెలంకుల విలోకించినపుడు దివ్యదీప్తుల జిందుచు, దిగ్వలయము చుట్టు జూపట్టును. దిశావలయ మొక పెద్దగిన్నెయంచువలె నుండును. గిన్నెలో వెన్నెల తొలకుచుండును. వెన్నెల కరళ్లకొనలందు బుడగలవలె నందందు కొన్నిచుక్కలు తేలును. సచేతనములట్లగపడుచు, వెన్నెలందు మునిగిమునుగని కొండలు మరందమున నీదులాడు తుమ్మెదలవలె తోచును. పాలపైపడిన పచ్చని పొడిపగిది, మంచుపై రాలిన ఆకుమూకలవలె, కౌముదీవీచికలపై నా యర్ధశర్వరీ ముహూర్తమున పుడమిగల యడవులు గోచరింపవా ? పాలవెల్లిపై తేలియాడు విష్ణుదేవుని చందమున సౌందర్యసముద్భాసితప్రకృతి

యత్తఱి వెన్నెలవెల్లిపై తేలియాడును! ఈ గిన్నెలోని సౌందర్యమును వర్ణింపగల మానవమాత్రు డేడి? తపసుచేసిన హృదయ మీ గిన్నె బోలునదని వచింతును. తన గుండె నిట్టిగిన్నె గావించుకొనిన తపసి తన శక్తిని తానే వర్ణింపజాలడు కాని, లోగలగిన్నెలోని యనిర్వాచనీయసృష్టిని (అసాధ్యములను సుసాధ్యములొనరించువాడగుడు) తన కలమునుండి, తనరసనమునుండి వ్యక్తీకరించి, తానెఱుగని, తానూహింపజాలని సౌందర్యము తనరచనమందెట్లు విరాజిల్లుచున్నదో యని మిక్కిలి యక్కజపడి, తన యెడల బ్రసన్నుడై తన రచనమును బ్రహ్మాండము జేసికొని అందు కాపురమున్న జగదీశునకు బ్రణమిల్లడా?

ఎట్టిచిత్రమో యోజింపుడు—కనులుమోసి అంతరంగమును పరిశీలించినపుడును, కనులు తెఱచి ఆత్మరచనమును పరికించినపుడును ఈతడొకే తెఱగు దివ్యదృశ్యమును పొడగాంచును. మానసనేత్రము మ్రోల నిట్టిదృశ్యమును ప్రదర్శించు రచనమును విలోకించినపుడు దాని కర్త తపస్వియని తప్పక గుర్తింతుము. పొడుపుగొండ చెంత నిలిచిన గాజుకుప్పెల ననంతకాంతులు విడిది నేర్పఱచుకొను లీల, ఈశ్వర సమక్షమున నిలిచిన వీని హృదయమున ననంతశక్తులు వసించెనని గ్రహింతుము. భ్రమరముపై కన్నిడిన కీటకము భ్రమరమే యగులీల, బ్రహ్మాండముపై దృష్టినిలిపిన వీనిగుండె బ్రహ్మాండ మయినదని గుర్తింతుము. ఈతనిమనసు వనమాలి వంశీరవమునకు నెచ్చెలియై ఎల్లకడలందు విహరించినదని, పోయిపోయి చుక్కచెల్వల గుండియలదట్టి, వాని యంతరంగములందు ప్రవేశించి, అందు విలసిల్లు వింతలను విలోకించి మురిసినదని, శ్రావణమేఘములను పిండి అందలి శీతలబిందువులను మెఱపులను గుటకలువేసినదని, ప్రకృతి సంయోగముకతన పండుతలపులను కనినదని, నందనవనమందలి నవప్రోవులను తనవశ మొనరించుకొనినదని, సౌందర్యలక్ష్మికి జాగిమ్రొక్కి అవిరళవరముల నందినదని, దేవనర్తకీబృందమున మసలిమసలి దివ్యగీతికాకళల నాలాపింప నేర్చినదని, భృంగియై, రమాపతి చరణకమల పీయూషమును తనివార గ్రోలినదని; భావనము కనియిచ్చిన సౌందర్యతిలకను తనదాని గావించుకొని, కవుంగిలిని జేర్చుకొని, ముదమార ముద్దాడి, చిర్నగవుచిందు ఆమెకన్నులనుండి, చక్కని

చెళుక్కుల గాంతిలు చెక్కిళులనుండి, చంద్రవంకకు వంకలుచెప్పునోసలు నుండి, మధురోక్తికి మార్గమిచ్చు నధరోష్ఠములనుండి, మక్కువతో గూడిన సిగ్గును చూపు చూపుగములనుండి, బాలచికురపిహిత ఫాల తలమునుండి యెనలేని కవితావిభూతిని కైకొనినదని మిగులగూర్చు మంగళముహూర్తములందు భావభువనములను చక్కెరగోళిలనట్లు దిగమ్రింగినదని గ్రహింతుము. వ్రతమునకు, ఏకాగ్రదృష్టికి, ధ్యానము నకు, తపసునకు అసాధ్యమైన దేది? ఇవెట్టి సుందరదృశ్యములను, ఎట్టి దివ్యమూర్తులను సృష్టించుకొనలేవు? ఒకరూపము నూహించుటకు వీని మ్రోల నొకవిగ్రహమును నిలువ నక్కరలేదు. దేహధారి యొక్కండు ప్రత్యక్షము కానక్కరలేదు. నిమిత్త మెద్దియు పురోభాగమున నిలువ నక్కరలేదు.

"అది" యని, "బ్రహ్మ" అని, "సర్వాంతర్యామి" యని జగ దీశు నుద్దేశించి శ్రీ శంకరుడు వచించినాడు. కాని సామాన్యులకీ "అది" యెద్దియో బోధపడలేదు. పామరులయెడల ననురక్తుడై యుండిన మహాత్ముడు రామానుజాచార్యుడు. జనసామాన్యమున కద్వైతము కాక విశిష్టాద్వైతమే సుబోధకముకదా? సగుణబ్రహ్మను, రూపసహితుని, "అనంతకల్యాణగుణశోభితు"ని, "హేయగుణరహితు"ని రామా నుజుడు నిర్దేశించినాడు. "ఇందుగల డందులేడని సందేహము వల" దని చక్రిగూర్చి ప్రహ్లాదుడు పలికి, శంకరసిద్ధాంతమునకు దారి జూపినాడు. భాగవతరచయితయే బ్రహ్మసూత్రములను రచించి, శంక రాదులభాష్యములకు నవకాశమిచ్చినాడుకదా! "ఎందెందు వెదకిచూచిన నందందే కల"డని తనయు డనినపుడుకూడ హిరణ్యకశిపునకు చక్రియస్తి త్వమునుగూర్చి సందేహమే యుండెను. కాని స్తంభమునుండి రూపసహి తుడై భగవంతుడు గోచరించినపుడు దానవాగ్రణికంతయు బోధపడినది. ఆ ముహూర్తమందలి ప్రత్యక్షతీవ్రానుభవముకతన ప్రహ్లాదప్రబోధ మందలి సత్యమెట్టిదో మఱింత బాగుగ నాతడు గ్రహించినాడు. భాగ వతమందలి ఈ కథను విమర్శకదృష్టితో పరిశీలించితిమేని, శంకరరామా నుజసిద్ధాంతముల ప్రత్యేక ప్రాముఖ్యమును గుర్తింతుము.

సాహిత్యమును, తత్త్వశాస్త్రమును, మతశాస్త్రమును సైదోడు లని తెలుపుచుండును. నక్షత్రములదోసిటగొని, సర్వేశుడు విశాలవినీలాకాశమున వెదచల్లిన త్రిశాస్త్రములు భావ్యాదాశయములను, ఉత్కృష్ట సత్యములను సాహితీవియత్తలమున వెదచల్లునంతదనుక సైదోడు లే! భావవ్యక్తీకరణమునకు నక్కరైన ఇంద్రియముల నివి మూలద్రోయుచో సాహితికి పనికిరావని వచింతును. పంచాగ్నులలో నింద్రియములను చిటచిటలాడించుకొనువారిని జూచి కళోపాసకుడు కను లెఱ్ఱజేయును. "తదీయవదనకమల మధుపానమును నిజనేత్రాంజలుల గ్రోలి" రని కదా వ్యాసు ననుసరించిన పోతనామాత్యుడు శ్రీకృష్ణుని విలోకించిన భక్త ప్రవరులను గుఱించి తెలిపినాడు! దివ్యనేత్రములొసగి కదా విశ్వరూప సందర్శనభాగ్యము జగదీశుడు గుడ్డిరాజున కొసగినాడు! మానవుని కన్నులు మూతలువడిన ముహూర్తమున జగతియందలి సౌందర్యలక్ష్మి నిర్వాసితయభాగినివలె పోగులును. మనుజుల చెవులు మూతలు పడిననాడు సంగీతమువచ్చి స్వర్గమును చేరుకొనుట మేలు. ఒక్కొక లలితకళ కొక్కొక యింద్రియము ప్రాపునంశమును పాఠకులు మఱువ రాదు. బాహ్యేంద్రియములకు వెన్కనే అంతరంగేంద్రియములు కలవు. అంతరంగమున జనించి, పెరిగి, పెంపొందిన భావము బాహ్యేంద్రియ కవాటమునుండియే ఆత్మప్రకాశము గావించుకొనును; రసనము తెగి పడిననాడు సగము చచ్చితినని గోలపెట్టి, ఇది కలమును చేబట్టును. కాని నాల్కనాడింపగల ప్రతిమానవుడు కలమును పట్టగలడని తలంచుట తప్పు. భావగ్రహణమును, భావప్రకాశమును కర్తవ్యములుగాగల సాహిత్యోపాసకుడు తన యింద్రియములకు సీల్లువేసికొననొల్లడు. వివిధానుభవములను తానందును; తనపఠితలలో తన్నుబోలువా రట్టి యనుభవముల నందుట తిలకించి మురియును. తాను కులుకును; వారిని కులికించును. తా నేడ్చును; వారి నేడ్పించును. తాను కోపించును; వారిని కోపింపజేయును. ఈ విద్యయం దారితేఱినవాడే తనరచనమున నవరసములను కురియించును. ఈ విద్యనెఱుగనివాడు రసరహితుడు. తనరచనలందు రసస్రవంతుల నీతడె ట్లుప్పతిలజేయగలడు? ఈతనిరచనము సుజలయుత సుఫలసమన్విత శ్యామలసస్యసందీపిత సుందరతరు

సుశోభిత మహోద్యానమువలె నుండదు. అది రాళ్లగుట్టవలె, ఇటుకలయామవలె, పెంకుల ప్రోగువలె, కట్టెలమోపువలె, బొగ్గులగుంపువలె, కచికలరాశివలె నుండును. ఈరీతి సరకులకు కావ్యజగతియందు చోటులేదు. రసరహిత పదార్థమునకును సౌందర్యసందీప్తముగాని వస్తువునకును గావ్యజగతిలో తావుండదు. లలితహృదయులకే పైన దెలిపినవిద్య యవలీలగ నలవడును. భావప్రకాశ మక్కఱలేక, సంఘసంపర్క మక్కఱలేక ఏమూలనో ముక్కుమూసికొని యుండువాని నటుంచుడు. ఈతడు మౌనియగుచో నమస్కరింతును. మౌని సంయమి; తన గుండెను పిడికిట బట్టినవాఁడు ఇంద్రియహయములను స్వాధీన మొనరించుకొనిన విక్రమశాలి. కఠినుడు వేఱు.—రాతిగుండెగలవాడు; ఎట్టి యనుభూతికి హృదయము నొగ్గక, ఎద్దువలె తిని మొద్దువలె పడి యుండువాడు; మోడునకు అన్న గానిపించుకొనువాడు కలమును గాని, కుంచెనుగాని పట్టుట కర్హుడుకాడు. ఈతీరుమనుజుని నమ్మరాదని నొక్కి వక్కాణింతును. "అతడు మానవులందు మానికము; పెక్కుబిరుదులు గలవాడు" అని ఒక్కొకమానవుని గుఱించి కొందఱు కొందఱు వచింతురు. తోడన నిది వేదవాక్కని నేరు గ్రహింపను. వెంటనే యావ్యక్తిని బోనులోనిలిపి, తీక్ష్ణవిమర్శకు గుఱిజేతును. సత్యాన్వేషణ మొనరింపక ఒరుల యభిప్రాయములకు "భళాభళి" యనను. సూక్ష్మదృష్టిని, తీవ్రవిమర్శనమును ఎఱుగనివారు ఒక్కొకపుడు "కోపించువారిలో మంచివా రధికులై యుండుటయు; కోపమెఱుగనివారిలో చెడ్డవా రధిక సంఖ్యాకులయి యుంటయు విడ్డూరము కా" దను నంశమును జ్ఞప్తియం దుంచుకొనవలెనని నా మనవి. పాషండులందఱు ప్రశాంతము నభినయింతురు! వీరు మనుష్యరూపులందు గోచరించు పాషాణములు. "అయ్యో!" అని యనవలసిన సమయమున మాకు గాదని వీరు మిన్నకుందురు. "జాలి" యనుపదమును వీరు తమ నిఘంటువులనుండి తుడిచి పాఱవైచియుందురు. వీరికి కరుణరస మెక్కడిది? శోకరస మేది? వీరు నవ్వరు; త్రుళ్లరు. వీరికి హాస్యరస మెక్కడిది? ఇట్టి యయ్యలు కావ్యములు రచింతురా? రసపూరిత కావ్యమహత్త్వమును గ్రహింతురా?

చక్కని కావ్యమునుచూచి (ఈ కావ్యము తనశత్రువు రచించినదైననేమి) మెచ్చువాడు మహోదారుడనియు, దానిని దుర్విమర్శకు నెరగావించునాతడు అజ్ఞానియో, దుర్మతియో యనియు గ్రహించు టొప్పు. సహృదయుని సహజగుణము ప్రశంస; క్షుద్రహృదయుని నైసర్గికగుణము దూషణము. ఎట్టియిన మంచిగోనమును కనుగొనవలెనని, మంచిమాట నాడవలెనని మొదటి వా డాతురపడును. రెండవవానిది ప్రతిపూలపంథ. ప్రశంసింపగలవాడే ప్రశంసనందును; దూషింపజాలువాడే దూషణమును కట్నముగా పడయును. ప్రశంస సదాశకు సంబంధించినది. కావ్యమందలి జఠరము సదాశ. నిరాశనుండి, నిట్టూర్పునుండి, నిస్సారనుండి, అజ్ఞానాంధకారమునుండి మానవు నుద్ధరించునది ఇదియే! మానవసముద్ధరణమునకు, లోకకల్యాణమునకు హేతువగు కళను సృష్టించుటకు వలసిన శక్తి నందుటను, తనరచనమును భావభాస్వద్రుచికలచే తళుక్కొత్తించుటకు, సదాశను తన పూజాపీఠమందలి దీపిక గావించుకొని మొదటివ్యక్తి దానికి జేజేలుపాడును; ప్రార్థనసలుపును. ప్రార్థన పథనుండియే ఆరాధ్య దైవతము (అది సత్యమనుడు, సౌందర్యమనుడు, శివమ్మనుడు) మనుష్యహృదయమున ప్రవేశించి, అందు నిత్యశృంగారమును నిలుపును; పచ్చతోరణమును గట్టును. ఈదివ్యశోభ కావ్యమున ప్రతిఫలించి, అందపూర్వసృష్టిని ప్రదర్శించును. ప్రార్థనవలన చేకుఱు అభ్యుదయము ఊహాతీతము. కావుననే టెన్నిసన్ మహాకవి ప్రార్థనమహాత్త్వమును బహుభంగుల బ్రస్తుతించినాడు.*

పైన నే దెలిపిన ప్రశంస ప్రార్థనమునకు సైదోడు. ఈమహద్గుణముల నలంకరించుకొనువాడే కావ్యసామ్రాజ్యమున పట్టాభిషిక్తుడై, పరార్థజీవియై తనరునని, వీనినెఱుగని వాడు అందుండి నిర్వాసితుడగుట కర్హుడని తెలుపుట నాయాశయము.

గుణమణిహారముచే నాత్మజీవితము నలంకరించుకొనువాడే కావ్యసామ్రాజ్యమున పట్టాభిషిక్తుడగుట కర్హుడని పచించితిని. ఈశ్వరచరిత్రయను అనంతగుణఖనినుండి ఈత డీమణులను సంగ్రహించును.

---

*"For, more things are wrought by Prayer than this world dreams of........
'*Vide Idyls of the King*'

కావున భారతీయు లీతడీశ్వరాంశసంభూతుడని వచింతురు.† అంతియ కాదు. ఈతడీశ్వరావతారమని వేనోళుల జాటి, ఈతని నారాధింతురు. కావ్యకర్త లీతని కావ్యవీరుంగా గావించిరి. ఇట్టివీరుని సృష్టించిన కావ్యకర్తను ప్రజలు సమ్రాట్టని, ఇలువేలుపని ప్రస్తుతించిరి. ఈశ్వరగుణమైన ప్రతిభను తనరచనమున నీతడు ప్రదర్శింపగలుగుటచే, ఈశ్వరాంశసంభూతుడని, పరార్థజీవియని లోకము తెలుగుతీఱున నీతడు ప్రవర్తించుటచే ఇట్టి దివ్యపదవి నందినాడు. పాశ్చాత్యులందు హోమ రిట్టివాడు. డాంటే, వర్జిల్, గెటే, షేక్స్పియరు లిట్టివారు. భారతీయులందు వ్యాసవాల్మీకి కాళిదాసు భవభూతి ప్రభృతు లిట్టివారు.

ఒరులకై పొగిలి, పోరి, ఒరులతో నానందించి, నిజజీవితములం దద్భుతగుణములను కోటిపత్తులు గావించుకొనినవారియందు భారతీయు లీశ్వరాంశమును గాంచిరనుటకు బహుళ తార్కాణములను పేర్కొన

---

† ఇట్టి విశ్వాస మాంగ్లేయులందు గూడ నుండెడిది. ఈ విశ్వాసముతో దశ స్టూవర్టురాజులు సింహాసన మధిష్ఠించిరి. కాని ఆత్మచరిత్రలందు వీ రీశ్వరగుణములను ప్రదర్శించినటుకల్ల. వివిధరీతులనిరంకుశత్వము విజృంభింపజేసి, వీరుతగుఫలము ననుభవించిరి. క్రీ. శ. 1603 లో సింహాసన మధిష్ఠించిన జేమ్సురాజన్యుడు ఆధ్యాత్మిక స్వత్వము ('Divine Right of Kings") నుగ్గడించుచు, చిత్తము వచ్చినట్లు ప్రవర్తించి, మౌఢ్యమును ప్రదర్శించిన మేధావి ("The wisest fool or the most enlightened idiot in Christendom") యనిపించుకొనినాడు. ఈతని వెనుక "ధళాధళి" యనిన మొదటి ఛార్లెస్ దేశమున సమరసంక్షోభమును జనింపజేసి, 1649 జనవరి 30-వ తేదిని తనకుత్తుకను తన ప్రజల కర్పించినాడు. ఈ తెరువు నుండి తరలనేరక, ప్రజలందు దురంతమైన యసంతృప్తిని బుట్టించి, తనకంతము కెట్టి మునలము చేటట్టునో యని యడలి, రెండవ జేమ్సు చల్లగ సింహాసనమునుండి పరారియైనాడు. 1642 లోని ప్రచండ రుధిరవిప్లవమును (Bloody Revolution), 1688 లోని ప్రసన్నపరివర్తనమును (Glorious Revolution), 1689 లోని గట్టిచట్టమును (Bill of Rights) స్టూవర్టుల నిరంకుశత్వమునుండి జనించినవి. నిరంకుశప్రభుత్వము నివి నున్న జేసినవి. వీనికతన ప్రజలే రాజులైరి. 1832, 1867, 1884, 1911 లందలి రిఫారమ్ఆక్టులు వీరికి మఱింత బలము నొసంగినవి.

నొక్కఅలేదు. అట్టి మహనీయులను వీరు సూర్యదేవుని సంతతివారని, చంద్రవంశజులని వచించిరి. చెప్పనేల? వారు దేవసములని దృష్టాంతీకరించుటకే స్వర్గములోనికి వారికై రాజమార్గముల నేర్పఱచిరి. దేవపతి సింహాసనము నధిష్టించి, ప్రత్యక్షముగ నీశ్వరుని కడనుండి వరములు గైకొని, పరమార్థమును చేపట్టి, ధనంజయుడై, మహాయాత్రికుడై విజయుడైన నరుడు వీరిదృష్టియం దెట్లు వ్రచినందినాడో యెఱుగమా? కావ్యకర్త వీరి ప్రతినిధిజుడీ!

తానెఱుగని ప్రతిభను ఒకడు మఱొకని కాపాదింపనేరడు. కావ్యకర్త తొలుత తాను విజయుడై, తానుధనంజయుడై మఱొకవిజయుని, ధనంజయుని సృష్టింపజాలునను ముఖ్యాంశమును చదువరులు మఱువరాదు. అర్జును డెవ్వరో, కృష్ణు డెవ్వరో, రాముడెవ్వరో ఎఱుగగోరువారు ఈ మహావీరులను కావ్యప్రపంచమున సృష్టించిన మహావ్యక్తి ఎవ్వరో తొలుత కనుగొనవలెను. నాటకకర్త తనపాత్రములందు ప్రవేశింపడని, ఆతనికిని అతడు సృష్టించిన పాత్రములకును నెట్టి సంబంధము ఉండదని, ప్రకృతిమోహిల ముకురమును నిలిపి, సత్యసందీప్తమైనదృష్టితో మనుష్యచరిత్రను చిత్రించు టాతని కర్తవ్యమని వచింతుము. నిక్కమే! రంగస్థలి ప్రదర్శించుట కక్కఱైన కావ్యమున వేర్వేఱు పాత్రముల వ్యక్తిగతప్రాముఖ్యమును వ్యక్తపఱచుట కిట్టి సిద్ధాంతము అనివార్యమైనది. ప్రబోధ మాచార్యుని పనిగాని నాటకకర్త పనికాదు. జగదీశునివలె నీతడు వెన్కనుండవలెను. కాని, స్వీయసామ్రాజ్యమున దివ్యాలోకప్రదీప్త సింహాసనము నలంకరించిన జగదీశుడు తాను సృష్టించిన మానవులందు గూడ కలడు.* కావ్యకర్తగూడ నిట్టివాడే! ఈతని యుత్కృష్టపాత్రములం దీతని కనుగొనవచ్చును. వీని మానసకైలాసమున నుదయించిన పూతభావధునీధార వీని యుదాత్తరచనములందు పాయపాయలై ప్రవహించి, అద్భుత సౌందర్యసృష్టిని పాఠకుల కన్నులకు కట్టును. వీని హృదయదిగ్వలయమున తళ్కొత్తిన సదాశ ఈతడు సృజించిన ఉదారపాత్రముల చరిత్రలందు మినుకులీనుట నిస్సంశయము. సృష్టిచిత్రము

* God is both immanent and transcendent.

లందు సృష్టికర్తను కనుగొనిన కన్నులులేవా! షేక్స్పియరును ప్రాస్పెరో, హేమ్లెట్, ఫాల్స్టాఫ్లతో పోల్చిన ఆంగ్లవిమర్శకులు లేరా? నన్నడిగితిరా, రామకృష్ణులందు, వసిష్ఠ యుధిష్ఠిరులందు వాల్మీకి వ్యాసు లున్నారని తెలిపి, అట్లని ఋజువొనరించుటకై రామాయణ భారతభాగవతములనుండి బహుళదృష్టాంతములను పేర్కొనగలను. చూడుడు: వ్యాసుడు శ్రీవిష్ణువుయొక్క అవతారమని మనగ్రంథములే తెలుపుచున్నవి. రాముడును, కృష్ణుడును అవతారపూరుషులేకదా! వ్యాసుడు శ్రీవిష్ణువుకావున కృష్ణునందు శ్రీ విష్ణువును జూపజాలెనని నొక్కి వచింతును. కిరాతుడేయయ్యు తపసుకతన శ్రీశంకరునకు ముందే "సోహమ్" అని పలికి, భగవానుడైన వాల్మీకి రామచంద్రభగవానుని కావ్యజగతియందు ప్రత్యక్ష మొనరించినాడు. తాను సాహితీసమ్రాట్టు కావున ముల్లోకములకు సమ్రాట్టు కాజాలిన మహాపాత్రమును కడుం గడు చక్కగ సృష్టించినాడు.

విధిసృష్టికి కవిసృష్టి తీసిపోదు. కావున కవికి బ్రహ్మయను నామాంతరము కలదు. సృష్టికర్తను ప్రాజదువులు "కవి" యని తెలుప లేదా? కవిబ్రహ్మ కాళిదాసువాక్కుల నాలింపుడు:

"చెలువుగవ్రాసి దిద్ది విధి చిత్తము రంజిల జీవమిచ్చెనో?
పొలుపులఁగూర్చి మానసవిభూతిని గౌతుకియై రచించెనో
మేలఁతుక మేనిఁజూడఁ బరమేష్ఠి ప్రభావము నెంచిచూడ నా
నెలఁతుకదోఁచు నొండుతరుణీమణి సృష్టి యటంచు నామదిన్."
("అభిజ్ఞానశాకుంతలము" వేంకటరాయశాస్త్రిగారి అనువాదము.)

సజీవమైన దృశ్యమునే ఛవ్వలిమాడ్కి మ్రోలనో, ఆంతరంగిక దృష్టి సమక్షమందో నిలుపుటే సృష్టికౌశలము. నామరూపములందు సృష్టి ప్రకాశమగును. కావ్యవీథులందు నడువనేర్చిన మనసు ఎన్నెన్ని దృశ్యములనో, ఎందఱెందఱు వ్యక్తులనో కాంచును. దైనికానుభవ మున కలుగు సంబంధములును, సంపర్కములును కావ్యవసుమతి యందును గోచరించును. అందివి మఱింతగాఢముగ నున్నట్లుండును,

గుణయుతులును, రూపసహితులును, వివిధానురాగ సూత్రములచే (ఆలుమగలట్లు, తండ్రికొడుకులట్లు) బంధింపబడినవారును అందు మసలుదురు. 'అది' యనబడు నిర్గుణ బ్రహ్మాకాశ కమలభవనర్తనుడు కావ్యరంగస్థలి బ్రత్యక్షమగును. రక్తమాంసములందు 'బ్రహ్మ' రామకృష్ణు లట్లు దృగ్గోచరమైనపుడే అష్టాదశపురాణములును, మహాకావ్యములును ఉద్భవించినవి.

శుభాశుభసంఘటనములు కలిగినపుడు సంతోషదుఃఖములను వ్యక్తీకరింప మానవులందఱు గాంక్షింతురు. మానవానుభవములను తామనుభవించి, ఆత్మానుభవములను కావ్యకర్తలు స్వీయకృతులందు ప్రదర్శింతురు. కావున మానవప్రకృతులును, మానవవికృతులును తమ కేలని వీడలేరు. అందు రేని వీరు తామేయుండు పుడమిలో, తమకై నిర్దేశింపబడిన గ్రంథములనే వ్రాసికొనవలెను. సంతసింపవలసి వచ్చినపుడు సంతసింపక, సంతపింపవలసివచ్చినపుడు సంతపింపక, 'అంతయు మిథ్య, సర్వము మాయ' అని కిక్కురుమనక కూర్చుండునాతడు సన్యాసులందు నూటికినూఱు మార్కులను దెచ్చుకొని మఠాధిపతి కావచ్చును; ఒరుల జోలి తనకేలని కదలని మెదలనిరాయి కావచ్చును. బండరాతికి కావ్యమున చోటులేదు. కావ్యకర్త దానిపై ఆకులను, పూవులను ప్రాకించును. తన లేఖినీసంజీవిచే స్పృశించి దానిని చక్కని చుక్క జేయును. ప్రతిభాస్పర్శచే (స్వార్థరహితుడు కావున దాను చేసినదానిని తన పాత్రముచేసెనంచు తెలుపుచు) కటికిరాతినుండి ఏయహల్యనో లేపి, పరస్పర భావప్రకాశమునకు నక్కఱైన చక్కని సంఘటనములను సృష్టించును. అంతియకాదు; కావ్యావనియందు మసలునంతకాలము తన ప్రత్యేకవ్యక్తిత్వము నణచియుంచి, తన గుండెలను కావ్యపాత్రముల కాటపందిల్లొనరించును. తానే ఒక్కొకపాత్రమై కావ్యరంగస్థలి దోచును. వాల్మీకివ్యాసకాళిదాసు లేమికావించిరో, కావ్యజగతియందెట్లు తోచిరో యెఱుగరా? జడదారులయ్యు, ప్రాపంచికానుభవములను దమ హృద్వీణలమీటనిచ్చిరి కారా? తాము గోలపెట్టగలవారగుటచే సీత, ద్రౌపది, శకుంతలాదులచే గోలపెట్టించిరి. తాము కోపింప

జాలుటచే భీమాదులను రెచ్చగొట్టింపజాలిరి. తాము భక్తులగుటచే హనుమదాదులచే తన్మయనృత్యము జేయింపగలిగిరి. తాము కులికిరి; ఒరులను కులికించిరి. శుభాశుభములును, సుఖదుఃఖములును తమకేలని తమ గుండియలపై గోరీలను నిర్మించిరికారు. చింతిలి, కులికి, కనలి కావ్య జగతియందు రసప్రవంతుల బాఱింపజేసిరి.

నన్నడిగితిరా కావ్యకర్తమనసును, బాలకుని మనసును ఒకేవిధమైన వందును. నూరేండ్లబూచి కొక్కరిగోడవగాని, గోడుగాని యక్కఱలేదు. ఈతని కేడ్పురాదు; నవ్వురాదు. సంఘజీవితమునుండి ఈతడు 'విడాకులు' గైకొని, ఏమూలనో ముక్కుమూసికొని, స్వాంత ముక్తికి సంబంధించిన గభీరచింతనలో బుడుంగున మునింగియుండును. కావ్యకర్తవలె బాలకుడు రూపగుణముల నెఱుగును. రూపరహితమైన దేద్దియు నీతనిచూడ్కి నాకర్షింపదు. ప్రత్యక్షగుణప్రదర్శన మొనరింపని మనుజుడు ఈతని హృదయమును స్పృశింపలేడు. తండ్రి రూపమందే ఈతడు తండ్రిగోసములను, తండ్రిని వీక్షించును. రూపము నుండి తండ్రి నిష్క్రమించి, 'అది' యని పేర్కొనబడు 'బ్రహ్మ'లో గలసినంతన బాలకుడు తల్లడిల్లును. జనకునిరూపముకాక ఆతని బూడిద ప్రత్యక్షమైనపుడు ఈతని మన సెట్లుండునో యూహింపుడు. తండ్రి రొమ్మునుండి తన్నెవరో దూరముగ గిరవాటువేసిరని, తన్నొంటరి జేయుటకై ఎవరో, గ్రద్దవలె తనతండ్రిని తనపాలనుండి తటాలున గొని పోయిరని (ఏమియు నూహింపజాలని పసివాడుకాడు కానందున) ఊహించి ఈత డంగలార్చును. సుఖదుఃఖ ప్రకాశమునకు, పరస్పరభావ వ్యక్తీకరణమునకు భంగము వాటిలినపుడు బ్రదుకుతెల్లవారెనని బాలురును, సామాన్యులును ఊహింపరా? ఘోరవిపత్తు బాలకుని గుండెపై బడినపుడు, పిడుగుదెబ్బవలన పిండిపై,—పిండియేయగుటకాదు, కాలి బూదెయై, వాతూలమున నదృశ్యమగు గింజవలె, నది బొగ్గును బుగ్గి యును గాదా? ఈబొగ్గులోను బుగ్గిలోను నెరసుండుననియును, వర్తమాన విషాదవాతూలమున గుండియ మిక్కుటముగ చలించినను భావి కాలమున నానెరసు ప్రజ్వరిల్లి భావిజీవనమున నవజీవనద్యుతులను జల

జలరాల్చుననియును మనము తెలుపవచ్చును. జ్ఞాన ప్రదీపకళికనుండి ప్రసరించు నీ భావచ్ఛటను కసుగాయమనసు గుర్తింపజాలునా?

కావ్యకర్తను సృష్టికర్తకు పోల్చితిని. ఈ పోలికలోని సృష్టికర్త సగుణబ్రహ్మగాని నిర్గుణబ్రహ్మకాడుసుడీ! కావ్యకర్త నిర్గుణబ్రహ్మవలె తనగ్రంథములను వ్రాయడు. జగదీశుని సృష్టిశక్తినే ఈత డలవఱచుకొనినాడు; కాని తక్కుంగల వాని యనంతగుణములకు బహుయోజనములదూరమందేయున్నాడు. కొన్నియంశములందు బాలకునకు సమీపమందున్నాడు. బాలకుడును, కావ్యకర్తయును, ఈశ్వరుడును గొన్నికొన్ని ముఖ్యాంశములందే పోలికలు కలిగియుండిరి.

జగదీశుడు త్రికాలవేది. ప్రస్తుతకాలమట్లే భావికాలమును ఆతనికి దోచును. కావ్యకర్తదృష్టి ప్రతిభాసముజ్జ్వలమయ్యు, దివ్యమయ్యు, కావ్యపాత్రమై ఆత్మరచనమున గోచరించు టాతని కగ్గమగుడు, జరుగనున్న దేమో యెఱుగని తెఱగున నాతడు ప్రవర్తించును. "కావలసిన కారణాంతము లవంబును తప్పదు." అనియాత డనునుగాని "కారణాంత మిట్టి" దని తెలుపడు. వర్తమానము కడవకుండ, గాలదిగ్వలయమున కవ్వలగల యంశములు తలలెత్తుచు కనులబడుచో వర్తమానమును (The Present) వీక్షించువారెవరు? కావ్యము జోస్యము కాదు. అది భావికాలమును గుఱించిన గాథకాదు; వర్తమాన సమయమునకును, ప్రత్యక్షకాలమునకును సంబంధించినది. గతాంశములను దెలుపుతఱి, గతమును దెచ్చి దాని నది దృష్టిసమక్షమున నిలుపును. కావ్యమున కవ్వల, రచనాకుశలుండు జోస్యముచెప్పినను, కావ్యమందు దాను నిమగ్నుడైయుండు నవసరమున తనకర్తవ్య లక్షణమెద్దియో గుర్తించియే ఈతడు తనక్రియను నెఱపును.

రేపు జరుగు సంఘటనము లెవ్వియో నేడే తెలిసిపోయిన, కావ్యమందు తెలుపుటకు కథన మేముండును? భావికాల మనుకూలమయినదని తెలిసికొనినపుడే మానవుడు తనపనికి పూనుకొనును. కాలవియత్తలమున ననుకూలాంశములే గోచరింపవు. ప్రతికూలాంశములు కూడ

నందు దోచినగాని సత్యము పూర్ణప్రకాశము నందజాలదు. కావ్య మున నీసత్య మాత్మప్రతిబింబమును గాంచును, రేబవళ్లు లేకున్న దినమే లేదు. సుఖదుఃఖములును, ఆలోకాంధకారములును, అనుకూల ప్రతి కూలాంశములును గలసియే పూర్ణజీవితసామగ్రి యగును. కావ్యగ్రథ నమున నక్కఱైన దీ సామగ్రియే!

కొండొకవడి దివ్యదృష్టినందిన అర్జునుడు విశ్వరూపసందర్శనమున కౌరవ విధ్వంసమును గాంచినాడు. * కృష్ణకటాక్షమున తాను విజయు డగుట ముందేయెఱిగి, కృష్ణ ప్రేరితుడై గాండీవము నెక్కుపెట్టి నాడు. కర్తవ్యాంగణమున లంఘించినాడు. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని ధర్మక్షేత్రమున, కురుక్షేత్రమున, క్రియాక్షేత్రమున బురికొలుపు శక్తిని సామాన్యులు గుర్తింపరు. సమ్ముఖమందలి సారథిని వీరెఱుగరు. కావున తమ భావికాలమెట్లుండునో వీరెఱుగరు. దానిం జేసియే అనుకూలాంశముల సఖ్యమును, ప్రతికూలాంశముల సంఘర్షణ మును జవిచూచి, కావ్యావనియందు వీ రుచితపాత్రము లయ్యెదరు.

దాశరథునిచేతిలో తనకు చావు కలదని దశకంఠుడు ముందే గ్రహించియుండినచో, లోకమాతపై మోహాంధదృష్టిని సారింపకనే యుండువాడు. కలుషమయమైన తన వాడిచూడ్కి వాడియడిదమై వెను దిరిగి తనగుండెయందు గ్రుచ్చుకొనునని, రాముకోదండము నదె తన మీదికి పురికొలుపునని ఈతడు ముందే గ్రహించి యుండినచో,

* "అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వేసహైవావనిపాలసంఘైః,
భీష్మోద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ సహాస్మదీయై రపి యోధముఖ్యైః.
వక్త్రాణి తేత్వరమాణా విశంతి దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః,
యథా నదీనాం బహవోఽంబువేగాస్సముద్రమే వాభిముఖా ద్రవంతి,
తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభి విజ్వలంతి.
యథా ప్రదీప్తం జ్వలనంపతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతిలోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః."

భావిసంఘటనములకును, రామాయణమహాకావ్యసృష్టికిని అవకాశ మొసగకుండువాడు. దూరదృష్టిగలవారును, త్రికాలవేదులును రావణులుకారు. కొన్నికొన్ని సందర్భములందు, కావ్యపృథ్వియం దొకానొక మూలమందిరమున వీరు గురువులై తోచెదరు. పరస్పర సంఘర్షణమునకు డీకొను ప్రధాన పాత్రములలో వీరికి (వీరు సంఘర్షణాతీతులగుడు) స్థానముండదు.

జగదీశుడు రాముడై యవతరించినపుడును, కృష్ణుడై యవతరించి నపుడును ఎట్టి వ్యత్యాసమును జూపెనో గ్రహించితిరా? బాగోగుల సంఘర్షణమున నొకవైపున నాయకుడు నిలుచును. మరొక ముఖ్యపాత్ర మీాతనికి ప్రతిద్వంద్విమైయుండును. 'ఇది నాది. ఈ క్రియను జరపి, నన్ను మార్కొనిన కీడును దునుమాడెదను. ఈ మేలునందెదను' అని నాయకుడు తలచియే కదనమునకు కడగును. భారతకావ్యకర్త సంఘర్షణానంతరమున నీతనిచేతికి జయపతాక మొసగును. సుగుణ ముచే విజయడిండిమమును మ్రోగింపజేయుటయు, దుర్గుణమును గూల్చుటయు నీతని యాశయములు. ఎదుటి శత్రువునకును, నాయకునకును ఈత మజ్జీజూచియే పోరుపొసగించును. రాముని గాక, నిర్గుణబ్రహ్మనో, శ్రీ మహావిష్ణువునో వాల్మీకి రావణుని కెదుట నిలుపదొరకొనినాడా? గుణాగుణ సంఘర్షణమునకు నాటపందిరియైన కావ్యమున నిర్గుణ బ్రహ్మకు చోటేది? విష్ణుమూర్తి త్రికాలము లెఱుగును. లక్ష్మి నెవ్వాడు దోకొని పోయెనో యెఱిగి, పర్ణశాలనుండియే సుదర్శనచక్రమును పుత్తెంచి, వాయుపథమందే దైత్యస్వామి కుత్తుక నుత్తరించి, తోడన దనయర్ధాంగ లక్ష్మిని జేకొనియుండును. రామవిలాపమునకుగాని, వారధి నిర్మాణమునకుగాని, తదుపరి యుద్ధమునకుగాని అవకాశ ముండెడిదికాదు. ఉత్సవ సన్నాహములను నగరుననవలోకించిన శ్రీరాముడు సన్నిహితులను పిలచి వానికారణమడిగినాడు. మఱునాడు తన పట్టాభిషేక మనుశుభవార్త నెఱిగినాడు. సమీపమందలి భావిసంఘటనము నాతడెఱుగడు. కైక దురుద్దేశమును దశరథు డించుక యూహించి, "తండ్రీ! భరతుడురాక మున్నే నీపట్టాభిషేకము జరుగవలెను సుమీ!" అని రామునితో పలికెను.

ఏవిషయమును రాము డెఱుగడు. ఆత డమాయకుని వలెనేయుండెను. వాటిలనున్న చేటును ముందే యెఱిగియుండినచో, రాముడు సీతతో పయనముగువాడు కాడు. ఆమెను వెంటగొనినను, వనమందలి పర్ణశాల నుండి కదలకనే యుండువాడు. వేయేల కావ్యమే యుండెడిదికాదు. పరిపూర్ణత్వము (Perfection) ను ప్రదర్శింపని మానవుడైన రాముడే సంఘర్షణమున పాల్గొనిన పాత్రమైనాడు. కృష్ణుడు కాలేదు. మానవుల నీతడు సంఘర్షణమున బ్రవేశపెట్టినాడు; వారిని సమరమునకు పురికొలిపినాడు. శ్రీకృష్ణుని మధ్యవర్తియనుడు; రాయబారియనుడు; సారథియనుడు; గీతాచార్యుడనుడు; గీతాలాపన మొనరించిన దివ్యగాయకుడనుడు; కాని పోరుసలిపిన మనుష్యుడనకుడు. అవతారములందు క్రమవృద్ధి కలదు. మీనముకంటె కూర్మము, కమఠముకంటె వరాహము, దానికంటె నరసింహము, నరసింహముకంటె నరుడు, నరునికంటె బ్రాహ్మత్వము బ్రదర్శించు జగదీశుడు మిన్నయను భావమును క్రమగతిదోచిన అవతార పరంపరయందు కాంతుము. బైబిలుభాషను ప్రయోగించితిమేని, రాముడు మానవతనూభవు (Son of man) డని, కృష్ణుడు దైవసంభూతు (Son of God) డని తెలుపవచ్చును. గిరిధారి కావించిన క్రియలన్నియు నాతడు జగదీశుడని తెలుపు ప్రమాణములే! 'నిర్గుణబ్రహ్మ' సుఖింపదు; దుఃఖింపదు; కోపింపదు. దేవదేవుడు మానవులట్లు ప్రవర్తింపడు. ఒక పర్యాయము మాత్రము శ్రీకృష్ణుడు అర్జునుని రెచ్చగొట్టుటకై కురుక్షేత్రమున క్రోధవిజృంభణ మొనరించి, "కుండలములకాంతి గగనభాగంబెల్ల గప్పికొనగ" తేరునుండి "కుప్పించి యెగసి", చక్రముబూని, భీష్ముని జంపనుంకించినాడు. అమ్ములు నేలరాల్చి, రొమ్మునొడ్డి, చేతులుమొగిచి, భక్తిపరవశుడై భీష్మాచార్యుడు జగదీశుని ప్రస్తుతించినాడు. ఉజ్జీలేనిదే కావ్యాంగణమున కదనమే లేదంటిని గాదా? ఎదుటివానిని గుఱించిగాని, భావికాలమును గుఱించిగాని పరిజ్ఞానముగలవాడు ఈ సంఘర్షణమున పాల్గొనడని కదా తెలిపి యుంటిని! ఈ పరిజ్ఞానము భీష్మునకుగలదు; కావున నాతడు జగదీశుని మ్రోల ప్రాంజలియై నిలిచి కాళ్ల బేరమునకు వచ్చినాడు. సమరము తనకు

కాదని యెఱిగిన కృష్ణభగవానుడు వెన్కకు తరలినాడు. మానవు లిద్దఱు పోరుసలిపిరి.

కావ్యస్థపాత్రముల జీవనము మానవమాత్రుల జీవితప్రతిబింబము. ప్రతిబింబమున విశేషసౌందర్యముండును. అందు కవితాశోభ తళ్కొత్తును. కావ్యపాత్రములు భావనమున మునిగి తేలువారు; వారు విశేషభావోద్వేగమును వ్యక్తీకరింతురు. ఉద్వేగపూరిత సంఘటనమున జిక్కిన బాలుడు కావ్యపాత్రమువంటివాడు; కావ్యకర్త * (ఈత డొక్కొకపుడు కావ్యపాత్రమై ఆత్మవ్యక్తీకరణ మొనరించుకొనును కావున) బోలువాడు. బుగ్గిలోనున్న అగ్గినెరసు భాసమానభావిజీవనమునకు జన్మదాత కెంజాలు నని ముగ్గినపండువంటి తాత్త్వికునివలె ఈ బాలకు డెట్లూహించును? బుగ్గి బుగ్గి యనియే ఈత డెఱుగును. ఘోరవిపత్తున కించిత్తుసంచలనమునే చూచుతత్త్వవేత్తకాక అందు భీషణభిత్తికను విలోకించు పామరు డీతడు! గతసంబంధము నమసరించియేకదా సమ్ముఖసంఘటనగుణానిర్ణయము జరగును. సన్నిహిత సంబంధమున గాఢప్రణయముండును; గభీరభావ ముండును. ప్రత్యక్షసంబంధమును తొలగించు ఘోరారిష్టము హృదయమును గభీరదుఃఖాంబుధిని గావింపదా? తండ్రినిగాక, తండ్రికిబదులు తండ్రిబూడిదను చూచి అభాగుడైన బాలకునికడుపున నిట్టికడలి నిండుకొనదా?

ఆకుగముల మఱుగునుండి తోచు పండువలె, కారుమొగులులో కాంతిలు కెంపుకాంతికరణి, సన్నని మేలిముసుగున గన్పట్టు నగుమోము పట్టమహిషియట్టులు, పవడపురాశిలో దాగిన నవభర్మశలాక పోలుపున, సుదూరవిహాయసాంతఃపురమున నీలంపువలువలో మిణుకు మిణుకుమను తారకాంగనవలె, తామరలందు దాగిలిమూతలాడు రాయంచ చందమున, బుడగకడుపులోని కెంపుతలంపులీల సుందరీచూడామణి మేలిసీలా

* కావ్యాంగణమున నీతడు ఘనభావములను, గంభీరసత్యములను విడజల్లునని, ప్రబోధధోరణి బ్రవేశింపదని, కానున్న దెద్దియో యెఱిగియు నీత డెఱుగనట్టే యుండి యుంజవేయు నని మనము మఱువరాదు.

లకలందు వజ్రపుపోళ్లతో నొప్పుపైడికై సేతకై వడి,పచ్చపందిరిలో నవ్వులు రాల్చుమల్లికలవలె, సరోజినీసంశ్లేషమున దాగి చొక్కియున్న భ్రమరవల్లభునిభంగి, మేఘడోలికలం దెగయు క్రొక్కాఱు మెఱుంగు తెఱంగున,అందకత్తైవాల్జెడనుండి వాలుచూపులు నిగిడించుచు హాసస్ముఖులయి తోచు గులాబులచొప్పున, కాచపాత్రమున సౌదామినీసృష్టిజేయు దీపకళికవలె, సాంద్రపర్ణములందు లంఘించిన నగుమోము కిరణకిశోరములకరణి, ముంగురులందు దోచు ముద్దుమోమువలె, అల్లన నాలాపనమొనరించుచు గభీరవనమున గన్పట్టు శరన్నదివలె, ప్రభాతశిశిరబిందుహృదయములందు మునిగితేలు సప్తరాగములట్లు, హంసతూలికాతల్పమున హాసస్ముఖియై నొయ్యారముగ శయించిన సౌందర్యతిలక పొలుపున, అమ్మరొమ్మున నడగిన పసిపాపపగిది, విభూతిరేఖలందలి త్రిచూర్ణతిలకమువలె, ఫేనమందలి కనకరశ్మిచాడ్పున, ముత్తెములందు వెలయు రతనముకరణి, తీవయిల్లాలి చేతులందలి పువ్వుబిడ్డపడువున, రంగారు బంగారువన్నెగల గొల్లమిన్నలందు నవ్వులాడు శ్యామసుందరునికైవడి, కీలికీలలందు చలింపని జానకియట్లు, వనవీధిలో జారిపడిన దేవాంగనమేని మీది ధవళాంబరమువలె తోచు పండువెన్నెలడంబున, ప్రభాతకాలమున గగనలక్ష్మీగళమునకు జగదీశుడు కట్టిన మంగళసూత్రమోయన దోచు దినమణి భాతి, మకుటమందలి కోహినూరు మణిమాడ్కి, నల్లని గుండియమీది కౌస్తుభమణి భంగి, నందనందనుని కంధరసీమగల శమంతకమణికరణి వర్ణమాలయందు కావ్యలక్ష్మీకాంతిలును. ఈలక్ష్మి పుట్టుక అద్భుతమైనది. ఈశ్వరకరుణా కతన మేరీకడుపున నేసు జనించె నని క్రైస్తవులందురు. అనుభవసముద్భవమైన పరిజ్ఞానమునకు ప్రతిభాసంపర్కమువలన కావ్యరమ కూతురై పుట్టుచుండును. మనుష్యహృదయమున నవతరించిన ఈశ్వరతేజస్సునే ప్రతిభయని నేను వాకొందును. నీటితుంపురును వెన్నెలవాక కలిసినపుడు తళుక్కు లుదయించులీల, కవిహృదయమునుండి చేరిన ప్రతిభాపూరమును అనుభవజనితవిజ్ఞానము అక్షరహృదయములందు కలియుతఱి మనశ్చక్షువునకు మిఱుమిట్లు గొలుపు మిసుక్కు లుదయించును.

స్వీయపరిశీలనమునుండి, స్వీయయోచనమునుండి, స్వీయభావనమునుండి, స్వీయానుభవమునుండి భావసామగ్రిగొని తేజఃపూరితమైన హృదయమున దానిని రంగరించి, కలముకొనకు పుత్తెంచి, రచయిత కావ్యసృష్టి గావించును. పరకీయపరికరము లీసృష్టికి పనికిరావు. అంగప్రత్యంగములనుచేర్చి కూర్చి, మనుష్యసృష్టి గావింపగలమా? గులాబీసృష్టిగులాబిగుండెయందే తలసూపినది. రేకు లూడిన,నవ్వాలినుండి కొన్ని దళములు కొనితెచ్చి కొమ్మకడుపున గోయిచేసి వాని నందు ప్రాతిపెట్టిన యెడల పుష్పసృష్టి యగునా? ఇంద్రధనువు వియత్తలమున దోచు స్వయంభువు. ఎవ్వారేని క్రిందినుండి మీదికి వింతగొట్టములతో రంగురంగుల నీటిని నింగిమీదికి గొట్టిన నింద్రధనుస్సు నిర్మింపబడునా? ఈచెయువునకు కడంగినవారి మొగములపై నారంగునీరు రాలి, వారికి వికృతరూపులు ప్రసాదింపదా ? ప్రజ్ఞాధురీణులైన కావ్యకర్తలకు ప్రణమిల్లి, వారిదృష్టాంతముల కతన నాంతరంగికోద్వేగమునంది, ఈ యుద్వేగమున తలసూపినశక్తులను పురస్కరించుకొని సహజమై, స్వతంత్రమైన కావ్యసృష్టికి మనము దొరకొను టొప్పు.

అవ్వాలినుండి కైకొనబడిన ఉపకరణములనుండి (అవి యనుభవజనితములైనను, అన్వేషణమున దోచినను) కావ్యసృష్టి కానేరదను నంశమును బహుళదృష్టాంతములనుండి చదువరులు గ్రహింపగలరు. పెక్కురాళ్లు నొక్కచో జేర్చినయెడల పెద్దదిబ్బ తయారగునుగాని తాజమహాలు సృష్టియగునా? యవనికపై నేడురంగులను రాల్చినంతన, రోతపుట్టించు పులుముడు గోచరించునుగాని ప్రతిమ ప్రత్యక్షమగునా? 'సరిగమలను' సరసగ వడివడిగ పలుపర్యాయము లుచ్చరించిన తోడన, వెఱ్ఱిధోరణి వినబడునుగాని, మంజులాలాపనము శ్రుతిగోచరమగునా? తెయ్యిమనినపుడు తోచునది నృత్యముకాక పిచ్చిగంతు కాదా? పెద్దబాలశిక్షలోని అక్షరపంక్తిని చిత్తమువచ్చినట్లు కాపీపుస్తకములం దెక్కించినపుడు, అర్థములేని చెత్త యగపడునుగాని సర్వాంగసుందరియైన కావ్యలక్ష్మి సాక్షాత్కరించునా? దిబ్బలోను, పులుముడులోను, వెఱ్ఱిధోరణిలోను, పిచ్చిగంతులోను, చెత్తలోను రూపులేదు; పొందు పొలిక్క; లయ నాస్తి; సమన్వయము సున్న; భావము శుద్ధపూజ్యము;

ప్రాణము పూర్ణానుస్వారము. రూపును, పొందును, లయను, అంగాంగ సమన్వయమును, భావమును, ప్రాణమును సృష్టించుశక్తి నేర్చిన నలవడునదికాదు. అది నైసర్గికమైనది. ఈశ్వరస్పర్శకతన నేవస్తువైనను ప్రాణసహితమగులీల, పైనసుశ్లేషింపబడిన ఉపకరణములను నైసర్గిక హృదయశక్తి సోకినంతనె నవి ప్రాణసంచారమునందె, లలితకళలనబరగి మానసికనయనములకు పండువును, అంతరంగికకర్ణములకు విందును గావించి, ఆత్మనలరించును. దండిప్రభృతు లీశక్తిని ప్రతిభయని పేర్కొనిరి. ఇది నవనవోన్మేషశాలిని! రచనాకౌశలమందును, శిల్పనైపుణ్యమందును, ఆలాపనమందలి నేరిమియందును, భావబంధురనృత్యభంగిమందును నిది ప్రకాశమగుచు. కళోపాసకుడు తన్మయుభావమున మునిగి, ఆత్మవిస్మృతుడై యున్న ముహూర్తమున, హృదయసింహాసనమున నాసీనుడై యున్న భగవానుడు "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని వాని నుద్దేశించి పలికి, వానిరసనముపై దివ్యవాక్కుల దేలించి, ఆతని లేఖినీముఖమునుండి భావభువనములను దొరలించును. కావ్యజగతియందా వాక్కులు వంశీరవమట్లు వినంబడును; ఈ భువనములు సుందర సృష్టిని దృష్టిసమక్షమున జూపును. కావున కావ్యజగతికి దివ్యబృందావనము రూపాంతర మని వచింతును.

నిర్మాణసూత్రములను దృష్టినిడికొని, అంగప్రత్యంగములను తయారొనరించి, వానిలో నాయువు వోసి విధి మనుష్యుని సృష్టించు లీల, నియమబద్ధవిషయసంయోగమున, వాక్యగ్రథనమున వరప్రసాదియైన రచయిత భావము వోసి కావ్యమును సృష్టించును.

తన కీశ్వరుడిచ్చిన శక్తిని కళోపాసకుడు తనకలమున బూరించును. మంత్రకానిచేతియందలి బెత్తమువలె నిది దివ్యమంత్రశక్తి గలిగి యుండును. కృష్ణప్రజ్ఞ సుదర్శనచక్రమున ప్రవేశించిన తెఱగున, కళోపాసకుని ప్రజ్ఞ ఆతనికలమున బ్రవేశించును. నిర్మాణనియమములను సహకారులగావించుకొని, మానసనేత్రము మ్రోల భావనము నిలిపిన దృశ్యమునకు సమాధిసున్నతటి హృత్పీఠి బ్రత్యక్షమైన దివ్యసుందర రూపమునకు ప్రభాకలితమైన తనకలముచే నీతడు ప్రతిరూపమును,

ప్రతిదృశ్యమును చిత్రించునపుడే అందాయువు ప్రవేశించును. పుష్ప సృష్టియగుట ఒకప్పుడు, అందు సౌరభము ప్రవేశించుట వేఱొక్కప్పుడు నగునా? సృష్టియనుడు, ప్రాణప్రతిష్ఠయనుడు, జీవప్రదీప్తసౌందర్యమనుడు, మహిమోపేతలావణ్యమనుడు, భావబంధురసౌష్ఠవమనుడు, రచనానైపుణ్యమనుడు, కళాకౌశల్యమనుడు ఈ చిత్రలేఖనమున జేరి యుండును.

జిజ్ఞాసగలదృష్టితో, జగదీశుడు ప్రసాదించిన హృదయముతో భ్రమణమొనరించుచు, అంతరంగిక ప్రోత్సాహముకతన జంకుగొంకులకు చోటీయక, వివిధానుభవములకు ఆత్మజీవితమున చోటొసగుచు, హృదయస్థశక్తిని వీనిలోని కావాహనమొనరించుచు, నేనీరచనమునకు గడంగితిని. హృదయమున నాధ్యాత్మికమైన పరుసవేదికలదని నాదృఢ విశ్వాసము; కావున దీని స్పర్శనందినంతన వివిధానుభవములు దివ్యగుణ సమన్వితములగునని హృదయపూర్వకముగ నమ్ముచుంటిని. ఇట్టి యనుభవములే కావ్యసామగ్రియగునని స్పష్టముగ విశ్వసింతును. కాబట్టి ఈశ్వరునుద్దేశించి చేతులుమొగిచి, ఈరచనమున కావ్యవిభవము తోచునేమో యని ఆశపడుచున్నాను; ఇందు సహజసృష్టి, స్వతంత్రసృష్టి, సద్భావసందీప్తసృష్టి, ఆత్మను తనుపుసృష్టి, కన్పట్టునేమో యని మక్కువపడుచున్నాను; నాయారాధ్యదేవి సాహిత్యలక్ష్మి నాయెడల బ్రసన్నయై నా రచనమును కమలాలయము కావించునేమో యని మిక్కిలి యాశించుచున్నాను. నాయాశ ఫలించునేని, నాయుద్దేశము సిద్ధించునేని, నాజన్మ ధన్యమైనదని యానందింతును.

నాయాశయమెద్దియో వినయముతో చదువరులమ్రోల విన్నవించుచు, నా జీవయాత్రలోని ఈ మహారాష్ట్రయాత్రయందు నాకు చేకుఱిన అనుభవములను గుఱించినకథ మాత్రముచెప్పి యూరకొనక, అందుండి నేనుసంగ్రహించిన భావసామగ్రిని, సాహితీసూత్రములను, కావ్యపరికరములను సందర్భోచితముగ నిందును నందును వ్యక్తపఱచుచుంటిని. వింతను, విడ్డూరమునే చూపునది కావ్యము కాదని నాయభిప్రాయము. వింతకై, విడ్డూరమునకై మాత్రము పొత్తములను తెఱచి, వానికే పారితోషికము లిచ్చుపాఠకులు కొంద ఱుండుట నే నెఱుగు

దును. నారచనములు వీరికై గాని, వీరిపసదనములకై గాని తలసూపుట లేదు. సత్యసందీప్తములై, సౌందర్యసముద్భాసితములై, పఠితహృదయము నాకర్షించిన చిత్రములను తెలుపుట నంతమాత్రమున తృప్తినందక, పఠిత ప్రతిభను తనిపి, పఠితయాత్మనలరించు భావసామగ్రిని ఆయాసందర్భములందు మనసున తలసూపిన కావ్యమునుండి కైకొని, నేని గ్రంథపీఠమున జేర్చుచుంటిని. పొడసూపిన సంగతులజాబితాను వివరించుట నాయుద్దేశముకాదు. సాహిత్యము జాబితాకాదు; కావ్యము చిట్టాకాదు. నాయాశయము లెవ్వియో, నా రచనోద్దేశము లెవ్వియో గ్రహించి పాఠకమహాశయులు నా యత్నములను విశాలదృష్టితోను, విజ్ఞానదృష్టితోడను విలోకింతురని ఆశపడుచున్నాను.

అమ్మ దివంగతయైన నిముసమున జడివానవలె నార్తి నా లేబ్రాయమును మార్కొనినది. నిర్మలమైన అయ్యగుండియ శ్వేతాతపత్రమై, వడిగల ఆ జడినుంచి నన్ను కాచినది. దుర్విధి ఎదురై ఆ పవిత్రచ్ఛత్రమును వమ్ముజేసి, నా బ్రదుకుపై దుమ్ముబోసినది. దురంతదురితోత్కట పరిస్థితులు గదలుపూని నాపై దుమికి, నా గుండెను గుండజేయదల పడినవి. ఒకచేత గుండియను బట్టితిని; నాకై మిగిలిన అయ్యచితిలోని విభూతిని రెండవకేలగైకొంటిని. నాకు కలదానిని కావలసినవారు కబళించుటచే నిక నావియనుకొనదగినవి రెండుచేతులగల ఈ సొమ్ములే! కొండొకవడి మిగులదూపిల్లినను, కడుంగడు పవిత్రమైన ఆ వమ్ము నుండి ఆత్మను దనుపుసొమ్మును సృష్టించుకొన నిశ్చయించి, ఆముహూర్తమందే అందుండి పయనమును ప్రారంభించితిని. నాటిశ్మశానఘట్ట మీ యాత్రలోని ప్రధానఘట్టమై, నేటి కావ్యఘట్టమైనది.



# నా మహారాష్ట్రయాత్ర

## పదునాలుగవ ప్రకరణము

మహారాష్ట్రమున కొంతదూరము పాఠకులు ఆంతరంగికముగ నాతోపయనించి వచ్చిరి. ఇంకను సలుపవలయుయాత్ర విశేషముగ గలదు. త్రియంబకమునుండి మరలి నాసిక జేరి, పంచవటియని మహారాష్ట్రులచే విశ్వసింపబడుస్థానము నవలోకించి, తపోవనమున నడచి, కపిలాశ్రమమును కడచి, చరచరచను గోదావరీశైవలిని ననుసరించిపోయి కనువిందొనరించు దృశ్యములందు మరలి మనసు నలరించు చెట్లజొంపములందు నధివసించి, ధునీతీరవిలసిత యోగులపొత్తుపడసి, చల్లనితల్లి నదీమతల్లిఘాట్టములందు పెంపొందు ప్రాణులసావాసమునంది, మునిమానసములవలె శాంతినికేతనములైన పర్ణశాలలందు శయించి, వీనులందు గానపీయూషమును వెలారించిన విహంగములకు ధన్యవాదములర్పించి, సహస్రాబ్దులనాటి భారతసంస్కృతీవిభవము స్మృతిపథమునుండి వెడలి వనగర్భమందలి యాశ్రమనిస్తబ్ధతలో నిలిచినట్లు గోచరించినంతన నానందవీచికలందు దోగి, గోదావరీకాననభూమియందు కొంతకాలము వసించి, అనంతరము బొంబాయికి మరలి, అరేబియాసముద్రమున నొక దీవియందలి ఎలిఫెంటాగుహాలను వీక్షించి, శతాబ్దులనుండి విజ్ఞాన యాత్రికులకు విస్మయముగొలుపు శిల్పకౌశలమునకు కన్నులప్పగించి, మూడుశిరములతో పరిఢవిల్లు మహోత్కృష్టవిగ్రహమును వీక్షించి, హిందూమహాయుగప్రభావమును హృదయంగమ మొనరించుకొని, నాటిపీష్వాలకును ఆధునికమహారాష్ట్ర మహాపురుషులకును నిలయమైన పూనాజేరి, పాంచగనీరమ్యస్థానమున చరించి, పదపడి పశ్చిమాద్రిమీది మహాబలేశ్వరమునకరిగి, పరిసరగిరికందరములం చరించి, అనంతరము బ్రహ్మారణ్యమున పయనించి, ఉన్నతపర్వతశిఖరముల (Arthur Peak, Elphinston Point, Wilson Point Etc.) నధిష్ఠించి, సంధ్యాసమయ శైలభాగ్యమునకు చూపులప్పగించి, ప్రకృతిసామ్రాజ్యమున నీశ్వర సామ్రాజ్యము నాలోకించి వియత్తలమునుండి కొండకొనమీదికిని, అందుండి లోతులోయలోని నీటిగీతమీదికిని చివాలునవ్రాలి తోడన

వినువీథికెగసి, విశాలవిశ్వమున చిత్తమువచ్చినట్లు విహరించుచు మధుర కూజితముతో మంజులగీతికాలాపనముతో బ్రహ్మాండమునలరించుచు నా కన్నులబడిన శకుంతముల స్వేచ్ఛానందములను ప్రశంసించుచు, స్థల కాలములు ప్రసాదించిన భావభిక్షచే భారసహమైన హృదయముతో శైలశిఖరములనుండి మరలి, వన్యమృగసంకులమైన బ్రహ్మారణ్యమున నిశీథినీసమయమున నడచి, ఒకానొకగిరిగుహయందు కొండొకవృద్ధ యోగినిగాంచి, భయదసమయమునగూడ నాతడు ప్రశాంతమూర్తియై యుండుట నబ్బురముతోచూచి, ఆతనివృత్తాంతమువలన ధృతినంది, మహిమోపేత ప్రాచీనసంప్రదాయము ఋషికమండలువుచెంత శైల వనగర్భముల నింకను నటలుట వీక్షించి మిగుల నలరి, పిదప కృష్ణా, కోయనా, యెన్నానదల జన్మస్థలములను తిలకించి, ఆయాక్షేత్రములందు విధ్యుక్తక్రియలను నిర్వహించి, పదంపడి ప్రతా పగడమున కరిగి, శైలశిఖరముపై శివాజీ నిర్మించిన మహాదుర్గమును గాంచి, ఆవీరవరుడు ప్రతిష్ఠించిన భవానీమందిరమున వసించి హిందూ మతసముద్ధరణమునకై కంకణము గట్టుకొనిన ఆమహాత్ముని హృదయమే దేవాలయమై వెలసినదనునూహ చిత్తమున దీపకళికయై తేజరిల్లు చుండ దానికి సహపాఠియనదగు గర్భాలయ జ్యోతిపై దృష్టినిలిపి, జ్యోతికిని, తోడ్తోడనే హిందూసంస్కృతిప్రదీపమునకును జోహారని, భక్తులొనరించు ఉద్వేగభరిత సంకీర్తనముకతన పరమపరితోషమంది, అనంతరము శివాజీ పుట్టి పెరిగిన తావులందు సంచరించి, ఆమహారాష్ట్ర వీరుడు కనిన కలలును, ఊహించిన భావములును, స్మరించిన భారతగత విభవమును, మననమొనరించిన మహితాశయములును పశ్చిమపర్వత సానువులందును, ఉపత్యకలందును, తరువులందును, దరులందును, చరి యలందును చింరకితములై విలసిల్లుటయు, శివాజీ పురశ్చరణమొన రించిన పవిత్రమంత్రాక్షరములు ఆతావులం దింకను ప్రతిధ్వనించుటయు నాస్వానుభూతికతన నెఱిగి విశ్వవిద్యాలయముల కసాధ్యమైన పరిజ్ఞాన మును పడయు నవకాశము నొసగిన జగదీశునకు ప్రణమిల్లి, తరువాతి పయనమును సాగించుతఱి మాహిమార్గమునగల పర్వతారణ్యములో అగ్నిని సృష్టించి వంటచెఱకును బొగ్గును దయారొనరించుచు తమయుఱ పులవలనను, ఆయుధములవలనను, బెబ్బులులను తఱిమికొట్టుచు, కష్ట

భూయిష్ఠమైన కృత్యమును మహోత్సాహముతో నిర్వహించువ
కొన్నిరాత్రులుకడపి జనపదములందును, పొలములందును వసించి
నపుడు కర్షకజీవితమును పరిశీలించుచు, కర్షకగీతికలకు వీనులొగ్గుచు
మహారాష్ట్రకేదారములకును, తెలుగు పొలములకును, విశాలభారత
వసుంధరలోని అన్యరాష్ట్రములందు నేనవలోకించిన కమతపునేలలకును
గల పోలికలను వ్యత్యాసములను గమనించుచు, పల్లెజీవితమునకును
నగరవాసమునకునుగల విభేదములను తలపోయుచు కొంతకాలము
గడపితిని.

పూనాకు కొంతదూరమున గలవాథర్‌ను కేంద్రముగావించుకొని,
పెక్కుచోటులందు చరింపజాలితిని. వాథర్‌కు నిరువదిమైళ్లదూరమున
కృష్ణానదీతీరమందలి వాయ్‌లోని మహోన్నతసిద్ధివినాయకవిగ్రహ
మును కూలవిలసిత శిలామూర్తులను విలోకించి, అనంతరము మీరజ్
దాటి సాంగ్లీపోయి అచటియారోగ్యాశ్రమమును కడుంగడుసుందర
మైన గణేశమందిరమును, దానికి నలువలకులందును వెలయు వివిధా
లయములనుగాంచి స్వామియుత్సవమున పాల్గొని, థర్‌పాల్ పరిసర
మందలి వినాయకవిగ్రహమునకును, హంపీక్షేత్రమున నరసింహస్వామి
విగ్రహమున కెనమైన గణేశమూర్తికిని వాయ్‌లోని విఘ్నేశ్వరవిగ్ర
హమునకును, సాంగ్లీవినాయకమూర్తికిని గలసామ్యవ్యత్యాసముల
నూహించుచు నందుండి తరలి కొల్హాపూరుచేరి పంచగంగామిళితప్రవం
తియం దీదులాడి రజతనిర్మితగర్భాలయమున విలసిల్లు అంబికాదేవిని
సేవించి, పురమున వేఱొకదిశగల చలనచిత్రనిర్మాణస్థానమును వీక్షించి,
థార్వార్ బెల్గామ్ లోండాలుదాటి అరేబియాసముద్రతీరమందలి
మార్మగోవాజేరి, అందలి రేవు నవలోకించి, అచటి కడలిపాయను
దాటి, థర్‌పాల్‌చిత్రములనుచూచి, డెబ్బదియైదుమైళ్లు సాంద్రవనమున
పయనించి, దక్షిణకాశ్మీరమన బరగినస్థానమును కన్నులారగాంచి, కాశ్మీర
మున మసలినట్లే అందును పరమప్రమోదముతో మసలి, కొండధార
లందుస్నానమొనరించి పశ్చిమపర్వతశ్రేణులందు నెందుజూచినను సాంద్ర
నారికేళవనము కనువిందొనరించుట కెంతయునలరి, హుబ్లీ గడగ్గులదాటి
హాస్పేట హంపీయాత్రలను స్థగితమొనరించి, షోలాపూరుచేరి, అచటి
బహుళయంత్రాలయములతో వస్త్రనిర్మాణమందలి వేర్వేఱువిధానము

)ను వీక్షించి, చంద్రగ్రహణసమయమునకు చంద్రభాగానదీతీరవిలసిత పండరీపురమున కరిగి గ్రహణకాలమున రథురగర్భమున గ్రుంకులిడి, సమర్థ రామదాస, ఏకనాథ, నామదేవ, జ్ఞానేశ్వర, తుకారామ, దామాజీ, సక్కుబాయి ప్రభృతుల భవ్యజీవితముల కాటపందిరియైన విఠ్ఠలమందిరమున నధివసించి, హంపీలోని విఠ్ఠలాలయమునకును ఆమందిరమునకును గల ఆంతరంగిక బాంధవ్యముగని మురియుచు, కృపాభరిత సాక్షాత్కారమునందును ప్రత్యక్షదృష్టాంతమందును భక్తులను, భక్తురాండ్రను బ్రోచిన పండరీప్రభువును సేవించి, బృందావన పండరీక్షేత్రములందలి పోలికలను తలపోయుచు, భారతమతచరిత్రాంగణమున నవి యందిన ప్రశస్తిని మనన మొనరించుచు, నా "సంపూర్ణభక్తవిజయ"మందలి మహారాష్ట్ర భక్తచరిత్రముల నందేలిఖించి, అభంగసంకీర్తనమునకు వీనులొగ్గుచు కొంతకాల మందువసించి, మరల బొంబాయిజేరి, ఖార్‌నాటి ప్రాచీన దేవాలయములను గాంచి, పశ్చిమతీరమందలి జూహూజూచి, తిరిగి సతారామండలమున ప్రవేశించి, అందుండి రత్నగిరిజిల్లాయందు చిప్లూణ్ తాలూకాలో గోఖలేజన్మస్థలమునకు సమీపమందున్న కరంబవానేలో గల మిత్రులను చూడనరిగి, మిత్రగృహమున నాతిథ్యమునందుతఱి ఆంధ్రులకును మహారాష్ట్రులకును గలపోలికలను మరింత విపులముగా విలోకించి, మహారాష్ట్రపల్లెజీవితమును విశేషశ్రద్ధతో పరిశీలించు నవకాశమంది గ్రామనగరజీవితముల వ్యత్యాసములను తలంచుచు నిర్వూరు నెచ్చెలులు వెంటరా నందుండి పయనించి, విశాలమహారాష్ట్రభూమి యందు పౌరాణిక చారిత్రిక ప్రాముఖ్యముగల బహుళప్రదేశములందు మహోత్సాహముతో మహోత్కంఠతో మహోల్లాసముతో విజ్ఞాన యాత్రికుడనై విహరించి, అక్కఱ ననుసరించి అందందువసించి ప్రదేశ పరిశీలనము గావింపసాగితిని.

వ్యక్తిగతముగ నొక్కొకజాతి సంప్రదాయప్రభావము నేమి, స్వతస్సిద్ధమైన ప్రతిభవలన నేమి, బహుళనైసర్గిక హేతువువలన నేమి, ప్రత్యేకశిక్షణసౌకర్యములకతన సహజశక్తి పడయు పరిణామమువలన నేమి, వేర్వేఱు జీవితాంశములందు ప్రాముఖ్యము వహించును. విశాల భారతజీవితవాహిని ననుసరించుచున్నను, భరతఖండమందలి వివిధరాష్ట్రములు పూర్వోల్లిఖిత కారణములవలన గొంత ప్రత్యేకతతో పరిఢవిల్లు

చున్నవి. భారతపరిభ్రమణమున నిశితపరిశీలనమువలన
గ్రహింపగలిగితిని. మహారాష్ట్రులు మహావీరులని చరిత్రయే జగ
నది. ప్రాచీనాంధ్రులకును, మహారాష్ట్రులకును జాతీయబాంధవ్యము
కలదు. మహారాష్ట్రమున ప్రజలుచూపిన విశేషప్రీతికతన ప్రత్యేకప్రతీ
నందిన వేల్పులును, భక్తులును, వీరులును గలరు. గణపతి, హనుమంత
విఠ్ఠలనాథులు వారి యిలువేల్పులు. పైన దెలుపబడిన రామదాస తుక
రామ నామదేవాదులు వారి పూజలందు భక్తవరేణ్యులు. భక్తికిని, సం
కీర్తనమునకును నేస్తము కలదుకదా! అభంగకీర్తనములును హరికథలును
మహారాష్ట్రసంస్కృతిసముత్పన్నములే కదా! శివాజీ మహారాష్ట్రులయా
రాధ్యవీరుడు. ఆధునికులలో లోకమాన్యబాలగంగాధరతిలక్, రానడే,
గోఖలే, కేల్కారు, చందావర్కారు, రామచంద్రభండార్కారు, జం
కరు, సావర్కారు మూంజీలు మహారాష్ట్రమాత యనుంగుబిడ్డలు కదా
పశ్చిమసీమయందు మలుతటి బూర్వోక్తప్రత్యేకాంశములు యా
కుని చిత్తముపై తళ్కొత్తును.

మహారాష్ట్రపర్యటనమున ప్రత్యేకస్థలావశ్యకత ననుసరించి ఒకొ
కపుడు పొగబండియందును, ఇంకొకపుడు మోటారులందును, బస్సు
లోను, వేలువేళలందు నెడ్లబండ్లలోను ప్రయాణము సలిపితిని. కొన్ని
కొన్ని ముహూర్తములందు కాల్నడకను పయనము సాగించితిని. ఒడి
దొడుకు నడకయందు చేకురు ప్రయోజనము హెచ్చిక్కయని యెఱుం
దును. ఒకతావునుండి వేఱొకతావునకు రెక్కలుకట్టుకొని గొంగు
ప్రత్యంగుళమందును ప్రత్యణువునందును అశేషభావములను పడసి, కా
పథమున వివిధఘట్టములందు మహారాష్ట్రజనయిత్రి బహుళజీవితశా
లతో నెట్లువెలసెనో గ్రహించుచు, చిత్తమున భావగోళము
దిరుగుముహూర్తములందు లేఖినిని పూని, నేనీయుదంతమున
తిని. నాయాశయముల నాదరించి, శేషించిన పూర్వోక్తస్థ
గూడ మానసికముగ నాతో పయనించి, పాఠకమహాశయుల
రాష్ట్రయాత్రలోని విశేషములను మక్కువతో విలోకింతు
సించుచున్నాను.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951